దివ్యజ్ఞాన కథామృతము 5

# డాక్టరు ఆనీ బిసెంటు




గ్రంథకర్త:...

ఆంధ్ర సర్కారుల థియసాఫికల్ ఫెడరే[illegible]

ఘంట్వారు వేంకట సుబ్బారావుగారు

ప్రకాశకులు:

దివ్యజ్ఞాన చంద్రికా మండలి,

ఏ. జి. ప్రెస్ భవనములు :: బెజవాడ.

1947 వెల రు 3—0—0

# అంకితము



క. కృతి నిచ్చెద శ్రీమతికిన్
సితకీర్తికిఁ బరమపురుష సేవారతకున్
జితసంసారికిఁ బరహిత
మతికిన్ ఆనీ బెసెంటు మాతకు భక్తిన్.

# విషయసూచిక

## మొదటి భాగము

## రెండవ భాగము

# ఉపోద్ఘాతము

మహావ్యక్తుల జీవితములు పన్నీటిసేచనమునంది, పూలపాన్పులపై పెంపొందవు. యజ్ఞకుండమున దోచి, అవి జ్ఞానపిపాసువులు వలచుపాయసము నొడ్డించును. అతులైశ్వర్యమల్లన నోటబెట్టు తియ్యని గోరుముద్దలు గురుగుణములను పుట్టింపవు. కఠోరానుభూతి ప్రసాదించు సైన్యమున శక్తి బడసి, నిష్ఠురమైన నిప్పచ్చరము దిద్దించు తొలియక్షరములందే మహావీరులు ప్రణయమహత్త్వమును, జీవితతత్త్వమును కనుగొందురు. అగ్నిపరీక్ష భయదమై గోచరించుట నిక్కమే! ఈ పరీక్షను కాంక్షింపనివాడు తనగుణమందలి మేలిమిబంగారమును గుర్తింపజాలడు. అసిధారావ్రతము భయానకమై తోచుట తథ్యమే! ఈ వ్రతమున బద్ధదీక్షితుడైన వాడే హృదయస్థజ్యోతిపై నంతర్దృష్టిని సారింపజాలును. దుష్ట పరిస్థితులు బుసగొట్టుచు విజృంభించుట సత్యమే! ఉదారాశయ మాలపించు మధురవంశీరవము వినులబడినంతనే మాణిక్య విలసిత ఫణములెత్తి అవి యాడును. కాలమేఘమువలె నిరాశ తోచుట యథార్థమే! సంయమసహనములు రామలక్ష్మణులట్లు అంతరంగగర్భాలయమున నిలుచు మంగళముహూర్తమున నాకారుమొయిలుపై నింద్రధనువువలె సదాశ తళుక్కొత్త గలదు. విషభాండమును చేతికందీయ నరిష్ట ముంకించును. ధృతి సాహసములతో వీరుడు దాని నెదుర్కొనునపుడు అమృతమూర్తియై యది సాక్షాత్కరించును. అంతరంగమందలి దైవీ

సంపద ఆత్మవ్యక్తీకరణము నందినవేళ బీయూమను నొద్దించుటకై సమ్ముఖమున నిలువేలుపై ఉత్కృష్టాదర్శము నిలుచును.

సమస్త జన్మలకంటె మనుష్యజన్మ మహోత్తరమైనదే! తనను తెలియనిచో, గీతకు దూరమగుచో, ఉపాసనమున నారితేలనిచో, వ్రతమండపమున ప్రవేశింపనిచో, మనుజుడు తన మనుష్యత్వమునకు నీరువిడిచి, పశువునకు సహపాఠియై యుండును. "సోహమ్" అనజాలు ఆత్మవిశ్వాసము ఆత్మజ్ఞాన సముద్భవమని గ్రహించి, ఈజ్ఞానము నందుటకై తపమొనరించు ఘనయత్నమందే హృదయస్థ మహితశక్తి వ్యక్తమగునని తెలిసికొని, కంటకభూయిష్ఠమైనను కష్టసాటి పథమున ముందంజ వేసినేని, సార్థకజీవనము ఉలరొప్పును. ముందంజలో మృత్యువిభీషిక తోచిన తోచుగాక! కైలాసమందిర మందలి పరమ శివునివలె హృదయగర్భాలయమందలి స్థితప్రజ్ఞ వెలయునపుడు మ్రోలనిలిచిన భయంకరదృశ్యము శాంతకుంజమై విలసిల్లును. కొండొకవడి కిక్కురుమనక వేడినిప్పుల నోటిబట్ట వలసివచ్చినను, జంకుగొంకు తెలియని సాధకుని అగ్గిప్రోవు చంద్రికాతతియై పరిఢవిల్లుట విలోకించును. తమోయవనిక తలపై బడినను, దానిని చీల్చిచెండాడు సమయూఖవ్రాతము గోచరింపక మానదని అతడు విశ్వసించును. తనశక్తిని గుర్తించిన వీరుడు మంచుమలపునాడికి స్వీయవజ్రసంకల్పమును సహపాఠి గావింపగలడు. ఇట్టిసాధకుడెన్నడు నిట్టూర్పువిడువడు. హేతుశక్తిని పురస్కరించుకొని మానవేషములను లెక్కించి జీవితఫలితములను నిర్ణయింపజాలు మానవు డేయుగమందును లేడు. మేధాసంపద దొడ్డదయ్యు, హేతుసామర్థ్యము అద్భుతమైనదయ్యు వీని

పోరాటములుండిరి కొన్ని యుద్ధములందు తెలియును. అవస్థల
తత్వాల నేమున్నదో గ్రహించుటకే మేధకు లేదు. ఇంద్రియాతీత
మైన మహితశక్తి,- మనసున కందని దివ్యప్రజ్ఞ కలదని సాధ
కుడు గుర్తించి, అంజలి ఘటించి, యాశక్తి వ్యక్తమగు ముహూర్త
మునకై తడయును. తన స్యందనమున తాను రథియై యున్నను,
తనవుముగడకు చేర్పఁగడయగు సారథి ఆదివ్యశక్తి యని
గ్రహించినపుడే ఆతని హృదయము సంక్షోభరహితమగును.
శారీరక మానసిక శక్తులపరిధి ఉన్నతభిత్తికయై యున్నతరి
బుద్ధిమంతుడు తన మస్తిష్కాఘాతములచే దానిని తొలగింప
దలపడక, చిత్తశక్తి కతీతమైన ఆత్మశక్తి ఏయంకిలి నెఱుగక
అనంత విజయక్షేత్రమున తన్ను నిలుపునని విశ్వసించును.
ఈ విశ్వాసముగల వ్యక్తి ఈశ్వరహస్తమును చేబట్టినసాధకుడై,
అంధకారమున దివ్వె నవలోకించి, నిజహృదయమున సచ్చిదా
నందములు కలవని ఆత్మానుభూతివలన నెఱిగి జీవితపథమున
సాగిపోవును. ఈ విశ్వాసము లేనివ్యక్తి ఘోరనిరోధములను,
ప్రతికూలపరిస్థితుల తీవ్రాఘాతములను తన మనసు
నున్మత్తపశువు గావింప, శాంతి నెఱుగక దురంత యాతన
పాలబడును.

బెసెంటుసతి జీవితమందలి వేర్వేఱు ఘట్టములను
జాగ్రత్తగా పరిశీలించినపుడు పూర్వోక్తసిద్ధాంతములు
దివ్యదీపికలవలె మానసనేత్రము మ్రోల గోచరించును.

చిఱుతప్రాయ మందే జీవితక్షేత్రము కురుక్షేత్ర
మట్లామెకు గోచరించెను. అది ధర్మక్షేత్రమని కాలక్రమమున
నామె గుర్తించెను. బాల్యకాలమందే ఆమె హృదయమున

తుపాను బొడసూపినది. క్రమక్రమముగ నది తీవ్రముగ విజృంభింప నారంభించినది. తన జీవితపరమావధిని కనుగొనుటకై ఆమె సర్వశక్తులను వినియోగించెను. ప్రతికూల పరిస్థితులు కోటిరక్కసులై ఆమె నెదుర్కొనెను. అద్భుతసాహసముతో బెసెంటుసతి వానిని మార్కొనెను. తన యాశయమును తాను గుర్తించుటకు, తన తెరువును దాను కనుగొనుటకు, తనశక్తిని దాను గ్రహించి తనధర్మమును తాను నిర్వహించుటకు వ్యక్తి విశేషముగా పెనగులాడవలసి వచ్చును. బహు భవముల నుండి పరిణతి నందుచువచ్చు బలవత్తర భావము జీవాత్మ ననుసరించి వచ్చుచునే యుండును. స్థూలశరీరము మంటిలో గాని మంటలో గాని కలిసినను, దేహమందిరమందలి పరంజ్యోతి గుప్పున నారిపోదు. అందలి శక్తులును, వాసనలును తరువాతితనువున ప్రవేశించితీరును. సంచితశక్తు లాత్మ వ్యక్తీకరణము నందవలెను. అట్లందు వఱకు అంతరంగమున నశాంతి ఝంఝూమారుతమువలె చెలరేగును. పంజరబద్ధమైన శక్తి చచ్చిన గొడ్డువలె పడియుండదు; ముక్తికై సహస్రయత్నములు సలుపును. బెసెంటుసతి యంతరంగమున నిట్టిశక్తి,—పెక్కు జన్మలనుండి వృద్ధియగుచుండిన శక్తి యుండెను. కొండొక మహత్తరాదర్శసిద్ధి దీని పరమావధి. దీనినందుటకై చేయు కృషియందే యాశక్తి స్వీయ చరితార్థత గాంచగలదు. తృటిలో నాదర్శము గోచరించదు కదా! దీనిని కనుగొనుటకై బెసెంటుసతి ఘోరసమరము సలుపవలసి వచ్చెను. "నీగమ్యస్థానము దెస ముందంజవేసినపుడే, దారుణప్రవిదారుణమున నీవు విజృంభించినపుడే,

నీ శక్తి కనుకూలమైన కర్తవ్యమును కౌశలముతో నీవు నెఱపి నపుడే నీజీవితము చరితార్థత నందజాలును. అంతకుమున్ను నిద్రాహారములకును, సుఖశాంతులకును నీవు నీరు వదలవలె" నని అంతర్వాణి యామెతో తఱచుగా తెలుపసాగెను. అంత రంగగర్భాలయమున నావాక్కు ప్రతిధ్వనించినపుడు నిరాశను పదదళిత మొనరించి,వీరావేశముతో భీషణభండనమున నామె విజృంభించెను. తలపై శిలీముఖవర్షము కురిసినను, అవిరళముగ పిడుగులు పైబడినను "హతోస్మి!" యనక ఛంగు ఛంగున తన కాయమును స్వీయకురుక్షేత్రమున నుడాయించిన వీరనారీ మణి బెసెంటుసతి. భయదమైన ధూళియై అవజ్ఞ ఆమెముఖమున బడెను. అవమానము గొడ్డలిపెట్టై ఆమె తలపై బడెను. అత్యాచారము వాడిగునపమై ఆమె గుండెలో గ్రుచ్చుకొనెను. వీని సంయుక్తశక్తి ఆమె హృదయమందలి వజ్రసంకల్పమును తునియలు చేయలేదు; ఆమె యిచ్ఛాశక్తిని మటుమాయ మొన రింపలేదు. చరణతాడితకందుకము కరణి ఆమెశక్తి యువ్వెత్తుగ లేచెను. నిభృతమున నధివసించి గభీరచింతనమున మునుగుచు, సత్యసందర్శనమునకై తపించుచు దానిని కనుగొని తీరెదనని ముందు కుఱుకుచు, తనయోచనలను తాను సమకువేసి కొనుచు, తనజతనములను తాను సింహావలోకన మొనరించు కొనుచు, తనదోసగులను తాను పరిశీలించుకొనుచు, తన యడుగులను తాను లెక్కించుకొనుచు, తనకథనమును తాను వినుచు, తనతెన్నును తాను వెతకికొనుచు, చేతులు చఱచి చరచరపోయి దెబ్బ తగిలినపుడు వెక్కటి యడుగులోని నెరసును కనుచు, గాయమునుండి స్రవించు రుధిరముపై

బడి "తల్లీ! నా మాటవినుము. ఇంత నీపోరేల? వేయుమాటలేల? కఠినభేదాభిప్రాయముపై నీ కాపురమును నాకను బ్రద్దలు కానీయకుము" అని పరిపరివిధముల బ్రార్థించెను. జనయిత్రిని తన యసువులకంటె మిన్నగ ప్రేమించిన యువతి బెసెంటుసతి. తండ్రి మరణించిన పిదప ఆమె పడు పాటుల నామె కన్నులార వీక్షించుచుండెను. తన కాపురముపై నిప్పులుపడుచో నామెయాతన దుర్భర మగునని బెసెంటుసతి యెఱుగును. భర్తనుండి వేఱై ఘోరదారిద్ర్యమును కవుంగి లించుకొని అంతకు మున్నే నిప్పచ్చర మను రొంపిలో దిగబడిన తల్లిని జేరి, ప్రపంచవీధులందు దిక్కులేక అల్లాడవలసి వచ్చుచో ఘోరనరకమును మనసార నాహ్వానించుటయని ఆమె యెఱుగును. "సత్యము నారాధించుటా? కన్నతల్లి పాటును, తనభావిస్థితిని ఊహించి తనదీక్షను వీడి కిక్కురు మనక ప్రతికూలాశయమునకు తల యొగ్గుటా?" యను సమస్య కడుంగడు భీషణమై ఆమె కట్టెదుట గోచరించెను. తల్లికన్నులనుండి అవిరళాశ్రువారి వెలారుచుండెను. రుద్ధ కంఠముతో నామె బ్రతిమాలుచుండెను. "నా పెనుగులాట కఠినమాయెను. ఆమెకు బాధ కలిగించుట శబదిమడుంగుల యాతనపాలం బడుట! కాఠిన్య మెదురైనపుడు ఉక్కు వలె నుంటిని. ప్రాణాధికముగ ప్రేమించిన మాతృదేవి నత జానువయై బ్రతిమాలునపుడు కాఠిన్యమూని యుండుట కష్ట మాయెను. ఆమె కిట్టి యాతన గలిగించుట ఘోరమైన అప రాధమే! పండినతల వంగి నాపదముల నంటినపుడు పాతకి నని, హంతకురాలనని యడలితిని. కాని అస్మృతము నను

షించుటా? ఇట్టితల్లి కొఱకైనను అట్టి యవమానమునొదలదాల్చుట సాధ్యముకాదు. దుర్దాంతమైన యాతన మనమున భయదమై జ్వలించుచుండ నా యిచ్ఛాశక్తి సత్యమునే గట్టిగ బట్టియుండెను. తండ్రినిగాని, తల్లినిగాని సత్యముకంటె మిన్నగా ప్రేమించువాడు సత్యప్రసన్నత నందుట కర్హుడు కాడను నుడువు నాడేకాక నేడును, నేడేకాక సర్వసమయము లందును నిక్కమని, కడుంగడు క్లిష్టమై, దుష్టకష్టబాధురమై, కఠినశిలాభరితమైన న్యాయపథమే వెలుగును, శాంతిని పడయుటకు నక్కరైన తెరువని నాదృఢవిశ్వాస" మని బెసెంటు సతి తనస్వీయచరిత్రలో (పుట 216) తెలుపుకొనిన వాక్కులు అజాండమున ననంతకాలము ప్రతిధ్వనించునవి. సత్యదేవతనారాధించుతఱి పంచప్రాణములను నివాళిగా సమర్పింపజాలువారు, గుండెబెటికి నైవేద్యముగా నర్పించువారు, హృదయస్థ రుధిరమును వసంతసేచన మొనరింప దలపడువారు, కడుపులోని ప్రేగులను యజ్ఞోపవీతములని సమ్ముఖస్థ దైవతమునకు ప్రసాదించువారు, మణిబంధమునకు కట్టుకొనిన దీక్షాకంకణము తునియలగుట కిచ్చగింపక కుత్తుకనైనను దుత్తునియ లొనరించుటకై తలపడువారు, తమ యాశయమునకు తలవంపులు చేసియైన అక్కరైనచో తమ శిరములను తఱిగి యెదుటిశక్తి కిచ్చుటకై సిద్ధపడువారు, సత్యమునకు జయము గూర్చుటయే తమ జీవితపరమావధియని యెంచి ఆత్మార్పణమందే విజయమును విలోకించువారు ప్రపంచ

చరిత్రలందు కొందఱున్నారు? శతాబ్దులును, సహస్రాబ్దులును యుగములను, మహాయుగములును కడచినపుడు ఈ దృశ మహావీరు లేకాలదిమందిరో తోచుచుండురు. ఇట్టి మహనీయులను విలోకించి, చతుర్ముఖుడు తనసృష్టి మహిమకు తానే యబ్బురపడును. అల్పసంఖ్యాకులైన ఈదృశమహా వ్యక్తులలో బెసెంటుసతి యొకరు కయని తెలుపుట నా యాశయము. ఆమె జీవితచరిత్ర యందలి తత్త్వ మొక్క మాటలో తెలుపవలెనన్న "సత్యారాధన"మని ముక్తకంఠముతో తెలుపవచ్చును.

ఆమె పలుకులనే పరిశీలింపుడు:

"నాజన్మమున నితరసందర్భములలోవలె నీ సందర్భమునగూడ నన్నృతమూడి హృదయశాంతిని గాంచజాలను. నా మాట లితరుల కిష్టముగ నున్నను లేకున్నను, నాకు మెప్పు తెచ్చినను నింద దెచ్చినను, సత్యము నే కలుకుమని యనివార్యమగు నావశ్యకత యొకటి నన్ను బలవంతపెట్టును. ఏ మిత్రులు నన్ను విడనాడినను, ఏ బాంధవ్యములు భగ్నమైనను సత్యదేవతయెడ గల నావిశ్వాసమునకు మాత్రము నేను కళంకము రానీయజాలను. ఆదేవత నన్నడవిలోనికి దీసికొని పోయినను, నే నామెవెంటనే పోవలెను. ఆమె నన్ను చంపినను ఆమెనే నమ్మెదను. నాగోరీమీద

'ఆమె సత్యము ననుసరింప యత్నించెను'

అను స్మారకవాక్యముకంటె వేఱేమియు వ్రాయ గోరను" (స్తుతగ్రంథము: పుట ౫౦)

1871 సంవత్సరమున వేసవిలో నొకనాటి నిశీథమున భర్త ఆమెతో కలహించి, ఆమె నవమానపఱిచి వెలుపలికి పోయెను. జీవితము దుర్భరమైనందున తనబిడ్డకై తెచ్చియుంచిన క్లోరోఫారంసీసాను పెట్టెనుండి యామె వెలుపలికి దీసి సీసామూత తెఱచి, యామె నోటికెత్తుకొనుచుండగా "పిరికిదానా! మతమునకై యుసురులగూడ బెట్టుకొనుటకుద్యమించుచుంటివా? కొలదిసంవత్సరములు యాతన ననుభవింపజాలవా?" యనువాక్యములు స్పష్టముగ నామెకు వినబడెను. తృటిలో ధైర్యమువహించి చేతిలోనిసీసా నామె గవాక్షముగుండా యవ్వలికి పాఱవైచెను.

ఆమెజీవితములో నిది తాత్కాలికమైన నిట్టూర్పు మాత్రమే! మూర్తీభవించిన అత్యాచారము చెంతనుండుటామెకు దుర్భరమాయెను. తానభిలషించు సత్యాన్వేషణము సలుపక కాళ్లు ముడుచుకొని కూర్చుండుటామె కసాధ్యమాయెను. "ధైర్యముతో నీజీవితధర్మము నెఱపుము; ముందంజ వేయుము" అనియంతర్వాణి ఆమెను హెచ్చరించెను. భర్త చూపు జుగుప్సకు సంఘము చలాయించు నిర్బంధము తోడాయెను. తన విశ్వాసమునకు విరుద్ధముగ తనసంఘము చూపు పుంతలో నడచుట కామె మనసొప్పలేదు. విడాకులదావా తలకెత్తినది! పుత్త్రుని భర్త చేతులబెట్టి పుత్త్రికతో నామె యిల్లు వెడలెను. భర్తవలన లభించు అల్పార్థము ఆహారమునకును చాలదు.

ఉపవాసదీక్షయందు, అగ్నిపరీక్షయందు, ఆత్మసంయమనమందు, ఆత్మార్పణమందు సత్యవ్రతము కొనసాగును. సత్యశోధకు దూరమై, కలహాన్నమును కుడుచుటకును భోగభాగ్య

ములనందుటకును సమ్మతింపక ఆదేవత మ్రోల నిప్పుగుండమున నధివసించుటకు మక్కువపడిన మానినీమణి బెసెంటుసతి. ఇది మౌఢ్యమని, అవివేకమని అనేకులు వచించుట నిక్కమే! అధికసంఖ్యాకులకు నవివేకమని తోచు విధానమందే వివేకజ్యోతిని వీరులును, వీరాంగనలును విలోకించుచుందురు. పలువురతో గలిసి "భళాభళి"యని పదుగుర మెప్పునంది క్షణముల మూటగట్టుకొనుటకంటె యథార్థపంథను బట్టుటే తమధర్మమని శూరులు తలంతురు. తమ తెరువు ననుసరించి పోవుచున్నను, లోకము వీరిని చూచి సహించదు. వీరిపై రాళ్ళు రువ్వును. వీరిముఖములపై నుమియును. వీరిచేతికి విషపాత్రము నందించును; వాడి ముండ్లను వీరి తలపై గుచ్చును. వాడి మేకులతో వీరి యెముకలను తునియలు చేయును. "పాపాత్ములు మీ"రని, "దురాత్ములు మీ"రని వీరి నాడిపోయును. మేనిపై రొచ్చు పులుమును; వెడలిన నిందలను దశదిశల విరజిమ్మును!

పతిగృహమునుండి వెలువడిన పిదప బెసెంటుసతి కేవలము క్షుద్బాధకు మాత్రమే గురికాలేదు. పూర్వోక్త కఠోరపరిస్థితుల కారణముగా తల యొగ్గవలసి వచ్చెను. దాదియై, వంటకత్తెయై, ఆకటి బాధనుండి, కటిక బ్రదుకునుండి కొంత నిష్కృతినందినను, లోకుల నిందనుండి ఆమెకు విముదల కలుగలేదు. సత్యాన్వేషణమునకై మార్గదర్శి నరయునపుడు 1874 లో చార్లెస్ బ్రాడ్లా ఆమె మ్రోల సాక్షాత్కరించెను. అతడు పరోపకారపారీణుడు; సాహసోపేతుడు; సంఘమందలి మౌఢ్యము నెదుర్కొనుటకు జంకని ధైర్య

కాలి; ఎదురీతలో నారితేటిన జట్టు; మహావక్త. తనయాశయ సిద్ధి కాతడు తోడ్పడునని బెసెంటుసతి యూహించెను. ఇరువురు నాస్తికమతప్రచారము చేయసాగిరి. ఈశ్వరుడు లేడని వారెన్నడును వచింపలేదు. దేవుని కనుగొనుట సాధ్యము కాదని యూహించి ఆతని గుఱించి యేమియు తెలుసుకున్నను, నైతికపీఠముపై నిలిచి, సుగుణ సంపద నలవఱచుకొని, పరార్థజీవులై మానవులు సర్వతోముఖ పురోభివృద్ధి నందవచ్చునని వారు విశ్వసించిరి. బెసెంటు సతి రచనలు "నేషనల్ రిఫార్మర్" పత్రికలో ప్రకటింప బడుచుండెను. ఆపత్రికకు కొంతకాలము సహాయసంపాదకు రాలై, కడపటి త్యాగబుద్ధితో ఆ పదవినుండి యామె తొలగిపోయెను. బహుభంగుల బ్రాడ్లా కామె తోడు పడెను. పార్లమెంటు ఎన్నికలలో నాతనిపక్షమున నిలిచి ఆమె యెంతో కృషి సలిపెను. పరుల దురభిప్రాయమునకు గుఱియైన వ్యక్తి కీమె యీదృశసహకారము సలుపుచుండు టచే పత్రికలీమెను తీవ్రముగ విమర్శింపసాగిరి. స్వంత కాపుర మునకు నీళ్లువిడి, నాస్తికుని యండజేరి, నాస్తికమతప్రచా రము చేయునారిని చూచి, సంఘము నోరుమూసికొనునా? నాత్మపరిశీలన మొనరింపక, చిత్తమువచ్చినట్లు బెసెంటు సతిని దూషింపసాగెను. సత్యమునే లక్ష్యముచేసికొనిన సీమంతినీచూడామణి యగుట, అపనిందను సరకుగొనక తన కర్తవ్యము నామె నిర్వహించుచునేయుండెను. ఈ సమయ మున నామెగుండెపై మరియొక పెద్ద యాఘాతము పడెను! నాస్తికురాలై, విప్లవోద్యమములను లేవనెత్తు తల్లికడ నుండి

వచ్చో, ఆమె యాడుబిడ్డ చెడిపోవునని యెంచి, బెసెంటుసతి భర్త కోర్టులో నామెకు ప్రతికూలముగ నభియోగము దెచ్చి తనయను (రుగ్ణయైనను) తల్లి కరములనుండి యీడదెచ్చుకు కొనిపోయెను. ఈ యుదంతమును కన్నీటితో తన యాత్మ కథయందు బెసెంటుసతి వ్రాసికొనెను. గాయముపడినహృదయ మున సుధాంజనముపూయు తన ముద్దుబిడ్డను - ప్రాణాధిక మైన దుహిత నీరీతిని దుర్విధి గొనిపోయి నప్పుడామెపడిన యాతన దుర్భరమైయుండెను. జగతియందలి బిడ్డలందఱు తనబిడ్డలే యని పరమహంస పత్నియైన శ్రీ శారదాదేవి తలంచినట్లు ఆమె యూహించెను. గ్రంథరచన మొనరించుచు, నిరంతరము పని చేయుచు నాటి హృదయారాటము నామె కొంతదనుక అణచియుంచుకొనజాలెను.

ఆమె హృదయము కారుణ్యాభరిత మైనదని తెలుపుట కనేకదృష్టాంతములు కలవు. దిక్కులేనివారికి, దీనులకు, నిరు పేదలకు సాహాయ్యము నలుపుటకై ఆమె యెంతో మక్కువ పడుచుండెను. తానుకష్టపడి సంపాదించిన పైకమును వెంటనే ఆమె దానము చేయుచుండెను. ఒరులకు సేవచేయుటకై పెక్కు సీగులకామె తలయొగ్గుచుండెను. నాల్టన్ పుస్తక విక్ర టనము ఆమెకును, బ్రాడ్లాకును కొన్ని చిక్కులను దెచ్చి పెట్టెను. బెసెంటుసతిని ప్రేమదృష్టితో వీక్షించిన కొందఱు మిత్రులుండిరి. మిస్ మ్యారియట్, బ్రాడ్లా, వకీల్ రాబర్ట్స్ స్టాట్ దంపతులు మున్నగువారామె కర్తవ్యమును సానుభూతితో వీక్షించిరి. ప్రజాపురోభివృద్ధికి సంబంధించిన ప్రతి యుద్యమ మందును (అదిరాజకీయోద్యమమైనను పారిశ్రామికోద్యమ

మైనను, సంఘసంస్కరణోద్యమమైనను, వైజ్ఞానికోద్యమమైనను, సామ్యవాదపుటుద్యమమైనను) ఆమె శక్తివంచన లేక కృషి సలిపెను. తన శరీరనాళములందు విశేషముగ నైరిష్ రుధిరమే స్రవించుచున్నను, ఐరిష్ ప్రజల కనేకరీతుల సేవ సలిపినను, ప్రపంచవాసులందఱు తన బంధుమిత్రులని యెంచి యెల్లసీమలందును సంచరించి, ఆమె తన సేవాధర్మమును నిర్వహించెను.

దివ్యజ్ఞానసమాజమున నడుగిడిన మంగళముహూర్తమున భవపరంపరనుండి తన స్వస్థలము భారతభూమి యని గ్రహించి, ఆమె భారతసంప్రదాయమున కంజలిఘటించెను.

నాస్తికుడైన నరేంద్రుడు శ్రీరామకృష్ణ పరమహంస పదస్పర్శవలన వివేకానందస్వామియైనట్లు నాస్తికవాదమును ప్రచారమొనరించిన బెసెంటుసతి మేడంబ్లవాట్స్కీసంపర్కమువలన యోగినియాయెను. సత్యము వెలుగులకై పెక్కుతెన్నులందు పెక్కుగతులనడచి, ప్రశాంతి నెఱుంగక బహుళ కష్టముల నెదుర్కొనుచు, ఆమె తీవ్రకృషి సలిపెను. ఒక తెరువునుండి వేఱొక తెరువునకు పరుగెత్తుటలో నొక్కొకపు డామె గట్టి దెబ్బలకు గుఱియగుచుండెను. సరియైన తెన్ను నినమ్మినంతదనుక అందే నిలిచినదుముగట్టి, అందు లోపము గోచరించుటతో తరువాతి తెరువున దుమికి సర్వశక్తుల నందలి కృషికై వినియోగించి పదపడి వెలుంగుదోచు నదే వానతో నామె వేఱొకదిక్కుగా పరుగెత్తుచుండెను. ఈపరుగులాటలో సుఖశాంతులు నేలరాలెడివి; కాయము గాయముల పాయ మాఱెడిది; చిత్తము తత్తరపడుచుండెడిది. ఎట్లైనను ఏమైనను

పట్టూర్పువిడిచి, నిరాశజెంది ఆమె చలికిలపడలేదు. పరాత్పరు డీ వ్యక్తి హృదయమందలి అనల్పవిజ్ఞానను, అద్భుతసత్య పరిశీలనాకాంక్షను జాగరూకుడై పరీక్షించుచునే యుండెను. “సీక్రెట్ డాక్ట్రిన్” అను గ్రంథమును, రెండు సంపుటములందు చూచినపుడు అపూర్వభావశబలత సూర్యరశ్మివలె ఆమె హృదయసరోజమును స్పృశించెను. తోడనే అది వికసించెను. బహువర్షములనుండి ఆమె యంతరంగమున విజృంభించు సంక్షోభము శాంతించెను. తన్ను దాను గుర్తించు శుభముహూర్త మాసన్నమైనదని ఆమె గుర్తించెను; ఆ యద్భుత గ్రంథమును రచియించినమహావ్యక్తి మేడంబ్లవాట్స్కీకడకరిగి, దర్శనమాత్రమున నామె హృదయ మహత్త్వమును, జీవితతత్త్వమును గ్రహించి ఆమెమ్రోల సాగిలపడెను. హేతుశక్తికంటె ఘనతరమైన శక్తి ఆత్మశక్తియని, విమర్శనము దొడ్డదయ్యుపరిమితికలదై కొంతదనుక సాగినను విశ్వాసమునకవకాశమీయవలెననియు నామె గుర్తించెను. తార్కికవిధులు, భౌతికశాస్త్రసూత్రములు ఆమెకుకరస్థలామలకములై యుండెను. బి. యస్ సి. వరకు ఈ శాస్త్రముల నామె పరీక్షించెను. నిశితపరిశీలనమున, నామె యారితేఱెను. తీవ్రసమీక్ష ఆమె దైనందినదీక్ష యాయెను. బహుజన్మసంచితమైన రత్నరాసులు హృదయాగారమున బంధింపబడుట నంతకుమున్నామె గుర్తింపలేదు. నేడు కవాటము భేదింపబడినది. ఆత్మవిభూతి నవలోకించి అంతరంగ మందిరమందలి పరంజ్యోతికామె జోహారన్ని జేజేలు పాడెను. నూత్నము చేజిక్కినది. దాని ననుసరించి గత భవపరంపరలోనికి తనయోగదృష్టిని

సారించి, గతయత్నము లను సింహావలోకన మొనరించి, ఆలోక సందీపితమైన తనగమ్యస్థానము నామె గుఱుతించెను. ఈ వఱలో బాహ్యచక్షువుతో నామె పరీక్షించెను. ఇపుడు దివ్య చక్షువుతో నింద్రియాతీత దృశ్యములను వీక్షింపసాగెను. ఈవఱలో నామె స్థూలదృష్టితో స్థూలప్రపంచమునే విలో కించెను; ఇపుడు సూక్ష్మదృష్టితో సూక్ష్మప్రపంచముల చూడదొడగెను. అంతర్దృష్టితో ననంతశక్తుల నామె పరిశీ లించి, తాను నవ్యవ్యక్తిత్వము నందెను. ఈ యంశమును పాఠకులకు దెలుపు దృష్టాంతములెన్నో 1889 నుండి నడచిన ఆమె జీవితగాధయందు గలవు. దాని నేకరువుబెట్టుట నా ప్రస్తుతాశయము కాదు. బెసెంటుసతి జీవితఘట్టములందలి గంభీరతత్త్వ మెట్టిదో సంక్షేపముగ పఠితలకు తెలుపుటయే నా ప్రస్తుతకర్తవ్యము. మేడమ్ బ్లవాట్‌స్కీ, కర్నల్ ఆల్కాట్, లెడ్‌బీటరులతో గలిసి గభీరతత్త్వవిచారము సలిపి ప్రాచీనప్రతీచీ మతములను, ప్రాచీనార్వాచీన మహా గ్రంథముల నవలోకించి, విశేష విజ్ఞానమునంది, క్రమనిష్ఠకతన మహత్తరయోగశక్తుల నామె పడసెను. జగతిలో నిట్టి శక్తుల ప్రధానకేంద్రము భారతదేశమని గుర్తించి, 1893 సంవత్సరమున (చికాగోలో జరిగిన అఖిలమత మహా సభయందు సింహగర్జనము సలిపిన యనంతరము) ప్రాగ్దిశకు పయనించి నవంబరు 9 వ తేదీనాడు కొలంబోలో దిగి మఱి యేదుదినములలో నామె పవిత్రభారత భూమిపై నడు గిడెను. పక్షి యెందో బంధింపబడి స్వస్థలము జేరినపు డెట్లు పరమానందభరితు డగునో బెసెంటుసతి పూత

భారతవసుంధర కరుదెంచినప్పుడల్లే పరమపవిత్రోపపూరిత స్వాంతయాయెను. భగవాన్‌దాసు, గోవిందదాసు లను సోదరుల సాహాయ్యమున నామె సంస్కృతము నచిరములో నభ్యసించి, భారతీయసంస్కృతిని హృదయంగమ మొనరించుకొని, భగవద్గీతాది గ్రంథములకు వ్యాఖ్యవ్రాసి, గీతాంశముల ననుసరించి జీవితము గడుపుచు హిందూమతాచారముల ననుసరించుచు, హైందవనారీమణులట్లు దుస్తులను ధరించుచు, నియమసహితమైన కాలహరణము చేయుచు కొంతకాలము వారణాసియందు వసించి, సెంట్రల్ హిందూ కాలేజిని స్థాపించి, సంస్కృతమునకును, మాతృభాషలకును ప్రాచీసంస్కృతికిని ఉత్సాహగర్భితప్రోత్సాహ మొసగి, పదపడి మాలవ్యా పండితునకు దాని నప్పగించి, హిందూ విశ్వవిద్యాలయము తలయెత్తుటకవకాశ మొసగి, పిదప అడయారు జేరి, సిద్ధుల యోగమనమున పునీతమైన తావది యని గ్రహించి; అందుండి భారతదేశమందలి వివిధరాష్ట్రములకును, ప్రపంచమందలి వివిధసీమలకును పయనించి, వివిధోద్యమ స్పందనములందు సారథియై ఆమె యొప్పెను. డాక్టరు అరండేలు లండన్‌లోని క్వీన్స్‌హాలు (Queen's Hall) లో బెసెంటుసతి మహోపన్యాసమును వినునపు డాతని సత్తువను త్రుటిలోనా మెగుర్తించి, తన యనుయాయులలో నాతని నొకని జేసికొనెను. సెంట్రల్ హిందూ కాలేజీలో నధ్యాపకుడై పదపడి, అడయారులో జేరి ఆత డామె యడుగుజాడల నంటి వివిధ క్రియాంగణములందు ముందంజ వేసెను. అడయారు మనోహరమై అంతర్జాతీయ దివ్యజ్ఞాన కేంద్రమాయెను. జినరాజ

దాసు, హీరేంద్రనాథదత్త మున్నగువా రామె శిష్యగణములో చేరిరి. విజ్ఞానియైన డాక్టర్ సుబ్రహ్మణ్య అయ్యరామెకు సన్నిహితుడాయెను. నారాయణయ్య కేసులో నామెకు ప్రతిద్వంద్వియై పనిచేసిన సి. పి. రామస్వామి అయ్య రామె ముఖ్య శిష్యులలో నొకడాయెను. పెరిగి పెద్దవారైన పిదప*ఆమెబిడ్డలిరువురు దివ్యజ్ఞాన సమాజమున జేరిరి.

ఆర్యవిద్య నుద్ధరించుటకై, ఆర్యమతమును ప్రోత్సహించుటకై కొండొకవడి శ్రమపడి, రాజకీయ మహోద్యమమున 1913 లో ప్రవేశించి, హోమ్‌రూలు ఆందోళనము నలిపి, కొంతకాలము నిర్బంధమున నుండి, భారతీయుల హృదయములందు నూతనోత్తేజమును బుట్టించి, వారి మన్ననలనంది, న్యూ యిండియా పత్రికను మదరాసులో నెలకొలిపి, అతివాదులకును, మితవాదులకును చేతులు కలిపి, 1917 లో కలకత్తా కాంగ్రెసు పీఠము నలంకరించి, మూడేండ్లలో గాంధిజీతో తన కభిప్రాయభేదము కలిగినను తన యుద్యమమును విరమింపక కామన్‌వెల్త్ ఆఫ్ యిండియా బిల్లును ఇంగ్లాండున పార్లమెంటులో ప్రవేశపెట్టి బహుభంగుల భారతపురోభివృద్ధికై ఆమె పాటుపడెను.

పిల్లలనిన నామెకు ప్రేమ యధికము. భగవాన్‌దాసు కొడుకైన శ్రీప్రకాశును † కేంబ్రిడ్జికి దోడ్కొనిపోయి,

---

* ఆమె కూతురు రష్యాలదాంపత్య సుఖము నందెను. కొడుకు తరకము వలన విశేషధనము సార్జించెను. అతుల్యైశ్వర్యమును బెసెంటు సతి ప్రకంటనైన విలోకింపకుండెను. కొడుకు నుద్దేశించి "Digby has become shamelessly rich" అని యామె పలుకుచుండెను.

† ఈతడిపుడు పాకిస్థాన్‌లో హైకమిషనరుగా నున్నాడు.

ఆతని విద్యాభ్యాసమునకు ఆమె చేయూత యొసగెను. బిడ్డ కృష్ణమూర్తి నిత్యానందులను చెంతజేర్చికొని, వారి పురోభివృద్ధిని కాంక్షించి, తండ్రికి వారి నప్పగింపక మదరాసు హైకోర్టున (తన చిరాభ్యాసమును పురస్కరించుకొని) తన కేసును దాను వాదించుకొని, న్యాయమూర్తి మనసును మార్చలేక నెగ్గుదల నందకున్నను, ఇంగ్లాండున నామె విజయమునే పడసెను.

బెసెంటుసతి హృదయమున నావంతైన మాలిన్యము లేదు. ఒరులు తన కెగ్గుచేసినను, ఆ యెగ్గు నామె తలచి యెఱుగదు. శత్రువులనైన దూషింపక, ఒరులు దూషించుట సహింపక మూర్తీభవించిన సహనమై, రూపుదాల్చిన యౌదార్యమై, ప్రేమ స్వరూపిణియై, అసంఖ్యాకులకు మాతృదేవియై, కన్నతల్లి వలెనే పిల్లలను పెద్దలను సేవించి, సర్వ సమయములందు కనికరమును ఆదరమును సమస్తభూతములకు జూపుచు నాయమ్మ వఱలెను. ఏటేట నింగ్లండుకు పోవుచు, భగవాన్ దాసుగారింటగల బిల్లలకై అందుండి వివిధములైన ఆటవస్తువులను (ఇవి బెనారసులో దొరకనవే యయ్యు) బెసెంటుసతి గొనివచ్చుచుండెను. ఒకప్పుడు దాసుగారు తీవ్రవ్యాధి పీడితులైనపుడు దాదివలె నామె ఆయనకు సేవసలిపెను. గాంధిగారి సహాయనిరాకరణోద్యమవాహనకు భుజమునొడ్డక, బెసెంటుసతి కొంతపలుకుబడిని గోల్పోయెను. కాని భగవాన్‌దాసు గాంధిజీ యనుచరులలో నొకఁడై కైదున ప్రవేశించినపుడు మనసున నామె ఖేదపడి, ఇంగ్లాండు నుండి మరలినతఱి స్టేషనునుండి తిన్నగా నాతనిని చూచుటకై

కారాగృహమున కరిగెను. బెసెంటుసతిపై అతని కెంతేని భక్తి యుండెను. నతడు సఖుడై సగము వంగ ఆమె కాతడు జోహా రొనరించువాడు. *

వ్యక్తిసేవ యెడలను, సంఘసేవ యెడలను ఆమెకు ప్రీతి మెండు. ఆమె స్థాపించిన "దివ్యజ్ఞానుల సమష్టిసంఘ జీవనవసతి", "బ్రదర్సుఆఫ్ సర్వీస్", "దివ్యజ్ఞాన సేవాసంఘము," ఆర్థరు చక్రవర్తి యొకప్పుడు నెలకొలిపిన రౌండు టేబుల్ వీరదళము బోలు "సేవాసమితి", "సుప్రీంకౌన్సిల్ ఆఫ్ యూనివర్సల్ కోమేసనరీ", "గుప్త విద్యాశిక్షణాలయము", "జగజ్జననీ-సేవకసమితి" మున్నగు సంఘములామె సేవాదీక్షను జగతికి చెప్పక చెప్పుచున్నవి. బేడెన్ పవెల్ నెలకొలిపిన బాలభటోద్యమములో బాలభటునివలె ముందు కురికిన వీరాంగన బెసెంటుసతి.

నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞ ఆమె సొమ్ము. దండి మహాకవి తెలిపిన నైసర్గిక ప్రతిభ ఆమె హృదయమున దివ్య దీపకళికయై వెలుగొందుచుండెను. వారణాసీవిశ్వవిద్యాలయము ఆమెకు మహోన్నత పట్టమును ప్రసాదించినను, ఏవిశ్వ కళాపరిషత్తులోను ఆమె విద్యాభ్యాసముచేయలేదు. స్వయం

---

* బెసెంటుసతి 1983 సెప్టెంబరు 20 వ తేదిని అడయారులో నస్తమించెను. ఆమె భౌతికశరీరము సుగంధకాష్ఠాలలో భస్మమాయెను! కొండికణికలబోలిన కొన్ని యెముక లందే (సంస్మరణోద్యానమున) భూస్థాపిత మొనరింపబడెను. శేషించినవి వారణాసికి గొనిపోబడెను. కర్మకాండపైన నమ్మకములేని భగవాన్ దాసు గారు విశేష భక్తితో, శ్రద్ధతో, విశ్వాసముతో వానిని చేబూని, తను పూజచేసి, నావలో గంగనడుమ కరిగి భాగీరథిజలంబు గలిపెను!

కృషివలన బహువైజ్ఞానికాంశముల నామె గ్రహించెను. ఎట్టి క్లిష్టాంశములైనను త్రుటిలో గ్రహించి, విస్మృతి నెఱుగక అనల్ప కౌశలముతో నామె వ్యక్తీకరించుచుండెను. నిశిత పరిశీలనమున కామె యద్భుతభావనాశక్తితోడాయెను. దివ్య దృశ్య సాక్షాత్కారము వలన నామె ప్రతిభ మహోజ్జ్వల మాయెను. ఈదృశ ప్రతిభగల వ్యక్తి దిగ్వలయము మీది దినమణివలె తేజరిల్లును. పాండితి గ్రహించిన భావబీజము ప్రతిభవలన రంగారు బంగారుపైరై విలసిల్లును. బెసెంటు సతి రచనమందును, వక్తృత్వమందును పైడిపైరు వెలసెనని మతిమంతులు గుర్తించిరి. వ్యవసాయాత్మికబుద్ధిగల విదుషీమణి యామె. క్షీరస్పర్శవలన నావు పొదుగునుండి విశేష దుగ్ధము వెలారునట్లు కొండొక మహితభావ స్పర్శవలన నామె హృదయమునుండి యవిరళభావధారలు వెడలి బహు సంఖ్యాకులైన జిజ్ఞాసువుల మానసములను దనుపుచుండెడివి. గభీరయోచన నలవఱచుకొనిన విదుషీమణి యగుడు ఆమె భావపూరము సేద్యమునకు కొఱగాని నీటివలె నిందందు చెదరక, సక్రమగతి నడచు కైవలిని వలె ప్రవహించెడిది.

ఏకాగ్రదృష్టి వలన తలపు అవిచ్ఛిన్న తైలధారవలె వెలారునుగాని వాతూలాఘాతమున దశదిశల జిమ్మబడు తుంపురులట్లు వ్యర్థముకాదు. లాకు తలుపు మూయబడినపుడవ్వలిపూరము నిలిచి యుప్పొంగి కవాటము తెఱువబడినంతన కటువేగమున జాల్వాఱునట్లు గతభవసంచితభావపోలితము నిభృతాంతరంగమున నొప్పి, స్మృతికవాటము

తెరువబడినంతన ప్రస్తుతభవనమున దివిజకల్లోలినివలె స్రవించును. దివి నుదయించిన ధునీపూరము భువిపై గంగయై సాగర దిశజనుచున్నది. పాతాళమున వెలారు స్రోతముకూడ కలదు. ఒక లోకము నుండి వేఱొకలోకమునకు లంఘించు ఝరీమతల్లివలె ఒక భవమునుండి వేఱొక భవములోనికి నుదాత్త భావకల్లోలిని పటుతరగతి నుఱుకు లెత్తుననుట తథ్యము. ఇట్లని భారత దేశమందలి కవీంద్రులును, మునీంద్రులును, వీరి జీవితవిధానములను సముజ్జ్వలములైన మేలుబంతు లొనరించుకొనిన అన్యదేశవాసులైన మనీషులును విశ్వసించిరి. సోక్రటీస్, ప్లేటో, పైథాగరస్, అరిస్టాటిల్, మేక్సిములర్ ప్రభృతు లిట్టివారు. ఇట్లు విశ్వసించిన మహిళ డాక్టరు బెసెంటు. ఇట్టి విశ్వాస మామె భర్తకు లేకుండెను. ఈ యభిప్రాయ భేదము వారినడుమ పొరపొచ్చెమును రవులొల్పెను.

కేవల పాండితినుండి వ్యక్తమగు వచనపరంపరలో దివ్యదీప్తి యుండదు. తపసున నారితేఱిన హృదయమే తన్మయత్వము నెఱుగును. ఇందుద్భవించిన సూక్తులే అనంతకాలము విశ్వమందు ప్రతిధ్వనించును. డాక్టరు బెసెంటు రసనమునుండి వెడలిన పలుకులిట్టివి.

జైనమతమును గుఱించి యొకప్పు డామె యుపన్యసింప వలసి వచ్చెను. అస్వస్థతవలన విషయపరిశీలన మొనరించుట కామె కవకాశము కలుగలేదు. సభాస్థలమున కరుగుటకు మున్ను గోవిందదాసు నడిగి జైనమతమును గుఱించి, కొలది విషయముల నామె తెలిసికొనెను. పకాలమున వేదికపై

డాక్టరు బెసెంటు నిలిచెను. రోగపీడిత యైనను కూర్చుని మాట్లాడుట కామె యెన్నడు సమ్మతించకుండెను. ఒక మిత్రుని చేయూతతో నామె నిలిచి, ఉపన్యాసము నారంభించెను. సహజధోరణితో జైనమతమును గురించి, జలదగంభీర స్వరమున నామె మహోపన్యాసము గావించెను. "జైనమతమును గురించి ఘనపాండిత్యము సంపాదించితిని. కాని నే నెన్నడిట్టి యుపన్యాసము నీయజాల"నని గోవిందదాసు పలికి, బెసెంటు సతి శక్తి ననేక రీతుల బ్రశంసించెను. ప్రతిభకును, వ్యుత్పత్తికిగల వ్యత్యాసమును గురించి పైన నేదెలిపిన వృత్తాంతమును పరిశీలించిన పఠితలు ప్రస్తుతాంశమందలి తత్వమేమో గ్రహింపజాలుదురు. గాదెలోనిధాన్యమునకును, పైడిగిన్నెలోనిపాయసమునకు నెట్టి భేదమున్నదో వట్టిపాండితి సంపాదించిన వ్యక్తి మనసునప్రవేశించిన విషయమునకును, ప్రతిభాశాలి హృదయమున జొచ్చిన అంశమునకును అట్టి భేదమే యున్నది. ఈతని చిత్తమున పడిన పదార్థము పడినట్లే యుండదు. అందది పచనమగును; శుద్ధోదనమగును. భావన బంధురమై మధురమగును; కలమాన్నమగును; గ్రహించినది సామాన్యాంశమే యయ్యు, హృదయమున నుదాత్తపరిణతి నందిన మహత్తర విషయము నీతడు జగతికి ప్రసాదించును. ఎట్టి కఠిన విషయమైనను వీని హృదయమున రసభరితమై, వీని యనుభూతి స్పర్శకతన మహిమోపేతమై యొప్పును. ఎవ్వాని హృదయమున రససృష్టియగునో, ఎవ్వాడు సౌందర్యోపాసన మందును, సత్యవ్రతమందును, ఆనందోపాసనమందును సిద్ధహస్తుడో అతని మానసము మానససరోవర మట్లు నిర్మలమై, ప్రశాంతమై

పరిఢవిల్లును. మానసహ్రదము మానసౌకముల నిలయము కదా! మరాళపంక్తులు ప్రఫుల్లముఖులైన శతశత సుందరీ మణుల పొందున సమోదానందము నందునుగదా! ఆలోక సందీపిత కనకవసనసుందరియై వెలయు ప్రభాతభామినీ ముఖవినిర్గత స్వర్ణమయూఖవ్రాతము ఫుల్లసరోజముఖ ములపై మంచిముత్తెముల కెనయై యొప్పు మంచుతుంపు రులందు నవరత్నద్యుతులను తళుక్కొత్తించుచుండ నా యబ్బు రంపు దృశ్యమునకు కనులప్పగించి పరమహంసలట్లు పూర్వోక్త రాజహంసలు తమ్ము తాము మరచి తన్మయ నృత్యము సలుపునుగదా! మానసహ్రదమున క్రీడైన హృదయమున రాయంచలబోలు తలంపు లుదయించి, అద్భుత సౌందర్యసృష్టి గావించును. అంతరంగమున తలయెత్తిన మనోహరదృశ్యమును కళోపాసకుడు సముచితపదయవనికపై దళుక్కొత్తించును. శతాబ్దులును, సహస్రాబ్దులును ఆ యవ నికకు కనులప్పగించును! ఈదృశసౌందర్యసృష్టి గావింప జాలు భావోపాసకులు ప్రపంచమున నందందు నుదయించు చుందురు. వీరిలో డాక్టరు బెసెంటు ఒకరుగయని తెలు పుట నాయాశయము. ఈమె హృదయమొక్కొకపుడు దివ్య బృందావనమున కెనయైయొప్పెడిది. బృందావనమున యమునా సరిత్తిలకము కలదుగదా! అందు వనమాలి కలడు. శ్యామ సుందరుని మోవిపై మురళి యుండునుగదా! మురళీవినిర్గత మధురమంజులనిస్వననిర్ఝరిణీ వీచికలందు రాయంచలట్లు వ్రజ నారీమణులుబ్బితలూగుచుందురుగదా! ఆత్మహృదయ బృందా వనమున శ్రీకృష్ణు నవలోకించి, కృష్ణగీతకు వీనులొగ్గి ఆత్మ

జీవితమును పీయూషభరిత మొనరించి ఆత్మకథ నొక మంజుల గీత నొనరించి, యశస్తిలకమైన సీమంతిని డాక్టరు బెసెంటు. ఆమె హృదయము నందనమున కెనయైన దందుమా? ఆ హృదయశోభ ఆమె రచనమున నొప్పారుచుండును. అందు నందనచందనోత్కర మొప్పుచుండునుగదా!

డాక్టరు బెసెంటువంటి మహావక్తలరుదుగ జన్మింతురు. ఆమెకాలమున నామె కీడైన వక్తలెవ్వరును లేరు. వక్తృత్వ కౌశలమున విఖ్యాతి గనిన గ్లేడ్‌స్టన్ ఆమెమ్రోల డింభకుడై యుండువాడు. పద్యములల్లినంతన నొకడు కవికానట్లునిఘంటువులను నమలిమ్రింగినంతన నొకడు వక్తకాజాలడు; భోక్తయైన గావచ్చును. కళోపాసనమున నందెవైచిన చేయి యగుటచే వక్తృత్వకళయం దామెయద్వితీయశక్తినందెను. ఉపన్యాసవిషయము సఘనపాండితీనంది, భాషయందు ప్రభుత్వమును నెలకొలిపి, శాఖాచంక్రమణమునకుకడంగక, సక్రమవిషయవిభజనమొనరించి, భావవ్యంగ్యరసౌచిత్యములు వలచు పదజాలమునే ప్రయోగించి, శ్రోతలపై కన్నుంచి, వారిహృద్వీణాతంత్రులను మీటుచు వారిసంఖ్య ననుసరించియు, విషయమందలి యుద్వేగము ననుసరించియు, గళరవమును మార్చుచు, నిర్దుష్టమైన యుచ్చారణమువలన, శైలిలోని మంత్రశక్తివలన, శయ్యలోని సౌందర్యమువలన, పాకమందలి రుచివలన, భావమందలి మహత్త్వమువలన, ధ్వనిలోని తత్త్వమువలన, సందర్భమందలి పటుత్వమువలన, విషయప్రాభవము పురికొలుపు హావభావములవలన నెదుటివారిపై సమ్మోహనాస్త్రము ప్రయోగించి హృదయగంగోత్తరినుండి యవిరతముగ స్రవించు విజ్ఞాన

పూరమున శ్రోతలను ముంచి తేలించుచు, ఒక్కొకపుడు వారిమేధాశక్తిని, వేఱొకప్పుడు హృదయశక్తిని రేకెత్తించుచు, వారి మానసనేత్రము మ్రోల మహత్తర దృశ్యములను గురుతరశక్తితో చిత్రించుచు, మహోత్సాహమున వారి నుఱ్ఱూతలూగించుచు తనతో వారిని పదునాలుగు భువనములందు ఛంగుఛంగున పరుగెత్తించుచు, నుపన్యసించువేళ నిజాత్మనుండి పటుతరగతి జాల్వారు పీయూషపూరమును మోహిని సురప్రముఖులకు నమృతము నొడ్డించినట్లొడ్డించుచు, తన యద్భుతానుభూతి బోలు అనుభూతిని వారిలో బుట్టించుచు, అనిర్వాచ్యవిద్యుచ్ఛక్తి యనల్పవేగమున నాత్మహృదయమున విజృంభించుచుండ దానుగాక దివినుండి హఠాత్తుగ నవతరించిన అపూర్వజీవి రంగస్థలమున నిలిచెనోయను నూహను కట్టెదుటి సభాహృదయమున సృజించుచు, ఒక్కొక ముహూర్తమున కమలభవనర్తనునివలె నింకొక నిముసమున రాసక్రీడలోని మురళీకృష్ణుని చాడ్పున, వేఱొకసమయమున నటరాజుకైవడి తోచుచు తన తన్మయత్వమును వారికిని ప్రసాదించుచు, మహాకావ్యపరంపరను సురాపగాసదృగ్ధారాళవాగ్ధాటి నతికౌశలమున వెలారించుచు, దివిజకవివరు మనసున నీసు రవులొల్కలుపుచు, దిక్కామినుల మానసనేత్రములకు మిఱుమిట్లుగొలుపుచు, సభాంగణమున నధివసించిన సూక్ష్మశరీరధారుల నలరించుచు, తనసృష్టికి నెంతో మురియు జగదీశుని మఱింత మురిపించుచు, పూత కళాసామ్రాజ్యమున స్వేచ్ఛావిహారము సలుపుచు, జగన్మోహినికి సహపాత్రియై మెలంగుచు "హాయి! హాయి!" యను హర్షధ్వానములను

"ఓహో! ఓహో!" యను మహాద్భుత రససముద్భవ నినదములును, ఉద్వేగభరితకరతాళధ్వనులును అజాండమున ప్రతిధ్వనింప బహుపాత్రధారియై గోచరించుచు మహావక్త మహావ్యక్తియై వఱలును! భూతలమందలి పత్రికలటుండ దక్కంగల భువనప్రకరమున పరగు ప్రత్యేకపత్రములందు మరీచిగుచ్ఛమున సృష్టియగు మహితాక్షరములందా వక్తృత్వవచనపరంపర ప్రకటింపబడును! దివ్యసూక్ష్మలేఖకులెంతో కష్టమున వ్రాసికొనిన అక్షరసముదాయమును ముసిముసినవ్వులతో సృష్టికర్త తీర్చిదిద్దును. పాఠకమహాశయులారా! మహావక్త శక్తిని వర్ణించుటకీ యుపోద్ఘాతము చాలదు. పదివేలలో నొకవక్త యుండునందురు. పైన పేర్కొనబడిన వక్త బోలుమనీషులు పదికోట్లలో నొక్కరుందురేమో! బహుజన్మసంచిత సుకృతమునకు ప్రస్తుతభవమందలి తపసు కలిసెనేని, ఒకవ్యక్తి అట్టి శక్తిగల వక్త కాజాలును. "సర్వశుక్లాసరస్వతి" యనబరగిన డాక్టరు బెసెంటు ఇట్టి మహావక్తయని తెలుపుట నాయుద్దేశము! ఆమె కుఱుగట నిలువజాలు వక్త యేసీమయందైన మఱొక్కడు లేడని కంఠమెత్తి వచింతును. ఇతర యుగములందు జగతిలో నట్టి వక్త ఏదిక్కనైన పుట్టెనో లేదో జగదీశునకే యెఱుక.

డాక్టరు బెసెంటు వక్తృత్వము పుడమిలోని ప్రతిఖండమందును, ప్రతిమహోద్యమ ప్రాంగణమందును ప్రతిధ్వనించెను. భారతభూమియందలి యీదృశప్రాంగణములందివి ముఖరితమగుట స్వానుభూతివలన నెఱుగు భాగ్యము నా కలవడెను. ఆ యనుభూతియే యీ మంగళముహూర్త

మున నా కలమును సాగించెనని వినమ్రుడనై మనవిచేయుచున్నాను. బెసెంటుసతి యద్భుతశక్తిని గుర్తించిన మహామేధావి సర్ అశుతోష్ ముఖోపాధ్యాయుడు కలకత్తా విశ్వవిద్యాలయమున కమలామహోపన్యాసము లిచ్చుట కర్హతగల తొలివక్త ఆమెయే యని నిర్ణయించుటచే, విద్యార్థినై ఆమెవాగ్ఝరియందోలలాడు భాగ్యము నందితిని. ఆయుపన్యాసములవలన మా విశ్వ కళాపరిషత్తు పునీతమైనది. ఆ పరిషత్తు చరిత్రలోని నీ కమలాయుపన్యాసముల యుదంతము స్వర్ణాక్షరములతో ప్రకటింపబడుట తథ్యము.

మెకాలే మహాశయ ప్రభృతుల ప్రయత్నముల వలన భారత భాషలపై, ప్రధానముగ సంస్కృతముపై ఆఘాతము పడినది. భర్తునిపై బడినపూలచెండవలె నాతనిపై పడిన దెబ్బ భగవంతునిపై పడినట్లు మాతృభాషలపై పడు దెబ్బ మాతృధర్మముపై, మాతృసంస్కృతిపై, మాతృసభ్యతపై, మాతృ విజ్ఞానముపై, మాతృ సాహితిపై, మాతృమతముపై, పడితీరును గదా! పాశ్చాత్యుల వలన మనమతముపై మనవాఙ్మయముపై దెబ్బపడినను, పాశ్చాత్య సీమయందు ప్రభవించిన ఒక మహావ్యక్తినే ఆ దోషమును మాపుచేయుటకై పరమేశుడు మనసీమకు పంపెను. 1893 ఆధునిక హిందూమత చరిత్రలో మిగుల ముఖ్యమైన సంవత్సరము. ఒగుల దండయాత్రల వలననేమి, దేశీయుల యవజ్ఞ వలననేమి హిందూమాత ధూళ్యవలుంఠితయైన సమయమున నా సంవత్సరమున చికాగోలో జరిగిన సర్వమతసమావేశములో వివేకానందస్వామి సనాతనమతమహత్త్వము నుగ్గడించినట్లే బెసెంటుసతి మనమత మహత్త్వమును దశదిశల బ్రకటించుటకై ఆ వత్సరమందే

మానసీమలో నడుగిడెను.

దివ్యజ్ఞానము విదేశయంత్రాగారములందు సృష్టియైన సరకు గాదు. మనదేశమున మన మునిముఖ్యుల హృదయాగారములందు జనించిన బ్రహ్మజ్ఞానమే యది! "థియాసఫీ" యనిన బ్రహ్మజ్ఞానమని దృఢముష్టిబంధమున రాయి గ్రుద్ది చెప్పెదను. ప్రపంచశాంతిని వలచి, వివిధమతసామరస్యమును కాంక్షించి, డాక్టరు బెసెంటుసతియును, ఆమెగురువులును, పరమగురువులును, శిష్యులును, ప్రశిష్యులును దివ్యజ్ఞాన మహోద్యమమును నెలకొలిపిరి. సమస్త శాస్త్రములకు వేదమాత ఆదిమాత యైనట్లు సమస్త మతములకు నాదిమాత హిందూమత జనయిత్రియేయను ముఖ్యాంశమును జిజ్ఞాసువులు విస్మరింపరాదు. తమతమ మతములకు తిలతర్పణము వీడుమని దివ్యజ్ఞానసమాజము తెలుపదు. తమ మతమందిరములం దధివసించుచు సోదరమతము లందలి భావశబలతను గ్రహించి, మహత్తరమైన ఏకైకక్రియాసఫలతకై నడుముగట్టి "వసుధైవ కుటుంబక" మ్మను మహావాక్య మనుసరించి జీవితము గడపుమని మానవలోకమునకు తన దివ్యశంఖారావమువలన దివ్యజ్ఞాన మహోద్యమము దశదిశల చాటుచున్నది. ఈ మహోద్యమ స్యందనమున సారథియై డాక్టరు బెసెంటు సమస్తసీమలందు విశేషోత్సాహముతో పయనించి బ్రహ్మజ్ఞాన తత్త్వమును, సనాతనమత మహత్త్వమును జలదగంభీరస్వరమున ప్రకటించెను. హిందూమతము నాడిపోయి వారెందరెందరో పెక్కుదిక్కులందు కోతికొమ్మచ్చు లాడునపుడు హిందూ మతప్రభావమును సర్వదిశలందును చాటిన ఈ విదుషీమణిఋణమును భారతీయు లెట్లు దీర్చికొందురో! ఋణమనిన

నామె యాత్మ యంగీకరించదు. నిష్కామకర్మ నిర్వహణమున నారితేరిన మహావ్యక్తి డాక్టరు బెసెంటు. నేడామెస్థూలశరీరము లేక పోయినను ఆమె యాత్మ ఆమె నిర్ణయించిన క్రియాంగణములందు, ఆమె యనుయాయులకు మార్గమును చూపుచునేయున్నది. ఆమె మహోపన్యాసముల నిక మనము వినజాలకపోయినను, ఆమె జీవించినపు డుచ్చరించిన గురుగంభీరవాక్కుల ప్రతిధ్వనులు విశ్వవాతావరణమున నింకను లీనముకాలేదు. శిష్యగణహృదయగర్భాలయములం దవి ముఖరితమగుచునే యున్నవి. ఉపనిషచ్ఛిఖరములందుదయించి యుగయుగములందు జాల్వారిన భావభాగీరథిని గుటుకించి, ఆపూతకల్లోలినీ వీచికలపై ననిర్వాచ్యానందమున నుయ్యాల లూగిన డాక్టరు బెసెంటు యాత్మ యింకను ఆ దివ్యానుభూతి నందుచునే యున్నది! ఉపనిషత్తు లుచ్చరించిన "అమృతస్య పుత్రా"యను భావబంధురవాక్కును శ్రద్ధాభరిత హృదయమై పలుమాఱులు పురశ్చరణ మొనరించిన పూతచరిత్ర అమృతస్య పుత్రికయై యొప్పెననుట అతిశయోక్తి కానేరదు.

ఈయశస్సిలక జీవితాంశములను కడుశ్రద్ధతో పరిశీలించి, బహుళ గ్రంథములనుండి విశేష విషయములను సంగ్రహించి, శ్రీ గుంటూరు వేంకట సుబ్బారావుగారు ప్రస్తుత గ్రంథమును రచించిరి. దివ్యజ్ఞాన సమాజాశయములను హృదయంగమ మొనరించుకొనిన విజ్ఞానియై, తమ యుపన్యాసముల వలనను, కృతుల వలనను డాక్టరు బెసెంటు మహోద్దేశములను అనల్పకౌశలముతో వారు మన రాష్ట్రమున బహు సంఖ్యాకుల హృదయఫలకములందు నాటుచుండిరి. ఆంధ్ర సర్కార్సు థియసాఫికల్ ఫెడరేషను అధ్యక్షులై వారు

చేయు కృషి ప్రశంసనీయము. వారి శైలి నిర్దుష్టమై, మనో హరమైనదని ప్రస్తుతగ్రంథమును పరిశీలించు జిజ్ఞాసువులు గ్రహింపజాలుదురు. ఈ గ్రంథభవనమును నిర్మించిన విద్వాంసులు వారు. భవనద్వారమును నిర్మించు భాగ్యము నా కలవడినది. ఈ భాగ్యమును నాకు చేకూర్చిన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారికి కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములను సమర్పించుచున్నాను.

ప్రజాకల్యాణముపై మనసుంచి, బహుళోద్యమము లకు బుజము నొడ్డి, విశేషత్యాగము సలుపు శ్రీ వేంకట రమణయ్య పంతులుగా రాంధ్రలోకమునకు చిర పరిచి తులు. దివ్యజ్ఞాన సాహిత్యమును దేశమున ప్రచలిత మొనరించు టకై విశేషధనమును వ్యయమొనరించుచు, వివిధ రీతుల ప్రజాళికి సేవజేయు కర్మవీరులు వారు. డాక్టరు బెసెంటు యుద్యమములన్నిటిని పరిశీలించి, ఆమె యనుయాయులలో నొకరై, ఆమె యూహాలను దశాబ్దులనుండి భారతీయులకు వారెఱిగించుచున్నారు.

అనల్పప్రజ్ఞతో నీ గ్రంథమును రచించిన శ్రీ వేంకట సుబ్బారావుగారిని, ఈ గ్రంథముద్రణ ప్రకటనములకు నుత్సాహగర్భిత ప్రోత్సాహము జేకూర్చిన శ్రీ వేంకట రమణయ్యపంతులుగారిని, ప్రకాశకులైన శ్రీ దివ్యజ్ఞాన చంద్రికామండలివారిని హృదయపూర్వకముగా నభినందించు చున్నాను.

బెజవాడ
12-12-47

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

# డాక్టరు ఆనీ బిసెంటు

## 1వ భాగము : ఇప్పటి జీవితచరిత్ర

### వంశము, జననము, పైతృక లక్షణములు

ఇంగ్లండు దేశములో డెవన్ షైర్ జిల్లాకు జెందిన వుడ్ వంశములో పూర్వులు చాలమంది గొప్ప రాజభక్తి పరాయణులని కీర్తి నొంది, గొప్ప పదవులను, గౌరవబిరుదులను పొందినవారును, పెద్ద యుద్యోగముల జేసినవారును గలరు. ఆకుటుంబములో ఆనీ 1847 సం. అక్టోబరు 1 తేదీని పుట్టెను. ఆమె తండ్రి విల్లియం ఐర్లండులో బుట్టి యక్కడనే విద్యనభ్యసించి వైద్యశాస్త్రములో పట్టభద్రుడయ్యెను. అతను వైద్యమును వృత్తిగా నెన్నడు నవలంబించ లేదుగాని యితర వైద్యులు చేయు శస్త్రచికిత్సలలోను శవపరీక్షలలోను, ఇతర పరిశోధనలలోను తరుచు సహాయము జేయుచుండెను. అతడు లండన్ లో నొకపెద్ద జీతముగల యుద్యోగము జేయుచుండెను. విల్లియం బహు భాషావిశారదుడు, గణితము, సాహిత్యము, తత్వశాస్త్రము పూర్తిగా చదివిన పండితుడు. ఆ కాలపు క్రైస్తవ మతాచారములకు బోధలకు విముఖుడు, పట్టుదలగలవాడు. అతని తల్లి ఐర్లండు దేశీయురాలు. అతని భార్య ఎమిలీయు ఐర్లాండు దేశీయురాలే. ఆమె కా దేశీయులకు సహజముగ నుండు సూక్ష్మగ్రహణశక్తి, దేవతాగణముల యందు శకున

ములయందు నమ్మకము కలవు. అందుచేతనే అనీకి ఐర్లండు నందభిమాన మెక్కువ, తానైర్లండు దేశీయురాల నని యనుకొని ముచ్చట పడుచుండెడిది.

ఎమిలీ తండ్రి బ్రతికిచెడిన యైరిష్ గృహస్థు. అతని యాస్తియంతయు జీర్ణమైపోయినను, బ్రతికినంతకాలము నతడు విచారము నెరుగడు. ఎమిలీ యతని రెండవకూతురు. ఆమెను అవివాహితయగు మేనత్త పెంచుకొనెను. బ్రతికిచెడిన యితర కుటుంబములలోవలెనే, యీమేనత్త తన పుట్టినింటి పూర్వుల మర్యాదను నిలబెట్టయత్నించెడిది. పూర్వమొకప్పుడు ఫ్రాంసు నుండి పలాయనులై యైర్లండుజేరి యచట నివాసమేర్పరుచు కొనిన 'రాజసప్తక' మను రాజవంశీయుల సంతతివారమని యామె చెప్పుకొని, యింటిలో నందరు రాజకుటుంబ మర్యాదల ననుసరించి నడువవలె నని యామె దిద్దుచుండెను. ఎమిలీ బాల్యచాపల్యముచే నల్లరిపను లేవైన జేసినపు డామె, "ఎమిలీ, ఫ్రాంసురాజసప్తకము సంతతివారి కిది తగదుసుమీ" యని మందలింప, నాబాల తానుచేసిన తప్పున కా పూర్వు లెంత యసహ్యించుకొనుచుండిరో యని దుఃఖించెడిది. అట్టి శిక్షణములో పెరిగిన యెమిలీ పెద్దదైనపుడు తన ప్రవర్తనలో దూష్యము, నీచము, నల్పము నగుచర్య వచ్చునేమోయని బహుజాగ్రత్తగ మెలగుచుండెడిది. ఎంత బాధపడినను అగౌరవము ఛాయామాత్రమైనను రాగూడదు; బాధను భరింపవచ్చునుగాని యమర్యాద భరింపజాలము, గనుక, మచ్చ లేనికీర్తిని గోరవలెను; కులీనురాలు తిండిలేక మాడిన మాడ వచ్చునుగాని యప్పుచేయరాదు; ఆమె గుండె పగులగొట్టుకొన

వచ్చునుగాని ముఖముపై చిరునవ్వు మాయరాదు. ఇది ఎమిలీ స్వభావము, కనుకనే, ఆమె యెన్ని కష్టములుపడినను లోకమును ధైర్యముతో నెదుర్కొనెను. ఆమె యీ స్వభావమే ఆమె యల్లారుముద్దుగ పెంచిన యానీకిని యలవడెను. ఈ శిక్షణము అతి నింద్యతమును తుపానులతో నిండినదియునగు ఆనీ జీవితమున కాధారమైనది. తనశీలమును శంకించిన విమర్శ యనిన నామెకు సహజమగు జంకు, లోకనిందయనిన బాధ కాని, యీ శిక్షణమువలన మరియొకలాభము చేకూరెను. ఆమెశీలము నెవరైన శంకించినయెడల వారిమాటల నామె గడ్డిపరకలవలె నిరశించి, వారికి జవాబైన చెప్పక, "నేను మీరనుకొనునట్టి దానను కాను, మీయజ్ఞానము నన్నెంత మాత్రము మార్పజాలదు. మీరు నన్నుగుఱించి యేమను కొన్నను నన్ను పాపిని జేయజాలరు. మీరు నన్నిపు డెట్టిదాన ననుకొనుచున్నారో నాదృష్టికి నేనటువంటిదాననెన్నటికిని కాను" అని యనుకొనియెడిది. ఆమె లోకుల దృష్టిలో నెంతయప కీర్తిపాలైనను భరించెనుగాని తనదృష్టికి పాపిగ గనిపించుట నించుకైన భరింపజాలకుండెను. ఆయాత్మగౌరవమే యామెకు రక్షయై, యామెశీలమును గాపాడెను. భర్త, పిల్లలు, ఇల్లు, మిత్రులు, సంఘము అందరు బహిష్కరింప, ఏకాకియైయున్న కాలమం దామెను రక్షించిన దీగర్వమే.

ఆనీ తన తల్లిని గుఱించి యిట్లు వ్రాసెను:—

"నే నెరిగినంతవఱకు నామెయందున్నంత మార్దవము, సౌజన్యత, ఔదార్యము, మరియొక స్త్రీయందగుపించలేదు.

తాను ప్రేమించినవారి యెడల అంత స్వార్థరహితమైన యను రక్తి, అధమము నీచమునైన సకలవిషయముల నెడల నంత తృణీకారభావము, మర్యాదతో సంబంధించిన యేవిషయము గుఱించియైన నంత తీక్ష్ణమగు నుదిరిక్తత, ఇచ్ఛయందంత దార్ఢ్యము, మార్దవమునందంత సౌహార్ద్యముగల స్త్రీని నే నెక్కడను చూడలేదు. నాతల్లి నా బాల్యమును సంతోషముతో నింపి స్వర్గలోకమువలె జేసెను: నావివాహమైనంత వఱకు తాను నివారింపగల బాధయేదియు నన్నంటకుండ నామె నన్ను కాపాడెను.

"దుఃఖమునంతను తాను భరించి సుఖమునంతను నే ననుభవింపవలెనని యామె నిరంతరము చూచుచు, న న్నేస్వల్ప దుఃఖమైన నంటనీయ లేదు. ఆజానులంబితమై యుంగరములు చుట్టుకొని యుండు నా కేశపాశము నామె స్వయముగా దువ్వి జటలల్లి యలంకరించవలెను గాని మరెవ్వరును ముట్టుకొన కూడదు; నాదుస్తుల నామె చేతులతో ముళ్ళు వేయవలెను, నాతలలో నామె స్వయముగ పువ్వులు ముడువవలెను. నన్ను ప్రేమించువారు నాకొఱకు భరించగలంత దుఃఖము చింత నన్నంటకుండ నా శైశవము బాల్యము గడుచుటచేత నిరుపేదలకు తప్ప తదితరులకు జీవితము దుర్భరముగ నుండునని కలలోనైన నే నెన్నడు ననుకొనలేదు. సుఖమయమగు నాకాలమున నాకు గలిగిన సంతోషము ఎట్లుకలిగినది యెవరివల్ల కలిగినది యను నాలోచనమైన చేయక సూర్యరశ్మి నెట్లనుభవింతుమో దాని నట్లనుభవించితిని."

ఎమిలీకి సూక్ష్మగ్రాహణశక్తి గలదనుటకు రెండు నిదర్శనము లున్నవి :— 1. ఆసీతండ్రి విల్లియం చనిపోయి నపు డతని శవమును చర్చికి తీసికొనిపోయి, చర్చిలో జరుగ వలసిన సంస్కారములు జరిగిన తరువాత, ఖననము చేసిరి. ఎమిలీ చర్చికి పోలేదు. ఆమె దుఃఖభారమున వెల్లబారిన ముఖ ముతో, నెఱిసినతలతో, నిర్జీవమగు చూపుతో, నొకప్రార్థనల పుస్తకమునుచేతపట్టుకొని యొకసోఫాలోగూర్చొనియుండెను. శవపేటిక చర్చిని చేరిన కాలము నామె లెక్కపెట్టి చూచి, యది మొదలు జరిగిన తంతుకు సంబంధించిన మంత్రములను పుస్తకములోనుండి చదువుచు, తుదకు "అంతయు నైపో యిన" దని యొక వెఱ్ఱికేకవేసి మూర్ఛపోయెను. తరువాత, కొన్ని వారములు గడచిన పిదప ఎమిలీ తన భర్త గోరీని దర్శింపగోరెను. అదివఱ కామె యెన్నడు నా చర్చికి పోలేదు, కనుక, అంత్యక్రియల సమయమున నచటనుండిన యొకబంధు వును తోడుదీసికొని పోయెను, ఆ బంధువుకూడ త్రోవతప్పి గోరీని కనుగొనలేకపోయెను. అక్కడనున్న వా రెవరో పురోహితుని గొనివచ్చుటకు బోయెను, గాని, యింతలో ఎమిలీ శవపేటికను మొదట చర్చిలోనుంచి ప్రాయశ్చిత్తాది కర్మలుచేసిన చోటుకు తనను దీసికొనిపోయిన యెడల గోరీని తాను కనపరచగల ననెను. అక్కడివా రది నమ్మకపోయినను ఆమె కోర్కె దీర్చుటకు ఆమె నాచోటుకు గొనిపోయిరి ఆమెఅచట నిలచి, అటునిటుచూచి, పూర్వపరిచితమగు త్రోవను పోయినట్లు తిన్నగా నొకదిక్కు నకు జంకు గొంకులేక నడిచిపోయి గోరీని చేరెను. ఆమె

ఖననము జరిగిననాడింటనే యుండినను చర్చిలో జరిగిన దంతయు దగ్గరనుండి చూచితినని యామెయే చెప్పెను.

2. ఆనీకి హెన్రీయను నన్నయును, ఆల్ఫ్రెడ్ అను తమ్ముడు నుండిరి ఆల్ఫ్రెకు తండ్రిదగ్గర చేరిక. తండ్రిపోయినది మొదలు ఆబిడ్డ బెంగపెట్టుకొని, నిరంతరము తండ్రిని తలచుకొనుచు, క్రమముగ శుష్కించిపోయెను. ఇట్లుండ నొకరాత్రి ఎమిలీ కొక కలవచ్చెను. ఆ కలలో విల్లియం వచ్చి 'అల్ఫ్రెను నాకిచ్చి తక్కిన యిద్దరిని నీవుంచుకొను'మని యామె నడిగెను. అది యాబిడ్డ మరణము సూచన యని యామె నిశ్చయించెను. ఆ ప్రకార మాతడు కొద్దిరోజులలో చనిపోయెను.

ఈ సూక్ష్మగ్రహణశక్తి ఆనీకి సంక్రమించెను. బాల్యమునం దామె యహస్స్వప్నముల గాంచుచు, నపూర్వదృశ్యముల జూచుచు, నూహల జేయుచుండెను. ఆమె యాడుకొను కొమ్మల నామె ప్రాణము పోతున్న స్త్రీ పురుషులుగ భావించి వారి కష్టముల నూహించి సానుభూతి చూపుచుండెను. వనదేవతలు, జలదేవతలు మొదలగు దేవతాగణము లామెకు పరిచితులైరి. ఆమె ప్రతివస్తువును ఒక ప్రాణిగ భావించి గౌరవించి యాదరించుచుండెను; నిర్జీవములగు నాటవస్తువులతో గూడి యెన్నియో కథల నల్లి యభినయించెను. ఆమె తండ్రి చనిపోవుటకు నాలుగురోజులముందు ఆమె జన్మదినము వచ్చెను. ఆరోజున నామెకు బహుమతిగ నొక బొమ్మను తండ్రి కొని తెప్పించి యిచ్చెను. దానికి 'చెర్రీ' యని పేరుపెట్టెను. తండ్రి పోవుటకు ముందురోజున అతనియొద్ద కడసారి సెలవు పుచ్చుకొనుటకు ఆనీ నతని మంచముపై

కెక్కించిరి. అప్పుడా బాలమ్మ నతడు ముద్దుపెట్టుకొనవలెనని పట్టు పట్టి యేడ్చెను. తనబిడ్డను తన తండ్రి యెందుకు ముద్దు పెట్టుకొనడని యామె చింత. ఆనీ చదివిన పుస్తకములలోని దేవతలు రాక్షసులు యుద్ధములు, మతముకొఱకు ప్రాణము లర్పించినవారి కథలు, ఆదాము అవ్వ కథ, మొదలగునవనిన నామెకు కడు సంతోషము. ఆయా కథలలో వీరులవలె తా నుండిన నెంత బాగుండునోయని యూహించుచుండెను. వారి వారి చర్యలు తనయెదుట జరుగుచున్నట్లే యూహించుకొనుచుండెను. ఈ సూక్ష్మగ్రహణశక్తి తరువాత ఆమె యం దితరవిధముగ పరిణామము నొందెను; ఆకాలమున పెద్దలందరు దాని నణచివేయుటకే చూచిరి, గాని, యది యణగ లేదు.

విల్లియం, ఎమిలీల యన్యోన్యానురాగము బహుగాఢ మైనది. అతడు గొప్ప పండితుడు, తత్వశాస్త్రవేత్త. ఆమె పూర్వాచారపరాయణురాలగు భక్తురాలు. అతనికి నాటి శుష్కమతాచారములయందు నమ్మకము లేదు. ఆమెకు వాని యందు గౌరవము. అతడు ప్రతిదినము నేదోయొక సద్గ్రంథ మును చదివి ఆమెకు వినిపించుటయో, అది యన్య భాషలోనుండిన దానికర్థము చెప్పుటయో తప్పక జరుగు చుండెను. ఒక్కొక్కనా డతడు రోమన్ కేతొలిక్కు-మతబోధ లను ఆచారములను వెక్కిరించుట వినలేక ఆమె యచటనుండి లేచి పోవుచుండెడిది. ఆమె కతనియభిప్రాయములను విమర్శిం చుట యెంతమాత్రము నిష్టము లేదు. 'మతాచారములు స్త్రీల కవసరముగాని పురుషుల కవసరము లేదు. వారు ఏది కావల

సిన నది చదువుకొందురు. ఋజువర్తనులు సత్యవంతులునై యున్నంతకాలము వారేయభిప్రాయములను గలిగియుండుట కైనను స్వతంత్రులు' అని సరిపెట్టుకొనుచుండెను. కాని యతని స్వతంత్రాభిప్రాయము లామెను కొంతమార్చకపోలేదు. నాటిమతబోధలలో గొన్ని మూఢనమ్మకములని యామె యంగీకరించెను. కాని, ఆలయములలోని శాంతి, గంభీరవాతావరణము, అక్కడ జరుగునారాధనల శోభ, యామెకు మిక్కిలి యాకర్షణీయములుగ నుండెను.

ఆనీకి మతమునం దెక్కువ పట్టుదల. చిన్నతనమున చర్చి బోధలు బైబిలువాక్యములు ఆమెకు ప్రమాణములు. కాని, యవి తన విమర్శనకు చాలనందున నామె యామతమును వీడి నాస్తికము నవలంబించి దానిని అంతపట్టుదలతో అనుసరించెను. ఆకాలములో ఆమెతల్లి చనిపోవుచు ఆమెను చేర బిలచి, నాచిట్టితల్లి మిక్కిలి మతాచారపరురాలు, ఆమెయందున్న లోప మది యొక్కటే'అనెను. రోమన్ కాతొలికుమతమునే నాకరించియే యుండినయెడల ఆమె యామతముకొఱకెంతయో త్యాగముచేసియుండును. కాని, యదియు నామెకు తృప్తినీయజాలకపోయెను. ఆనీ యేవిషయమునైనను నమ్మినపుడెంత గాఢముగ నమ్మెనో అది తప్పుఅని తెలిసినపుడు దానిని విడిచిపెట్టుటలో నంతపట్టుదల చూపెను. ఆపట్టుదలయే యామె సత్యాన్వేషణమున దోడ్పడెను.

ఆనీకి చిన్నతనమునుండియు పుస్తకములు చదువుట యనిన ప్రీతి. ఏమూలలనో యెవరికి కనిపించకుండ కూర్చొని యెప్పుడు నేదోయొక కథలపుస్తకము చదువుచుండెడిది.

# బాల్యము

ఆనీ శైశవ మైదేండ్లు బహుసుఖముగ జరిగిపోయెను. ఆ కాలమందా కుటుంబములో సుఖసంతోషములు తాండవ మాడెననిన నతిశయోక్తి కాదు. 1852 సం॥ ఆగష్టు మధ్యలో నొకనాడు విల్లియం వానలో తడిసి యింటికి వచ్చెను. దానితో వానికి పడిసెముపట్టి గుండెలలో భారముపుట్టెను. ఒక గొప్ప వైద్యుని పిలిపించిరి. అతడు రోగిని పరీక్షించి వెడలి పోవుచుండ ఎమిలీ యాతనితో నావల కేగి సంగతేమని యడిగెను. వైద్యుడు 'నీ పతనికి ధైర్యము చెప్పవలెను. తీవ్రమైన క్షయ ప్రవేశించినది. ఆరువారములకంటె నెక్కువ బ్రతుకడు' అని కట్టెవిఱిచినట్లు చెప్పెను. దానితో నామె స్మృతి దప్పి పడిపోయెను; గాని, త్వరలో తెలివితెచ్చుకొని, తన బాధను దిగమ్రింగి యతని యుపచారములో నిమగ్న యయ్యెను. అదిమొదలు పదినిమిషములైన విశ్రాంతి లేకుండ భర్తకామె యుపచారముల జేసెను, కాని, యామెకు కష్టకాల మారంభించి, యతడు అక్టోబరు 5 వ తేదిని దివికేగెను. ఆ రాత్రియంతయు నామె యొకగదిలో తలుపు గడియవేసికొని యొంటరిగ నుండెను. తెల్లవారి యీవలకు వచ్చునరికి ఆమె నల్లనితల పూర్తిగా నెరిసి తెల్లబడిపోయెను.

విల్లియం పోయినప్పుడు కొంతధన ముండెనని యను కొనిరి గాని లెక్కలు చూచుకొన్నతరువాత కొంతకొక్కము తప్ప మరేమియు లేదని విశదమైనది. కాని, ఎమిలీ, వచ్చిన కష్టముకంటె నీదారిద్ర్య మెక్కువకాదని ధైర్యముతో నెదు

రోక్కనసాగెను. మొట్టమొదట కొడుకు హెన్రీ చదువుసంగతి చూడవలెను. అతడు విశ్వకళాశాలలో పట్టముపొంది మతాచారి కావలెనని తల్లికిని, లాయరు కావలెనని తండ్రికిని అభిలాష. తండ్రిపోయినతరువాత నిద్దరుబంధువులు వానికి చిన్న చదువు చెప్పించి తరువాత వర్తకవ్యాపారములో బెట్టెదమనిరి. కాని, ఎమిలీకి భర్త చనిపోవుటకుముందు వానివిద్యను గురించి చేసిన యాదేశమునకు వ్యతిరేకముగ జేయుట కిష్టము లేక వారిమాట కంగీకరించలేదు. అయినను, ఆబంధువు లా కుటుంబమునకు ఏదో కొంత సహాయము చేయుచు నుండిరి. తుదకు భర్తపోయిన కొన్నినెలలకు ఎమిలీ హెన్రీని హారో స్కూలులో చదివించుటకు నిశ్చయించి యక్కడకు పిల్లలను తీసికొనిపోయి, నొక చిల్లరవర్తకుని దుకాణముమీద మేడలో బసచేసెను. అక్కడ నొకపిల్లవానిని తనఇంట బెట్టుకొని సంరక్షించునట్లును అందుకు ఆమెకు వాని తలిదండ్రు లిచ్చు డబ్బుతో తనకొడుకుకు చదువు చెప్పించుకొనుటకును ఏర్పర్చుకొనెను.

ఇట్లొకయేడు గడచినతరువాత ఆమె యాయూరిలో చిన్నకొండపైనున్న యొక యిల్లు పుచ్చుకొని అక్కడ బడి పిల్లలను కొందరిని చేర్చి వారికి బస, భోజనము మొదలగు సదుపాయములు చేయుటకు బడి ప్రధానోపాధ్యాయుడగు డా॥ వాఘన్‌యొక్క యనుజ్ఞను కోరెను. అతని కామెను చూడగనే యామెయెడల గౌరవభావము నమ్మకము పుట్టి ఆమె కోరినదాని కొప్పుకొనుటయేగాక, తరువాత అతడును అతనిభార్యయును ఆమె కనేకవిధముల సహాయమొన

చ్చిరి. ఆమె తీసుకొన్నయిల్లు పూర్వము అచటిచర్చిలో వికార్ (పురోహితుడు) కాపుర ముండుటకు కట్టినది. ఇప్పు డత డాయింటిని విడిచి మరియొక యింటిలో నుండుటచేత ఆ యిల్లామెకు దొరికెను. అది విశాలమైనది, చాలా గదులు గలది, అన్ని విధముల ఆమె సంకల్పమున కనుకూలించినది. డా. వాఘన్ బడి యుపాధ్యాయు డొక డాయింట కాపుర ముండి పిల్లల చదువును కనిపెట్టి చూచుచుండవలె ననిన నందు కెమిలీ యొప్పుకొనెను. ఆప్రకార మక్కడ ఎమిలీ ప్రవేశించి పదేళ్లు బడిపిల్లలను సంరక్షించి తన పిల్లలను పెంచి కొడుకు కేంబ్రిడ్జి కళాశాలలో చదువుటకు వెళ్లినంతవఱకు వానికి చదువు చెప్పించుకొనెను. మన ఆనీకి ఊహ వచ్చిన తరువాత (ఆయింట ప్రవేశించినప్పటికామె కేడేండ్ల వయస్సు) ఆమె భావిజీవితమునకు పునాది యిక్కడనే పడినది. ఆ యింటిచుట్టు పెద్ద తోటలు గలవు. అనేక జాతుల ఫల వృక్షములు, రకరకముల పూలమొక్కలు కలిగి అవి బహు రమణీయముగ నుండెను. ఆ తోటలలో నొక్కచెట్టైనను ఆనీ యెక్కనిది లేదు. చాల దూరము వ్యాపించిన కొమ్మలుగల యొకచెట్టు నామె తన నివాసగృహముగ నేర్పర్చుకొనెను. ఆచెట్టుకొమ్మలలోనే బైటక్ ఖానా, పడకగది, చదువుకొను గది, సామానుకొట్టు ఏర్పడెను. ఈ సామాను కొట్టులో చెట్లను కోసితెచ్చిన పండ్లు దాచుచుండెను. చదువుకొను గదిలో గంటల తరబడి కూర్చొని పుస్తకములు చదువుకొను చుండెను. ఆమెకు మిల్టన్ వ్రాసిన పేరడైజ్ లాస్ట్ అను

కావ్యము అభిమాన గ్రంథము. అందులోని పాత్రలను తాను చూని యభినయించుట, అందులో వర్ణించిన స్వర్గనరకముల నూహించి, యక్కడ తానున్నట్లు భావించుట, దానిలోని కొన్ని భాగములను గట్టిగా చదువుట ఆమెకు సరదా. ఆ తోటలో నొకవైపున ద్వారము తెరచినపు డగుపించు దివ్య దృశ్యము మరువరానిది. అనీ ఇటువంటి పరిసరములలో మొగపిల్లలతో గూడి యాడుచు పాడుచు కొన్ని నెలలు గడిపెను. ఆమె క్రికెట్టును చక్కగా ఆడుచుండెడిది. ఇంత వఱకు తల్లికూతుళ్లిద్దరు నొకరినొక రెడబాసి యెన్నడు నుండలేదు. ఆమె తల్లి యెక్కడకు వెళ్లిన నక్కడకు వెళ్లెడిది, ఆమెను తగులునట్లు కూర్చొని, గాని, నిలుచొని గాని యుం డెడిది. ఒకనాడు తల్లి యిదిచూచి "చిట్టితల్లీ ఇలాగెల్లప్పుడు అమ్మనంటిపెట్టుకొని యున్నచో, నొక త్రాడుతెచ్చి నా కొంగుకు కట్టివేసికొనెదను, ఏమందువు" అనెను. వెంటనే అనీ "అమ్మా! గట్టిముడివేయవే" అనియెను. వారి ప్రేమ నిజముగా వారి నంతగట్టిగా బంధించినది.

ఇట్లుండ, నొకనాడు అనీ పొరుగింటికి చూడబోయెను. అక్కడ నెవరో యొక స్త్రీట్టవనిత వచ్చియుండెను. లోపలకు గెంతుకొనుచు వచ్చిన యా ముద్దుబాలికను చూడగానే ఆమె ముఖము వికసించి, బిడ్డనెత్తుకొని, యొడిలో గూర్చొన బెట్టుకొని కొంతసేపు మాటలాడెను. మరునాడామె ఎమిలీ యొద్దకు వచ్చి తన మేనకోడలుతోపాటు అనీనిగూడ తన యింట బెట్టుకొని చదువు చెప్పెదను బంపమని, సెలవులలో నింటికి వచ్చుచుండునని, చెప్పెను. ఎమిలీ మొదట బిడ్డను

విడిచియుండలేక పంపుట కొప్పుకొనలేదు, కాని, ఆ యువతి తనయొద్ద నేర్చువిద్య ధనముతో చేకూరునది కాదని, మొగపిల్లలతో కలిసి మసలుట మంచిదికాదని, ఒకప్పుడు పిల్లను స్కూలుకు పంపవలసి వచ్చునని, స్కూలులో చదువుటవల్ల సంభవించు నష్టములు లేకుండ అక్కడ దొరకు లాభము లన్నియు నిక్కడ దొరుకునని, నచ్చచెప్పినమీాద ఎమిలీ ఒప్పుకొనెను.

ఆయువతి కెప్టెన్ మార్యెట్ అను సుప్రసిద్ధ నవలా రచయితకు చెల్లెలు మార్యెట్కన్య. ఆమె తన తల్లితో గలిసి వింబిల్డన్ పార్కులో నివసించుచుండెను. ఆమెతల్లి చనిపోయిన తరువాత ధనవంతురాలగు తా నితరుల కుపకరించు పని యెక్కడనైన దొరుకునేమోయని చూచి, తనసోదరులలో నొకనికి చాలామంది సంతానముండుటచే వారిలో నొకపిల్లను తెచ్చి యింట నుంచుకొని స్వయముగా జదువుచెప్పుచుండెను. కొద్దిరోజులలో నాబిడ్డ కింకొకరిని తోడుచేసిన బాగుండునని యామెకు తోచెను. ఇట్లుండ నామె హారో వచ్చుటయు, నక్కడ తలవనితలంపుగ ఆనీని చూచుటయు జరిగెను. ఆసంధానము ఆనీ యదృష్టమని చెప్పవలెను.

మార్యెట్కన్య విద్యగరపుటయందు నేర్పరి. బడిలో విధానమును పూర్తిగా విడిచిపెట్టి పిల్లలమనస్సున కాహ్లాదము గలిగించుచు క్రొత్తపద్ధతులనుబట్టి బోధలజేయుచుండెను. పేదరికముచే కుంగియు నోరుతెరచి యొకరి నడుగుటకు లజ్జపడు తలిదండ్రుల బిడ్డలను తెచ్చి వారికి సంరక్షణచేసి చదువు

చెప్పుట యామె సంకల్పము. కాని, పిల్లల నామె యెంచుకొని తెచ్చుకొనెడిది. ఏలయన, తనశ్రమ వ్యర్థము కాగూడదు. పిల్లలామెను 'అత్తా' యనిపిలిచెడువారు. ఆమెముఖమెంతగంభీరమో హృదయ మంత మెత్తన. ఆమెవల్ల అనీ పొందినమేలు తన స్వీయచరిత్రలో నిట్లొక్క వాక్యములో వ్రాసెను: "నాజ్ఞానమునకే గాక నన్ను నిరంతరము నేర్చుకొనుమని ప్రేరేపించుచున్న జిజ్ఞాసకు నే నామె కెంత ఋణపడియున్నానో చెప్పుటకు మాటలులేవు."

మార్యట్ కన్య ఇవాంజలికల్ చర్చికి చెందిన క్రైస్తవురాలు. ఆమె బహుకఠినముగ మతనిష్ఠ నాచరించుచుండెను. ఆమె యెంతపూర్వాచార పరాయణురాలైనను, తనమతమును జీవితచర్యలలో ననుష్ఠించెడిది. ఆమె పేదలకు ధనము నిచ్చెడిది కాదు, వారికి అన్నము వండించి వారిఇండ్లకు తీసుకొనివెళ్లి పెట్టెడిది. ఎంగిలియన్నము నెవరికిని పెట్టనంగీకరించదు. కొందరికి రోజుకూలికి పనులుగాని నెలజీతములపై నౌకరీలుగాని సంపాదించెడిది. ఆదివారమునాడు బైబిలుగాని 'సండే ఎట్ హోం' గానితప్ప మరియేపుస్తకము పిల్లలను చదువనిచ్చెడిది కాదు, కాని, పిల్లల కారోజున కథలుచెప్పి, కీర్తనలుపాడించి, బైబిలుచదివించి, సండేస్కూలులో పిల్లలకు పాఠములు చెప్పించి, తోటలలో త్రిప్పి, విసుగులేకుండా చేయుచుండెను. సండే స్కూలులో చెప్పవలసిన పాఠములను శనివారము నాడు సిద్ధముచేసికొని యుండవలెను. పేదలకొఱకే యుపకారముచేసిన అది దాతకూరక లభించినదియై యుండరాదని యామె సిద్ధాంతము. "నా కేకష్టములేక లభించినది, ప్రభువగు

దేవునకు సమర్పించనా" యను బైబిలువాక్య మందుకు ప్రమాణము.

ఆనీకి మార్గరెట్‌కన్య ఇవాంజలికల్ చర్చి సంప్రదాయము ననుసరించి మతాచారములయందు శిక్షగఱపెను. క్రైస్తవులు చాలమంది తాము ('కన్వర్టు') మార్పునొందితి మనెడువారు. తనయం దట్టి మార్పేదియు కలిగినట్లు ఆనీకి కనిపించనందున, ఆమె చాలా విచారించుచుండెను; తాను 'రక్షింప' బడితినా యని సంశయించుచుండెను. ఆమె బైబిల్ మొదలగు గ్రంథములనుండి వాక్యములను కంఠపాఠము చేసి యొప్పగించవలెనని సరదాచేత ఒప్పగించినపు డామె నందరు గొప్ప భక్తురాలని పొగడుచుండిరి. అది యామెకు కష్టముగా నుండెడిది. చర్చిలో ప్రార్థనలకు బాలబాలికలందరు హాజరుకావలెను. అక్కడ నొక్కొక్కరును ప్రార్థనచేయవలెను. ఆనీవంతు వచ్చినపు డామెకు కంపమారంభమై నోట మాటరాక, వణుకు స్వరముతో నారంభించినను, తుదకందరిని మించినట్లు ప్రార్థన చేసి తన వాక్చాతుర్యమునకు మురిసిపోయి, దేవుడు, అత్త, తన ప్రార్థననుమెచ్చుకొనిరని సంతసించుచుండెను. మొత్తము మీద ఈ మతశిక్షణము బహు కఠినముగ నుండెను దానివల్ల తక్కిన ఫలితము లెట్లున్నను, అది తల్లి నెడబాసిన బెంగతోడై ఆనీ మనస్సులో కొంత నిరుత్సాహము పుట్టించెను. ఆమె యింటికి వచ్చినపుడు మార్గరెట్‌కన్య యామె బడిచర్యను గుఱించి వ్రాసియిచ్చిన రిపోర్టులో "ఉత్సాహము" తక్కువ యని యుదహరించెను.

1861 సం॥ లో మార్గ్యాట్‌కన్య తనమేనల్లుని కంటి వైద్యముకొఱకు జర్మని తీసుకువెళ్ళి అక్కడకు తనశిష్యు రాండ్రను గూడ దీసికొనిపోయెను. అక్కడ బోన్ నగరములో మూడునెలలుండి, ఆచుట్టుపట్లనున్న చక్కని ప్రకృతిదృశ్యము లను, చిత్రకళాప్రదర్శనశాలలను అన్నిటిని చూచిరి. తరు వాత, మార్గ్యాట్‌కన్య పిల్లలను సెలవుల కింటికి పంపెను. రెండు నెలలైన పిదప వారందరు ప్యారిస్‌నగరములో గలుసుకొనిరి. అక్కడ వారు చూడని దివ్యభవనములుగాని, చర్చిలుగాని, చిత్రకళాప్రదర్శన శాలలుగాని లేవు. ఆనీ యచటి సుప్రసిద్ధ మగుచున చర్చిలుచూచి ముగ్ధురాలైపోయెడిది. అక్కడి యస మానమగు నలంకారములు, పాటలు, పూజలు ఆమెకు హృదయరంజకములుగ నుండెను.

ఇట్లుండ 1862 సం॥ వసంతములో ప్యారిస్‌లో ఆనీకి 'కన్ఫర్మేషన్' అను సంస్కారము జరిగెను. ఆ సంస్కారము గుఱించి వ్రాయుచు ఆమె "వేదికయొద్ద నేను మోకరించితిని, నాశిరస్సుపైన వృద్ధుడగు నాచార్యుడు చేయివేసినపు డామృదుస్పర్శ, అప్పుడావాహనచేయబడిన పవిత్రాత్మ, దివ్య కపోతము యొక్కఱెక్క తాకినట్లనిపించి అవశనైతిని", అని వ్రాసెను. పారిస్‌నివాసమువల్ల ఆనీకి మతాభిమాన మెక్కు వైనది.

ఇంగ్లండు వచ్చిన తరువాత మిస్ మార్గ్యాట్ ఆనీకి పాఠ ములు చెప్పుటమాని, ఆమె తనంతట తాను చదువుకొని సంశ యములున్న తన నడుగుచుండవలెనని ఆమెను విడిచిపెట్టెను అత్తా! మునుపటివలె పాఠములు చెప్పుటలేదేమని యడిగిన

నామె "బ్రతికియున్నంతకాలము అత్తను ఊతగా పట్టుకొని యుందువా" యనెను. ఈ పద్ధతి ఆనీ కెంతయో సహాయకారి యయ్యెను. ఆనీ ఫ్రెంచి జర్మన్ భాషలలో విశేషకృషిచేసెను. అనేక సద్గ్రంథముల జదివెను. సంగీతము శ్రద్ధతో నేర్చుకొనెను. జిజ్ఞాస వృద్ధిచేసికొనెను. 1862 సం॥ శీతకాలములో ఆమె లండన్‌లో మార్యట్‌కన్యతోనుండి కూ. రోచి నడుపు ఫ్రెంచిబోధనాతరగతులకు హాజరయ్యెను. తరువాత వసంతము (1863) లో నామె హారోకు వెళ్ళి వారమున కొకసారి యాతరగతులకు పోవుచుండెను. అది పూర్తియైన తరువాత మార్యట్‌కన్య తాను చేయగలదంతయు చేసితిననియు అటుపైన (ఆనీ) తనరెక్కలతో తానెగురవలసినదే యనియు చెప్పెను. ఆమెచేసిన దెంత మహాకార్యమో యప్పుడెవరెరుగుదురు. ఆనీ కామె యేబడులలోను లభించని యపూర్వ శిక్షణమునిచ్చి తనంత తానెన్ని విద్యలనైన నేర్చుకొనుటకు జిజ్ఞాస లోపలనుండి పొంగివచ్చునట్లు మేల్కొల్పినది. ఆనీ యా తరువాత జర్మన్ భాషయందు కృషి సాగించుచు, తల్లికత్యంతాభిమానమగు సంగీతమును హారోస్కూలు సంగీతోపాధ్యాయునియొద్ద పూర్తిచేసెను.



# యౌవనము

16½ సంవత్సరముల వయస్సులో బడినుండి బైటపడుటయు, నింట తానొక్కతెయే యాడుబిడ్డ యగుటయు, తల్లి తనకష్టము లేవియు తనబిడ్డకు దెలియకుండ తానే భరించుచు బిడ్డ నెల్లపుడు సంతోషసాగరమున నోలలాడునట్లు చూచుటయు, ఇటువంటి పరిస్థితులలో మరియొక యువతిగతి యేమగునోగాని ఆనీ తనకాలమును వ్యర్థముచేయక తనజ్ఞానమును శీలమును వృద్ధిచేసుకొనెను. ప్రతిదినము తల్లికోరికపైన రెండుగంటలు సంగీతము సాధనము చేయుచుండెను గాని తక్కినకాలమంతయు తల్లి నిషేధించిన నవలలుతప్ప తన యిష్టమువచ్చిన పుస్తకములు చదువుకొనుచు, ఆటలు, గుఱ్ఱపుస్వారి, షికార్లు, విందులకు బోవుటతో గడుపుచుండెను. విందులలో నాచె అత్యుల్లాసవంతురాలైన యతిథియని పేరు నొందెను. విందుకు ఎవరైన పిలచిన చాలును, వేళగుసరికి తల్లి స్వయముగ ముస్తాబుచేసి పంపును గాని, యామె కేదుస్తులు వేసికోవలెనను చింతయైన నక్కరలేదు. క్రికెటు, క్రోకెట్ ఆటలలో ఆమె నేర్పరి. విలువిద్య పట్టుబట్టి నేర్చుకొని మొదటి బహుమానము పొందెను. ఆబహుమానమొక యుంగరము. ఆమె యీజన్మలో మొదట ధరించిన దా యుంగరము.

ఆమెకు తనతల్లి కొంచెము కష్టజీవితమునుకూడ రుచి చూపించియుండినచో, ఆకస్మికముగ కష్టములలో బడినప్పుడంత మనఃక్లేశ ముండకపోవునేమో యన్న చింత యిటీవల

కొంచెమామెకు కలిగినను ఆమె యీ యౌవన గడిపిన
సుఖజీవితమును బ్రతికియున్నట్లు ఆనందముతోను కృత
జ్ఞతతోను తలచుకొనుచుండెను.

19 వ సం. ములో వివాహమైనంతవఱకు ఆమె బాహ్య
జీవిత మీరీతిగ నంతరాయమెఱుంగని యానందముతో నిండి
యుండెను. ఆమె నాకాలమున "సన్ షైన్" (సూర్యరశ్మి)
యని పిలచెడివారు. సూర్యకాంతివలె ఆమె యెక్కడ కేగిన
నక్కడ అందరికి సంతోషము గొనిపోవుచుండినందున ఆపేరు
వచ్చెను. ఈ తరువాత ఆమె యెన్నివందలమంది ఆత్మలకు
శాంతిని పరమానందమును గలిగించెనో, అందు కా ధన్యజీవి
కేమని పేరుపెట్టవలెనో ఆ యన్నివందలమందియు నామెను
"అమ్మా" యని పిలచుచుండిరి. ఆహా! యెంతసార్థకనామము!
బాహ్యజీవిత మిట్లు గడుచుచుండ, నెవ్వరు నెఱుంగని యంత
రంగజీవితప్రవాహ మొకటి యామెలో ప్రవహించుచుండెను.
అది యామె జిజ్ఞాస. ప్రాచీన క్రైస్తవమతగ్రంథము లామె
కభిమాన పాఠములాయెను. ఏసుక్రీస్తు కాలము మొదలుకొని
18 శతాబ్దులకాలమున క్రైస్తవ మతాచార్యులు ఎక్క
డెక్కడ నెవ రేయభిప్రాయములను తెలియజేసిరో అన్నియు
నామె చదివెను. ముఖ్యముగ కేథొలిక్ చర్చి సంప్రదాయము
దామెకు ప్రీతి. ఆగ్రంథములు చదివినకొలదియు క్రీస్తు
ప్రభునియెడల నామెకు భక్తి మెండాయెను. ఆయన తన
యెదుట నదృశ్యరూపమున నెల్లపుడు నున్నట్లామె భావించుచు
తనభక్తిబలముచే స్వర్గరాజ్యమునుండిదిగి స్థూలరూపమున ప్రత్య
క్షమగునని నమ్మెను. వారమునకొకసారి ధ్యానసమాధి, తరుచు

నుపవాసములు, ప్రాచీన భక్తులు తొక్కిన త్రోవ ద్రొక్కు-భాగ్యముగలిగిన యెడల వారివలె శరీరబాధ ననుభవించుట నలవాటుచేసికొనుటకు అప్పటప్పట తన దేహమును కొరడాతో గొట్టుకొనుట, ఇది యామె నిష్ఠ. ప్రభువును ఆయన చర్చిద్వారా సేవించుట, ఆమె జీవితమునకు లక్ష్యమగుటచేత, ఆమె తన ప్రేమను త్యాగముద్వారా కనపర్చుటకును, తన తీవ్రమైనకృతజ్ఞతను సేవగామార్చుటకును వీలగునట్లు ధార్మిక జీవితము ననుష్ఠింప దలపెట్టసాగెను.

జీవితములో నెన్నిపొరపాట్లు చేసినను, ఎన్నితప్పు పనులు చేసినను, ఆమె లక్ష్యము మాత్రము త్యాగము-కేవల దేహముకంటె శ్రేష్ఠతరమగు నేదోయొక ప్రయోజనము కొఱకు, త్యాగము - అయియుండెను. త్యాగబుద్ధి యామె కప్రయత్నముగ గలిగినదిగాని బలవంతముగా తెచ్చుకొనినది కాదు; అంతరాత్మప్రేరేపణగాని మానసికనిర్ణయము కాదు; త్యాగము చేయని యెడల అంతరాత్మకు ద్రోహముచేసినట్లు, పతిత, పాపి యైనట్లు తోచెడిది. ఇటీవల ఆమె త్యాగమును మెచ్చుకొనిన మిత్రులనేకులామె త్యాగముచేసి యెంతయో బాధపడెననుకొనిరి, కాని, యది పొరపాటు. ఆమెకు త్యాగమానందదాయకమగు సులభమార్గమున గంతులిడుచు పోవుట వలె నుండెను. ఏడ్చుచున్న బిడ్డ నక్కునజేర్చి తనకష్టములకోర్చి బిడ్డనోదార్చుటకు పాలిచ్చుతల్లి త్యాగమెంత అప్రయత్నము, అవ్యాజము అయినదో, దుఃఖిత లోకమునకు సేవజేయవలె ననిన త్యాగబుద్ధి ఆనీ కంత అప్రయత్నము, అవ్యాజము. ఆ లోక దుఃఖార్తి యామె హృదయము ననేకజన్మలనుండి కలిచి

వేయుచుండెను. చిన్నతనముననే యామెయందు దంతభక్తి పుట్టించి, తన మతమునకొఱకు ప్రాణమునైన తెగించవలెనన్న బుద్ధిగలిగించి ఇంటినుండి భర్త పిల్లలనుండి వెడలగొట్టబడి లోకమునందపవాదులను వెక్కిరింపులను ఎదుర్కొనజేసి, తుదకు దివ్యజ్ఞానమున బ్రవేశపెట్టి, పరమసేవకు పూర్ణావకాశములను గనపరచిన యీ తీవ్రత్యాగబుద్ధి అనీకి పూర్వజన్మ సంస్కారఫలితము; అనేక జన్మములనుండి వినుచున్న ఆర్త నాద మీజన్మమున పుట్టుకతోడనే ఆమె చెవులలో బడెను.

1865 సం॥ క్రిస్మసులో క్లాప్‌హాం అను లండనులో నిరుపేదలుండు నొక పేటలో మిషను చర్చి నొకదానిని స్థాపించిరి. దానిసమీపముననే అనీతాతగారి యిల్లుండెను. ఇతర యువతులతోపాటు అనీ యా చర్చి కనేక విధముల సహాయము చేయుచుండెను. 1866 సం. ఈస్టరు పండుగుల కాచర్చిని అనేకవిధముల పుష్పతోరణములతో నలంకరించిరి. అదివఱకు పువ్వును చూచియెరుగని యావాడ బాలబాలికలా యలంకారములుచూచి పొంగిపోయిరి. అనీ ఈస్టరుపండుగల కొకవిధముగా సిద్ధమగుచుండెను. ఆ వారమునకు ముందువారములో నామె క్రీస్తుప్రభువు జీవిత మంతను చదివి శిలువనుపడినవఱకు ఆయన అంత్యదినములలో నెక్కడ నేమిచేసెనో వివరముగ దెలిసికొని తాను నారీతిగా నాదినములు గడిపినట్లూహించుకొని గుడ్ ఫ్రైడే (ఈస్టరు ఆరంభ శుక్రవారము) నాడు వేదికయెదుట మోకరించి ప్రార్థనచేయుటకు సిద్ధముకావలెనని యామెసంకల్పము. ఆసంకల్పముతో బైబిలుతీసి చదువనారంభించగా దానిలోవ్రాసిన

చరిత్రననుసరించి క్రీస్తుప్రభుని యంత్యదినములచరిత్ర వ్రాయవలె ననుబుద్ధి పుట్టెను. దానికొఱకు బైబిలుసువార్తలలో దేనిలో నేరోజు చర్య యేరీతిగా వర్ణింపబడెనో జాగ్రత్తగా నొకచోట వ్రాసిచూచుసరికి వానిలో ననేక పరస్పర భేదములగుపించెను. దానితో నామె కకస్మాత్తుగా నాగాథలన్నియు నబద్ధములను ననుమానము పుట్టెను. కాని, ఆమెసంశయము మొక పాపమని నమ్మినదగుటచేత వెంటనే ఆయనుమానమును బలవంతముగ నణచివేసెను. "(నాజన్మలోబుట్టిన) ఈమొదటి సంశయము నాకెంతబాధ కలిగించెనో దాని నెంత త్వరగా నణచివేసితినో, పాతిపెట్టి మట్టిపెల్లలతో కప్పివేసితినో ఊహించుకోవలసినదే. కాని ఆయనుమానము మాత్రము ఇంకను చావకయున్నది. దానిమచ్చ నిలిచిపోయినది."

ఈ ప్రకారము ఆనీ ముందుజీవితములో కష్టములకు త్రోవదీసిన సంశయము హృదయములో మొలకెత్తిన కాలము ననే,ఆమెకు ఆమెవివాహముచేసికొనిన యువకునితో పరిచయమాయెను. ఫ్రాంక్ బెసెంటు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో పట్టభద్రుడు, కొద్దికాలము క్రిందటనే పురోహితదీక్ష పొంది క్లాప్హాం చర్చిలో డీకన్‌గా ప్రవేశించెను.ఆనీ ఈస్టరుకు చర్చినలంకరించు చుండినపుడు వారిద్దరికి పరిచయమాయెను.

వివాహకారణమైన యాపరిచయము, ఆవివాహవిచ్ఛేదనకు కారణమైన యాసంశయము ఒక్కమారు తటస్థించుట యొక గొప్పవిశేషము.

ఇట్లు 19 సం॥ లలో ఆనీలో జరిగినమార్పులు గమనించ

దగినవి. మొదట ఆమె ఎవేంజిలికల్ సంప్రదాయమునకు చెందినది. తరువాత ఆమెచదివినచదువుచే ఏంగ్లికన్ (కేథొలిక్కు సంప్రదాయమునకు చెందియు రోమ్‌తో సంబంధము లేని) చర్చిసంప్రదాయ మవలంబించెను, ఇంతలో సంశయవిష బీజము ప్రవేశించెను. ఈమార్పులకు ఆమెతీవ్ర జిజ్ఞాసయే కారణము.



# వి వా హ ము

ఇంగ్లీషువారిలో 19 సం॥ల యువతి బాలికగనే భావించబడును. అందులో ప్రాపంచిక కష్టముల నెరుంగని, వివాహ మన నేమో యెరుగని అని వంటి ముగ్ధ ఆవయస్సులో పెండ్లి చేసికొనెననిన ఆశ్చర్యము కలుగకమానదు. "శాంతవటుకు వలపు కథలను చదువకపోవుట చేతను, క్రైస్తుప్రభునితో సంబంధము గూర్చిన యూహాలచేతను" ఆమె "అహః స్వప్నములలో వలపునకు తావులేదు." "నా జీవితమును ఏసు ఆరాధనతో గడపగోరితిని. నా యంతరంగ జీవిత మా 'రతుకుని' యెడల గాఢమగు ప్రేమలో మునిగిపోయెను. ఆ ప్రేమ రాగపూరిత హృదయులకు, ఒక కేథొలిక్కునకు, ఒక మానవవ్యక్తిపై గల వలపునుండి యొక ఆదర్శముపైకి స్త్రీకి యేసుపైకిని, పురుషునకు మేరీకన్యపైకిని మరలెడు ప్రేమ." (దీనిని మనము రాధ మొదలగు గోపికలకు శ్రీకృష్ణుని యెడల గల ప్రేమతో పోల్చవచ్చును). అని ప్రతి దినము చేయు ప్రార్థన లా ప్రేమను ప్రదర్శించు చుండెను.

అనీ లేత హృదయము చిన్నతనమునుండియు తనతల్లి, క్రైస్తు అను రెండు ఆదర్శములపైకి ప్రాకి ప్రేళ్లు పారెను. ఆమె మిత్రులలో గొందరు యువకు లుండిరి గాని ఆమె యెవ రిని మోహించలేదు. ఆమె తల్లివద్ద కొకరిద్ద రామె పెండ్లి గుఱించి మాట్లాడవచ్చిరి గాని ఆమె బాల్యము నెపమున వారిని పంపివేసెను. "నా యహః స్వప్నములు క్రమముగ నేకైకాదర్శపురుషునితో నిండిపోయెను; నిరంతరము క్రైస్తును బూజించుచు, పేదల సేవయందు నిమగ్నయైయుండు 'కరుణా సోదరి' (యోగిని) జీవితమువైపు నా యాశలన్నియు మర లెను." ఏదో విధముగ త్యాగముచేసి యీ సంసార కల్లోలమునుండి తప్పించుకొనవలె నన్నభావ మామె హృద యములో నాటుకొనెను. ఆమెతల్లి కిది యిష్టము లేదు.

"ఇటువంటి భావముల ఫలితము మతగురు వొక పుణ్యపురుషుడు, ప్రభువునకు నమ్మినబంటు, దూత యను నభిప్రాయము. ఆపదవి నిచ్చుట మర్త్యున కమృతత్వ మిచ్చుట; దేవుని పక్షమున నుండు రాజులు మతాచార్యులు ధరించు కిరీటము నతని శిరముపై బెట్టుట. ఈ ప్రకారము చూచిన యెడల మతగురు (పురోహితుని) భార్యస్థితి మతములోనున్న యోగిని స్థితికి తరువాతది యనవచ్చును. ఆస్థితిలో నొక యాకర్షణ శక్తి కలదు. ఆయాకర్షణలో భర్తకు పాలులేదు. పురోహిత దీక్ష భార్యకు కూడ వర్తించి 'ఆ పుణ్యపదవిని' 'పవిత్ర వస్తువుల సాన్నిధ్యమును' ఆమెకుగూడ నొసగును." ఇట్టి భావములచే పురోహితుల జీవితమువైపు అనీవంటివా రాకర్షింపబడిరనిన నాశ్చర్యము లేదు.

# వివాహము

మొదటి సంభా... 17080

ఇట్లుండ 1866 సం॥ ఈస్టర్పర్వ్లో గలిగిన పరిచయమ్ము మూలమున ఆనీయును ఫ్రాంకు బెసెంటును [illegible] కొనుట సంభవించెను. ఒక వారమురోజులు కొందరితో విహారమునకు బోయి యచట గుఱ్ఱపు స్వారీలుచేసి, బండ్ల లోను నడకను షికార్లుపోయి కాలము గడుపుటలో తరుచు వారిద్దరు నొంటరిగ నుండుట సంభవించెను. దానివల్ల సహజముగ నత డామెకు తనయెడల సదభిప్రాయ మున్నదనుకొని తనను పెండ్లాడమని యడిగెను. దానితో నామెకు పిడుగు వడినట్లాయెను. మొదట నిరాకరించ వలె ననుకొనెను, కాని, ఆ వారమురోజులు తనతో సరసము లాడెననుకొనునేమో యని సందేహించి మాటలాడక యూరకొనెను. అతడు రైలుకు త్వరగా పోవలసి, తిరిగివచ్చి ఆమె తల్లితో మాట్లాడినవఱకు ఎవరికి చెప్పవద్దని యానబెట్టి పోయెను. దానితో నామె హృదయము కలిగిపోయెను. ఒక ప్రక్క ఇదివఱకెన్నడు నేసంగతిని రహస్యముగ నుంచనితల్లికి చెప్పకుండ నొకరహస్యమును దాచుకొనుట, ఒకప్రక్కను అనినమాట తప్పుట కిష్టములేకుండుట, ఈ రెండు చిక్కుల మధ్య నూగులాడుచు చెదిరిన మనస్సుతో పదునైదు దినము లెట్లో గడిపెను. తరువాత అతనిని కలుసుకొనినప్పుడు అతని రహస్యము దాచనిరాకరించెను. ఆమెతల్లికీ సంగతి తెలిసి పెండ్లి నిశ్చయించుట కామె చిన్నదనముమిషచే రెండునెల లాలస్యము చేసి తుదకా సంవత్సరము శరత్కాలములో నిశ్చయము చేసెను. 1867 సం॥రము శీతకాలములో వివాహము జరిగెను. ఆమధ్య నొకసారి ఆనీ పెండ్లి తప్పించుకొనవలెనని

తల్లితో జెప్ప నామె "నాకూతురు ఆడినమాటను తప్పునా?" యని కఠినముగ కోపించెను. ఒక్క మతవిషయములో దప్ప మరి యే విషయములోను తల్లిమాట కెదురాడని ఆనీ మరి యామాట నెత్తలేదు. ఆమెకు పెండ్లియం దయిష్టత పురోహితునిభార్యయై నిరంతరము చర్చిలోను పేదలకును సేవచేయు చుండవచ్చునన్న భావములో నంతరించిపోయెను. ఇంటిలో నామెకు సుఖముగ గడుచుచున్నది. కాని యెవరికి నుపయోగించని యా జీవిత మామెకు భారముగ దోచెను. "మరి యే విధముగను చేయగలసేవకంటె నెక్కువ గొప్పసేవ పురోహితునిభార్యగనుండి చేయగలవు" అను నెపమామెకు వివాహామందుగల అయిష్టమును పోగొట్టెను.

పెండ్లయినప్పు డామెకు ఇరువదేండ్లు ప్రాయమున్నను నాలుగేండ్ల బాలికకు పెండ్లి సంబంధముగుఱించి బాధ్యతల గుఱించి యెంత తెలియునో ఆమెకును అంతే తెలియును. ఆమెతల్లి ఆమెకిచ్చిన శిక్షణములోని గొప్పలోప మిది. తల్లి తన బిడ్డ అమాయకురాలుగ పెరుగవలెనని సద్హృదయముతో గోరి, ఆ కారణముచేత ఆమెకు స్త్రీ పురుష సంబంధముగుఱించి యించుకయైన తెలియరాకుండ జేసెను. ఆ యజ్ఞానమే తుదకు ఆనీని అనుకొనని చిక్కులలో బెట్టెను. ఇటీవల డా. బెసెంటు బాల బాలికలకు విద్య గఱపునపుడు యోగ్యులైన యుపాధ్యాయులు శరీరనిర్మాణశాస్త్రమును, స్త్రీ పురుష స్వభావములను గుఱించి బోధించకతప్పదని చెప్పుచుండుట కీ స్వానుభవమే కారణమనిన నతిశయోక్తి కాదు.

ఈ సందర్భములో ప్రపంచమున జరుగు రాజకీయాందోళనము గుఱించి ఆనీకి గల ప్రథమానుభవమును సంగ్రహముగ జెప్పవలెను. ఆమెకు పేద లనిన గౌరవనీయులని, ఆదరణకు పాత్రులని భాగ్యవంతులు వారిని సంరక్షించవలసినవారని యభిప్రాయము. మేంఛస్టరులో రాబర్ట్సు అను నొక న్యాయవాది యుండెను. అతడు పేదల పక్షమున నుచితముగ వాదించెడివాడు గనుక 'పేదల లాయరు'ని యతను పేరుపడెను. అతను ఆనీ కుటుంబమునకు చిరకాల మిత్రుడు. అతనికి పేదలు సహాయార్హులు మాత్రమే కారు; వారు సర్వస్వాతంత్రములకు అర్హులు, వారియెడల న్యాయము చూపుట లేదు, అని యతని యభిప్రాయము. గనులలో బానిసలవలె కూలిపని చేయుచు మానవత్వమన నేమో మరచిన స్త్రీ బాలుర నాతడుద్ధరించి వారి చిరకాల కృతజ్ఞతకు పాత్రుడయ్యెను. అతనియింట ఆనీయు తల్లియు 1867 సం. శరదృతువులో నతిథులుగ నుండిరి. ఆసమయములో ఐరిష్ జనుల నాయకుల నిద్దరిని బంధించి వారిపై నేరము నారోపించిరి. సెప్టెంబరు 18 తేదీని వారిని పోలీసువా రొకబండిలో బెట్టి చెరసాలకు తీసికొనిపోవుచుండగా రైలురోడ్డువద్ద బండిగుఱ్ఱము నెవరో తుపాకితో కాల్చి చంపుటచే బండి నిలిచిపోయెను. అదివఱకే యక్కడి యైరిష్ జనులందరును వారి నాయకులను బంధించుటచే నుద్రిక్తులై వారిని విడిపింప మూకగా చేరియుండిరి; ఆగిన బండియొద్దకు వచ్చి దాని తాళమును తుపాకితో బ్రద్దలుగొట్టి బందీలను విడిపించుకొని పోయిరి. ఏలెన్ అను పదునేడేండ్ల బాలు డాతుపాకి పేల్చెను.

ఆగుండు లోపల బందీలకు కాపుగానుండిన పోలీసువానికి తగిలి వాడు చనిపోయెను. తరువాత ఏలెక్సను మరికొందరిని బంధించి వారిని హత్యానేరమునకు విచారణచేసిరి. ఆ దేశములో ఇంగ్లీషు జనులకు ఐరిష్ జనులనిన పరమ అసహ్యము, అందుచేత రాబర్ట్సు మొదలగు న్యాయవాదుల వాదము గాని సాక్ష్యములోని లోపములుగాని నిందితులను కాపాడలేకపోయెను. ఆ యభియోగము విచారణ జరుగునపుడు చూచుటకు రాబర్ట్సు భార్య, కుమార్తెలు, అనీ యొక బండిలో వెళ్లిరి. కోర్టుచుట్టు ఐరిష్ ప్రజలు మూకలుగ జేరి యల్లరి చేయుచుండిరి. వారీ బండిని నిలిపి ఇంగ్లీషువారిని వినరానితిట్లు తిట్టసాగిరి. కోపోద్రిక్తులైన మూకల స్వభావమును అనీ యప్పుడు చూచెను. బండిలోనివారప్పు డేమి చేసిన నేమి ప్రమాదము వచ్చునోయన్న భయము. అనీ ధైర్యముపీడక, బండిలోనికి పిడికిళ్లుపట్టి చేతులతో బెదిరించుచున్న యొకని పిడికిలిపై చేయివేసి, 'మిత్రులారా! వీరు రాబర్ట్సుగారి భార్య, బిడ్డలు' అనెను. వెంటనే 'న్యాయవాది రాబర్ట్సునకు జెయ్, వారిబండికి త్రోవచెయ్యండి' అను కేకలు బయలుదేరెను. జనులు బండికి దారిచేసి దానిలోనివారు సభామందిరములోనికి చేరువఱకు సాగనంపిరి. అనుకొన్న ప్రకారము విచారణ యను ప్రహసనము జరిగినది. నిందితులకు మరణదండన విధించిరి. ఇక్కడ విచారణ జరుగుచున్నప్పుడే లోపలగదిలో న్యాయాధికారి మరణదండన విధించునపుడు ధరించు నల్లటోపీలను సిద్ధము చేయుచుండుట అనీ చూచెను. తీర్పు ప్రకారము నవంబరు 23 తేదిని వానిని

ఉరిదీసిరి. ఛార్లెస్ బ్రాడ్లాను అనీ అదివఱకెరుగదు. కాని, అతడు ఆమె యభిప్రాయముల కనుకూలుడని యతడు నవంబరు 24 తేది గల నేషనల్ రిఫార్మరు పత్రికలో నీ యభియోగము గురించి వ్రాసినవ్యాసమువల్ల ఆమె కనిపెట్టెను. మరియు నతడు అక్టోబరులో ఐర్లండు పక్షమున నొక గొప్ప వ్యాసమును వ్రాసెను.

ఈ రెండు విషయములు అనీ జీవితములో చాల యుపకరించెను.



## గార్హస్థ్యము

అనీ భర్తయింటికి వెళ్లినమొదలు తా నతనిని పెండ్లియాడుట గొప్పపొరపాటని స్పష్టము కాజొచ్చెను. ఫ్రాంక్ బిసెంటు భార్య భర్తకు లొంగియుండవలెనని నమ్మినవాడు, ప్రతిస్వల్పవివరమును జాగ్రత్తగ చూచుకొని గృహకృత్యములను ఒక పద్ధతిమీాద చక్కబెట్టువాడు, సులభకోపి, దీర్ఘకోపి ఆమె స్వేచ్ఛకలవాటుపడినది, గృహకృత్యముల కలవాటు పడినదికాదు, ఉద్రేకపూరితమగు స్వభావముగలది, స్వాభిమాని; ఎన్నడు ఎవరిచేతను మాటపడి యెరుగదు, ఎవరు నామె కాజ్ఞాపించుట నెరుగదు; ఆమెత్రోవ యెప్పటి కప్పుడితరులచే నిష్కంటకము చేయబడుటయేకాని, యేవిషయము గురించియు చింతనెరుగదు. ఆతని కాఠిన్యము మొదట నామె యందు అత్యాశ్చర్యముగలిగించెను, తరువాత కోపము, దాని

వెంట కన్నీటికాలువలు,పిదప నిర్లక్ష్యము, తుదకు తిరుగుబాటు లోకి దిగెను. తన చిన్ననాటి జీవితాశయములన్నియు నణిగి పోయినవి; ఉత్సాహముతో నురుకుచుండిన బాలిక గంభీరము, అహంకారము, మానముగల యువతిగ మారిపోయెను. మొదట గృహస్థాశ్రమమన నేమో యెరుగని గోలకు తరువాత నాయాశ్రమము కఠినతతోను, అవమానముతోను ఆరంభించెను; అందుచేత, ఆమె తన పత్నీధర్మము నెంతజాగ్రత్తగ నేరవేర్ప యత్నించినను సాధ్యముకాలేదు. బహుశః, భర్త పవిత్రన మింకొకరీతిగ నుండి, ఆమె నత దర్శముచేసికొని, యామెస్వేచ్ఛకు ఆశయములకు అంత ఆకస్మికాఘాతము గలిగించకుండిన నామె సాంప్రదాయికమగు నిల్లాలై యుండెడి దేమో! ఆమె యల్పవిషయములను సరకుచేయక, ఇంటి పనులు త్వరలో ముగించుకొని పుస్తకముచేతబట్టి కూర్చొనగోరును; తల్లినుండి యెడబాసిన దుఃఖమును దిగమ్రింగి, ఆమె పేరెత్తిన భర్త కోపగించు నని యామె పేరైన నెత్తక యుండును; ఇరుగుపొరుగు అమ్మలక్కలు వచ్చి ఆమె కిష్టమైన మతము, శాస్త్రములు, రాజకీయములు గురించి మాట్లాడక, ఆమె కిష్టములేని బిడ్డలు, వంటలు, నౌకరుల వలపుగాథలు మొదలగు వానినిగురించి చెప్పుకబుర్లు ఆమెకు విసుకుపుట్టించ జొచ్చెను. అట్టి పరిస్థితులలో నామె ముద్దుబారి, పిరికియై, మనస్సు కుంగిపోయినదాయెను.

ఆమెకు పెండ్లి చేసికొనుటయే పొరపాటనిపించినది. కాని, చిన్ననాటినుండియు చూచిన నామె స్వభావములో పరస్పర విరుద్ధములగు బలదౌర్బల్యము లనేకములుండుటయు

వానివలన నామె యనేకసార్లు తప్పుత్రోవలబట్టుటయు గని పించును. బాల్యమున చెప్పలేనిసిగ్గు, ఏమిచేసిన నెవ రేమను కొందురోయని భయము, కొ్రత్తవారనిన భయము ఆమెకు మెండుగ నుండెను. గృహిణియైన తరువాత సేవకులు తప్పు చేసినను వారిని పల్లెత్తుమాట యనుట కిష్టపడదు; ఉపన్యాస వేదిక నెక్కి నిర్భయముగ నన్యాయమును ఖండించు వక్త యింటికి వచ్చి సేవకురాలిని నిద్రలేపి యన్నము పెట్టుమన వెరచును. ఉపన్యాసవేదికపై నెవరైన తన నెదిరించినచో నిర్మొగమాటముగ జవాబుచెప్పు ధీరురాలు. ఇంటివద్ద కఠిన మైన చూపుగాని మాటగాని భరింపలేక నత్తగుల్లవలె ముణుచుకొనిపోవును. ఇట్లొక సంవత్సరము గడిపి, తరువాత కాఠిన్యముచేతను అన్యాయమువల్లను మొండిబారిపోయి, ఆ మొండితనమను కవచములో దూరెను.

ఆమె 1868 సం॥లో పుస్తకములు వ్రాయ నారంభించెను. ఇంగ్లండుచర్చివారి పంచాంగములో పుణ్య పురుషులకు సంబం ధించిన శుభదినము లనేకముండును. వానిలో కొన్ని యెఱ్ఱని యక్షరములలోను కొన్ని నల్లని యక్షరములలోను ముద్రిం తురు. నల్లనియక్షరములతో నచ్చువేయువారి చరిత్రల నామె వ్రాసెను. ఆపుస్తకము ప్రచురించెదమని యెవరో తీసికొనిరి. కాని, తరువాత దానిజాడ తెలియలేదు. తరువాత నొకచిన్న కథవ్రాసి 'ఫామిలీ హెరాల్డు'అను పత్రికకు పంపెను. కొద్ది రోజులలోనే ఆపత్రికాధిపతియొద్దనుండి యొకజాబు, కథకు మూల్యము వచ్చెను. ఆపైకము చూచి ఆమె చాల సంతో షించెను. ఆమె స్వయముగ నార్జించుట కదే మొదలు. ఆమెక్కది

స్వాంతదారిద్ర్యము, స్వతంత్రజీవనచిహ్నము. కాని, యాకాలమున భార్యఆస్తియంతయు భర్తదే యని యామె యెరుగదు. తరువాత, ఆమె కొన్నికథలు వ్రాసి యాపత్రికకు కొంతపైకము సంపాదించుచుండెను. తనకథలు ఆపత్రిక స్వీకరించుటచే ధైర్యమువచ్చి యొక నవలనువ్రాసి పంపెను. కాని, దానిలో రాజకీయము లెక్కువగ నున్నందున స్వీకరింపజాలమని, కేవలము కుటుంబజీవితమునకు సంబంధించి కథను వ్రాసి పంపిన తీసికొందుమని దానిని నిరాకరించిరి. కాని అప్పటికామె మతధర్మ సందేహములతో కొట్టుకొనుచుండుట చేత దానిని వ్రాయజాలకపోయెను. తరువాత క్రైస్తవభక్తు లుపవాసము చేయవలసిన యావశ్యకత గుఱించి యొక చిన్నపుస్తకము వ్రాసెను. అది యచ్చుపడినది, గాని, దాని పేరామెకే జ్ఞాపకము లేదు.

1868 జనవరిలో నామెకు తొలిసంతానము, కొడుకు పుట్టెను. పురిటికిముందు కొన్ని నెలలుజబ్బుగా నుండుటచేతను తరువాత శిశుసంరక్షణలో నిమగ్నయగుటచేతను, పుస్తకములు చదువుటగాని వ్రాయుటగాని నిలిచిపోయెను. శిశుసంరక్షణకు దాదినిపెట్ట సమర్థత లేనందున ఆమెపైనే యాబాధ్యత పడెను. అదియు కొంత మేలే యైనది. ఆవ్యాపకములో తన కష్టములను మఱచిపోవుచుండెను. ఆమెకు 1870 సం ఆగస్టులో ఆడుపిల్ల పుట్టెను. అదివఱకే ఆరోగ్యము కొంతకాలమునుండి సరిగా నుండుట లేనందున ఆపురుడుతో మరింత నీరసపడి చాలాకాలమువఱకు ఆరోగ్యముబడయలేదు. తల్లియున్న



డాక్టరు ఆనీ బిసెంటు (1870)

రోగ్యమువల్లనూ, యుక్తకాలమునకు ముందే పురుడు వచ్చుట చేతను ఆపిల్ల బహునీరసముగ నుండెను.

1871 సం. ములో పిల్లలిద్దరికి కోరింతదగ్గు వచ్చెను. దృఢారోగ్యముగల పిల్లవాడు త్వరలో బాగుపడెను గాని అరభుకురాలైన బాలికకు ప్రాణావశిష్టమైనది. దగ్గు ముదిరి క్రమముగ రొమ్ముపడిశము (బ్రాంకైటీస్) లోనికి దిగెను, క్రమముగా నూపిరితిత్తులు కఫముతో నిండిపోయెను. ఏ వేళప్పుడు ప్రాణము పోవునోయన్న స్థితిలో కొన్ని వారములుండెను. ఊపిరి సులభముగ తీయుటకు మంచముచుట్టు గుడారమువలె నొక తెరను కట్టి దానిలో నావిరి నింపుచుండిరి. ఆ గుడారములో నాశిశువు నొడిలో బెట్టుకొని తల్లి నిరంతరము కూర్చొనియుండెడిది. బిడ్డ గ్రుక్కెడు పాలు గొంతుకలో బోసిన దగ్గువచ్చి గ్రుక్కమల్లక కొట్టుకుపోయెడిది. ఒకనాడు వైద్యుడారోజు సాయంత్రమువఱకు పిల్ల బ్రతుకదని చెప్పెను. ఆవేళ లోపల నొక పొరలో రంధ్రముపడి గాలి గుండెలలో ప్రవేశించుటచేత నొడలంతయు పొంగిపోయెను. వైద్యుడు వచ్చి చూచుచుండిన సమయములో దగ్గువచ్చెను. ఆ దగ్గుబాధ నణచుట కతడు క్లోరోఫారం (మత్తుమందు) ఒక గుడ్డలో వేసి ముక్కువద్దనుంచి, దానివల్ల దగ్గు కుదుపు ఆగినవఱకుచూచి, "ఈస్థితిలో ఇది బాధతగ్గించును గాని అంతకంటె ప్రమాదము చేయదు" అని వెడలిపోయెను. అదే యాబిడ్డకు చింతామణి యైనది. అది కడపటి చికిత్సయనియే వైద్యుని యభిప్రాయము, గాని, పిల్లకు తెలివివచ్చినది. అది మొదలు, దగ్గు ఉద్రేకముగా వచ్చినపుడెల్ల కొంచెము క్లోరోఫారముకు తల్లియుపయోగించ

యాపదుపును, బాధను అణచివేయుచుండెను రాను. రాను క్రమముగ పిల్ల కోరుకొనెను. పిల్ల ప్రమాదము తప్పి బైటపడిన వెంటనే తల్లి మంచముపట్టి వారమురోజులు కదలలేదు. ఆరోగ్యము మళ్లీ ఆమె లేచినది మొదలు ఆమెను నాస్తికురాలుగ జేసిన మనోవ్యథ ప్రారంభమై, మూడేండ్లు చెప్పలేని వేదన గలిగించెను. అందులో మొదటి పందొమ్మిది నెలలు ఆమె పడిన బాధ భగవంతునికి, బాధపడిన యామెకు తప్ప మరెవరికి తెలియదు.

ఆమె సత్యాన్వేషణములో కలుగుచున్న సందేహములు తీర్చువారు లేక, ఆమె ఆస్తికత్వమును కాపాడుకొనుటకై చేయు యత్నములలో నాటంకములను తొలిగించువారు, మనస్సున కూరట నిచ్చువారు లేక యున్న సమయమున నిఃష్కారణము నిష్ప్రయోజనము అని కనిపించుపిల్ల మరణబాధతోడై యామెకు 'భగవంతుడు దయామయుడగు తండ్రి' యను నమ్మకమునకు మొదటి గొడ్డలిపెట్టయ్యెను. ఆమె పేదల ననేకులను చూచి, వారికష్టములను చూచుచుండెను; ఆమె దేవతగ బూజించుకొనుతల్లిని ఆమె లాయరు మోసగించి ఆమె ధనము నపహరించెను, ఆమె సుఖపూరితజీవితము కష్టజాలము ముసుకులో బడి, దుర్భర బానిసత్వముచే నవమానమునొంది, హృదయము గాయపడెను. ఇట్టిస్థితిలో, ఏపాపము నెరుగనిబిడ్డ పడరానిబాధపడి చిక్కి శల్యమైపోయెను. ఈ యాకస్మిక భ్రాంతివిచ్ఛేదముచే కన్నులు మిఱుమిట్లుగొని, మొగము తిరిగెను; దేవునిపై నమ్మకము కూలిపోయెను. ఇంతవఱకు అణగియున్న మనోబలమొక్కసారి లేచి తిరుగబడెను; ఇంకను

దేవుడు లేడను స్థితి రాలేదుగాని దేవుని ప్రార్థింప బుద్ధిపుట్టుట లేదు. బిసెంటుసతి మనస్సులో నీతిరుగుబాటు పుట్టినప్పుడే ఆమెభర్త యొక్క మతబోధకుని తీసికొనివచ్చి ఆమెకు పరిచయము చేసెను అతడు గొప్ప ఉదారహృదయుడు, ఆమె ఆవేదన నంతను విని, యింటికిపోయి యొక జాబు వ్రాసెను. ఆజాబులో నత డామెయెడల పూర్తియైన సానుభూతిని కనపరిచి, మనస్సునకు సమాధానమీయ యత్నించెను, గాని, యామె తీవ్రజిజ్ఞాస కది సమాధానము చెప్పలేకపోయెను. ఏల యన, తుద కాత డాజాబులో 'నీకు తెలియకున్నను నమ్మవలె' ననెను.

ఇట్లుండ 1871 సం॥ వేసంగిలో నొకరాత్రి ఫ్రాంక్ బెసెంటు ఆమెతో దెబ్బలాడి యామె నవమానపరిచి పైకి వెడలిపోయెను. దానితో నామెకు జీవితముపై నసహ్యము పుట్టి, పెట్టిలో పిల్లకొఱకు తెచ్చియుంచిన క్లోరోఫారంసీసా యున్నట్లు జ్ఞప్తికివచ్చి, దానిని తెచ్చి గదికిటికీయొద్ద నిలిచి, సీసామూత దీసి, నోటి కెత్తుకొనుచుండగా "ఓపిరికిదానా, పిరికిదానా, మతముకొఱకు ప్రాణమునిచ్చుటకు చూచుచుంటివే, కొద్దిసంవత్సరములు బాధ భరించజాలవా?" యనుమాటలు స్పష్టముగ మృదువైన ధ్వనిలో వినవచ్చెను. వెంటనే సిగ్గుముంచివేసి ఆమె చేతిలోని సీసాను కిటికీలోనుంచి యావలకు పారవేసెను; ఒకసారి ధైర్యము, బలము ఉబికి, వెంటనే మూర్ఛవచ్చి నేలపై గూలెను.

పాప మామె క్రొత్తమిత్రుడగు మతబోధకు డనేక విధముల నామె మనస్సుకు సమాధానము గలిగించయత్నిం

చెను, కాని, యీప్రపంచమున నన్యాయముగ గనిపించు దుర్భరసంఘటనలు, అమాయకులను దోషులనుకూడ నొక్కరీతిగ బాధించుటకు విశ్వసించదగిన కారణ మతడు చెప్పలేకపోయెను. ఆకాలమున ననేకులకు మనస్సమాధానము నిచ్చిన తత్వము లామె తీవ్రజిజ్ఞాస కోడిపోయెను. ఆమె ఈమానసికాందోళనముచే ఆరోగ్యము పూర్తిగా చెడి మంచముపట్టెను. ఎడతెగని తలనొప్పి, వెలుతురు చూడలేదు; ప్రజ్ఞయుండియు దుక్కవలె మంచమున పడియుండి, మనస్సంతయు బాధపైకి తప్ప మరి యితరవిషయములపైకి పోక కొన్నివారములు పడియుండెను. వైద్యు డనేకవిధముల సాధనము చేయుచున్నను ప్రయోజనము లేకుండెను. కొంతకాలమునకు క్రమముగ ఆ బాధ తగ్గినది; వైద్యుడు తరుణము చూచి, యామె మనస్సు మరలింపనుద్దేశించి శరీరశాస్త్రగ్రంథములు, రసాయన శాస్త్రగ్రంథములు, మొదలగు శాస్త్రగ్రంథముల నామెకు తెచ్చియిచ్చి ఆమెచే చదివించి, ఎంతపనియున్నను కొంచెము తీరుబడి చేసికొనివచ్చి శరీరశాస్త్రములోని కష్టమగు నంశముల నామెకు బోధపరచసాగెను. ఆమె బ్రతికి ఆరోగ్యముచెందుట, మనస్థిమితముపొందుట దయామయుడగు నావృద్ధవైద్యుని నేర్పు, చాతుర్యమువల్లనే యని యామె నమ్మి యతనికి కృతజ్ఞురాలై యుండెను.

ధర్మసందేహములచే గలిగిన యీ దౌర్భాగ్యము ఆమె గార్హస్థ్యజీవితమును మరింత దుఃఖభాజకముగ జేసెను. తెలివైన యేస్త్రీయైన నిట్టి సందేహములను మనస్సులో బెట్టుకొని సంసారములో దుఃఖములపాలగునాస్త్రీకి తనభర్త

సుఖమును పిల్లలసుఖమును చూచుకొనుచు సంసారము దిద్దుకొనుట ధర్మముగాని గొప్ప గొప్ప పండితులకు సాధ్యము కాని విషమసమస్యలతో మనస్సు పాడుచేసికొనుట ఆమెకు ధర్మము కాదు. స్త్రీగాని పురుషుడుగాని లోకమును తెలిసికొనగోరినయెడల పెండ్లిచేసికొని, యాపవిత్రాశ్రమ ధర్మములు నెరవేర్చజాలక బాధపడరాదు. జీవు డొంటరిగ పైకి పోయి దెయ్యము నారాధింపవచ్చును, గాని, యా మహానీయుని సపరివారముగ గృహములోనికి దెచ్చి అక్కడ శాంతికి భంగము గలిగించకూడదు. పోరాటము స్వభావముగా గల స్త్రీగాని పురుషుడుగాని యౌవనము కండ్లుగప్పి పెండ్లి చేసికొనినయెడల తనకేగాక తానుకట్టుకొన్నవారికిగూడ దుఃఖము తెచ్చిపెట్టును. అంతేగాక, కట్టుకొన్నభర్త పూర్వాచారపరుడై "అల్లరిగొట్టు"భార్యను లొంగదీయ యత్నించినయెడల, ఆమె లొంగిపోయి నలిగి మొగర్చుకొనుచు పడిపోవును, లేదా, తిరుగబడి దేవు డిచ్చిన స్వతంత్రతను నిలబెట్టుకొనుటకై శృంఖలములను బ్రద్దలగొట్టి, ఆతిరుగుబాటులోనే బలము తెచ్చుకొని అసత్యజీవితము జీవింప నిరాకరించును.

బిసెంటుసతి రోగము మళ్లి ఆరోగ్యము వచ్చినతరువాత సాంప్రదాయక క్రైస్తవము ననుసరింప దలచి, తాను నమ్మదగిన విషయములు కొంచెముగ నున్నను ఆ కొద్ది విషయములనైన సత్యములని తెలిసి నమ్మవలెనని, క్రైస్తవ సాంప్రదాయక సిద్ధాంతముల నొక్కొక్కటిని పరీక్షింపసాగెను. ఆ పరీక్షాఫలితముగ నాలుగు సమస్యలకు సమాధానము దొరకలేదు. ఈ సమస్య లామెనే గాదు, చరిత్రజ్ఞానము,

భౌతికశాస్త్రజ్ఞానము వృద్ధినొందుచున్న యీ కాలమున పూర్వపు నమ్మకముల నాజ్ఞానదృష్టితో జూచు స్త్రీ పురుషు లనేకుల కెదురగుచున్నవి. అవేవన:—

1. మరణానంతరము శాశ్వత దండనము,

2. ఈ ప్రపంచమున నింత పాపమును, దుఃఖమును పుట్టించిన దేవుని వర్ణించుటలో నుపయోగించు "మంచితనము" "ప్రేమ" యను మాటల యర్థము.

3. క్రైస్తు పశ్చాత్తాపము యొక్క తత్త్వము; పాపికి బదులుగ క్రైస్తు బాధపాలగుట యందును, క్రైస్తు బాధపడినందున పాపి పుణ్యాత్ము డగుటయందును దేవుని "న్యాయము".

4. బైబిలుకు సంబంధించి నంతవఱకు "దైవప్రేరణ" మనుమాట కర్థము. బైబిలులో గనపడు తప్పులను, అధర్మములను, ఆ గ్రంథకర్తయగు క్రైస్తు పరిపూర్ణతతో సమన్వయము చేయుట.

బిసెంటుసతి నిర్దుష్టప్రవర్తన, గాఢమగు ధర్మబుద్ధి ఆత్మగౌరవము గల గృహిణి, తల్లియై, బైటకుపోయి స్వేచ్ఛగ దిరుగవలెనను చింతలేక, యింటిలో రక్షితయైయున్న కాలములో నీ సందేహములు కలిగి క్రైస్తవమునందు నమ్మకము పోవుటచేత, ఈ యపనమ్మకము తర్కబుద్ధివలన గలిగినది కాదని, అంతరాత్మ నమ్ముటకు నిరాకరించుటచే గలిగినదని, అమిత నైతిక స్వేచ్ఛయం దభిలాషచే నామె నాస్తికమతము స్వీకరించలేదని, అవమానమువల్ల అన్యాయమువల్ల స్వీకరించెనని విశదమగును.

# సంశయ కల్లోలము

ఇట్లుండగా బిసెంటుసతి తండ్రిగారి జ్ఞాతియైన హాతర్లే ప్రభువు కోరికపైని దొరతనమువారు బిసెంటుదొరకు లింకాలన్షైర్ జిల్లాలోని సిబ్సియను పల్లెలో సంవత్సరము నకు 450 పౌన్లు జీతముమీద అక్కడి చర్చిలో పురోహితుని యుద్యోగము నిచ్చుటచేత కుటుంబమంతయు నక్కడకు వెడలి పోయిరి. అక్కడ బిసెంటుసతికి ఎక్కువ తీరిక దొరుకు టచేత ఆమె సందేహములు తీర్చుకొనుట కనేక గొప్పరచయి తల గ్రంథములను చదివెను. ఆమె యెడల నభిమానము సానుభూతి గల మునలిమతబోధకు డప్పు డప్పుట నుత్తరములు వ్రాయుచునే యుండెను. కాని, ఆమె సంశయములు బలపడెనే గాని తీరలేదు.

వారమున కొకసారి చర్చిలో జరుగు నారాధనము లామెకు వేదన గలిగించుచుండెను, కాని, ఆమెకు సంశయములే గాని స్థిరాభిప్రాయములు లేనందున ఆసంశయముల నితరులకు చెప్పి వారి నమ్మకములను చెడగొట్ట నిష్టము లేకయు, సంశయము లెప్పటికైనను తీరిపోవునను నాశచేతను, వాని నెవ్వరికిని చెప్పక చర్చికి పోవుచుండెను.

మనస్సీవిధముగా కొట్టుకొనుచుండ, రోగుల కుపచారము చేయుటలోను, పేదల దురవస్థను తొలిగించుటకు యత్నిం చుటలోను కొంతశాంతి నొందుచుండెను. ఆకాలములోనే వ్యవ సాయదార్ల అవస్థలనుగుఱించియు, భూముల హక్కులనుగుఱిం చియు, నేర్చుకొని, తరువాత ఆసంగతుల నుపన్యాసములలో

నుపయోగించెను. వ్యవసాయములో పనిచేయు కూలీలదుర వస్థను గుఱించి జోసెఫ్ ఆర్చి అనునాతడు చేసిన కృషివలన ఆకూలీలలో నాందోళనము బయలుదేరెను. వారిసంగతుల నెఱింగిన బిసెంటుసతికి వారియెడల పూర్తియైన సానుభూతి కలిగెను.

ముత్తాత, ముత్తవ్వ, వారియవివాహితయగు కూతురు, ఆమె యవివాహితయగు కూతురు, ఈమెబిడ్డ - ఈయైదుగురును, అద్దెకు కాపురమున్న ముగ్గురు పురుషులును, మొత్తము ఎనమండుగురు ఒక్కగదిలో నుండుకొనుట; వర్షము కురిసిన కారుకప్పులతోనున్న శిథిల కుటీరములు; మనుష్యులతోపాటు పక్షవాతము, చలిజ్వరము కాపురముచేయు గుడిసెలు;— ఇవన్నియు చూచిన యామెకు ఈనిరుపేదల నాదరించువారెవరైన నున్నయెడల వారికి తోడ్పడవలెనన్న బుద్ధిపుట్టుట విశేషముకాదు. వ్యవసాయకర్షకుల సంఘమునకు రైతులు వ్యతిరేకులు. ఆసంఘములో జేరినవారిని వారు పనిలోనికి రానిచ్చుటలేదు. భార్య, యిద్దరు పిల్లలుగల యొకకర్షకుడొకనాడా సంఘసభకు వెళ్లిన పాపము చేసినందు కా జిల్లాలో రైతుఎవడును వానిని పనికి రానియ్యలేదు. పాపము వాడు పనికొఱకు తిరిగి తిరిగి ప్రాణము విసిగి, త్రాగుడలవాటుచేసి కొనెను. వాని యింట జూడ భార్యయు నొకబిడ్డయు జ్వరముతో బాధపడుచుండిరి, యొకబిడ్డ చచ్చియుండెను. ఆరాత్రి త్రాగివచ్చిన పురుషుడు, భార్య, బిడ్డ, శవము ఒక్కమంచము మీదనే పరుండిరి. వీరి కింతదారిద్ర్యము వచ్చుటకు కారణము రైతులు భూకామందుల పక్షమున జేరి కూలివాండ్రి

యభివృద్ధికి వ్యతిరేకులగుట. ఈ పోరాటమును దాని దుష్ఫలితములను జూచిన బిసెంటుసతికి మతకర్మకల్లోలముతో పాటు రాజకీయవిద్యకూడ అలవడుచుండెను.

ఆమె కొన్నాళ్లు తల్లియొద్ద నుండుటకు లండన్ వెళ్లియుండగా నొక యాదివారమునాడు రె. చార్లెస్ వోయిసీ యను నతడు సెం. జార్జి మందిరములో నిచ్చిన యుపన్యాసము విని, అక్కడ అమ్ముచుండిన కొన్ని పుస్తకములు కొని చదివెను. వోయిసీ బోధించినది ఆస్తికమతమే యైనను క్రైస్తవ చర్చిలలో బోధించుమతమునకు భిన్నముగ నుండి బిసెంటుసతి హృదయమున చెలరేగిన తుపానును కొంతవరకు చల్లార్చెను. తరువాత ఆతని యుపన్యాసములను కొన్నిటిని విని యతడు చెప్పిన పుస్తకములను చదివెను. దానితో ఆమెకు గలిగిన సందేహములలో నొక్కటి తప్ప తక్కినవన్నియు పోయి అంతవరకు ఆమె హృదయములో ఆరిపోకుండ రగులుచుండిన యాస్తికత్వమును ప్రజ్వలింపజేసెను. కాని, జీసస్ దేవుడని ఆమెకు చిన్నప్పటినుండియు గలనమ్మకము ఆమె కెంతయో యుత్సాహకరముగను ప్రోత్సాహకరముగను నుండుటచే దానిని విడువజాలకుండెను. మరియును, క్రీస్తు దేవుడని నమ్మని యెడల క్రైస్తవ మతములో నుండుటకు వీలులేదు. ఇదివరకు లోలోపల జరుగుచున్న పోరాట మిక బహిరంగముగ జరుగవలెను. ఆమె క్రైస్తవ మతబోధకుని భార్య, ఆమెకు నటన యిష్టము లేదు. ఏమిచేయవలెను?

క్రైస్తు దేవుడగునా కాడా యని నిశ్చయించుటకు తిరిగి బైబిలు మొదలగు పుస్తకములను జాగ్రత్తగా జదివెను. దాని

వల్ల క్రైస్తు దేవుడు కాదన్న యభిప్రాయము బలమైనది. కాని, ఆయభిప్రాయము వెల్లడిచేయుటకు ముందు డా॥ పూసీయను సుప్రసిద్ధుడగు పండితునకు తన సంశయములను తెలియజేసి యతని సహాయముగోరెను. అతడు గూడ చర్చిశాసన మతిక్రమింపరాదని, దానిసత్యమును సంశయింపకూడదని కఠినముగ శాసించనేగాని, యామె సంశయముల దీర్పజాలకపోయెను.

ఆమె లండనులో నున్నప్పుడే 1872 సం॥ శరత్కాలములో రె॥ వోయిసీ ఆమెకు స్కాటు దంపతులతో పరిచయము చేసెను. స్కాటుద్వార వివిధ విషయములను గూర్చి, వివిధాభిప్రాయములను, ద్వేషభావము పక్షపాతము లేకుండ మర్యాదతో గూడిన శైలిలో, పలువురు రచయితలు వ్రాసిన వ్యాసములను నెలకొకటిచొప్పున ప్రచురించుచుండెను. సత్యమునం దభిమాన మున్నవా రందరు నేమతమువారైనను ఆయన యొద్ద మాన్యతనొందుచుండిరి, ఆయనకు బిసెంటు సతి మరికొంత కాలమయిన తరువాత, వ్రాసిన మొదటి 'ఫ్రీథాట్' (స్వతంత్రమతము) పత్రిక యిచ్చెను. అది "నాజరత్ వాస్తవ్యుడగు జీసస్ దైవత్వము" అను శీర్షికతో ప్రచురింపబడెను. తరువాత, అది 'నాస్తికమునకు నా త్రోవ' యను పుస్తకములో మొదటి యధ్యాయముగ చేర్చబడెను.

తరువాత ఆమె సిబ్సేకి వెళ్లి, తన నిశ్చితాభిప్రాయము నాచరణలో బెట్ట నిశ్చయించి, చర్చిప్రార్థనల కేగి ప్రత్యేకముగ భగవంతునకు చేయు నారాధనలలో దప్ప ఇతరములలో బాల్గొనవని, తీర్థప్రసాదములలో బాల్గొనుట

కంగీకరించనని నిశ్చయించుకొనెను. అందు కామె భర్త అంగీకరించెను. ఒకనాడు చర్చిలో నివేదన సమయమున ఆమె లేచి పైకి వెడలిపోయెను. అవల్లెజను లామె కాకస్మికముగ జబ్బుచేసె ననుకొనిరి.

1873 సం॥ వసంతములో నొక విచిత్రము జరిగెను. బిసెంటుసతి యొకనా డొక్క తెయు చర్చికి జంత్రగానము సాధనముచేయ నేగినప్పుడు ఆమె కుపన్యాసము చెప్పవలె నన్న కుతూహలము పుట్టెను. తన కవకాశ మున్నయెడల చక్కగా నుపన్యసింపగలనన్న నమ్మకము మనస్సులో పుట్టెను. ఆ యుత్సాహము పట్టలేక వేదిక నెక్కి 'బైబిలులో దేవుని వాక్కు' గుఱించి యుపన్యసించెను. ఆ యుపన్యాసము వినుచున్న ఆమెకే అందలి ధోరణి, మాటల పొందిక, వాక్యముల కూరుపు, శైలి, ఆశ్చర్యము కలిగించెను. ఆమె కా మందిరమంతయు శ్రద్ధతో వినుచున్న శ్రోతలతో నిండినట్లగు పించెను. ఎప్పుడైన బహిరంగోపన్యాస మియ్యవలసి నప్పుడు శ్రోతలను వినునట్లు చేయు శక్తి యున్నట్లామె కప్పుడే తెలిసినది, కాని, ఆ సంగతి నప్పు డెవరికి చెప్పలేదు.

బిసెంటుసతి నాడట్లు చర్చినుండి వెడలుట గుఱించి లోకు లనేక విధముల నాడుకొనజొచ్చిరి. బిసెంటుగారి స్నేహితు డొక డతనిని ఆమె చర్యవలన సంభవించు ఘోర ప్రమాదములను గుఱించి భయపెట్టసాగెను. 1873 జూలైలోనో ఆగష్టులోనో ఆమెను చర్చి సంస్కారము లన్నిటిలో పాల్గొనవలెనని భర్త శాసించెను. అందుకామె నిరాకరించెను.

పాల్గొనకున్న ఇంటిలోనుండి పైకి పొమ్మని యతడనెను. అనగా, కపటనటనయో గృహబహిష్కరణమో యెంచు కొనుమనెను. ఆమె గృహము విడుచుటకే యంగీకరించెను.

1871 సం॥ నుండియు నామె యారోగ్యము సరిగా లేదు. దానిపై నీకష్టము. ఒక యువతి యిల్లు విడిచిపెట్టిన లోకమునం దామె కెంత యపకీర్తి కలుగునో, లోకు లెట్లాడి పోసెదరో ఆమె కపుడనుభవము లేదు. కాని ఆ యనుభవము లన్నిటిని భరించిన తరువాత నటనాజీవితము జీవించుచు అనృతవాది నగుటకంటె ఆకష్టములను భరించుటయే మేలామె నని యామె వ్రాసెను. ఆమె తల్లి యిదివిని మిక్కిలి దుఃఖించెను. అన్ని కష్టముల నెదుర్కొన బూనిన బిసెంటుసతి కామె తల్లి దుఃఖము భరించ సాధ్యము కాకుండెను. తన ఎదుట మోకరించి కన్నీరు కారుచుండ భర్తమాట వినుమని యా ముదుసలి పెట్టు మొర వినజాలకుండెను. ఒక ప్రక్క యనృతజీవిత మెదురుగ నగుపడుచుండెను. తుదకు సత్యము జయమొందెను. సత్యముకంటె తలిదండ్రుల నెక్కువగ ప్రేమించువాడా దేవత కటాక్షమున కర్హుడు కాడను నుడి నాడును నేడును గూడ యథార్థము. ఈ రెండింటికితోడు పిల్లలున్నారు. తమకు తల్లి, పరిచారిక, ఆటకత్తెయైన యామెయందు వారి కెంతో ప్రేమ. వారినికూడ విడిచిపెట్టవలెనా? కొంత కాలము పిల్లలామెయొద్దనే యుండిరి. ఆమె సోదరుడు ప్రయత్నించి భార్యాభర్తలు వేరుగ నివసించుటకు, ఆడపిల్ల ఆమె సంరక్షణలో నుండుటకు, భర్త కొంత మనోవృత్తి ఆమె కిచ్చుటకు విడాకులపత్రము వ్రాయించెను.

# స్వేచ్ఛ

ఆమెకు కావలసిన స్వేచ్ఛ లభించినది. కాని, ఆస్వేచ్ఛ నెట్లు వినియోగించుట? ముందు భర్త యిచ్చు స్వల్పమనో వృత్తికి కొంతచేర్చి తాను, పిల్ల కడుపునిండ తినుటకు, వృత్తి సంపాదించవలెను. ఎంతప్రయత్నించినను దొరకలేదు, తుదకు కొన్నివారములు కుట్టుపనిచేసి, కుట్టినగుడ్డలు పేదరాండ్ర కిచ్చి 4½ షిల్లింగులు సంపాదించెను. తరువాత, ఆమెమేనత్త లామె కొకరియింట పిల్లలకు చదువుచెప్పి వారికుపచారములు చేయుచు వారియింట బస, భోజనముచేయుటకు నేర్పర్చినందున ఆపనిలో ప్రవేశించెను. అక్కడకు వెళ్లినతరువాత ఆమె వంట కూడ చేయవలసి వచ్చెను. ఆపనిలోగూడ నామె నేర్పరిగా తయారయ్యెను. ఇట్లుండ కొన్నాళ్లలో ఆయింటి పిల్లలలో నొకనికి 'డిఫ్తీరియా' యను కంఠరోగము వచ్చెను. బిసెంటు సతికి రోగికి ఉపచారము చేయుటయనిన, ముఖ్యముగా మృత్యువుతో యుద్ధము చేయవలసినప్పుడు, బహుశ్రద్ధ. వెంటనే ఆ బాలుని ఇతరులున్న యింటిభాగమునుండి వేరుచేసి, కూతురు మేబెల్‌ను తనతల్లి యొద్దకు పంపించి, ఆరోగికి ఉపచార మారంభించెను. ఆబాలుడు ప్రమాదము తప్పి బయలు పడినంతలో రెండవ పిల్లవానికి 'స్కార్లెట్' జ్వరము వచ్చెను. ఆమె యా బాలుని ప్రాణములుగూడ కాపాడి విజయ గర్వముతో నిద్దరిని తలిదండ్రుల కొప్పగించెను.

1874 వసంతములో ఆమెతల్లికి జబ్బుచేసెను. వైద్యు డామె బ్రతుకదనెను. కాని, ఆమెను బ్రతుకవలెనని తీవ్రేచ్ఛ

యుండుటచేత అప్పటికి బ్రతికెనుగాని మే 10 తేదిని చనిపోయెను. చనిపోవకముందు వారిమతాచారము ప్రకారము మతగురువు వచ్చి 'హోలీ కమ్యూనియన్' అను సంస్కారము జరుపవలెను; అది పొందక చనిపోవువారికి స్వర్గప్రాప్తి లేదు. బిసెంటుసతి కది యిష్టములేదు. ఆమెతల్లియు నామె యీ సంస్కారము పొందనపుడు ఆమెను నరకమునకు విడిచి తానొక్కతెయు స్వర్గమునకు బోవనొల్లననెను. అదిచూచి ఆనీకి చాలాకష్టముతోచి తల్లితో చెప్పకుండ నొకరిద్దరు నడుగ వారామె మతభ్రష్టురాలు గనుక ఆమె కా సంస్కారము నీయ నిరాకరించిరి. అంత నామె స్టాన్లేయను నుదారవృద్ధమతాచార్యుని (Dean) యొద్దకేగి సంగతినంతను ఆయనకు చెప్పెను. అతడును ఆమె మనస్థితికి సానుభూతి కనపరచి మరునాడు వచ్చి రోగితో మాట్లాడి ఆమెను సమాధానపరచి ఆమరునాడు వచ్చి యీసంస్కారమును చేసెను. ఆతడు నేర్పుతోచెప్పిన మాటలవల్ల రోగికి కూతురు మతాభిప్రాయముల గుఱించిన భయమంతయు పోయెను. ఆమెకు కలిగిన మనశ్శాంతికి కూతురు సంతోషించెను.

తల్లితో నెడబాటు ఎంతదుఃఖకరమైనను బిసెంటుసతి తనబిడ్డ ముద్దుచేష్టలను చూచుకొనుచును, జీవితాధారము సంపాదించుకొను యత్నములలోను ఆదుఃఖమును మఱువజొచ్చెను. తల్లికి జబ్బుచేయకముందే తల్లికూతుళ్లిద్దరు నొక యిల్లద్దెకు తీసికొనిరి. ఆ ఇంటనే యుండి సమీపముననే కాపురమున్న స్కాట్ దంపతులసహాయమును పొందుచు, ఆయనకు కొన్ని వ్యాసములు వ్రాసియిచ్చి కొంతసొమ్ము సంపాదించుచు,

కాలముగడిపెను. స్కాట్‌సతి యామెను తల్లివలెకాపాడుచు ఎప్పటి కప్పుడు యోగక్షేమము లరయుచు, తరుచుగ తన యింటికి భోజనమునకు గొనిపోయియో, తన యింటినుంచి భక్ష్యములబంపియో యుపవాసములను తప్పించుచు నుండెను. బిసెంటుసతి మధ్యాహ్నము 'మ్యూజియం' (వస్తుప్రదర్శన శాల) కు వెళ్లి అక్కడ విశేషములను నేర్చుకొనుచుండెను. మధ్యాహ్నభోజనము పట్టణములో చేయుచున్నానని చెప్పి స్కాట్‌సతి నుండి తప్పించుకొనుచుండెడిది. ఆ పుణ్యదంపతులు ఆ కష్ట దినములలో చేసిన సహాయమున కామె బ్రతికి యున్నంతకాలము కృతజ్ఞురాలై యుండెను.

ఆమె కున్న కొద్దినగలను అమ్మివేసెను. బిడ్డ కేలోపము లేకుండ చేయుట కామె నిరంతరము చూచుచుండెను. క్రమముగ నామె హృదయతంతువు లా బాలికచుట్టును పెనవేసికొనెను.

ఆ కాలమునం దామె యనుభవించిన దారిద్ర్యమువల్ల నామె హృదయమున పేదల యెడల కనికరముపూని, ప్రబలి 'ఆకలి వేయుచున్న' దన్నమాట విన్నంతనే తన ఆకలిబాధ యెంత భయంకరమైనదో జ్ఞప్తికి వచ్చి తాత్కాలికముగనైన నుపశాంతి నీయకుండ బోజాలకుండెను.



# చార్లెస్ బ్రాడ్లా, నాస్తికము

ఇన్ని కష్టములు పడుచున్నను ఆమె మతగ్రంథములు చదువుట మానలేదు. మాన్క్యూర్ కాన్వేగారి యుపన్యాసములు విని మాన్సెల్, మిల్, కాంటి మొదలగు పండితుల తత్త్వవిచార గ్రంథములను చదివి క్రమముగా మిగిలియున్నరవంత ఆస్తికత్వమునుగూడ పోగొట్టుకొనెను. భగవత్ప్రార్థనను మానుకొనెను. 'ఎన్నడు ప్రార్థనచేయనివారి సత్య జీవితమునుండి భగవంతుడు మాయమైపోవును'.

ఇట్లుండ నొకనాడు కాన్వేసతి యామెకు చార్లెస్ బ్రాడ్లాను గురించి చెప్పెను. ఆ తరువాత నొకనాడొక దుకాణము వద్ద 'నేషనల్ రిఫార్మర్' అను పత్రికనుగొని దానిలో చార్లెస్ బ్రాడ్లా అభిప్రాయములను ఖండించుచు నొకరు వ్రాసిన వ్యాసమును, దానికి బ్రాడ్లా యిచ్చిన జవాబును చదివెను. ఆ పత్రికలోనే 'ఫ్రీథాట్' ప్రచారమున కేర్పడిన 'నేషనల్ సెక్యులర్ సొసైటి' గురించిన యొక వ్యాసమును గూడ జదివెను. వెంటనే తానాసంఘములో చేరదలచి 'మీ సంఘములో జేరువారు నాస్తికులై యుండవలెనా' యని ఆ పత్రిక సంపాదకునకు వ్రాసెను; అక్కరలేదని జవాబు వచ్చెను. వెంటనే సభ్యత్వమునకు దరఖాస్తుపంపెను. లండన్‌లో నివసించువారికి సభ్యత్వపు సర్టిఫికెట్లు 'హాల్ ఆఫ్ సైన్సు' లో బ్రాడ్లాగారు స్వయముగా నిచ్చెదరని ఆమెకు జవాబు వచ్చెను. ఆమె 1874 సం. ఆగస్టు 2 తే దిని సర్టిఫికెటు పుచ్చుకొనుటకు అచటకు వెళ్ళెను.

అక్కడ కాలంతయు క్రిక్కిరిసి యుండెను. ఉప న్యాస సమయమునకు వేదికపైకి బ్రాడ్లా వచ్చెను. శాంతి గంభీరములు తాండవమాడు ఆ ముఖము, తీక్ష్ణమైనచూపు, విశాల కపోలము, పెద్ద శిరస్సు చూచి బెసెంటుసతి తీవ్రాందోళకుడు, అజ్ఞాని, వాచాలుడు నని చెప్పగా వినిన బ్రాడ్లా ఈయనేనా యని ఆశ్చర్యపడెను. ఆయన యుపన్యాసము, వాక్చమత్కృతి, కంఠధ్వని మాధుర్యము, తర్కము, విషయపరిజ్ఞానము ఆమె కద్భుతముగా దోచెను ఉపన్యాసానంతర మాతడు కొన్ని సర్టిఫికెట్లు చేత పుచ్చుకొనివిన్నగా నామెయొద్దకువచ్చి బెసెంటుసతి మీరేనా యని యడిగి ఆమె సర్టిఫికెట్టు నామె కిచ్చి, ఆమె నాస్తిక మతమును గుఱించి వ్రాసిన విషయము నెత్తి, ఎప్పుడైన సమయము నేర్పర్చుకొని వచ్చినయెడల దానిని గుఱించి చెప్పెద నని, తా నుపన్యాసములకై యుపయోగించుచుండిన యొక పుస్తకము నామెకు చదువ నిచ్చెను. నన్ను మీ రిదివఱ కెరుగరు గదా, నాడు నన్నెట్లానవాలు పట్టిరని తరువాత నొకనా డామె యడుగ బ్రాడ్లా నవ్వి, మిమ్మెరుగను గాని, అందరి ముఖములు చూచి మీరే అనీ బెసెంటని నిశ్చయించుకొంటి నని జవాబు చెప్పెను. ఇట్టీసమావేశము దైవప్రేరితమని విశద మగుచున్నది.

ఇదివఱ కెన్నిజన్మముల నుండియో వచ్చుచున్న వారి మైత్రిచేతనే వా రొకరి నొక రట్లానవాలు పట్టుటయు, ఈజన్మమున వారిమైత్రి యంతగాఢము పవిత్రము నగుటయు తటస్థించెను. అది యీ జన్మాంతమున నశించు మైత్రికాదు. బ్రాడ్లా

వద్ద బెసెంటుసతి నేర్చుకొన్ని ఆమె తరువాత జీవితములో నాచరించిన ముఖ్యసూత్రము: "నీతో నేకీభవించినవారి యభిప్రాయములను చదివి కాలము వ్యర్థపరచవద్దు; నీతో నంగీకరించనివారి యభిప్రాయములను చదువుము, నీకు వెంటనే కనిపించని సత్యస్వరూపము లందులో దొరకును." ఆమె తన యుపన్యాసములలోని వాగ్ధోరణికి ప్రజల మెప్పుపొంది మత్తెక్కియున్న సమయములలో నాతడు నెమ్మదిగ వచ్చి ఆమె వాదములోని దుర్బలాంశములను చూపియు, తప్పు అభిప్రాయములను శాంతముగ విమర్శించియు, నామెను గొప్ప వక్తగా జేసెను.

'హాల్ ఆఫ్ సైన్సు' లో వారి సమావేశమైన తరువాత నాతని గదిలో తిరిగి కలుసుకొనిరి. అప్పుడు జరిగిన సంభాషణలో నాతడు "మీరు తెలియకనే నాస్తికములో జేరినా"రనెను. ఆమె వ్రాసిన 'దేవుని స్వభావము, ఉనికి' యను వ్యాసము నతని కప్పుడామె చూపెను. దానినిగురించిన సంభాషణ ఫలితముగ దానిలో 'దేవుడు లేడు' అను వాక్యమును తీసివేసి, ఆ యభిప్రాయమును ఖండించుచు బ్రాడ్లా వ్రాసిన యొక వ్యాసమునుండి కొన్ని వాక్యముల నచట చేర్చెను. దేవుడు లేడని యీ నాస్తికమతమువా రనరు. దేవుని తెలియుట అశక్యము గనుక వారాసంగతి నెత్తరు. మానవజీవితములో దేవుని ప్రస్తావన అక్కరలేకుండ సత్ప్రవర్తన, పరహితజీవనమువల్ల పురోవృద్ధి నొందవచ్చునని వారివాదము.

1874 సం॥ మొదలు 1886 సం॥ వఱకు బెసెంటుసతి తీవ్రమైన నాస్తికవాదిగ పనిచేసి, వక్తగాను రచయితగాను

కూడ ప్రసిద్ధిగాంచెను. ఆమె యారోజులలో దేవుని నమ్మనను సిద్ధాంతము నాధారము చేసికొని, జననమరణములు, నైతిక వర్తనము, ఆత్మ, మొదలగు ననేక జీవితవిషయములను హేతు పూర్వకమగు వాదముచే పరీక్షించి వ్యాసములను వ్రాసెను. అప్పటికామె బుద్ధికి లభ్యమైన సత్యముల ననుసరించి చేసిన యాసిద్ధాంతములు బహు యుక్తియుక్తముగ నుండుటచే జనామోదకరమై యుండెను.

1874 సం॥లో బెసెంటుసతికి బ్రాడ్లాకు పరిచయ మైనది మొదలు ఆమె తన సహజదీక్షతో కార్యరంగమున నురికెను. 'నేషనల్ రిఫార్మర్' కు వ్యాసముల వ్రాయుచు కొన్నాళ్ళకాపత్రికకు సహాయసంపాదకురాలాయెను. స్కాట్ గారికి ప్రచురణము నిమిత్తము వ్యాసములువ్రాసి యిచ్చు చుండెను. నాస్తికము, 'స్వతంత్రమతము' గురించి యుపన్య సించుచు వ్యాసములు వ్రాయుచుండెను. ఇతరవిషయము లలో, ముఖ్యముగ సాంఘిక రాజకీయ విషయములలో, గూడ పనిచేయుచుండెను. ఫ్రెంచిప్రజల తిరుగుబాటు (French Revolution) గురించి కొన్ని యుపన్యాసము లిచ్చుటకామె రెండుబళ్ళ పుస్తకములు చదివెనట. (ఆయుపన్యాసము లొక పుస్తకముగా ప్రచురింపబడెను.) "ఆతిరుగుబాటు నా కొక నాటకమువలెను, దానిలో నేను నొక పాత్రగా నటించి నట్లును, ఇతరనటులు నాస్వంతమిత్రులు శత్రువులుగాను నా కగుపించెదరు" అని యామె వ్రాసెను. 1874 సం॥ సెప్టెం బరులో పార్లమెంటుకు జరిగిన ఎన్నికలలో బ్రాడ్లా పక్ష మున నామె కష్టపడి పనిచేసెను.

ఆకాలములో నామె రెండువిధములగు నాటంకములను తెరిచవలసియుండెను. ఒకటి, ఆమె భర్తయింటనుండి వెడలివచ్చుటవల్ల, నాస్తికమవలంబించుటవల్ల జనుల కామెయెడల బుట్టిన యయిష్టత. రెండు, బ్రాడ్లాయెడల జనులకుండిన దురభిప్రాయ జనితమగు ద్వేషభావము, ఆయనతో నీమె మైత్రిచేసి ఆయనపక్షమున పనిచేయబూనుట. ఈ రెండును గొప్ప ఆటంకములైనను, బెసెంటుసతి ఆ యాటంకములవైపు చూడనైన చూడక తనపనిని తాను చేయదొడగెను. సత్యమే ఆమె లక్ష్యము. సత్యము 'నా పక్షము నిలిచి మాట్లాడు వా రెవరు గండు' అని పిలిచినట్లు విని 'ఇదిగో నేనున్నాను'అని యామె బయలుదేరినది. ఆ పవిత్ర కార్యమునకు తన సర్వశక్తులను ధారపోసెను. ఆమె యేపని చేసినను ఆపని సత్యమునకు కైంకర్యముగ జేసెను. ఆకార్యమును బూనుటయందు, లోకమును మతదాస్యమునుండి విముక్తిచేయు బోధ జేసి లక్షలకొలది జనుల మనస్సుల మార్చు కార్యము బూనుటయందు, తన బాధ్యత యెంతపవిత్రమైనదో ఆమె గ్రహించెను.

ఇక్కడ నొకవిశేషము చెప్పవలసియున్నది. బెసెంటుసతి నాస్తికమతపక్షమున తీవ్రముగ పనిజేయదొడగిన 1875 సం. లోనే అమెరికాలో దివ్యజ్ఞాన సమాజస్థాపనకు మేడం బ్లావట్స్కీ తీవ్రప్రయత్నములు చేయుచుండెను. ఆసంవత్సరము నవంబరులో ఆసమాజ మచట స్థాపించబడెను. ఇంగ్లండులో బెసెంటుసతియు బ్రాడ్లాయు 'మూఢనమ్మకము'ల బారద్రోలుటకై చేయుచుండిన మహాకార్యమును మెచ్చుకొనుచు,

వారు చేసిన ప్రచారమువల్లనే దివ్యజ్ఞానసందేశమును ప్రచారముచేయుట సాధ్యమైనదని బ్లవాట్స్కీ వ్రాసెను.

1875 సం. జూన్‌లో బెసెంటుసతి వెస్టరులో నుపన్యసించెను. ఉపన్యాసాంతమున జరిగిన సంభాషణలో నామె జీవితమునందలి యొకవిచిత్ర సంఘటనకు బీజము పడెను. ఆమె యుపన్యాసమును కోపముతో ఖండించుచు నొక క్రైస్తవుడు 'ది ఎలిమెంట్సు ఆఫ్ సోషల్ సైన్సు' (సాంఘిక శాస్త్ర ప్రాథమిక సూత్రములు) అనుపుస్తకము నామె వ్రాసినట్లును అందులో పెళ్లిళ్లు మానవలెనని వ్రాసియున్నట్లును, అందును, బ్రాడ్లా అంగీకరించినట్లును చెప్పెను. ఆమె ఆపేరే వినలేదు, బ్రాడ్లా వివాహము నిషేధించలేదని యెరుగును, గనుక, వెంటనే యాక్రైస్తవున కామె తగిన జవాబు నిచ్చెను. కాని, ఆమె అక్కడినుండి లండన్ వెళ్లినవెంటనే ఆపుస్తకముగుఱించి విచారింపసాగెను. కొన్నేండ్లక్రిందట నొకవైద్య డాపేరుగల పుస్తకమువ్రాసి 'నేషనల్ రిఫార్మర్'కు విమర్శనిమిత్తము పంపెననియు, బ్రాడ్లా విమర్శ వ్రాయుచు గ్రంథకర్త దానిని సద్భావముతోను సదుద్దేశముతోను వ్రాసినట్లు వ్రాసెననియు తెలిసికొని ఆపుస్తకమును తీసి చదివెను. అది మూడు భాగములుగ నున్నది. మొదటిభాగములో వైద్యశాస్త్రము ప్రకారము 'స్వేచ్ఛానురాగ'మనునది శ్రేష్ఠమని నిరూపింపబడెను; రెండవభాగమంతయు వైద్యశాస్త్రచర్య; మూడవభాగములో రే. మాల్తూస్ జనసంఖ్యను పరిమితిలోనుంచుట గుఱించి వ్రాసిన యభిప్రాయములు స్పష్టముగ విశదపరచబడెను. బ్రాడ్లా యాగ్రంథములోని మూడవభాగము కూలీల కనుసర

ణీయమని వ్రాసెను. అతని శత్రువులు రాజకీయాది యితర విషయములలో నతడు వ్రాసిన వ్రాతలలో నెక్కడను తప్పు పట్టలేక యీగ్రంథ విమర్శనను పుచ్చుకొని యత డవినీతికర మగు బోధ చేయుచున్నాడని అట్టివానిని పార్లమెంటులోకి ప్రజాప్రతినిధిగ బంపుట హానికరమని వాదింపజొచ్చిరి. ఇది బ్రాడ్లాకును బెసెంటుసతికిని చాలా కష్టముల దెచ్చిపెట్టెను. ఆపుస్తకమును 'నేషనల్ రిఫార్మర్'లో బ్రాడ్లా పొగడినకంటె నెక్కువగా నితరపత్రికలు పొగడెను గాని యాపత్రికలతో గాని విమర్శకులతోగాని జను లిసుమంతయు జోక్యము కలిగించుకొనలేదు.

1875 మొదలు బెసెంటుసతి 'నేషనల్ సెక్యులర్ సొసైటీ'కి ఒక ఉపాధ్యక్షురాలు, బ్రాడ్లా అధ్యక్షుడు. సత్యాన్వేషణ మా సమాజాదర్శము. దానిలో ననేకమంది సభ్యులుండిరి. మతములోను, రాజకీయములలోనుగూడ ఆసమాజమునకు దేశములో గొప్పపలుకుబడి కలిగెను. ఆసమాజసభ్యులలో నపూర్వమగు మైత్రి కుదిరెను. వారిలో కూలివాండ్రెక్కువ మంది. వారే బ్రాడ్లా ఎన్నికలసమయములలో నైన వ్యయమంతను భరించిరి, అతనిపక్ష మల్లరులలో పాల్గొని పోరాడిరి.

బెసెంటుసతి యుపన్యాసము లిచ్చుట కారంభించిన క్రొత్తదినములలో మూకలుచేరి యామెపై రాళ్లు రువ్వుట మొదలగు ననేక దుర్మార్గపుపనులు చేసిరి. కాని కూలివాండ్రు, నిరుపేదలు ఎప్పుడును ఆమెపక్షముననుండి యామెను కాపాడిరి.



# నౌల్టన్ పుస్తకము

1835 సం॥ లో డా॥ చార్లెస్ నౌల్టను అను అమెరికా దేశపు వైద్యుఁడు సంతాననిరోధముగురించి యొకపుస్తకమును ప్రచురించెను. స్త్రీపురుషులు చిన్నతనములో పెండ్లి చేసికొనుట వ్యభిచారము నరికట్టుటకు మార్గమని, తలిదండ్రులు పోషించలేనంతమంది సంతానము కనకుండ జాగ్రత్తగా మసులుకొనిన యెడల దరిద్రముండదని అతనివాదము. దానిలో సంతాననిరోధనమునకు కొన్ని ఉపాయములుగూడా వ్రాసెను. ఆపుస్తకము 40 సంవత్సరములు అమెరికాలోను ఇంగ్లండులోను నిరాటంకముగ అమ్ముచుండిరి. ఇట్లుండగా బ్రిస్టల్‌లో నొక డా పుస్తకమునే కొన్ని యవకతవక బొమ్మలు చేర్చి అమ్ముటచేత వానిని శిక్షించిరి. తరువాత 'నేషనల్ రిఫార్మర్'ను, బ్రాడ్లా, బెసెంటుసతి వ్రాసిన పుస్తకములను ప్రకటించునతడు నౌల్టన్‌పుస్తకములనుగూడ అమ్మెను. అందుకు వానిని శిక్షించిరి, దానితో, బ్రాడ్లాయు బెసెంటుసతియు ఆపుస్తకములోని విషయము అవినీతికరములా, దాని ప్రకటనము శిక్షార్హమగునా యను సంగతిని పరీక్షచేయుట కా పుస్తకమును తిరిగి అచ్చువేసి, స్వయముగ నొకచోట నొక సమయమున దాని ప్రతుల నమ్మెదమని పోలీసులకు, మరికొంద రధికార్లకు తెలియచేసి, 1877 సం॥ మార్చి 24 మొదలు సాయంత్రము 5 గం మొ॥ 6 గం॥ వఱకు పుస్తకము లమ్ముటకును, ఉదయము 10 గం॥ మొ॥ 11 గం॥ వఱకు పోలీసులు తమను ఎరెస్టు చేయుటకును అస్థలమందుండసాగిరి.

ఈపుస్తకము ప్రకటించుటవల్ల వారికి వచ్చు చిక్కులు వారు గమనించకపోలేదు. కోర్టులో శిక్షమాట యటుండ బ్రాడ్లా కిది పార్లమెంటు సభ్యత్వమును పోగొట్టును. ఇంతవఱకు అతని విరోధుల కతని కొట్టుటకు దొరకని ఆయుధమిప్పుడు వారికి దొరకును. బెసెంటుసతి కిది అపఖ్యాతి. ఆమె యింతవఱకు ఎంతో కష్టపడి నిలబెట్టుకొనిన సచ్ఛీల యను కీర్తి కిది భంగకరము. కాని, తా నెంత యపకీర్తి పాలైనను పేదల కుపకారమగు కార్యము చేయుట కామె వెనుదీయ లేదు. దరిద్రదేవతపాలై దిక్కులేనివారి కొక దిక్కు గలిగించుటకంటె ఆమె కీర్తి గొప్పదా? సమయము వచ్చినపుడు వెనుదీసిన యెడల ఆత్మత్యాగముగుఱించి, ఆత్మార్పణము గుఱించి చేసిన యుపన్యాసము లన్నియు వ్యర్థమేనా? ఈ యోచనచే నామె ధైర్యముతో నీ ప్రకటనకు బూనెను.

క్రిస్టియన్ ఎవిడెన్సు సొసైటీవారి మనవిపైన పోలీసులు వారిని ఏప్రిల్ 6 తేదిని అరెస్టుచేసి కోర్టుయెదుట బెట్టిరి. వారికి జామీనుండుటకు సిద్ధముగ పదులకొలది జనులు హాజరైరి. కోర్టువారు వారిని స్వంత జామీనుపై విడుదలచేసెను. తరువాత వ్యాజ్యెము హైకోర్టుకు మార్చబడెను. అక్కడ ఇంగ్లండు ప్రధాన న్యాయాధిపతి జూరీ సహాయముతో విచారణ చేసెను. న్యాయాధిపతి జూరీ కిచ్చిన యాదేశములో ముద్దాయీల పక్షము బలముగా వ్రాసెను గాని జూరీ 'పుస్తకము ప్రజల నీతికి భంగకరమని మే మేకగ్రీవముగ నంగీకరించు చున్నాము గాని ముద్దాయీలు దురుద్దేశముతో ప్రకటించలే' దని యభిప్రాయ మిచ్చిరి. దానిని

న్యాయాధిపతి నేరముచేసినట్లు అర్థముచేసెను. జూరీ అయభి ప్రాయము తమకు లేదని తిరిగి యోచించుట కనుమతిగోరిరి. వారిలో నెక్కువమందికి ముద్దాయీలను విడుదల చేయవలె నని యున్నను నాయకుడు భిన్నాభిప్రాయము గలవాడగు టను వానిమాట కెదురాడలేక అందరును ముద్దాయీలు నేరస్థులని యభిప్రాయ మిచ్చిరి. తరువాత విచారణలో జరి గిన లోపముల కారణమునను జూరీ మొకటి యభిప్రాయము తమపక్షముండెనను కారణమునను పునర్విచారణ చేయుడని ముద్దాయీలు వాదించిరి. ఆ వాదమును నిరాకరించి న్యాయాధిపతి వారిని ఆపుస్తకము నమ్మమని వాగ్దానమిచ్చిన యెడల విడిచిపెట్టెదననెను. వా రందు కంగీకరించనందున వారిని ఆరేసినెలలు ఖైదు, రెండేసి వందల పౌను లపరాధము విధించి, ఒక సంవత్సరము సత్ప్రవర్తనకు అయిదేసి వందల పౌనులకు జామీ నిమ్మనెను. కాని బ్రాడ్లా అపీలు చేయుదు మనినందున ఆతని స్వంత జామీనుపైన వారిని విడిచిపెట్టిరి. అపీలులో విచారణలో లోపమున్న కారణమున నా తీర్పు రద్దు కాబడి శిక్ష రద్దు అయినది.

కాని, వా రిద్దరిని తిరిగి యెన్నడైన ఆ పుస్తకము అమ్మినయెడల ఎరెస్టుచేసి కేసుపెట్టుట కవకాశము మిగిలెను. అందుచేత బెసెంటుసతి సంతాననియమ ధర్మముగురించి తమ సంఘమువారి యభిప్రాయములను తెలియజేయుచు నొక పుస్తకము వ్రాసి యచ్చువేయించి, ప్రచురించెను. తిరిగి నాల్టన్ పుస్తకము నమ్మసాగిరి. ఈసారి పోలీసుపైని బ్రాడ్లా పోలీసువారు తీసికొనిన తమ పుస్తకప్రతులను తిరిగి

యియ్యలేదని వ్యాజ్యెము వేసి ఆ ప్రతులను పుచ్చుకొని, ఒక్కొక్క దాని మీద 'పోలీసులనుండి తిరిగి తెచ్చినది' అని వ్రాసి అమ్మిరి. ఆ పుస్తకముగుఱించి వారిపై పోలీసులు చర్యజరుపరని వర్తమానము వచ్చినవఱకు దానినమ్మి ఆ వర్తమానము రాగానే దానియమ్మకము నిలిపివేసి, బెసెంటుసతి వ్రాసిన పుస్తకము నమ్మసాగిరి.

కాని, బెసెంటుసతి కంతటితో కష్టము లాగలేదు, అనుకొనని కష్టములు ప్రాప్తించెను. 1878 సం. ఏప్రిల్‌లో ఆమె కూతురు మేబెల్‌ను స్వాధీనపరుచుకొనుట కామె భర్త వ్యాజ్యెము వేసెను. అందుకు ముఖ్యకారణము లామె ఆస్తిక మతావలంబనము, నౌల్టన్ పుస్తక ప్రకటనము, ఆమె సంతాన నియమముగుఱించి వ్రాసిన పుస్తక ప్రకటనమును. అప్పుడు మేబెల్ స్కార్లెట్‌జ్వరముతో మంచముపట్టి యుండెను. ఆ స్థితిలో నామె యాబిడ్డను విడిచి కోర్టుకు వెళ్లవలసెను. కోర్టులో అదివఱకు న్యాయాధిపతు లామె యెడల జూపిన గౌరవమునకు మార్దవమునకు బదు లీ న్యాయాధిపతి, చూపిన కాఠిన్యము ఆమె భరించలేకపోయెను. ఆరంభమునుండి అంతము వఱకు ఆతడు న్యాయవాదివలె ప్రవర్తించెనుగాని న్యాయాధిపతివలె ప్రవర్తించలేదు. తాను క్రైస్తవము విడిచిన తరువాత బిడ్డ తన రక్షణలోనుండుట కొప్పుకొని తండ్రివ్రాసి యిచ్చిన పత్రముప్రకార మీవ్యాజ్యము నిలువదని, తన యభిప్రాయము లాపత్రములోని యంగీకారమును రద్దుచేయవని ఆమె వాదము. వాది పక్షమున నామె శీలములో లోపము నెంచలేదు, పిల్ల సంరక్షణ చక్కగా జరుగుచున్నట్లొప్పు

కొనిరి. న్యాయాధిపతి పిల్లకు మతబోధ చేయలేదన్న యొక్క కారణముమీదనే పిల్లను తండ్రి కొప్పగింప తీర్పుచెప్పి అపీలు పర్యవసానము తేలేవఱకు ఆతీర్పు అమలుచేయకుండ నిలుప నిరాకరించెను. వెంటనే ఆమె భర్తయొద్దనుండి వచ్చిన యొకడు జ్వరముచే నీరసపడియున్న గూ బిడ్డను, ఏడ్చుచు కొట్టుకొనుచున్ననుజాలిమైనలేక బలవంతముగ దీసికొని పోయెను. పిల్లను తల్లిచూచుటకైన నవకాశము నీయనందున, పిల్లలను చూచుకొనుచుండుటకైన పనికివచ్చునని (Restitution of Conjugal Rights) వైవాహిక ధర్మ ప్రత్యానయమునకు వ్యాజ్యము వేయుదునని భర్తకు నోటీసిచ్చెను. కాని, యింతలో ఆమె అమితదుఃఖముపాలై, జ్వరముతో పడిపోయెను; సన్నిపాతములో మానసికవేదన యణిగెను. ఆజబ్బులో బ్రాడ్లా వచ్చి నిరంతరము ఆమెచెంతనేయుండి తన పని చేసికొనుచు, ఆమెకు తల్లివలె సంరక్షణచేసి ఆమెను బ్రతికించెను. ఆమె జబ్బుగానున్నపుడామె భర్త యొక్క వ్యాజ్యమువేసి యాతనిపై నామె నోటీసు ప్రకార మెట్టి చర్యయు జరుపకుండు నిషేధపు టుత్తరువు పొందెను. ఆయుత్తరువును రద్దుచేయుటకై యామె చర్యజరిపెను. ఆమె పిల్లను తండ్రి కిప్పించిన న్యాయాధిపతియే ఆమెకు పిల్లలను చూడనవకాశ మీయలేదని, ఆమె కియ్యనొప్పుకొనిన మనోవృత్తి నిచ్చుటలేదని విని భర్త చర్యను తీవ్రముగా ఖండించెను. కాని, 1873 సం. లో భర్త వ్రాసిన విడాకులుపత్రము ప్రకార మామె యతనిపై నెట్టి చర్యజరుపుటకును వీలులేదని తీర్మానించెను. ఆపత్రములోనే పిల్ల స్వాధీనము గుఱించి వ్రాసిన యేర్పాటు రద్దుచేసి, తక్కిన

యేర్పాట్లు ఆమెను బంధించుననుట ఘోరమైన అన్యాయము. కాని,అప్పీలు కోర్టులోకూడ ఆతీర్పు ఖాయమైనది. భార్యపై భర్తకుగల యీనిరంకుశాధికార మీతరువాత పార్లమెంటువారొక చట్టముచే తొలగించిరి. అప్పీలు కోర్టువారితీర్పులో ఆమెపిల్లలను చూచుట కవకాశమీయవలెనని వ్రాయుచు, అందుకుతగిన యుత్తరువులకొఱకు మొదట తీర్పునిచ్చిన న్యాయాధిపతి యొద్ద మనవిచేయవలెనని యాజ్ఞాపించిరి. ఆప్రకారము చేసిన మనవిపైనా న్యాయాధిపతి బెసెంటుసతికి పిల్లనుచూచుటకు విస్తారముగ నవకాశముల నిచ్చెను. కాని, తరచుగ తల్లిరాక కెదురు చూచుచుండుట, ఆలస్యమైన బెంగపెట్టుకొనుట మేబెల్ కు కష్టకారణమయ్యెను. మరియును పిల్లలయెదుట వారి తండ్రి తల్లిని దూషించుటయు వారికి కష్టమేయాయెను. అందుచేత బెసెంటుసతి పిల్లల నాకష్టమునుండి తప్పించుటకును వారికి తల్లిపైన తండ్రిపైన కూడ గౌరవము పోవుటకంటె నొకరిపైనైన గౌరవ ముండుట మంచిదని తలచియు, తన యెడబాటుదుఃఖమును దిగమ్రింగి పిల్లలను జూడబోవుట మానుకొని, ఆ గాయము నితరుల బిడ్డలకు సంరక్షణచేసి మాన్పుకొన నిశ్చయించెను

ఈ ప్రకారము నాల్టన్ పుస్తకప్రకటన మామె కెన్ని కష్టములు తెచ్చినను ప్రజల హృదయములలో ఆమెకు విజయము గలిగెను. ఇంగ్లండులోనే గాక, ఆస్ట్రేలియా హైకోర్టులోగూడ ఆపుస్తక ప్రకటనము దోషము కాదు. అది జనుల కుపకారియని తీర్మానింపబడెను. బెసెంటుసతికి ఆపుస్తకము సాహసించి ప్రకటించినందుకు కృతజ్ఞతను దెలుపుచు

నాలుగు మూలలనుండి వేనవేల స్త్రీలు, అన్నితరగతుల వారు - క్రైస్తవ మతాచార్యుల, పురోహితుల, బోధకుల భార్యలుకూడ - జాబులువ్రాసిరి. ఆపుస్తకమునకు బదులు ఆమె వ్రాసిన పుస్తకమును అమ్ముచుండిరని పైన తెలిపితిమి. అదియు దేశములో మిక్కిలి మన్ననపొందెను. 1891 సం.లో బెసెంటునతి తన పుస్తక ప్రచారమును నిలిపివేసినపుడు అది ప్రకటించు నధికారమునిచ్చిన చాలాధనము నిచ్చెదమని యొక పుస్తకముల కంపెనీవా రడిగిరి, కాని, యామె నిరాకరించెను. 1893 సం. నాటికి పూర్వాచారపరాయణులగు క్రైస్తవుల పత్రిక 'క్రిస్టియన్ వరల్డు' కూడ సంతాన నియమము నామోదించెను. నే డది యవసర సాంఘిక ధర్మముగ సర్వాంగీకారము నొందినది. లోకాభిప్రాయము లెట్లు మారునో, అజ్ఞాన మేరీతిగా కాలగతిని తొలుగునో చూపుట కిది యొక నిదర్శనము.

తల్లి పిల్లల యెడబా టేమైనది? వారికి ఈడురాగానే తల్లియొద్దకు పోయిరి. మేబెల్ తల్లియొద్ద కొద్దికాలమే యుండి అనుకూలవరుని పెండ్లాడి సుఖముగ కాపురము చేయుచున్నది. కొడుకు, కూతురు మతాభిప్రాయములలో తల్లితోవనె తొక్కి, క్రమముగా నామెకు కన్నులు తెరచిన దివ్యజ్ఞాన సమాజములో జేరిరి.

ఈ సంతాన నియమనముతో సంబంధించి రాబర్టు డేల్ ఓవెన్ వ్రాసిన రెండు చిన్నపుస్తకము లమ్మినందుకు ఎడ్వర్డు ట్రూలవ్ అను 68 సం|| వృద్ధుకు నాలుగు నెలలు ఖైదు చెప్పిరి. ఈ సంబంధమగు కేసులన్నిటిని అప్పీళ్లను నడుపు

టకును అందుకైన ఖర్చులు పెట్టుటకును డిఫెన్సు కమిటీ యొకటి యేర్పడి ఇంచుమించుగ 1700 పౌనులు చందాలు ప్రోగుచేసి ఖర్చుపెట్టిరి. పాపము ట్రూలవ్ కెవ్వరెన్ని యత్నములు చేసినను శిక్ష ననుభవించుట తప్పలేదు. ఈ విచారణలు శిక్షలు ఫలితముగ జనులలో బ్రాడ్లా, బెసెంటుసతి, ట్రూలవ్, మున్నగువారికి కీర్తివచ్చుట యటుండ, వారి పుస్తకములు వేలకొలది చెల్లిపోయెను. మాల్తూసియన్ సంఘమను పేరున సంతాన నియమనము గురించి ప్రచారమునకు 1877 సం॥ లో నొక సంఘము బైలుదేరి, అనేక బహిరంగోపన్యాసము లిప్పించెను. ఆ యుపన్యాసములకే గాక, వాని మూలమున నాస్తికమతోపన్యాసములకు గూడ వచ్చు శ్రోతల సంఖ్య వృద్ధి యయ్యెను. తద్వారా బెసెంటుసతికి ఆ జన్మాంతము వీడని మిత్రులు ప్రాప్తించిరి.

ఇటువంటి పుస్తకమునే అమెరికాలో అమ్మినందుకు బెన్నెట్టను నొక వర్తకుని శిక్షించిరి. అత డాశిక్ష ననుభవించిన తరువాత ఇంగ్లండు రాగా అతనికి బ్రహ్మాండమైన స్వాగత మిచ్చిరి. ఇంతకష్టపడి ప్రచారము చేసిన సంతాన నియమన సిద్ధాంతమును బెసెంటుసతి 1891 సం॥ ఏప్రిల్‌లో మేడమ్ బ్లవాట్‌స్కీగారి బోధనపైన త్యజించెను. భౌతికవాద మవలంబించినపు డామె భౌతికదేహము దాని పరిణామము, ఐహిక జీవితసంబంధమగు నీతి మొదలగు విషయములను గాఢముగ విమర్శించి తర్కించి తెలిసికొనిన సిద్ధాంతముల నాధారముగ చేసికొనెను, గాని, ఆత్మ సిద్ధాంతములలో చోటు లేక పోయెను. బ్లవాట్‌స్కీగారి బోధల జదివిన తరువాత ఆత్మకు

దేహ పరిణామమునకు గల సంబంధమును, సాంఘిక జీవితము నకు వ్యక్తి ఆత్మకుగల సంబంధమును తెలిసికొనినదై బెసెంటు సతి తన నాస్తిక వాదమును సంతాన నియమన వాదమును వదలెను. ఆ వాదము పిల్లలను పెంచలేక దుఃఖపడు చున్న నిరుపేదలు తమకొక త్రోవ చూపినదని సంతోషించు చుండిరి. వారికీ యాత్మతత్త్వము, కర్మ, పునర్జన్మ సిద్ధాంతములు తలకెక్కవు. వారికి కావలసినది కడుపునిండ తిండి. అటువంటివారి కా వాదము తాత్కాలి కోపశాంతినిచ్చుచుండగా వారి కారవంత యుపశాంతియు నీయకుండ పోవు చున్నదేయని బెసెంటుసతి హృదయము కొట్టుకొని, ఆ కారణముచేతనైన సంతాన నిరోధము బోధించ కూడదా యని యడుగ, బ్లావాట్స్కీ అజ్ఞానురాలగు స్త్రీ - అనగా ఆత్మ జ్ఞానమెరుగని స్త్రీ - తన కష్టములను తగ్గించుకొనుటకు ఏ యుపాయము నవలంబించినను ఆమెను నిందించవలసిన పనిలేదు. కాని, ఆత్మజ్ఞానివగు నీవట్టి బోధ చేయరాదని శాసించెను. బెసెంటుసతి చిన్నతనమునుండి పెరిగిన క్రైస్తవమును సత్యముకొఱకు ఎంత త్యాగముచేసి వదలిపెట్టెనో, ఇప్పుడు సత్యముకొఱ కంత త్యాగముచేసి, హృదయ రక్తమునోడ్చి, నాస్తికమును విడిచెను. నాల్టన్ పుస్తకము, సంతాన ధర్మము గుఱించి బెసెంటు వ్రాసిన పుస్తకము ప్రచారములోనుండి తీసివేయగానే ఆ ప్రచారము సందర్భములో ఆమె పడిన కష్టములో పూనుకొని సహాయము చేసినవారందరు తమ శ్రమయంతయు వ్యర్థమయినదని అందుకు (వారికి తెలిసినంత వఱకు) తగినంత కారణమేమియు లేదని చాలా కించపడిరి.

# సర్వతోముఖసమరము

1878 సం॥ లో బెసెంటుసతికి చేసినజబ్బు నయమైన తరువాత తిరిగి మునుపటికంటె ద్విగుణముగ పనిలో మునుగ దొడగెను. ఆమెకు హృదయభారము తగ్గించుట కంతకంటె మఱియొక సదుపాయ మగుపడలేదు. తనబిడ్డ నెడబాపిన క్రైస్తవమతముపై తీవ్రవిమర్శల చేయ నారంభించెను. ఆకాలమున ఇండియాలో బ్రిటిష్‌వారు సంస్థానముల ఆక్రమణ మొదలగు ఘోరాన్యాయములను, ఆఫ్గన్ దండయాత్రను తీవ్రముగ విమర్శించి అనేకమంది భారతీయుల కృతజ్ఞతకు పాత్రురాలై తన భావిభారతీయ జీవితమునకు పునాదివేసెను. ఆసంవత్సరం నవంబరులో "ఇంగ్లండు, ఇండియా అండ్ ఆఫ్గనిస్థాన్" అను పుస్తకము ప్రకటించెను. నేషనల్ 'రిఫార్మర్' పత్రికా నిర్వహణము, కోర్టులో వాదములు, ప్రతిఆదివారము రెండుమూడు ఉపన్యాసములు, మాల్థూసియన్ సంఘములో కార్యదర్శిపని, ఇతరదినములలో నప్పటప్పట నుపన్యాసములు, దీనితో కాలము పుచ్చుచుండినను, ఆమె మనస్సవశముగ తనబిడ్డపైకి జారిపోవుచుండెను. అది కనిపెట్టి తీరుబడియున్న సమయములలో భౌతికశాస్త్రగ్రంథములు చదువుచు, ఏదైన నొక పరీక్షకు కూర్చొనదలచెను. 1879 సం॥ ఆరంభములో ఎడ్వర్డు బి. ఏవిలాంగ్ డి. యస్. సి. ని కలుసుకొనెను. అతడు భౌతికశాస్త్రమునం దసమానమైన అధ్యాపకుడు. అతడా జనవరిలో 'నేషనల్ రిఫార్మర్' లో వ్యాసములు వ్రాయ నారంభించెను. ఫిబ్రవరిలో అతనియొద్ద బెసెంటుసతి శిష్యత్వమును

ఆరంభించి ఆ సం॥ రం జూన్‌లో లండన్ యూనివర్సిటీ మెట్రి క్యులేషన్ పరీక్షలో కృతార్థురాలాయెను. ఈ పనులన్నియు జేయుచు నొక పెద్ద ఫ్రెంచిగ్రంథము నింగ్లీషులోని కనువాదము చేసెను. డా. ఏవిలాంగ్ వీరితోగలిసి పనిచేయుచుండుటచేత లండన్ ఆస్పత్రిలో అతనియుద్యోగ మూడిపోయెను. దానితో నతని యధ్వర్యమున శాస్త్రములు కళలు నేర్పుటకు సౌత్ కెన్సింగ్టన్‌లో నొక బడిపెట్టిరి. ఆబడి క్రమాభివృద్ధినొంది 1883 సం. లో 13 తరగతులతో నుండెను. బెసెంటుసతి ఆ బడిలో చదివి ఎనిమిది శాస్త్రములలో ఉత్తమపట్టమునొంది శాస్త్రాధ్యాపన కధికారము బడసి ఆబడిలోనే అధ్యాపకురాలాయెను. తరువాత లండన్ యూనివర్సిటీ బి.యస్ సి. పరీక్షకు కూర్చొనెను. కాని మూడుసార్లు రసాయనశాస్త్ర ప్రయోగ పరీక్షలో తప్పిపోయెను. అక్కడ గూడ మతాభిప్రాయ మెదురుగవచ్చెను. యూనివర్సిటీ కాలేజిలో వృక్ష శాస్త్ర తరగతులలో జేరుటకు బెసెంటుసతియును బ్రాడ్లా కుమార్తెయు దరఖాస్తుచేయగా బెసెంటుసతికి మతాభిప్రాయ దోషమువల్లను, బ్రాడ్లాకన్య కామె తనతండ్రికూతు రగుటచేతను ప్రవేశము నిరాకరించిరి. బెసెంటుసతి అధ్యాపకత్వమున కర్హత బడసిన తరువాత దొరతనపు విద్యాశాఖవారి నా యధికారము నంగీకరించుడని కోరి యంగీకారము బడసెను. కాని వెంటనే సర్ హెన్రీ టైలరను నతడు పార్లమెంటులో ఆ యంగీకారము నాక్షేపించుచు, డా. ఏవిలాంగ్, బెసెంటుసతి, బ్రాడ్లాకన్యలు క్రైస్తవులు కానందున వారి బడికి గ్రాంటు రద్దుచేయవలెనని తీర్మానమును ప్రతిపాదించెను. రీజెంటు

పార్కులోని 'బొటానికల్ గార్డెన్సు' (వృక్షశాస్త్రము ప్రకారము వివిధజాతుల చెట్లమొదలగువానిని పెంచు వనము) లోనికి బెసెంటుసతి పోయిచూచుట కనుజ్ఞ గోర ఆవనాధికారి దానిలో తన కూతుళ్లు పరిశోధనలు చేయుచున్నారని ఆమెకు ప్రవేశమీయలేదు. ఈప్రకారము వారేవైపు తిరిగినను అగౌరవము, అమర్యాద, అవమానము, తిరస్కారము ఎదురగుచుండెను. వారు చేయు పనులు అన్నియు బహు ఉపయోగకరముగను, లోపరహితముగను ఉన్నను వారిమతాభిప్రాయములచేతనే వారి కెక్కడను తలయెత్త వీలులేనంత యవమానమగుపించు చుండెను.

1879 సం. అక్టోబరులో బ్రాడ్లా భూమిహక్కుల గురించిన పద్ధతుల సంస్కరణము నాలోచించుటకు రాజ్య మంతటినుండి ప్రతినిధులను రావించి గొప్పసభ జరిపెను. ఆసభకు వచ్చిన హెర్బర్టు బరోస్‌తో బెసెంటుసతి కప్పుడు పరిచయమయ్యెను. 1887 సం. లో వారొక యుద్యమములో కలిసి పనిచేసిరి.

1880 సం. ఆరంభములో బ్రాడ్లా పార్లమెంటు కెన్నుకోబడెను. అతడు మొదటిసారి ఏప్రిల్ 30 తేదిని పార్లమెంటు సభ్యత్వపు ప్రమాణము దీసికొనవలసియుండెను. పద్ధతిప్రకారము మతనికి ప్రమాణమునకు బదులు సత్యప్రతిజ్ఞ చేయుట కధికార మున్నందున సత్యప్రతిజ్ఞ చేయుదునని స్పీకరు (అధ్యక్షుడు)కు మనవిచేసెను. కాని, అందుకు సభ అంగీకరించలేదు. తరువాత, నతడు ప్రమాణము చేయుదుననిన నందుకును అంగీకరించక సభలో నతడు పాల్గొన వీలులేకుండ జేసిరి.

దానితో దేశములో అలజడి యెక్కువయై పార్లమెంటుచర్యల నందరు ఖండింపసాగిరి. పార్లమెంటు తన తీర్మానమును రద్దు చేసికొని తిరిగి బ్రాడ్లాను సత్యప్రతిజ్ఞ చేసి సభలో పాల్గొన వచ్చునని తీర్మానించుటచే అతడు జూలై 2 తేది సభలో కూర్చొనెను. దానిపైన కొందరు ధనికులు చేరి యొకనిరుపేదను వాదిగాబెట్టి బ్రాడ్లా ప్రమాణము చేయకుండ సభలో వోటు చేసెనని వ్యాజ్యము వేయించిరి. అతనివైరుల కతనిని దరిద్రునిగ జేయుటయే యుద్దేశ్యము. ఆవ్యాజ్యములో రాత్రింబవళ్లు పనిచేయుచు, పార్లమెంటులో తన విధ్యుక్తధర్మమును యుక్తముగ నెరవేర్చుచు, ఆరోగ్యమును చెడగొట్టుకొని ధనము వ్యయమై యప్పులు పెరిగి దినవెచ్చములకు ధనసంపాదనకై యుపన్యాసము లిచ్చుచు తుదకు వ్యాజ్యము గెలుచుకొనెను.

అట్లోడిన వైరులు హైకోర్టులో అప్పీలు చేసియు, నతనికి వ్యథగలిగించు నుద్దేశముతో బెసెంటుసతిపై దండెత్తి ఆమె ననేక విధముల దూషింపసాగిరి. ఇదంతయు భరించుచు నామె ఐర్లండులో భూములు దున్ను రైతులపక్షము వహించి ప్రభుత్వముపై పోరాటము సాగించెను.

1881 సం. వసంతములో అప్పీలుకోర్టువారు బ్రాడ్లాకు పార్లమెంటులో సత్యప్రతిజ్ఞచేసి సభ్యుడుగ పనిచేయుట కధికారము లేదని తీర్మానించుటచే అతని స్థానమునకు తిరిగి యెన్నికలు జరిగి మునుపటికంటె ఎక్కువ వోట్లతో బ్రాడ్లాయే గెలిచెను. దానితో వాని వైరు లతనిని పార్లమెంటులోకి రాకుండ చేయవలెనన్న యత్నములు బలమయ్యెను. దౌర్జనమువారు

(గ్లాడ్ స్టన్ అప్పుడు ప్రధాని) కూడ అతని వైరులకు వ్యతిరేకముచేయ సాహసింపలేక సత్యప్రతిజ్ఞ చేయు నధికారమిచ్చు చట్టమును చేయదుమని చెప్పియు మానుకొనిరి. అంత తిరిగి బ్రాడ్లా తన హక్కును నిలబెట్టుకొనుటకు ఆగష్టు 3 తేదిని పార్లమెంటుకు పోయెను. ఆవేళ వేలకొలది జనులు దేశమన్ని మూలలనుండి వచ్చి బ్రాడ్లాను సభలో చేర్చుకొనుమని అర్జీలను చేతబట్టుకొని పార్లమెంటు మందిరము మెట్లమీాద నిలిచిరి. జను లల్లరిచేయకుండ కాపాడు బాధ్యత బెసెంటుసతిపై బ్రాడ్లా యుంచెను. లోపల నేమి జరుగుచున్నదో తెలియక జను లట్టహాసములు చేయుచుండిరి. పోలీసులు వారిని తరుమజూచిరి, గాని, బెసెంటుసతి యక్కడ అందరు నిలుచుటకు హక్కు కలదని వాదించి వారిని పంపివేసెను. ఒకప్పుడు జనులు ముందుకు త్రోసుకొని రాబోవ పోలీసువా రడ్డగించ్చిరి, కాని, బెసెంటుసతి ముందుకు వచ్చి చేతితో సంజ్ఞచేసి బ్రాడ్లాకోరిక ప్రకారము తొందరపడక శాంతి వహింపుడని యాజ్ఞాపింప వా రందరు తమ కోపము నాపుకొని నిశ్శబ్దముగ వెనుకకు పోయిరి. ఇది చూచి పోలీసులు దిగ్భ్రాంతులైరి. ఇంతలో నొక పెద్దశబ్దము విని యదేమని విచారించి బ్రాడ్లా వెనుకద్వారము బైట దెబ్బలతోను చినిగినబట్టలతోను నిశ్చలముగ బంధించిన ద్వారముపై పు తిరిగి యుండుట గాంచిరి. అతనిని మందిరములో నుండి పదిమంది భటులు బలవంతముగ బైటకు త్రోసివేసిరి. ఆ త్రోపులాటలో నతనిని కదల్పజాలక కొంతసేపు శ్రమపడి పదిమంది బలముచే ముందుకు త్రోయుటలో నొక తలుపు బ్రద్దలై అద్దములు చితికిపోయెను. అతని పక్షము వచ్చిన జను

లందరు బెసెంటుసతి వారింపకున్న సతనిని బలవంతముగ సభలో గూర్చుండబెట్టియుందు మనిరి. ఈ ప్రకారము మత మూర్ఖత యితర విషయములలోగూడ న్యాయాన్యాయ విచ క్షణకు చోటీయక, న్యాయమునకు జగత్ప్రసిద్ధిగాంచినట్టియు బ్రాడ్లాకు గౌరవనీయమైనట్టియు, గ్లాడ్స్టన్ వంటి రాజకీయ వేత్త నాయకత్వమున నున్నట్టియు పార్లమెంటునుకూడ లొంగ దీసి యొక బ్రిటిష్ పౌరునకు మతస్వాతంత్ర్యము లేకుండ జేసెను. దానితో ప్రజలలో నన్ని తరగతులవారిలోను ఆందోళన బైలుదేరుటచేత దొరతనమువారు ఆయన్యాయము తొలగిం చెదమని ఖరారుచేసిరి. ఇంతలో బెసెంటుసతి దొరతనమునకు పన్ను చెల్లవలసిన వస్తువులన్నిటినివాడుక చేయుటమానుటకును సేవింగ్సుబాంకులో కట్టిన సొమ్మంతను తీసివేసికొనుటకును ప్రజలలో నొకయుద్యమము లేవనెత్తెను. దాని కందరు సిద్ధపడినంతలో దొరతనమువారు చేసిన ఖరారు తెలిసి ఆ యుద్యమము నాపివైచెను. ఒక ప్రక్క బ్రాడ్లా దెబ్బలచే మంచము పట్టెను. ఒకప్రక్క బెసెంటుసతిపై ననేకదుర్వార్తలు, అభియోగములు నడుచుచుండెను. బ్రిటిష్ సామ్రాజ్య వలస దేశములలో ఆమె యెన్నడు చూచియెరుగని పుస్తకముల కామె కర్తయని ప్రకటింపబడెను. సర్ హెన్రి టైలర్ వారి బడిపైన దండయాత్ర చేయుచుండెను.

1882 సం॥ వచ్చినను బ్రాడ్లా పార్లమెంటు సభ్యత్వపు తగవు పరిష్కారముకాలేదు. దొరతనమువారే చర్య జరుప లేదు. ఫిబ్రవరి 7 తేదిని తిరిగి బ్రాడ్లా పార్లమెంటు యెదుట వాదించెను. కాని, తిరిగి యెక్కువ మందిచే నిరాకరింపబడెను.

ఒక సభ్యుడు ప్రభుత్వము ప్రవేశపెట్టదమన్న బిల్లును ప్రవేశ పెట్టెను గాని నెగ్గలేదు. ఫిబ్రవరి 21 తేది బ్రాడ్లా సభలో ప్రవేశించి ప్రమాణముచేసి తన స్థానమున కూర్చొనెను. పార్లమెంటు అతనినితొలగించి, తిరిగి యెన్నికలనుపెట్ట దానిలో తిరిగి బ్రాడ్లా గెలిచెను. కాని మరల ఎక్కువమంది యభిప్రాయముప్రకార మతనిని ప్రమాణము తీసికొనసీయలేదు. దానితో నంతవఱకు అతనికి వ్యతిరేకముగ నుండినవారు కూడ ప్రబలముగ పార్లమెంటుచర్యను ఖండింపసాగిరి. ఇంతలో పార్లమెంటుసభ్యులందరి యెన్నికలు వచ్చి అందులో బ్రాడ్లా మఱల విజయుడై సభలో ప్రమాణముచేసి కూర్చొని ప్రమాణముల చట్టమును తానే ప్రవేశపెట్టి చట్టముగా చేయించెను. ప్రభువుల సభలో రిడెస్డేల్ ప్రభువు నాస్తికులు పార్లమెంటులో సభ్యులుగ నుండకూడదని యొక బిల్లు ప్రవేశపెట్టెను, గాని, ప్రజల అభిప్రాయము చాల బలముగా నుండుటచేత దానిని సభవారంగీకరించలేదు.

పార్లమెంటులో క్రైస్తవమును నమ్మనివారందరిని శిక్షింపించవలెనని నిరంతరము ఆందోళనము జరుగుచుండెను. బ్రాడ్లాను దివాలా తీయించు ప్రయత్నములు జరుగుచుండెను. వారి బడి సెత్తివేయించుటకు ప్రయత్నములు జరుగుచుండెను. ఈ ప్రయత్నములన్నియు సత్యాన్వేషకులు, ప్రజోపకార పరాయణులు, ప్రభుభక్తిపరాయణులు నగు వారి యుక్తుల తోడిన ఆస్తిక క్రైస్తవులు బలవంతముగ వారి నణగద్రొక్కుటకు చేయు యత్నములు. ఆయత్నము లెక్కువైనకొలదియు నీ 'పాషండుల' సంఖ్యయు, వారిబలమును వృద్ధిచెందుచున్నవి.

ఐర్లండు రైతులపక్ష మవలంబించి బెసెంటుసతి పని చేసినని చెప్పియుంటిమి. భూకామందుల పక్షమై ప్రభుత్వము వారు రైతులను బలవంతముగ తొలగించుటకు తోడ్పడిరి. 3 నెలలలో 7020 మందిని తొలిగించిరి. వారు తిండిలేక పిల్లలతోగూడ మాడిపోవుచుండిరి. అనేకమంది యీయన్యాయము నెదిరించినవారిని విచారణలేకుండ ఖైదులో బెట్టిరి. దానిపై జరిగిన యాందోళనఫలితముగ దొరతనమువారు రైతులకు న్యాయమునిచ్చుటకు నిశ్చయించి, ఖైదులో నున్నవారి నందరిని విడిచిపెట్టి శాంతినెలకొల్ప లార్డు కేవెండిష్‌ను ఐర్లండు పంపిరి. ఆతడచట నోడ దిగెనో లేదోగాని యెవరో చంపిరి. బెసెంటుసతి ఆరోజు బ్లాక్‌బర్నులో ప్రభుత్వమువారిచర్యకు వారి నభినందించుచు నుపన్యసింపవలసి యుండెను. ఆమె యుపన్యాస మందిరమునకు బోవుత్రోవలో కేవెండిష్ ప్రభువును హత్య చేసిరన్న తంతివార్త నామె కిచ్చిరి. 'ఆమె నిలువున నీరై పోయినది'. "హత్యచేసినది యిద్దరిని మాత్రమే కాదు. రెండు దేశములమధ్య సమాధానము కుదురు నాశను హత్యచేసిరి". (కేవెండిష్‌తోపాటు మరియొకడుకూడ హత్య చేయబడి యున్నది). వెంటనే ప్రభుత్వమువారొక చట్టమును నిర్మించి రైతులను రెట్టింపుగ హింసింపనారంభించిరి. హత్యచేసినవారెవరో దుర్మార్గులు, మంచిచెడ్డ తెలియక తొందరపాటుచే జేసిరి. వారితప్పునకు దేశప్రజలందరిని హింసించుట న్యాయము కాదని బెసెంటుసతి తీవ్రముగ వాదించెను. కాని, తమ దేశస్థుని చంపిరన్న యుత్రేకముచే మదించిన బ్రిటిష్ ప్రజల నడ్డువారెవరు? ఆసమయమున సవుబు, న్యాయము ఎవరి

మనస్సున కెక్కునా? (బెసెంటుసతి చేయు అందోళనలలో విశిష్టత కీయుదంత యొక నిదర్శనము)

ఈగందరగోళములో బెసెంటుసతి దృష్టిలోకి దివ్య జ్ఞానసమాజము వచ్చెను. సమాజోద్దేశములును, క. అల్కాటు ఇచ్చిన యొకయుపన్యాసమును ఆమెచేత బడెను. సమాజోద్దేశములను గుఱించి అవి "పూర్వకాలపు మతతాత్త్విక భ్రాంతుల యందు అస్పష్టమగు శ్రద్ధనుతప్ప సమాజసభ్యత్వమున కర్హత యేమో స్పష్టముగ చెప్పలేవు" అని ఆమెవ్రాసెను. అల్కాటు ఉపన్యాసమును బట్టి ఆమె యాసమాజము 'మృతుల పిశాచములగుఱించియు, స్థూలలోకమునకు పైట దానికి సంబంధించని యొక విచిత్రలోక ముఃన్నదనియు నమ్మునది' యని యను కొనెను. నాస్తికుల నేషనల్ సెక్యులర్ సొసైటిలో సభ్యులుగనున్న భారతీయులు కొందరు 'దివ్య జ్ఞానసమాజ సభ్యులు తమసంఘములోను, తమసంఘసభ్యులు ఆసమాజములోను చేరవచ్చునా' యని యడుగుచు సమాజోద్దేశములు అల్కాటు ఉపన్యాసముగల కాగితముల నామె కంపిరి. దానిపై నామె నేషనల్ రిఫార్మర్‌లో తన యభిప్రాయమును పైనుదహరించిన ప్రకారము వ్రాయుచు, తనకు పంపినకాగితములనుబట్టి చూడ 'సెక్యులర్ సొసైటిలో దివ్య జ్ఞానసమాజ సభ్యులను చేర్చుకొనని నిరాకరించుట కా సొసైటి వారి కధికారములేదు; గాని, దివ్యజ్ఞాన గూఢతత్త్వమునకును సెక్యులర్ సొసైటీ భౌతికవాదమునకు అతకని భేదమున్నది. కేవలము ఈలోకమునందనురక్తులై యుండవలెనని సెక్యులర్ సొసైటి మతమున కర్థము కనుక దానిలో పరలోకచింత

కేమాత్రముతావులేదు. పరలోకములను నమ్ము సమాజములో నీ సెక్యులర్ సొసైటి మతమునందు నమ్మకమున్న సభ్యులెవ్వరును చేరగూడదు' అని వ్రాసెను. 1882 సం. ఆగస్టు థియాసఫిస్టులో హెచ్. పి. బ్లవాట్స్కీ దీనికి జవాబువ్రాసెను. "అభిప్రాయస్వాతంత్ర్యముకొఱకు గుడ్డిమతమూర్ఖతతోను సాంఘికపక్షపాతముతోను తనజన్మమంతయు పోరాడినటువంటి గొప్ప తెలివి, తీవ్రబుద్ధిగల యీరచయిత తొందరపడి నిరంకుశాజ్ఞలను చేయుట అసందర్భముగ నున్న"దని, ఆవ్రాతకు మదరాసునుండి శాస్త్రీయమగు భౌతికమతావలంబనాకాంక్షచే గాక పగ దీర్చుకొనుటయే యుద్దేశముగా గల కుత్సితుల తప్పుడు వ్రాతలు కారణమని, డా. బెసెంటుకు దివ్యజ్ఞానసమాజాదర్శములు సరిగా తెలియజేయబడలేదని ఆమె యా జవాబులో వ్రాసెను. బ్లవాట్స్కీ అప్పటప్పట ఇంగ్లండులో జరుగుచుండిన ఆందోళనమును గుఱించి విమర్శించుచు ఆ విమర్శలో బ్రాడ్లా, బెసెంటుసతిని ఉదారహృదయముతో మెచ్చుకొనుచుండెను. ఆ ప్రకారము బ్లవాట్స్కీని గుఱించి అప్పుడే బెసెంటుసతికి తెలిసియుండినను ఆమె యింకను భౌతికవాదవిమర్శ పూర్తిచేసి ఆత్మవాదమునకు సిద్ధము కానందున కాబోలు వారొకరి నొకరు చూచుట తటస్థించలేదు.

సర్ హెన్రీ టైలరు మతముపేరున తలపెట్టిన హింస మానలేదు. సర్ వెర్నన్ హార్కూట్ చేత బ్రాడ్లే మీద, బెసెంటుసతి మీద దైవదూషణ నేరమునకు చర్య జరిపించ యత్నించి నిగ్రహించలేక, తాను స్వయముగ 'ఫ్రీ థింకర్'

పత్రిక సంపాదకునిమీద, ప్రచారకునిమీద కేసుపెట్టి ఆ పత్రికతో సంబంధములేని బ్రాడ్లానుకూడా ఆ కేసులో ముద్దాయిగా చేర్చెను. ఆ కేసులో నతడు బ్రాడ్లాయొక్క, (కేసులో ముద్దాయికాని) బెసెంటుసతియొక్క స్వంతబ్యాంకు లెక్కల తనిఖీనిమిత్తము ఉత్తరువుపొందెను. బ్రాడ్లా కుమార్తెలకు వారిబడిలో శాస్త్రోపాధ్యాయినిలుగ నిచ్చుచున్న గ్రాంటు నిలుపుచేయవలెనని పార్లమెంటులో తీర్మానమున కపుడు నోటీసిచ్చెను. ఇవన్నియు వ్యర్థప్రయత్నములైనవి.

బ్రాడ్లా, బెసెంటుసతి తమ ప్రచురణవ్యాపారము వృద్ధియగుటచేత కార్యాలయమును ఫ్లీట్‌స్ట్రీట్‌లో నొక పెద్దయింటికి మార్చిరి. అక్కడ మొదట ప్రకటించిన పుస్తకము ఆమె ఈజిప్టుకట్ల బ్రిటిష్ ప్రభుత్వమవలంబించిన రాజనీతిని తీవ్రముగా ఖండించుచు వ్రాసినపుస్తకము. అక్కడ వారు అనేకమంది సహచరుల సహాయముతో పనిచేయుచుండిరి. బెసెంటుసతి 'అవర్ కార్నర్' అను పేరుతో నొక చవుక పత్రికను స్థాపించి దానిలో సాంఘిక కార్మిక ప్రచారములు చేయసాగెను; ఆ పత్రిక 1883 సం. జనవరి మొదలు ఆరేండ్లు అనన్యసామాన్యమగు సేవచేసెను.

ఫ్రీథింకర్ కేసు పరిష్కారమయిన వెంటనే ఆ పత్రిక సంపాదకుడు మొదలైన ముగ్గురిపైని మఱియొక కేసుపెట్టిరి. ఆ కేసులో ముద్దాయిలకు ఖయిదుశిక్ష విధించిరి. వెంటనే బెసెంటుసతియును, ఆమె సహాయులును వారి పత్రికను, దుకాణములను నడుపుటకును, వారికుటుంబములకు సహా

యము చేయుటకును పూనుకొనిరి. ఆ పత్రిక సంపాదకుడగు ఫూట్‌పైని విధించిన శిక్షనుగూర్చి మేడం బ్లావట్స్కీ 'థియాసఫిస్టు'లో వ్రాయుచు 'ఫూట్‌ను శిక్షించిన జడ్జి కంటె ఫూట్‌స్థితియే మాకు శ్రేష్ఠతరముగ దోచుచున్నది. మేము జడ్జి ఆసనములో గూర్చొనుటకంటె ముద్దాయి యిప్పుడున్నచోట నుండుటయే యెక్కువ గర్వించదగిన స్థితియని భావించెదము' అని వ్రాసెను. ఒక విశేష మేమనగా, శ్రీ థిలకర్ పత్రికాభిప్రాయములతో బెసెంటుసతి ఆమె పక్షము వారు అంగీకరించకపోయినను ఆ పత్రికాధిపతులకు జరిగిన యన్యాయము సహించలేక వారికి సహాయము చేయబూనిరి.



# స్వామ్యవాదము

1883 సం॥ లో మొట్టమొదట బెసెంటుసతికి స్వామ్యవాదమును గురించి జ్ఞోక్యము కలిగినది. ఇతరుల యుపన్యాసముల నామె నేషనల్ రిఫార్మర్‌లో విమర్శించెను, కాని, అంతకంటె ఆవిషయమున నప్పు డామె యెక్కువ శ్రద్ధ దీసికొనలేదు. 1884 సం. లో బ్రాడ్లాకు హెన్రీ హైండ్మనుకు నొక వాదము జరిగెను. హైండ్మన్ స్వార్థరహితుడును ఉత్తమగుణ సంపన్నుడునై, అనేక కష్టములకు అపవాదులకు ఓర్చి పని చేయు స్వామ్యవాది. వారివాదము వినిన బెసెంటుసతి ఆవాదమునుగూర్చి పుస్తకములు చదువ నారంభించెను. అప్పటికి స్వామ్యవాదులు బ్రాడ్లాను తీవ్రముగ ఖండించుచుండుటచేతను,

వారిమాటలలోను వ్రాతలలోను నిగ్రహములేక మితిమీరు చుండుటచేతను కొన్ని అనృతములుకూడ నుండుటచేతను వా రనిన బెసెంటునతి కిష్టములేకుండెను. కాని, వారివాదము విని నప్పుడామెకు వారిపక్షమున కొంత సవుబు, న్యాయము ఉన్నట్లు తోచి వారి పుస్తకములు చదువబూనెను. వారిని గురించి బాగుగ దెలిసికొనినతరువాత వా రందరు ప్రభుత్వ పద్ధతులక్రింద నలిగి శ్రమపడుచున్నవారని, తఱిబీతు లేక పోవుటచేతను కష్టములలో సహాజముగ వచ్చు క్రోధము చేతను మాటలు వ్రాతలు తీవ్రముగనుండెను గాని లోతుగా పరికించి చూచినయెడల వారిలో పెక్కుఱు బహు ఉదార స్వభావులు, ఆత్మత్యాగులు, అనురాగపూరితు లున్నారని తెలిసికొనెను.

ఈసమయములోనే ఆమెకు జార్జి బెర్నార్డు షాతో పరి చయమయ్యెను. "ఇతడు సామ్యవాదులలో మిక్కిలి తెలి వైన రచయిత. మనుష్యులను రెచ్చగొట్టుటలో నంతవాడు లేడు. ఉత్సాహము, శ్రద్ధ గలవారిలో నాగుణములను పురి గొల్పుటలో పరిపూర్ణ నిపుణుడు, తనంతదుర్మార్గుడు లేడని చెప్పుకొనగోరువాడు." అతని నామె మొదట చూచినపు డత డామెతో తాను 'సోమరిపోతు'నని చెప్పెను. దానిమీద నత నిని తీవ్రముగ విమర్శించుచు, ఆమెకు సోమరిపోతులపై నున్న అయిష్టతను వెల్లడించుచు నేషనల్ రిఫార్మర్ లో నొకవ్యాసము వ్రాసెను. తరువాత, నత డొక పేదవాడని, కొన్ని నియమ ములు గలిగి, మనస్సాక్షిని చంపుకొనుటకంటె శరీరమును చంపుకొనుట కిష్టపడుటచే నుపవాసములచే మాడుచుండు

వనియు, రాత్రింబవళ్లు కూలివాండ్రి క్లబ్బులలో మసిలి వారిలో సామ్యవాద సిద్ధాంతములు ప్రచారము చేయునని, వారివలె తాను బరువులు మోయదుగనుక సోమరిపోతు వని చెప్పుకొనుననియు తెలిసి, అతనిని తప్పుటర్థము చేసి కొన్నందుకు చింతించి, మనస్సులో నొకప్రక్క అపార్థము చేసికొనచేసినందుకు కోపమున్నను, అతని క్షమాపణగోరి యొకవ్యాసము వ్రాసెను.

క్రమముగా బెసెంటుసతిబుద్ధి రాజకీయములలోనుండి ప్రజల సాంఘికజీవితమువైపు మరలజొచ్చెను. దేశమంతటను సామ్యవాదసిద్ధాంతములు ప్రబలుచుండెను. ఆమె అవన్నియు వినుచు చదువుచు నూరక కనిపెట్టి చూచుచుండెను. ఇంతలో సర్ జాన్ లబ్బల్ చిన్నపిల్లలచేత దినమునకు 12 గంటలు పని చేయించుటకు నియమించు నొక చట్టమును పార్లమెంటులో ప్రవేశపెట్టెను. దాని నామె తీవ్రముగ ఖండించి, వారమున కైదురోజులు, రోజున కెనిమిదిగంటల పనికంటె పిల్లల నెక్కువ చేయనీయరాదని, చేయుపని కష్టమైనదైనయెడల కాలమింకను తగ్గించవలెనని వాదించెను. జాన్ రాబర్ట్సన్ అను నొక సామ్యవాది 'నేషనల్ రిఫార్మర్' లో పనిచేయవచ్చెను. ఇట్టి పరిస్థితులలో నామె సామ్యవాద సిద్ధాంతములయం దెక్కువ శ్రద్ధచూపుచురాగా, తుదకు సకల జనులకు సమానస్వతంత్ర జీవితము, సాంఘిక సోదరత్వము అను మహాదాదర్శ మామె హృదయము నాకర్షించెను; ఆ వాదమునకు మూలమైన ఆర్థిక నియతి యామె మనస్సునకు వచ్చెను. మానవసేవ, దీనజనోద్ధరణము ఆమె నాకర్షించెను.

1885 సం. జనవరిలో ఆమె యొకవ్యాసములో నిట్లు వ్రాసెను: "క్రైస్తవ వదాన్యతయా ? మేము దాని నెరుగుదుము. ఒక కూలివాని కుటుంబమునకంతకు సంవత్సరమున కొకహండ్రెడ్ వైటు బొగ్గు, అయిదు పౌనుల రొట్టె నిత్తురు. వాడు చేసినపనికి న్యాయమైన ప్రతిఫలము నిచ్చియుండినచో వాడు దానికి నూరు రెట్లెక్కువ సంపాదించి యుండును. కూలివాడు తయారు చేసిన సంపదను వానివద్దనుండి దోచుకొని, దానిలో వెయ్యవ వంతు వానిమీద ధర్మార్థముగ పారవేయుదురు. పేదలను మురికి కొంపలలోను, సందులలోను పెట్టి విషముచే దేహ మంతయు రోగములపాలుచేసి ఆ రోగులకు అస్పత్రులు కట్టుదురు. వయస్సులో వీర్యమును, బలమును, ఆశలను, ఆనంద మును పీల్చి పిప్పిచేసి, మిగిలిన శల్యములకొఱకు పరిశ్రమ శాలలు కట్టుదురు. క్రైస్తవ నాగరికతను పొగడుమని కాబ్ కన్య మమ్ము కోరుచున్నది. కష్టపడువారు నేసినదుస్తులను సోమరులు ధరించి కులుకుచుండుటయు నిరుపేదలు కన్నీరు గార్చుచు, కష్టముల నెదుర్కొనుచు, నిరాశ తాండవింప దౌర్భాగ్యముల ననుభవించుచు కట్టిన పునాదులమీద లేచిన మెఱుగులలో ధనికు లుయ్యేలలూగుటయు మేము చూచు చున్నాము."

బోర్డుస్కూలు పిల్లలకు భోజనము పెట్టవలెనని వాదిం చుచు నామె నేషనల్ రిఫార్మర్‌లో నొకతీవ్రమైన వ్యాసము వ్రాసెను. దానిని విమర్శించుచు 'బాల్' అనువా డొక వ్యాసమువ్రాసెను, ఆవ్యాసములో నత డామె స్వామ్యవాద పక్షపాతమును ఖండించెను. ఆ భాగమును విడిచిపెట్టి తక్కిన

విమర్శకు మాత్రి మాఁమె జవాబువ్రాసెను. ఆమెకు స్వామ్య వాదమందు నమ్మకమున్నను బ్రాడ్లా యెడల స్వామ్యవాదుల వైఖరిచూచి బహిరంగముగ నాసిద్ధాంతము లంగీకరించుటకు వెనుదీయుచుండెను. ఆతడు పట్టుదల గలవాఁడగుటచేత తన యభిప్రాయముల కనుకూలించని స్వామ్యవాదుల పూర్వపు అభిప్రాయములనే చూచి వారికి వ్యతిరేకుడై యుండెను, గాని, వారి క్రొత్త క్రొత్త అభిప్రాయములను వానిలోనున్న సవ్యమును న్యాయమును భవితవ్యతను గాంచకుండెను.

బెసెంటుసతి యీసమయములో ప్రత్యక్షముగ స్వామ్య వాదుల పక్ష మవలంబించి, తన మిత్రుని విడనాడునా? అతని యెడల నామెకుగల కృతజ్ఞత, అనురాగము, గౌరవము అతని కంత అవకాశ మొసర్చినవారి పక్షము చేరనిచ్చుటలేదు, కాని, "తిండిలేక మాడుచున్న పిల్లలయేడ్పులు, సీసపు పరి శ్రమలో విషదిగ్ధమైన, మేకుల పరిశ్రమలో నలిసిపోయిన, పస్తులుండలేక లంజరికమునకు దిగిన, నిరంతర శ్రమచే వంగి ముదుసలులైన స్త్రీలగోడు," ఆమె చెవులలో గింగురు పెట్టు చుండెను. ప్రస్తుతము దేశములోనున్న పారిశ్రామిక పరరక్ష పద్ధతులే కృషీవలుల కష్టములన్నిటికి కారణమని, యామె నమ్మెను. ఆమె మనస్సులోనున్న పోరాటము స్వాంతానుబంధ మునకు విద్యుక్తధర్మాచరణమునకు మధ్య జరుగుచున్నది. ఇట్టి పోరాట మెన్నాళ్లుండును? త్వరలోనే ఆమె, హృదయము పీకుచున్నను, పూర్తిగా స్వామ్యవాద పక్ష మవలంబించి శక్తికొలది పనిచేయ నిశ్చయించుకొనెను. బ్రాడ్లాతోడి స్నేహమున కీమార్పు భంగము కలిగించలేదు, గాని, అతని

కామె విచక్షణశక్తిమీద పూర్వపు నమ్మకము పోయి మునుపటివలె నతడు తన యభిప్రాయములను గుఱించి యామె సలహా నడుగుట మానుకొనెను.

తరువాత 'అవర్ కార్నర్' పత్రికలో వరుసగా 'రాజకీయాధికారము తిరిగిపంచుట','సంఘ పరిణామము','అభినవ స్వామ్యవాదము' అను వ్యాసముల వ్రాసి ఆమె యభిప్రాయములను స్పష్టపరచెను. ఆమెవాదమున కంతకును ఆదర్శము "ప్రతివానికి తగినంతపని, తగినంత విరామము, తగినంత సంతోషము ఇయ్యవలెను; ఎవ్వనికిని అతి తక్కువగాని అత్యధికముగాని యుండరాదు. ఇది స్వామ్యవాదుల ఆదర్శము. దానిని పొందుటకు బొత్తిగా యత్నముచేయక యూరకొనుటకంటె, తగినయత్నముచేసి యోడిపోవుటమేలు".

ప్రజలకును భద్రజాతులకును యుద్ధము జరుగవలసిన సమయమున ప్రజలలో పరస్పరవైరము లుండరాదని, వారిలో నైకమత్యమేర్పడి అందరుకలసి తమ సామాన్యవైరి నెదుర్కొనవలెనని చెప్పి,'రాడికల్ ఇండివిడ్యుయలిస్టు'పార్టీని తీవ్రముగ నామె విమర్శించెను. పేదవారి కష్టములను, వారికి భాగ్యవంతులకు ప్రభుత్వముచూపు ఆదరణలో భేదములను, పేదల నుద్ధరించుట కుపాయములను భాగ్యవంతుల చెవులలో వేయుట కామె పాటుపడజొచ్చెను.

స్వామ్యవాదుల పక్షమున పనిచేయు సంస్థలలో 'ఫేబియన్ సొసైటి' లక్ష్యములు ఆమెకు నచ్చినందున దానిలో నామె ప్రవేశించెను. సిడ్నీ వెబ్, జార్జి బెర్నార్డు షా, హ్యుబర్టు మొదలగు ప్రసిద్ధ పురుషు లా సంఘములో నుండిరి.

వారు క్రమముగా రాడికల్ పార్టీ వారిని తమపక్షమునకు మరల్చుకొనిరి. పార్లమెంటు సభ్యత్వమునకు పోటీచేయు వారికి, మ్యునిసిపాలిటీలలో సభ్యులుగా చేరదలచినవారికి ప్రశ్నలను బంపి వారికి యుద్యమముపట్ల శ్రద్ధపుట్టించుచు, ప్రజలలో తమ హక్కులనుగురించి ప్రబోధము కలిగించుచు వచ్చిరి. దానితో వారికి ప్రతికూలాందోళనము బైలుదేరి, పోలీసులు సామ్యవాదులను బహిరంగోపన్యాసములిచ్చిన బంధింపజొచ్చిరి. పోలీసు లిట్టి చర్య నారంభించిన తరువాత బెసెంటుసతి యొక నాడొక బహిరంగోపన్యాసము నిచ్చెను. కాని, అప్పటికే ప్రజలలో ఆందోళన బయలుదేరుటచేత ఆమెను బంధించలేదు.

ఆసంవత్సరమే హెర్బర్టు బరోస్ సామ్యవాదుల పక్షమున స్కూలు బోర్డుకు సభ్యుడుగా నిలిచెను. అతనికి వ్యతిరేకముగ మతాధికారులు, ధర్మగుణోతులు, ప్రస్తుత సాంఘిక పరిస్థితుల పక్షమువారు అందరు కలిసి పనిచేసినను అతడు గెలిచెను. అత డప్పుడు చేసినప్రచారము 1888 సం. లో బెసెంటుసతి ఆసంస్థలో సభ్యత్వమునకు పోటీ చేసినప్పుడు గెలుచుటకు పనికివచ్చెను.

1885 సం. శరదృతువులో పేదలపక్షమున కోర్టులలో వాదించుటకు న్యాయవాదుల నేర్పర్చుటకు, అవుసరము వచ్చినపుడు వారికి జామీనుకుదుర్చుటకు ఒక యుద్యమమును బయలుదేర్చి మొట్టమొదట లయన్సు అను నొకనిని శిక్షించి నపుడు బెసెంటుసతి జామీనునిలిచి వానిని విడిపించి, వాని పక్షము అపీలుచేయించి, అపీలులో శిక్ష రద్దుచేయించెను.

ఇటువంటి దిక్కులేని యెందరు నిర్భాగ్యులు చెరసాలలలో మగ్గిరో ఎవరెరుగుదురు?

బెసెంటుసతిస్వామ్యవాదమును ఖండించుచు నొక విమర్శకుడు "బెసెంటుసతి, చాలమంది స్త్రీలవలె, ఆర్థిక విషయములను గుఱించి తనకడపటి పురుషస్నేహితుని యభిప్రాయములను బట్టి మార్చుకొనునని వింటిని" అని వ్రాసెను. ఆరోజులలో నిటువంటి విమర్శలకు జవాబుచెప్పక తనపని చేసికోవలెనన్న సంగతి నామె యెరుగదు. నిందాస్తుతులకు లక్ష్యముచేయక, ఇతరుల యభిప్రాయముల నాత్మనిగ్రహముతో పరికించవలెననిగాని, "ద్వేషము ప్రేమచే నశించును గాని ద్వేషముచే నశించ"దను బుద్ధుని వాక్యమును గాని యామె యెరుగదు. అందుచేత ఆవిమర్శన కొక జవాబును వ్రాసెను. తరువాత అది యవివేకపు వ్రాతయని తెలిసికొనెను.

1886 సం॥ లో వర్తకము మందగించినదన్న నెపమున కూలీలకూలి తగ్గించుట, పనిలోనుండి తప్పించుట దేశమంతటను వ్యాపించెను. దానితో కూలీలలో దారిద్ర్యము ఉపవాసములు అధికమై 'కష్టపడి పనిచేయుచు తిండిలేక మాడుటకు బదులు పనిచేయకయే మాడుదు' మనజొచ్చిరి. వారు ఓరిమితో కష్టము లనుభవించుట, కావలసినది యెంతఅధికముగ నున్నను, అడుగునది స్వల్పము, పొందున దంతకంటెను స్వల్పము నైనను, దొరికినదానికి సంతసించుట, ఎంతకొంచెమైన నుపకారము చేసినవారియెడల కృతజ్ఞత, వారిని ప్రేమించి నిరర్థకముగనైన వారికి సేవజేయుటకూ వినవారి

యెడల విశ్వాసము మొదలగు సుగుణములుగల ఆ యమాయకుల పాట్లు చూచి ఆమె హృదయము కరిగిపోయెను. ఆమె సంఘమర్యాద నిదివఱకే విడిచిపెట్టెను, ఇప్పుడు సుఖమును, సదుపాయములను, కాలమును కూడ త్యాగము జేయదలచెను. ఒక్కొక్క త్యాగకృత్యముతో నామెకు జాలి, కరుణ బలపడుచుండెను. ఒక్కొక్క త్యాగకృత్యము ఆమెనదివఱకెరుగని దివ్యత్యాగమార్గద్వారమునకు దగ్గరగ జేర్చుచుండెను. మానవుని కొఱకు సమస్తమును పరిత్యజించుటకు, ప్రేమకొఱకు ప్రతిఫలము గోరకుండ సేవచేసి యంధకారమును తరించి తమ దేహాత్మలను వ్రేల్చి లోకమునకు జ్యోతిని వెలిగించుటకు, సిద్ధముగ నున్నవారు నడుచుదివ్యమార్గద్వారము నీత్యాగకృత్యములచే నామె సమీపించుచుండెను.

1887 సం. లో సామ్యవాదులు పనులలోనుంచి తప్పించబడి నిరుద్యోగులై తిరుగుచున్న కాలములో వారికి తిండి పెట్టించుటకు వీలైనంతవఱకు కూలిపని యిప్పించుటకు చర్చి అధికార్లను, స్థానికపాలకసంఘములను ప్రోత్సాహము చేయుచుండిరి. చేరింగ్ క్రాస్ పార్లమెంటును స్థాపించి దానిలో ననేకచట్టములను తయారుచేసిరి. వానిలోని తీవ్రభావము లనేక విమర్శలకు గురియయ్యెను. నేషనల్ రిఫార్మర్ కు సహాయ సంపాదకత్వ పదవిని బెసెంటుసతి యీ సంవత్సరములో విడిచిపెట్టెను. అందుకు కారణములు: 1. పత్రిక సంపాదకు లిద్దరి అభిప్రాయములలో భేదములున్నందున నెవరి యభిప్రాయము పత్రికాభిప్రాయమో స్పష్టమగుట లేదనియు నేకమంది వ్రాయుట, 2. బెసెంటుసతి సామ్యవాది యయినందున, తన యభిప్రాయ

ములకు బ్రాడ్లా అంగీకరించనందున, ఈ యభిప్రాయ భేదము-లకు కారణము తానేయగుటచేత తానే తప్పుకొనుటయు క్షేమము. ఈకారణములచే సంపాదకత్వ బాధ్యతను తప్పించుకొనినను ఆపత్రికలో నామె వ్యాసములను ప్రకటించుచుండెను. బ్రాడ్లా ఆమె త్యాగమునకు మెచ్చుకొనెను. నిజముగ నిది యామెకు గొప్పత్యాగమే. ఎందుచేతననగా, పదమూడేండ్లక్రిందట లోకాపవాదుకోర్చి సంపాదించిన సహకారము, పదమూడు సంవత్సరములు నిరంతరాభివృద్ధి నొందినమైత్రి యొక్కసారి త్రెంపుకొనుట యెంతకష్టమో అనుభవించినవారికిగాని తెలియదు. బెసెంటుసతి ఆ పత్రిక సంపాదకీయపదవినుండి తొలగుటకింకొక కారణముకూడ నుండెను, గాని; దాని నతనికి తెలియనిచ్చిన నత డామె నాపదవిని విడువనీయడని చెప్పలేదు. అప్పటికి బ్రాడ్లాకు రాజకీయవ్యాపారములలో పలుకుబడి చాలా యెక్కువైనది. అదివఱకు అతనికి బ్రతిపక్షులుగనుండిన లిబరల్ పార్టీవా రిప్పుడతని పక్షమగుచున్నారు, కాని, బెసెంటుసతి యతని యభివృద్ధి కాటంకమగుచుండెనని వా రందరు నభిప్రాయపడుచుండిరి. ఆ యాటంకము తొలగించి యతనిమార్గము నిరాటంకముచేయుట కామె క్రమముగ నతనితో సహకారమునువదలి దూరమగుటకు నిశ్చయించెను. "గాలి యెటువీచిన నటు తిరుగు స్నేహితు లతని కెక్కువైనకొలది నేను తప్పుకొనుచు, నతని నెక్కువగ సేవింపదొడగితిని; నేను ప్రక్కకు నిలిచినప్పటికంటె నెక్కువగ నే నెన్నడును అతనిని ప్రేమించి యుండలేదు. నావ్రాతపని నెప్పటివలె చేసికొనుచుంటిని." అభిప్రాయభేదముల వలన నాయం దతని దయ తగ్గలేదు. కాని,

తరువాత కొన్నాళ్లకు నేను దివ్యజ్ఞాన సమాజములో చేరి నపుడు నావివేకమును, విచక్షణశక్తిని ఆతడు సంశయించెను."

నిరుద్యోగులలో సంచలన మెక్కువయై 1887 సం. అక్టోబరు నెలలో వీధులవెంట నూరేగింపులు, పోలీసులు వానిని చెదరగొట్టుట, దానిచే జనులు మరింత రెచ్చిపోవుట పెరిగిపోయెను. తుదకు నవంబరు 12 తే దిని జనులందరు నగరమున వివిధభాగములనుండి యూరేగింపులతో వచ్చి ట్రిఫాల్గర్ స్క్వేరులో కలుసుకొని సభ చేయుట కేర్పరిచిరి. ఆవేళ పోలీసులు సైన్యములలో వివిధబలములు వచ్చి నిర్దాక్షిణ్యముగ జనులను కొట్టి, గుఱ్ఱముల చే త్రొక్కించి, బంధించి, బీభత్సము చేసిరి. అనేకమంది చనిపోయిరి, వేలకొలది గాయములు తగిలి బాధపడిరి, అంగవిహీనులైరి. అనేకవేలమందిని బంధించి కోర్టుయెదుట విచారణకు పెట్టిరి. బెసెంటుసతి యామె నమ్మిన యనుచరుల ననేకులను పోగుచేసి వారందరికి జామీనులిప్పించి విడిచిపెట్టించెను. లాయరును పెట్టి వారికి శిక్షలులేకుండ తప్పించెను. ట్రిఫాల్గర్ స్క్వేరు వధల సమయమున బెసెంటుసతి యొక యూరేగింపునకు నాయకురాలుగనుండి రంగమధ్యమున నిలిచి ప్రజలను హెచ్చరించుచు, తుదకు సైనికులు తుపాకుల నుపయోగింప సిద్ధమైనపుడు జనుల నిండ్లకు పొమ్మనగా వారు శాంతముగ వెడలిపోయిరి. ప్రజల శాంతిసమరముతో క్రమముగ పోలీసులు విసుగు జెందిరి; ఉన్నతపోలీసు అధికారి తన పదవినివిడిచి వెడలిపోవ అతనికిబదులు అంతకంటె వివేకి, నేర్పరి యగు మరియొకడు వచ్చెను.

# గాలివాన చల్లారి శాంతి చేకూరినది

ఈ గందరగోళమంతయు నిట్లు జరుగుచుండగా దానిలో నుండి క్రమముగా నొక క్రొత్తకిరణము వెలువడెను. ఈ సిద్ధాంతము లన్నిటికంటె పరమైన సిద్ధాంత మేదో లోక కల్యాణము సమకూర్చునదొకటి యుండవలెనని, దానిని తెలిసి కొనవలెనని ఆమె మనస్సులో జిజ్ఞాస యధికమయ్యెను. మతములతోను అభిప్రాయములతోను సంబంధము లేకుండ మానవ సేవ జేయవలయునని యామెకు తోచెను. విలియం స్టెడ్ (రివ్యూ ఆఫ్ రివ్యూస్ అను పత్రిక సంపాదకుడు)తో ఆలోచించి వారిద్దరు నొక వారపత్రికను 'లింక్' అనుపేరుతో స్థాపించిరి. దానిలో దరిద్రులయొక్క దౌర్భాగ్యులయొక్క కష్టములను వెల్లడించసాగిరి. మానవసేవ దానియాదర్శము, భూఖామందులు పెట్టు బాధలనుండి రైతులను తప్పించుట, పేదల కొంటకుపెట్టిన పరిశ్రమశాలలలో జరుగు నన్యాయములను వెల్లడించుట మొదలగుపనులు చేయుట కేర్పాట్లు చేసిరి. ఒక్కొక్క ప్రాంతములోను పిల్లలయెడలజరుగు హింస, బలవంతముచేసి ధనము పుచ్చుకొనుట, పరిశ్రమాలయములలో ననారోగ్యపరిస్థితులు, కష్టపెట్టి పనిచేయించుట, మొదలగు నక్రమములను కనిపెట్టి బెసెంటుసతి కెరిగించుట కన్నిప్రాంతములలోను 'విజిలెన్సు' దళములు స్థాపించిరి. ఈపనిలో వారికి హెర్బర్టు బర్రోస్ అనునతడు సహాకారిగ జేరెను. అతని త్యాగముకు ధర్మబుద్ధిని అతను మరణావస్థలోనుండిన

సమయములో చెప్పిన "నేను జనుల నెల్ల వేళల నెంతో ప్రేమించు చున్నానని చెప్పుము" అనుమాటలో విశదమగును.

నౌకా నిర్మాణాలయములలోని పనివాండ్ర పక్షము కూలి హెచ్చించుటకు, బడిపిల్లల పక్షమున వారికి కడుపునిండ తిండిపెట్టుటకు ఆందోళన నారంభించిరి. దుస్తులు, అగ్గిపుల్లలు మొదలగు వస్తువులను తక్కువ కూలిచ్చి తయారుచేయించి యెక్కువ లాభములుపొందు వర్తకులపై దాడి సాగించిరి. అన్యాయపుకూలి ఇయ్యని వర్తకులవద్దనే సామగ్రి కొనెదమని ప్రతిజ్ఞలుచేయువారి సంఘమొకటి బయలుదేర్చిరి. అగ్గిపుల్లలు అమ్ము బ్రయంటు అండ్ మే కంపెనీవారి 5 పౌనుల వాటా 18¾ పౌనులకు అమ్ముచుండిరట, అనగా వాటాదార్లకు విశేషలాభము వచ్చుచుండెను. ఇది విని భోగట్టాలుచేసి అగ్గిపుల్లలుచేయు ఆడకూలీల నుద్ధరింపబూనిరి. ఒకనాడా కూలివాండ్రందరు బెసెంటుసతి కార్యాలయమునకు పోయి వారిలో ముగ్గురు స్త్రీలామెను దర్శించి "అమ్మా, మీరు మమ్ములగురించి వ్రాసినమాట లబద్ధములని మాకు చాల ప్రశస్తమయిన ఆదరణ జరుగుచున్నదని వ్రాసి యిమ్మనిరి, మేము నిరాకరించి మీరు చెప్పినట్లు చేయవచ్చినా"మని చెప్పిరి. మరునాడు వారి నాయకురాలి నేదో మిష మీద పనిలోనుండి తొలగించిరి. దానితో 1400 మంది పని మాని బెసెంటుసతిమొద్దకు వచ్చిరి. వెంటనే ఆమెయు బర్రోస్‌యును కనిపూని వారము రోజులలో దేశమంతయు రెచ్చగొట్టిరి. గొప్పగొప్ప పార్లమెంటు సభ్యులందరు వారి పక్షము చేరిరి. తుదకంతకొద్దికాలములో మధ్యవర్తి తీర్మా

సము ప్రకారము తగవు న్యాయముగా పరిష్కారమై, కూలి వాండ్రందరు పనిలో జేరిరి. ఆ పని చేయుకూలీ లోకసంఘముగా జేరిరి. దానికి చాలకాలము బెసెంటుసతి కార్యదర్శిగ నుండెను. ఈ విధముగ ననేక విధముల పరిశ్రమలలో పని వాండ్రకు సహాయము చేయుటతో 1889 సంవత్సరము ప్రవేశించి బెసెంటుసతి 'నిజగృహ'ము జేరుసమయము వచ్చెను.

సర్వమానవసోదరత్వము నాదర్శముగ బెట్టుకొని పని చేయుటకు కారణము గోచరించుటలేదు. స్వామ్యవాదము ఆర్థికముగ నిరుపమమైనదేగాని సోదరత్వమున కందులో కారణ మగుపించుటలేదు. స్వార్థరహితులు, సేవకోత్సుకు మానవసేవచేయువారు దొరుకుటలేదు. "ఉత్కృష్ట సాంఘిక నియతి నిర్మాణమునకు పరికరము లేవి? మానవాలయమును గట్టుటకు మలచిన శిలలేవి?"

అంతేగాక, ఆమె నమ్మిన తత్వసిద్ధాంతములో లోపము లగుపించుచున్నవి. మనశ్శాస్త్రపరిశోధనలవల్ల మానవ చైతన్యము పలువిధ చైతన్యముల మిశ్రమముగ నగుపించెను; మెదడు ప్రజ్ఞ లేకయున్న సమయమున మనస్సు పనిచేయు చున్నట్లు స్పష్టమయ్యెను. ఈ ప్రకార మామెకు సమాధానము దొరకని క్రొత్తక్రొత్త విషయములు కనిపెట్టుచుండిరి. చైతన్య విశేషములను గుఱించి, స్వప్నములు, భ్రాంతులు, భ్రమలు, పిచ్చిమొదలగు విషయములన్ని గుఱించి అనేకగ్రంథము లామె చదివెను. తుదకు ఎ. పి. సిన్నెట్ వ్రాసిన 'ది అకల్టు వరల్డు' అను పుస్తకము అంధకారములో వెలుతురు కిరణమువలె ఆమెకు దొరికెను. దానిలో ప్రకృతి

కతీతమైన తత్వ మేదియు లేదు. ఆమె యూహించనంత విశాలమైన ధర్మబద్ధమగు ప్రకృతని గుఱించి బోధించు లేఖ లున్నవి. ఈచదువునకుతోడు ఆమె ప్రేతావేశపరిశోధనలను కూడ జేయనారంభించి, అక్కడ సంభవించు ఆవేశములను నమ్మెనుగాని, అందుకు చెప్పబడిన కారణములను నమ్మజాలక పోయెను. సూక్ష్మదృష్టి, సూక్ష్మశ్రవణము, మనస్సులోని తలంపులను తెలిసికొనుట మొదలగునవన్ని యథార్థములని కనిపెట్టెను. బాహ్యజీవితమునందలి యొడుదొడుకులలో నీ ప్రశ్నలన్నియు నామె మనస్సులో పనిచేయుచు, వానికి సమాధానములు దొరకకయుండెను. అనేక పుస్తకములు చదివినను ఫలములేదు; వానిలో చెప్పిన యనేక పరిశోధనలు చేయగా విచిత్రముగ దోచిన ఫలితములు గలిగెను. తుదకామె కేదో యొక రహస్యశక్తి యున్నదని గట్టి యనుమానము పుట్టి, అది యేమో కనుగొనువఱకు నెడదెగక యత్నించుటకు తీర్మానించుకొనెను. 1889 సంవత్సర వసంతారంభమునాటి కా తీర్మానము ఎన్నికష్టములైనను పడి యా రహస్యమును సాధించుటకు ప్రతిజ్ఞగా మారెను. ఒకనాడు అలవాటు ప్రకార మామె సూర్యాస్తమయమైనతరువాత గాఢచింతనములో మునిగియుండగా, ఈతరువాత నామె పృథ్వియందతి పవిత్ర ధ్వనియైన యొక ధ్వనిలో "వెలుగు సమీపముననే యున్నది, ధైర్యము వీడవద్దు" అనుమాటలు వినబడెను. తరువాత, రెండువారములలో హెచ్. పి. బ్లవాట్స్కీ వ్రాసిన 'సీక్రెట్ డాక్ట్రిన్', రెండుసంపుటములు 'స్టెడ్' ఆమె చేతికిచ్చి "వీనిని నీవు విమర్శించగలవా? నాకు తెలిసిన యువకులందరు పూను

కొనుటకు జంకినారు. నీకీవిషయములనిన పిచ్చిగనుక నీవేమైన సాధించగలవేమో" అనెను.

"ఇంటి కాబరువు మోసికొనిపోయి, చదువుటకు కూర్చుంటిని. ఒక్కొక్కపత్రమును త్రిప్పినకొలదియు దానియందభిరుచి వృద్ధికాజొచ్చెను. ఆహా! విషయ మెంత పరిచయముగ గనిపించెను! నాహృదయము పర్యవసానములను ముందుగ నూహింపనగుచుండెను, అంతయు సహజముగను, సందర్భముగను, యుక్తియుక్తముగను, సుబోధకముగను కనిపించెను. విడివిడిగనున్న సంగతులన్నియు నొక గొప్ప పూర్ణములోని భాగములని కనపరిచిన వెలుగునకు నాకన్నులు మిరుమిట్లు గొనెను. నాచిక్కులు, కఠినప్రశ్నలు, సమస్యలు, సంశయములు అన్ని విడిపోయిన ట్లగుపించెను. ఇది కొంతవఱకు మాయ, ఎందుచేతననగా, అంతర్బుద్ధి శీఘ్రము గ సత్యమని గ్రహించిన యొక్కొక్క విషయమును తరువాత విప్పి, క్రమముగ మెదడు జీర్ణము చేసికొనవలసియుండెను. కాని, వెలుతురగుపించినది, ఆ యాకస్మికజ్ఞానప్రకాశములో నాయన్వేషణ మంతమైనదని, కేవల సత్యము దొరికెనని తెలిసికొంటిని" అని యామె వ్రాసెను.

ఆ గ్రంథముపై విమర్శవ్రాసియిచ్చి తనను బ్లవాట్స్కీ కెరుకపఱుచుమని 'స్టెడ్'ను కోరి, తాను సందర్శించుట కామె యనుమతిని బొంది ఆమె బర్రోస్‌తోగూడ బ్లవాట్స్కీని చూడబోయెను. వారామె యున్న గదిలోని కేగగానే ఆమె "నా ప్రియమైన బెసెంటుసతీ, నిన్నెన్ని నాళ్లనుండియో చూడవలెననుకొనుచున్నాను" అని మధురము నాకర్షణీయమునగు స్వర



హెలెనా పెట్రోవ్నా బ్లావట్స్కీ

దివ్యజ్ఞానసమాజ స్థాపకులు ఇద్దరిలో నొకరు.

మున వారికి స్వాగత మొసగి చేయిచ్చెను. "ఆమె బిగిపిడికిలిలో నా చేతినుంచి, యీ జన్మములో తొలిసారి 'హెచ్. పి. బి.' కండ్లలోనికి చూచుచు నిలుచుంటిని. ఆకస్మికముగ నాహృదయ మొక గంతువేసినట్లెరుగుదును—పూర్వపరిచితురాలి నానవాలు పట్టుటయా యది?-, కాని వెంటనే తీవ్రమగు తిరుగుబాటు, ఒక వనమృగము దానిని నిరోధించు పట్టులోనుండి విడిపించుకొనునట్లు విడిపించుకొనుట" జరిగి బెసెంటుసతి కూర్చొనెను. బ్లవాట్స్కి కన్నులు దించి, వ్రేళ్లతో నెడతెగకుండ సిగరెట్లు చుట్టుచు, అనేక సామాన్య విషయములను గురించి మాట్లాడెను, గాని, ఆత్మవిద్యనుగురించియొక్క మాటనైన పలుకలేదు. కొంతసేపటికి బెసెంటుసతి, బరోస్ సెలవు పుచ్చుకొని వెడలుటకు లేవగానే ఆమె కన్నులెత్తి తీవ్రదృష్టితో బెసెంటుసతివైపు చూచి, అపేక్షతో, చలించు కంఠముతో "ప్రియమైన బెసెంటుసతీ! నీవు మాలో చేరిన నెంతబాగుండును." అనెను. బెసెంటుసతికి "ఆకంఠస్వరము, కండ్లచూపు వంగి ఆమెను ముద్దుపెట్టుకోవలెనని బుద్ధిపుట్టించెను," కాని, "చిరకాలమునుంచియున్న ఒకరికిలొంగనీయని గర్వము పైకుబికి, నాపొరపాటుకు లోలోన నవ్వుకొని, సెలవుపుచ్చుకొనుచు మర్యాదకొఱకేదోయొక మాటనాడి" మరలెను. ఆతరువాత చాలకాలమున కొకనాడు బ్లవాట్స్కి బెసెంటుసతితో "బిడ్డా, నీగర్వము బహుతీవ్రము, లూసిఫర్ కున్నంతగర్వమున్నదిసుమా నీకు" అనెను. కాని, బెసెంటుసతి యాతొలి సందర్శనదినమున దక్క మరెన్నడును తనగర్వము నామెయెదుట నగుపడనీయలేదు.

బెసెంటుసతికి తిరిగిహృదయములో తుపాను చెలరేగెను. ఆమెకు దివ్యజ్ఞాన సమాజములో చేరవలెనని బుద్ధిపుట్టెను. ఆమె స్కూలుబోర్డులో నుండి చేసినపనివల్ల ప్రజల కామె యందుండిన ప్రీతికూల్యము చల్లారి యామెత్రోవ నిరాటంకమైయుండెను. దానిని విడిచి తిరిగి యాకొ్రత్త్రోవద్రాక్షిజనుల మెగతాళికి పాలగుటయా? ఇదివఱకు భౌతికవాదియై, యదితప్పనియిప్పుడుదానిని నిరాకరించుటయా?ఇంతకాలము తనయం దెంతో సమ్మతిము గౌరవము ఉంచి,తన ననేకవిధముల కాపాడి పైకితెచ్చిన బ్రాడ్లా యేమనుకొనును? అతనిముఖము చూడగలదా? తన ననుసరించి యిన్నియేండ్లు ధైర్యముగా తనకు సహాకారులై పోరాడినవారందరిని విడనాడుటయా? ఈ తుపాను బహుతీవ్రముగ వీచెను, కాని, అనేక యుద్ధములు చేసి గాయములుతిని గట్టిపడిన యామె హృదయమునందు మునుపటివలె వేదనలేదు. తుదకొకనాడు మనస్సు నిశ్చయము చేసికొని యామె బ్లవాట్స్కీ యొద్ద కేగి సమాజములో జేర్చుకొనుమని కోరెను. బ్లవాట్స్కీ యామెపై వాకత్షణము తీక్ష్ణముగజూచి, (Psychic Research Society) సైకిక్‌రీసెర్చిసొసైటి (=పారలౌకిక పరిశోధన సంఘము)వారి నివేదిక చదివితివా? యని యడిగెను. బెసెంటుసతి లేదన ఆమె "నీవుపోయి దానిని చదువుము, చదివినతరువాత నీవు మరల వచ్చినచో-సరి" అని ప్రసంగము మార్చివేసెను. బెసెంటు ఆనివేదికను సంపాదించి, చదివి, యందలి యభిప్రాయముల కాధారములేదని గ్రహించి, అందలి యసందర్భపు వ్రాతలకు నవ్వుకొని, దాని నావల పారవేసి, మరునాడు థియసాఫికల్ పబ్లిషింగ్ కంపెనీ

కార్యాలయమున కేగి అక్కడ పనిచేయుచున్న కౌంటెస్ వీట్ మీస్టర్ (వీట్ మీస్టర్ ప్రభ్వి)చేతికి తన సభ్యత్వపు దరఖాస్తు నిచ్చెను. ఆమెను సమాజములో జేర్చుకొన్నట్లు పట్టా వచ్చినవెంటనే, 'హెచ్. పి. బి.'ని చూడబోయెను. ఆమెను చూచినంతనే వంగి యామెను ముద్దుపెట్టుకొని మాట లాడక నిలిచెను.

బ్లవాట్స్కీ:— సమాజములో చేరితివా?

బెసెంటు:— ఔను.

బ్ల:— నివేదిక చదివితివా?

బె:— చదివితిని.

బ్ల:— మరేమి?

బెసెంటుసతి యామె యెదుట మోకరించి యామె చేతులుపట్టుకొని యామె కండ్లలోనికి చూచుచు, "నన్ను మీ శిష్యురాలుగ స్వీకరించి, మీరు నా గురువు అని లోకములో ప్రకటించుకొను గౌరవము నా కిచ్చెదరా?" యనెను.

ఆ మాటతో బ్లవాట్స్కీ గంభీరవదనము మెత్తబడి, కన్నులు బాష్పపూరితములై, మహారాణికివికంటె గొప్ప ఠీవితో తనచేతి నామె శిరముపైనుంచి "నీ వౌదార్యవంతురాలవు, పరమగురువు నిన్నాశీర్వదించుగాక" యని యాశీర్వదించెను. ఇది 1889 సం. మే 10 తే దిని జరిగెను. అది మొదలు బెసెంటుసతి యవతారము చాలించినవఱకు ఆమెకు బ్లవాట్స్కీయందు విశ్వాసము లవలేశమైన చలించ లేదు. యోగసంప్రదాయములో ద్వారము తెరచి త్రోవ జూపిన గురువునెడల నుండు కృతజ్ఞత, అనన్య భక్తి, విశ్వా

సము ఆమెకు బ్లవాట్స్కీ యెడల నుండెను. 19.వ శతాబ్దపు ఆంగ్లేయు లది మహాద్భ్యమని వెక్కిరించిరి. అగుగాక. ఆమె సత్యమును చూచినది. వా రేమనిన నేమి?

బెసెంటుసతి యుత్సాహముచే తొందరపడి దివ్యజ్ఞాన సమాజములో చేరెనని లోకు లాక్షేపించిరి. సభ్యురాలుగ జేరుట యట్లే జరిగెను, కాని, యా యుత్సాహము చిన్న నాటనుండియు క్రమ క్రమముగ జరిగిన వికాస ఫలితముగాని తాత్కాలికోద్రేకము కాదు. మొదట ఆమె సభ్యత్వమువల్ల నాశించిన ఫలముకంటె నెక్కువ గొప్ప ఫలము ఆమెకు లభించెను. త్వరలోనే ఆమెకు అనేక విధములగు స్వానుభవముచే "దివ్యజ్ఞాన తత్త్వముల" యథార్థత బుజువైనది. ఆమెవలె సత్యముకొఱకు సర్వపరిత్యాగము చేసినవా రందరకు ఆమె ప్రవేశించిన మార్గము దొరుకును.

'నేషనల్ రిఫార్మర్' లోకూడ "సీక్రెట్ డాక్ట్రిన్" పయి నామె వ్రాసిన విమర్శ ప్రచురించిరి. దానితోనే ఆమె దివ్యజ్ఞాన సమాజములో చేరిన సంగతియు ప్రకటించిరి. దానిపైన తుపానువలె విమర్శలు బయలుదేరెను. ఆమెకు దివ్యజ్ఞాన మనగా నేమో చెప్పుమని యనేకజాబులు వచ్చెను. బ్రాడ్లాకు బోధపడినంతవఱకు థియాసఫీ అనగా నేమో ఆపత్రికలో వ్రాసెను, కాని, అత డెంత నిగ్రహముతో వ్రాసినను అది నాస్తికవాది దృష్టితో వ్రాసినదియు, రచయిత అనంగీకారమును వెలిబుచ్చునదియునై యుండెను. 'ఫుట్' అను నత డింతకంటె తీవ్రముగా ఖండించెను. బెసెంటుసతి ఆవిమర్శలకు

జవాబుగా సమాజోద్దేశములను, ఆదర్శములను సంగ్రహముగ వ్రాసి సభ్యుల అభిప్రాయ స్వాతంత్ర్యమును తెలియజేసెను.

ఆసంవత్సరము జూలైలో బెసెంటుసతియు, బర్రోస్ యు పారిస్ నగరమున జరిగిన లేబరుసభకు వెళ్ళి, అక్కడనుండి ఫాంటెనబ్లోలోనున్న బ్లవాట్స్కీయొద్ద రెండుదినము లుండిరి. ఆరెండుదినములలో బ్లవాట్స్కీ The Voice of the Silence (ది వోయిస్ ఆఫ్ ది సైలెన్సు=అంతర్వాణి)యను దివ్యకావ్యమును రచియించెను. అది The Book of Golden Precepts (ది బుక్ ఆఫ్ గోల్డెన్ ప్రిసెప్ట్సు) అను ప్రాచీన గ్రంథములోని శ్లోకములకాంగ్లానువాదము. ఆనాడే బెసెంటుసతికి బ్లవాట్స్కీ ప్రేతావేశ ప్రదర్శనములలో వినబడు 'టకటక' ధ్వను లెట్లు వచ్చునో చూపించెను.

ఆగస్టు 4, 11 తేదీలను ఆమె 'నే నెందుకు దివ్యజ్ఞానినైతిని' అను విషయమునుగూర్చి యుపన్యసించెను. అ ఆమెతో కలిసి పనిచేసి, యిప్పుడామెను ఖండించుచున్న నా కులకు సమాధానముచెప్పుట కా యుపన్యాసము లుద్దేశింపబడెను. అవి తరువాత సంగ్రహముగా పుస్తకరూపమున వెలువడి విస్తారముగ ప్రచురింపబడెను. ఆ యుపన్యాస మీ క్రింది వాక్యములతో ముగిసెను:-

"స్వతంత్ర మతవాదులకు థియాసఫీయెడల ప్రతికూలాభిప్రాయము గలిగించునట్టి, శత్రువులు వెక్కిరించుటకు తేలికగా దొరుకునట్టి యొక విషయము వారి మనస్సులలోని పొరపాటులకు కారణమై యున్నది. అది మన భూమండలముపై నున్న మనుష్యులు మృగములు గాక ఇతర ప్రాణులున్నట్లు

రూఢిగా జెప్పుట. అట్టిమాట చెప్పినంతనే వెనుదిరిగిపోవు వారు కొంచెము నిలిచి, యీ బ్రహ్మాండమంతటిలో సహారా యెడారిలోని యిసుక రేణువువలెనున్న యీయల్పగోళ మొక్క దానిలోనే ప్రాణులున్నట్లు నిజముగా నమ్ముచున్నామా యని ప్రశ్నించుకొనుట మంచిది. మన కంఠధ్వనులు తప్ప మరెక్కడను ఏధ్వనులులేక బ్రహ్మాండము మూగదై యున్నదా? మన కంటిదృష్టిలేకున్న బ్రహ్మాండ మంధమై యున్నదా? మన ప్రాణములేకున్న బ్రహ్మాండము మృతమైయున్నదా? ఇట్టి విపరీతపు నమ్మకము మన ప్రపంచము బ్రహ్మాండమున కంతకు కేంద్రమని, సృష్టి కటాక్షించి ప్రాణములు విడిచినది మన మానవజాతికొఱకు మాత్రమేయని క్రైస్తవమతము నమ్మిన రోజులలో తగిన నమ్మకమే; కాని, యిప్పుడు మనము మనసరియైన స్థితినెఱిగి, అసంఖ్యాకములగు ప్రపంచములలో మనదొకటని తెలిసిన తరువాత మనదే సజీవసృష్టియని భావించు విపరీత గర్వము నకు హేతు వెక్కడున్నది? భూమి, జలము, గాలి ఇవన్నియు ఆయా పరిసరములకు అనుకూలించు ప్రాణులతో నిండియున్నవి. మనభూగోళమున ప్రాణము నిండి పైకి పొరలు చున్నది. కాని, మనము మన వాతావరణమును దాటి పైకేగి నట్లు మనస్సులో నూహించిన తత్క్షణము ఈపరిస్థితు లన్నిటిని మార్చివేయవలెను. ఇటువంటి యూహాలకు సవుబుగాని సాదృశ్యముగాని యేమైన నున్నదా? మన ప్రపంచములోనే గాక యితరప్రపంచములలో గూడ ప్రాణులున్నవని బోధింప సాహసించుట బ్రూనోపై నారోపించిన నేరములలో నొకటి;

కాని, యాతని కాల్చిన సన్యాసులకంటె నతడే యెక్కువ బుద్ధిమంతుడు. (పృథివ్యాది) ప్రకృతి విభాగము లన్నిటిలో నొక్కొక్కదానికి అనుకూలమైన ప్రాణులు దానిలో నున్న వని, బ్రహ్మాండ మంతయు ప్రాణముతో స్పందించుచున్నదని మాత్రము దివ్యజ్ఞానులు చెప్పుచున్నారు. మూర్ఖులు ఇది మూఢనమ్మకమందురు. మానవదృష్టి కగుపించని సూక్ష్మ క్రిము లున్నవని నమ్ముటకంటె నిది గొప్ప మూఢనమ్మకము గాదు. 'స్పిరిట్' అను మాట తప్పుటర్థము నిచ్చుచున్నది; ఆమాటలో ప్రకృతిరాహిత్యము, ప్రకృతి కతీతమైన యొక యునికి స్ఫురించును; దివ్యజ్ఞాని యీ రెండింటిని నమ్మడు. సమస్త ప్రాణులు ప్రకృతి నాధారము చేసికొని దానిలోను దానిద్వారాను వర్తించునని 'ప్రకృతి' 'పురుషుడు' విడిగా నుండవని దివ్యజ్ఞాని యభిప్రాయము. కాని, యతడు ప్రకృతి నేటి భౌతికశాస్త్రమునకు తెలిసిన స్థితులలోనేగాక ఇతర స్థితులలో గూడ నున్నదనును. దీనిని నిరాకరించుట వెనుకటి కొక హిందూదేశపు సంస్థానాధిపతి తా నెన్నడు నీరు గట్టిగా నుండుట చూడలేదు గనుక మంచున్నదని యొప్పుకొన ననుట యెంత తెలివితక్కువయో అంత తెలివితక్కువ. నిదర్శనము, ఋజువు, దొరుకువరకు నమ్మననుట సవుబు; కాని, మన పరిమిత అనుభవమునకు పైన దేనిని నమ్మమనుట అసందర్భము.

"నా 'నాస్తిక' (సెక్యులర్ సొసైటి) మిత్రుల కొక తుదిమాట. మాసంఘమును విడిచిపొమ్ము అని మీరందు రేని విడిచిపోయెదను. నే నేపక్షములోను బలవంతము చేసి

యుండను; నే నుండుట వారి కే క్షణమునం దనిష్టమగునో ఆ క్షణముననే పైకి పోయెదను.*నా యాశ లన్నిటిని తీర్చు ననుకొన్న అనాత్మవాదము ఆశాభంగ మొనర్చినదని యొప్పుకొనుటవల్లను ఆ యొప్పుకొనుటచే నాయత్యంత సన్నిహిత మిత్రుల యసమ్మతిని పైన వేసికొనుటవల్లను నాకు కలిగిన బాధ నేను భరించజాలినంతకంటె నెక్కువగా నున్నది. కాని, నాజన్మమునం దితర సందర్భములలోవలె నీసందర్భములోగూడ అసృతమాడి హృదయశాంతిని గొనజాలను. నామాట లితరుల కిష్టముగ నున్నను అనిష్టముగనున్నను, నాకు మెప్పుతెచ్చినను నిందదెచ్చినను, సత్యమునే పలుకుమని యనివార్యమగు నావశ్యకత యొకటి నన్ను బలవంత పెట్టును. ఏమిత్రులు నన్ను విడనాడినను, ఏ బాంధవ్యములు భగ్నమైనను సత్యదేవతయెడల విశ్వాసమునకు మాత్రము నేను కళంకము రానీయరాదు. ఆదేవత నన్నడవిలోకి దీసికొని పోయినను నే నామెవెంటనే పోవలెను, ఆమె నాప్రేమనంతను ఒలిచివేసినను నే నామెనే వెంబడించవలెను, ఆమె నన్ను చంపినను ఆమెనే నమ్మెదను. నాగోరీ మీద,

'ఆమె సత్యము ననుసరింప యత్నించెను.'

అను స్మారక వాక్యము కంటె వేరేమియు వ్రాయగోరను".

ఇది యిట్లుండ, బెసెంటు సతి మొదలగువారు నడుపుబడికి ధనసహాయ మెక్కడ నుండియో వచ్చి ఆ సంస్థ చక్కగా జరుగుచుండెను; స్వామ్యవాదవ్యవస్థ, పారిశ్రామి

*ఇది 1889 సం. లో చెప్పినమాట. తరువాత 1890 సం. లో బెసెంటుసతి యా సంఘమునుండి తొలిగిపోయెను.

కోద్యమము యథాప్రకారము జరుగుచుండెను. క్రొత్తపరిశ్రమ లలో పనివాండ్రందరిని చేర్చి వారివారి కష్టములు తొలిగింప యత్నించుచున్నారు. ఆపనులన్నియు చేయుచు బెసెంటుసతి తీరిక దొరికినప్పుడు, అనగా రైలువచ్చువరకు కనిపెట్టుకొనియున్నపుడు, రైలులోను, ట్రాంబండ్లలోను, బస్సులలోనుప్రయాణముచేయు చున్నపుడు పుస్తకములు చదువుకొనుచుండెను, రాత్రి చేయ వలసినపని మానుకొని హెచ్. పి. బి. యుపన్యాసములు వినుటకు బోవుచుండెను.

ఆసంవత్సరము సెప్టెంబరు తే 5 దిని క. ఆల్కాటు బెసెంటుసతిని చూచి వెంటనే యామె గొప్ప జ్ఞానియని గ్రహించెను. ఆమె "జ్ఞాపకశక్తి" గుఱించి యిచ్చిన యుపన్యా సము నాతడు విని యాదిమొదలు ఆ మహావక్త యుపన్యాస ములు వినకుండ నుండగూడదని యామె యుపన్యాసము లన్నిటికిని బోయి శ్రద్ధగా వినుచుండెను సెక్యులరు సొసైటి పక్షమున ఆ సంఘమువారియొద్ద సెలవుపుచ్చుకొనుచు నిచ్చిన పైనుదహరించిన వాక్యములు చెప్పిన కడపటి యుప న్యాసమును ఆల్కాటు వినెను.

ఆ సంవత్సరము అక్టోబరులో బ్రాడ్లా కకస్మాత్తుగా జబ్బుచేసి బ్రతుకడనుకొనిరి, గాని, నాలుగు వారముల తరు వాత క్రమముగా రోగము మల్లి యారోగ్యముజెంది,సముద్ర యానముచేయుమని వైద్యుడు సలహాచెప్పుటచేత ఇండియాకు వెళ్లి జాతీయమహాసభ (కాంగ్రెస్)లో బాల్గొనెను.

1888 సం. లో స్కూలుబోర్డుకు జరిగిన యెన్నికల సమయమున స్టెడ్ఫీగారిమ పురోహితుడగు హాస్కెన్సు అను

సతము బెసెంటుసతి వ్రాయని యేదో పుస్తకములోని వాక్యములను తీసి అవి యామె యభిప్రాయములని ప్రకటించెను. దానిపై నామె మానసష్టపరిహారమునకు వ్యాజ్యము వేసెను. ఆవ్యాజ్యములో 1889 నవంబరులో ఆమె స్వయముగ వాదించెను. ఎదిరిపక్షమునసున్న న్యాయవాదియు న్యాయధికారియు గూడ మొదటినుంచియు నామెకు వ్యతిరేకముగ నుండిరి. ఆమె సాక్ష్యము చెప్పునపు డెట్లయిన నామెకు కోపము తెప్పించి తప్పుసాక్ష్యము చెప్పించజూచిరి కాని యామె లొంగలేదు. న్యాయాధికారి జూరీ కిచ్చిన యాదేశములో ఆప్రచారణము మానసష్టము కాదని ఆమెకు వ్యతిరేకముగ తీర్పు చెప్పు మనెను. జూరీ అందరు ఆ ప్రచారము మానసష్టమని యొప్పుకొని యితరకారణములమీాద ఆమెకు పరిహారమీాయ నంగీకరించలేదు. తుదకు తీర్పు వ్యతిరేకమైనను తనపై నారోపితమైనది యపవాదు అని ఋజువైనందున నామె పైచర్య చేయలేదు.

1890 సం. ఆరంభములో బ్లావట్స్కీకి ఎవరో 1000 పౌనులిచ్చి దాని నామెయిష్టప్రకారము, వీలైనచో స్త్రీల కొఱకు, విని యోగించుమని అధికారమిచ్చిరి. తూర్పులండన్‌లో కూలిస్త్రీల కొరకొక క్లబ్బును పెట్టదలచి యొకయిల్లు తీసికొని దానిని బాగుచేయించి ఆగస్టు తే 15 ది నందులో క్లబ్బు నారంభించిరి. అది ఆప్రాంతపు స్త్రీలకు చాలకాలము అనుకొన్న ప్రకార ముపయోగించెను.

ఆసంవత్సరము వేసంగిలో దివ్యజ్ఞాన సమాజము బ్లవాట్స్కీ లాడ్జి భవనము ఏవెన్యూరోడ్డు న 19 రు యింటికి

మార్చిరి. అక్కడకు బ్లవాట్స్కీని చాలా కాలమునుండి సేవించుచున్న కీట్లీదంపతులు, ధనమును పదవిని వదులుకొని యామె సేవకు వచ్చిన వాట్ మిాస్టర్ వ్రిభ్వి, యోగశాస్త్రములో శ్రద్ధగల ఇసాబెల్ కూపర్-ఓక్లే, గొప్ప పండితుడు అలసటనెరుగని పనివాడునగు మిాడ్, మొదలగువారందరు చేరిరి. బెసెంటుసతియు వారును ఆరంభమునందా భవనములో కాపురముండి పనిజేసినవారు. ఆయింట నిర్ణీతకాలము తప్పకుండ పనులు జరుగవలెనని బ్లవాట్స్కీ ఆజ్ఞ. అందరు ఉదయము గ 8 లకు భోజనముచేసి మధ్యాహ్నము 1 గంటవఱకు పనిచేయవలెను. 1 గంటకు మఱల భోజనములుచేసి సాయంత్రము 7 గంటలవరకు పనిచేయవలెను. అప్పుడు భోజనములు చేసి అందరు నొకచోట జేరి, ముందుకార్యక్రమము నిర్ణయించుటయో, చిక్కుసమస్యలను చర్చించుటయో, బ్లవాట్స్కీగారి యుపన్యాసము వినుటయో 12 గంటలవఱకు చేయుచుండిరి. 12 గంటలకు దీపము లార్పివేయవలెను. బెసెంటుసతి మాత్రము పగలు తన యితర వ్యాపకములమిాద చాలాకాలముపైని గడపవలసివచ్చుచుండెను. బ్లవాట్స్కీ తన శరీరము రోగముతో బాధపడుచున్నను లక్ష్యముచేయక అలసట విశ్రాంతినెరుగక నిరంతరము వ్రాయుచునే యుండెను. ఆమె తన శిష్యులతో వారివారి స్వభావములను బట్టి మసలుచుండెను.

ఆసంవత్సరముననే బెసెంటుసతి సిన్నెటుగారి యింటి వద్ద సి. డబ్లియు. లెడ్బీటరును మొట్టమొదట కలుసుకొనెను.

వారిస్నేహము ఏరీతిగా వర్థిల్లెనో తరువాత తెలియజేయబడును.

1891 సం. వసంతములో ఛార్లెస్ బ్రాడ్లాయును మే నెలలో బ్లవాట్స్కీయును స్థూలదేహములను విడిచి స్వర్గతులైరి.

ఈపరిహారము బెసెంటుసతికి హృదయకల్లోలము చల్లారి నిత్యమగు నాత్మశాంతి చేకూరెను. అదిమొదలు ఎన్ని యిబ్బందులు, ఎన్ని బాధ్యతలు, ఎన్ని యాఘాతములు సంభవించినను వానిని నిశ్చలముగ భరించుటయు, వానివల్ల నా శాంతి యెక్కువగుటయు సంభవించెను. ఆమెకు సంశయము పోయి నిశ్చయము కుదిరెను. అత్రుత భయము పోయి బలమైన నిర్భయత్వము చేకూడెను. "బ్రతికియున్నపుడు, మరణానంతరము తిరిగి పుట్టువరకు నేను మహీపీఠమునకును, ఎవరి శిరస్సులపై పరమగురువుదివ్యహస్త మాశీర్వాదపూర్వకముగ నొక్కక్షణ ముంచబడినంత మాత్రమున నిత్యశాంతియొక్క తేజస్సుతో ప్రకాశించు నేత్రములతో దప్ప యితరవిధముగ లోకమును జూడజాలరో వారికిని నేను సేవకురాలను మాత్రమే".



# దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వము

1891 సం॥లో మేడం బ్లవాట్స్కీ చనిపోయినంతవఱకు బెసెంటుసతి ఆమె యంతరంగ శిష్యులలో ప్రథమురాలై, యామె చేసిన పరీక్షలన్నిటికి నిలిచి యామె మన్నన లందెను. బ్లవాట్స్కీ తన శిష్యులను వేర్వేరు విధముల బహుకఠినముగ పరీక్షించుచుండెను. ఉదాహరణ మొక విషయమును దీసికొందము: ఆమెకు బెసెంటుసతి స్వయముగ వంటచేసి పెట్టుచుండెను. ఆమె కే పదార్థములు ఎట్లువండిన రుచించునో కనుగొని ఆ పదార్థముల నెంతో శ్రద్ధతో తయారుచేసి పెట్టుచుండెను. ప్రతిదినము, బ్లవాట్స్కీ భోజనముపద్ద గూర్చొని వంట బాగులేదని సణుగుకొనుచుండెను. ఒకనాడు బెసెంటుసతి బహు శ్రద్ధగా వండి వడ్డించిన పదార్థములను నోటబెట్టెనో లేదో బ్లవాట్స్కీ తిట్టనారంభించి, తుదకు తనను విషముబెట్టి చంపునట్లున్నదని కూడ యనెను. ఆ మాటలు విని బెసెంటుసతి భరించలేకపోయి మంచముపై బడి యేడువదొడగెను. కొంతసేపటికి శాంతించి యది పరీక్షయని గ్రహించి తిరిగి బ్లవాట్స్కీయొద్దకు పోయి యామె ప్రశాంత చిత్తయై మాట్లాడుట గాంచి సంతుష్టురాలయ్యెను. గుప్త విద్యాభ్యాసకు లెవరెట్టి కష్టములు పడవలసియున్నను వానిని పడవలసిన రీతిగ పడిననేగాని పురోవృద్ధిగాంచరు. ఆ మార్గ మంతయు కష్టపరంపరలతో నిండినది. అందుచేత ముందుగా పరీక్షచేసి ఆ పరీక్షకు నిలిచినవారినే గాని యా మార్గమున ప్రవేశపెట్టరు. ఆ రహస్యము నెఱింగిన బెసెంటుసతివంటి బహుకొద్దిమందిమాత్ర మాపరీక్షలకు నిలిచెదరు.

ఆప్రకారము బెసెంటుసతిని పరీక్షించిన బ్లవాట్స్కీ దివ్యజ్ఞాన సమాజాంతరంగశాఖ కామెను 1891 సం॥లో కార్యదర్శిని జేసి, తన మరణానంతరము తన గుప్తవిద్యాధ్యాపకపదవి నామె కొప్పగించెను. బ్లవాట్స్కీ ధరించెడు నొక మణిఖచిత మగు నుంగర మామె కిచ్చెను. అది యిప్పుడు దివ్యజ్ఞానసమాజాధ్యక్షునిచే ధరింపబడుచున్నది. మఱియును 1891 సంవత్సరము కడపటి దినములలో జరిగిన (యూరప్‌లోని) సమాజ వార్షికోత్సవమునాటి కామె బ్లవాట్స్కీ-లాడ్జి అధ్యక్షురాలుగ నుండి ఆపదవిలో నాసభల కధ్యక్షుడుగ వచ్చిన కల్. ఆల్కాటు నకు గొప్ప స్వాగత మిచ్చెను.

ఆసంవత్సరములో ఆమె ఆరోగ్యమునకు భంగము గలుగనియెడలను, ఆమెకు అగు ప్రయాణపుఖర్చులే గాక ఆమె లండనులో సంపాదించి బ్లవాట్స్కీ-లాడ్జికొఱకు ఖర్చు పెట్టుచున్న సొమ్ము ఆమె యక్కడ లేనప్పుడు సంపాదింపబడదు గనుక ఆలాడ్జికి కావలసిన సొమ్ము లోపము రాకుండుటకై యాపైకమునుగూడ ఇచ్చినయెడలను ఇండియాకు వచ్చెదనని బెసెంటుసతి మాటయిచ్చెను. కాని, వైద్యు డామెను ప్రయాణము చేయవద్దని నిషేధించెను, ఆమెకు కావలసిన పయికము నెవ్వరు నియ్యలేదు. అందుచేత ఆమె ఇండియా కాయేడు వెళ్లలేకపోయెను. దానినిగుఱించి థియాసఫిస్టులో వ్రాయుచు నిట్లనెను, "ఇండియాయొక్క ముక్తి ఆమెమీదను అక్కడ నుండి పనిచేయువారిమీదను ఆధారపడియున్నది, గాని, నే నిచ్చు నుపన్యాసములవల్ల గలుగు తాత్కాలికోద్రేకము మీద గాదు. నాసోదరులారా! మీదేశమునకు మీరే




డాక్టరు ఆనీ బిసెంటు (1893)
దివ్యజ్ఞాన సమాజ స్థాపకురాలగు

బాధ్యులు. కొద్దికాలములో మీ యెదుటనుందునని యాశించుచున్నాను. నేను పుట్టుకచేచెందిన జాతికంటె నిండియాయును అందలిప్రజలును నాకు ఎక్కువ సన్నిహితులు; నేను నా హృదయాంతరంగమున మీలో నొకతెను; నాపూర్వచరిత్ర బట్టియు నేను మీదాననే. ఈ నాకడపటిజన్మమున పశ్చిమ దేశములలో కొంతపని చేయవలసియున్నందున నచట పుట్టితిని గాని తల్లియొద్ద నుండవలెనని పుత్రికకుండు నాశవల్ల యంతరంగ ప్రకృతి తూర్పువైపునకే మరలియున్నది. కర్మ ద్వారమును తెరచినప్పుడు నే నాద్వారము దాటెదను, అప్పుడు మనమీశరీరములో కలుసుకొందము. మానసికముగ నెప్పుడును కలుసుకొనుచునేయున్నాము".

1893 సం. సెప్టెంబరులో చికాగో నగరములో జరిగిన చరిత్ర ప్రఖ్యాతమైన మొదటి Parliament of Religions (పార్లమెంటు ఆఫ్ రెలిజియన్సు = సకలమతసమావేశము) కు దివ్యజ్ఞాన సమాజాధ్యక్షుని ప్రతినిధిగ సమాజోపాధ్యక్షుడైన 'జడ్జి'యును, సమాజము తరపున నాసభలో నుపన్యసించుటకు ప్రతినిధిగ బెసెంటుసతియును నియమింపబడిరి. ఆపార్లమెంటు మహాసభలో 3000 ప్రతినిధుల యెదుట నిచ్చిన యుపన్యాసములోనేగాక ప్రత్యేకముగజరిగిన సభలలోనిచ్చిన యుపన్యాసములలోగూడ బెసెంటుసతి తన వక్తృత్వముచే దివ్యజ్ఞానసమాజము గురించి గొప్ప సదభిప్రాయము గలిగించెను.

అక్కడనుండి బెసెంటుసతి వాట్ మీాస్టర్ ప్రభృతులతోగూడ ఇండియాకు పయనమై నవంబరు 9 తేదీని కొలంబోలో దిగెను.

కొలంబోలోను కేండీలోను ఉపన్యాసములిచ్చి యచటనుండి బయలుదేరి 1893 సం. నవంబరు 16 తేది ఉదయము 10 గం 24 ని లకు బెసెంటుసతి భారతభూమిపై నడుగిడెను. క.ఆల్కాటుగారు 'ఓల్డుడైరీలీవ్సు'లో "అప్పుడు గ్రహకూటము, జ్యోతిష్కుల లెక్కలనుబట్టి యెట్లున్నను, బహుశుభదాయకముగ నుండక తప్పదు. ఏలయన ఆమె ఇండియాలో చేసిన సంచారమంతయు విజయవంతముగ నుండెను" అని వ్రాసెను.

తుత్తికొరన్, బెంగుళూరు, బెజవాడ పట్టణములలో నుపన్యసించి డిసెంబరులో అడయారులో జరిగిన వార్షికసభలలో బెసెంటుసతి "The Building of the Cosmos" (విశ్వనిర్మాణము)గురించి నాలుగు ఉపన్యాసముల నిచ్చెను. ఆసభలలో "ప్రతినిధులు పటాలములవలె వచ్చిరి. ఇంటిలో గదులన్నియు నిండిపోయెను. ప్రతిదినము బెసెంటుసతి సంభాషణలను వినుటకు అనేకులు కూడుచుండిరి. ఆమె హిందువులవలె తివాసిమీద పద్మాసనమువేసి కూర్చొని ఎటువంటి కఠిన ప్రశ్నలకైనను అడిగినపాటున సుస్పష్టముగ సమాధానములిచ్చుచుండెను" అని క. ఆల్కాటు వ్రాసెను.

ఆతరుణమున నామె యీదేశములో చేసిన సంచారమునంతను వివరించుటకంటె, ఆమె యెక్కడకు వెళ్లినను జనులు తండోపతండములుగ కూడి ఆమెను దర్శించి, విని, ధన్యులమైతిమని సంతసించిరని చెప్పిన చాలును.

అడయారులో బైలుదేరి బెసెంటుసతి, క. ఆల్కాటు మొదలగువారు కలకత్తావెళ్లి అక్కడ జనవరి తే 11 దిని



డాక్టరు ఆనీ బిసెంటు

1895 మొ॥ 1907 వరకు కాశీయందలి స్వగృహమగు

5000 మంది శ్రోతలకు 'జనాంగములలో ఇండియాస్థానము' గుఱించి యుపన్యసించెను. ఆశ్రోతలలో నొకరు ఆలాకాటుతో తానామె యుపన్యసించినపుడు వెండిమువ్వల మధురధ్వని వింటినని ఆమెయొద్ద బయలుదేరి భవనమంతను నింపుచుండి నట్లుతోచిన యపూర్వపరిమెళముగల ధూపము వాసనజూచితి నని చెప్పెను; మఱియొకరు ఆమెచుట్టు నొక తేజస్సు ప్రకాశిం చెననెను; మూడవవాడు తాను ఆతేజస్సును జూచుటయే గాక,ఆకాంతిలో గెడ్డము, తలపాగాగలిగి రాజఠీవితో ప్రకా శించు నొక దివ్యమూర్తిని చూచితిననియు, ఆమూర్తి తేజో మండలము వక్త తేజోమండలముతో సమానముగ స్పందించుచు నొక్కొక్క స్పందమునకు ఆమె నరముల జాలమంతయు పులక రించుచుండెననియు చెప్పెను. అక్కడనుండి వారు కాశీ, ఆగ్రా, లాహూరు, బారిల్లీ, బొంబాయి వెళ్లి అక్కడనుంచి మార్చి 20 తేదిని బెసెంటుసతి యూరపునకేగెను. బారీల్లీ లో నామె 'మానవుడు, వానిగతి'యను విషయమున నిచ్చిన యుపన్యాసము 'వజ్రములలో కోహినూరు'అని క. ఆలాకాటు వర్ణించెను.

1894 సం. ఆగస్టు తే 26 దిని ఆమె ఆస్ట్రేలియాకు వెళ్లి అక్కడనుండి డిసెంబరు తే 22 దికి అడయారుచేరి, అక్కడ వార్షిక సభలలో బాల్గొనెను. బ్లవాట్స్కి చనిపోయిన తరువాత విల్లియం. క్యూ. జడ్జి ఆమె గుప్త విద్యాధ్యాపకత్వము తనకే యిచ్చెనని చెప్పసాగెను. వివాదలు చంపుటకు బెసెంటుసతి తాను పూర్వార్ధగోళము లోను, జడ్జి పశ్చిమార్ధగోళములోను అధ్యాపకులుగ నుండ

నేర్పర్చుకొనెను, కాని, జడ్జి కదియును సంతుష్టి కలిగించక అమెరికాలోని సమాజశాఖలను విడదీయ నారంభించెను. అందుచేత ఆతను సమాజమును విడిచిపెట్టమని చెప్పవలెనని సమాజ కార్యనిర్వాహక సభలో బెసెంటుసతి తీర్మానము పెట్టి యుపన్యసించెను. క. ఆల్కాటు వ్రాసినట్లు ఆ యుప న్యాసము కరుణతోనిండి, అసూయ లేశమైన లేక,ఒక యుమా యకుని నిష్కారణముగ దూషించినవానిపై సమాజముగ నుండు సత్యాగ్రహమైన గనిపించక యుండెను. 1895 ఏప్రిల్ లో జరిగిన ఐరోపియన్ వార్షిక సభలో జడ్జియును అతని యను చరులును అల్లరిచేసి సభవిడచిపోయిరి.

అప్పుడు బెసెంటుసతి లండనులో 'కర్మ'గురించియిచ్చిన యుపన్యాసములు 4 వ మేన్యుయల్ గా ప్రచురింపబడెను. ఆమె స్వయముగా సూక్ష్మలోకములలో జేసిన పరిశోధనల ఫలితము మొదటిసారి యీ పుస్తకములోనే ప్రకటింపబడెను. 1895 సం. అక్టోబరు, నవంబరు నెలలలో ఆమె యింగ్లండులోనే యుండి అక్కడ తనపైన, ఆల్కాటుపైన వచ్చిన నిందలకు జవాబులు చెప్పి డిసెంబరులో అడయారు వార్షికసభల వేళకు చేరెను. ఆసభలు ముగిసిన తరువాత ఇండియాలో సంచారము చేసి 1896 సం. ఏప్రిల్ తే 4 దిని ఇంగ్లండుకు పయినమై వెడ లెను. ఆ నెలలో నామె లండను క్వీన్సుహాలులో నారంభించి యిచ్చిన యుపన్యాసములు 'ది ఏన్షెన్టు విజ్డమ్' అను పేరున పుస్తకముగ ప్రచురింపబడెను.

ఈ ప్రకారమామె (1-2 సం. లలో తప్ప) ప్రతిసంవ త్సరము డిసెంబరులో ఇండియాలో జరుగు అంతర్జాతీయ

సమాజవారిక సభలకు వచ్చుచు అక్కడ కొన్నిదినములు సంచారముచేసి యుపన్యసించి పైఖండములకేగుచు నుండెను. 1897 సం. డిసెంబరులో ఆమె ఇండియాకు రాజాలక 1898 సం. మార్చిలో వచ్చి ఏప్రిల్ 3 తేదిని కాశీలో సెంట్రల్ హిందూ కాలేజి స్థాపింప యత్నమారంభించెను. 1899 సం. జనవరిలో సెంట్రల్ హిందూకాలేజి కమిటీ నేర్పాటుచేసి, 3 నెలలు బహుశ్రమపడి ఆకమిటీ శాఖల ననేకచోట్ల స్థాపించి, కాలేజిని వృద్ధిచేసి, ఎప్రిల్‌లో ఇంగ్లండు కేగెను. 1900 సం. మార్చిలో ఆమె కాశీలో 'శాంతికుంజ' లో మొదట ప్రవేశిం చెను. అదిమొదలామె కది వాసగృహముగ నుండెను.

1901 సం. లో ఆమె ఇండియాలోనే యుండి హిందూ మత పునరుద్ధరణమునకును విద్యావిధాన సంస్కారమునకును పాటుపడెను. హిందూమతముఁగుఱించి పిల్లలకు బోధపరుచుట కనువుగ చిన్న ప్రశ్నోత్తరమాలనొకదానిని వ్రాసెను, చిన్న తరగతుల విద్యార్థులకు పెద్దతరగతి విద్యార్థులకు పనికివచ్చు పాఠపుస్తకములు వ్రాసి ప్రచురించెను. ఈ కాలములోనే ఆమె రామాయణమును గుఱించి కాశీలో నిచ్చిన యుపన్యాసములు 'శ్రీ రామచంద్ర' యను పేరున ప్రచురింపబడెను.

హిందూదేశ పునర్నిర్మాణ కార్యమున పనిచేయుటకు యువతీ యువకుల నామె ప్రోగుచేయ నారంభించెను. క్రమముగా యీ బృందము విస్తరించి యనేకవిధముల దేశ సేవలో ప్రసిద్ధిజెందిరి. 1904 సం. జనవరిలో 'సెంట్రల్ హిందూ కాలేజి మేగజిన్' అను పత్రిక ఆరంభమయ్యెను.

అప్పటి కామెను సమాజ సభ్యులు చాలమంది యొక్క దివ్యస్త్రీ యని, ఆమె యభిప్రాయములు నిర్దుష్టములని నమ్మి జొచ్చి, ఆమె యభిప్రాయములకు వ్యతిరేకముగ మాట్లాడిన వారిని వెలివేయుదొడంగిరి; ఆసంగతి దెలిసి యామె ఫిబ్రవరి తే 17 దిని కాశీనుండి సభ్యుల కొకజాబు వ్రాసెను. దానిలో నామె తప్పులుచేయు సామాన్య మానవురాలనని, ఆమె కంతకంటె నెక్కువపదని నిచ్చుటవల్ల నభిప్రాయ స్వాతంత్ర్య మున కాటంకమై సమాజమంతయు నశించిపోవునని, తన యభిప్రాయము లందరివానివలె విమర్శకపాత్రములని, విమర్శించువారిని వెలివేయుట నిరంకుశత్వమని, ఇటువంటి భావములు ప్రబలినయెడల సమాజములో కక్షలు బైలుదేరు నని తీవ్రముగ వ్రాసెను.

1905 సం. లో నామె స్త్రీలను విశేషముగ దివ్యజ్ఞాన సమాజములో జేర్చుకొనెను. 1906 సం. లో వేల్సు యువరాజు యువరాణి (పంచమ జార్జిచక్రవర్తియు మేరీ రాణియు) ఇండియాకు వచ్చినపుడు వారిని సెంట్రల్ హిందు కాలేజికి బెసెంటుసతి ఆహ్వానించెను. సంయుక్తరాష్ట్రపు దొరతనమువారు వారి దర్శనమున కెన్నో యాటంకముల బెట్టజూచి నిగ్రహించలేక, తుదకు వారికి కాలేజివా రిచ్చు సన్మానపత్రమును మోటారు కారులోనే యుండి యందు కొనుట కేర్పాటుచేసిరి. గవర్నమెంటువారు కాలేజీ సరి హద్దులలో పోలీసులను పెట్టబోవ బెసెంటుసతి వారిని తన సరిహద్దులలోనికి రానీయనని అక్కడ యువరాజ దంపతుల క్షేమమునకు తాను బాధ్యురాలనని తన కాలేజి విద్యార్థులే

కాపురాయుదురని నిర్భయముగ జెప్పి, పోలీసులను పంపి వేసెను. ప్రభుత్వోద్యోగుల కిది మఱికొంత క్రోధహేతువై నను వారేమియు చేయజాలకపోయిరి. యువరాజ దంపతులను బెసెంటుసతి వారికారువద్ద కలుసుకొని యుక్తమర్యాదలతో సత్కరించి లోపలకు ఆహ్వానింప వారు వెంటనే కారుదిగి లోపల వారి సన్మానమున కేర్పరచిన మందిరములోని కేగి సన్మానమును పొందిరి. మరునాడు యువరాణి బెసెంటుసతికి కబురుచేసి తనబసలో నామెతో చాలాసేపు మాటలాడి పంపెను. బెసెంటుసతి యాదంపతుల సంతకములు చేసిన ఛాయాపటమును సప్తమ యెడ్వర్డు చక్రవర్తి ఛాయాపట మును ఇప్పించుమని కోరి వానిని కాలేజీహాలులో నుంచెను. ఈసందర్భమున నామె స్వభావములో నొక గొప్ప గుణమును దెలియజేయు నొకచిన్న సంగతి చెప్పవలెను. యువరాజ దంప తుల రక్షణకై కాలేజీకేడెట్ల (సైనికశిక్షణము పొందిన బాలుర)ను మార్గమున ఇరుప్రక్కల నిలువబెట్టిరి. ఆమె యువరాజ దంపతుల కారు వచ్చుటకుముందు అన్ని యేర్పా ట్లను స్వయముగ సరిచూచుకొనుచుండెను. ఆమె చేయదలచిన రొయొక యేర్పాటునకా 'కేడెట్ల'లో నొకచిన్న బాలు డడ్డము వచ్చెను. వాని నామె యక్కడనుంచి తొలగుము ప్రక్కకు జరుగుమనెను. ఆబాలుడు జంకుగొంకులేక తన దళనాయ కుని యాజ్ఞప్రకారము తా నచట నుంటిననియు, నతనియాజ్ఞ గాకుండ కదలననియు జవాబు చెప్పెను. వెంటనే బెసెంటు సతి తన తప్పు నొప్పుకొని, బాలుని క్షమాపణగోరి, దళ

నాయకునియొద్ద కేగి వాని (వాడును చిన్నపిల్లవాడే) ద్వారా తన పనిని నెరవేర్చుకొనెను.

1906 సం. ములో సమాజ చరిత్రలో కొన్ని విశేష సంఘటనలు జరిగెను. సి. డబ్లియు. లెడ్బీటరు సమాజములో ప్రసిద్ధి కెక్కిన సభ్యుడు, పరమగురువులు నమ్మినబంటు. అతడు లండనులో దనశిష్యుల కవినీతికరములగు బోధల జేయుచుండెననియు నతనిని సమాజమునుండి తొలిగించవలెననియు నొక యాందోళనము బయలుదేరెను. బెసెంటుసతి సమాజములో సభ్యుల కభిప్రాయస్వాతంత్ర్య ముండవలెనని వాదించుచుండెను. ఆమె లెడ్బీటరు బోధల నంగీకరించకున్నను అతని శీలము నిర్దుష్టమని యంగీకరించెను లెడ్బీటరు తనపై జరుగుచున్న తీవ్రాందోళనచే సమాజసభ్యత్వమునకు రాజీనామా నీయ, అధ్యక్షుడు దాని నంగీకరించెను. ఆకాలమున నమెరికాలో సంచారముచేసి యుపన్యాసము లిచ్చుచుండిన సి. జినరాజదాసా లెడ్బీటరు పక్షమున తీవ్రముగ వాదించెను. అధ్యక్షుడు ఆందోళనకు లొంగి యతనిని సభ్యత్వమునుండి తొలిగించెను తరువాత సమాజ కార్యనిర్వాహక సభ (జనరల్ కౌన్సిలు) వా రతనిని తొలగించుట పొరపాటని యంగీకరించి తిరిగి చేర్చుకొనిరి.

క. ఆల్కాటుకు రోగ మధికమగుచుండెను. 1906 సం. డిసెంబరులో అడయారులో జరిగిన వార్షికసభల నారంభించుటకును ముగించుటకును అతనిని మేడమీదనుండి క్రిందికి దింపి తీసికొనివచ్చిరి. అతని యనంతరము సమాజమున కెవరధ్యక్షుడు కావలెనని బెసెంటుసతి యోచింపసాగెను. తాను తన

కున్న సెంట్రల్ హిందూ కాలేజి వ్యాపకములతోను, భారతదేశోద్ధరణ కార్యములతోను అధ్యక్షపదవిని నిర్వహింప జాలననియును, ఏ. పి సిన్నెటుగాని, జి. యస్. మీడ్ గాని యాపదవి కంగీకరించరనియును, ఇక బెర్ట్రాం కీట్లీ యొక్కడే తగినవా డున్నాడనియును ఆమె నిశ్చయించెను.

1907 సం॥ ఆరంభములో దివ్యజ్ఞాన సమాజముతో నత్యంత సన్నిహిత సంబంధముగల మహాత్ము లిద్దరును ఆల్కాటును చూడవచ్చి. యతని తరువాత బెసెంటుసతియే యధ్యక్షురాలు కావలెనని వారు సెలవిచ్చిరని క. ఆల్కాటు ప్రకటించెను. సమాజనియమముల ప్రకార మధ్యక్షుడు తన తరువాత నెవరధ్యక్షుడు కావలెనో వారిని పేర్కొనవచ్చును, దానిని జనరల్ కౌన్సిలువా రామోదించవలెను. క. ఆల్కాటు చేసిన ప్రకటనలో తన తరువాత నధ్యక్షురాలుగ బెసెంటు సతిని 'పేర్కొనుచున్నాను' అని వ్రాయుటకుబదులు పొరపాటున 'నియమించుచున్నాను' అని వ్రాసెను; అది ఆత డధ్యక్షుడుగ వ్రాసినదియు గాదు. ఆత డధ్యక్షుడుగా నన్ని జాతీయ శాఖలకును వ్రాసిన జాబులో 'పేర్కొనుచున్నా' ననియే వ్రాసెను. బెసెంటుసతి లెడ్బీటరు పక్షమున వాదించుటచే నతని విరోధు లామొదటి ప్రకటనలోని పొరపాటును పుచ్చుకొని యామెకు వ్యతిరేక ప్రచారము చేయ నారంభించిరి. మఱియును, కొందరు పరమగురువుల పేరు చెప్పి యామెపక్షము వోటుచేయ నిర్బంధించుచున్నారని యాక్షేపణ చేయసాగిరి. క. ఆల్కాటు 1907 ఫిబ్రవరి 17 తేదిని చనిపోయెను. ఉపాధ్యక్షుడగు సిన్నెటు తాత్కా

లికముగ నధ్యక్షత వహించి యెన్నికలు జరిపెను. ఆ యెన్ని కలలో బెసెంటుసతి గెలిచి యధ్యక్షురా లయ్యెను.



## సమాజాధ్యక్షురాలు

బెసెంటుసతి సమాజమున కధ్యక్షురాలుగ నెన్ను కోబడినట్లు 1907 సం. జూలై 6 తేదిని ప్రకటింపబడెను. ఆమె బ్లవాట్స్కీసతియొక్క గురుదేవుని శిష్యురాలైనట్లు ప్రకటించుటకు వెనుదీయనని బ్లవాట్స్కీసతికి మాటయిచ్చెను. 'ఈసంబంధము తెగనీయకు'మని బ్లవాట్స్కీసతి యాదేశము. ఆసంబంధమువల్ల తనకు గలిగిన యవకాశములన్నిటిని సమాజమును వృద్ధిచేయుటకు బెసెంటుసతి వినియోగించెను. క. ఆల్కాటు అధ్యక్షుడుగ నున్నప్పుడు సమాజముయొక్క సర్వసమత్వమును నిలబెట్టుటకు పరమగురువులకు సమాజమునకుగల సంబంధము యొబుసునైన నెత్త నంగీకరించ లేదు. మఱియు 'నాయధికార పదవినిబట్టి నాకీ (కో-ఫ్రీమేసనరీ మొ॥) సంస్థలతో సంబంధముంచుకొనుట తగదు', గనుక, సభ్యులలో నెవరికే యభిప్రాయము లున్నను, వారిలో కొందరు చేరి ప్రత్యేకముగ నేవ్యవస్థనైన బెట్టుకొనినను, వారికి వీలైన యవకాశముల నిచ్చుచు, తానుమాత్రి మాసంస్థలలో జేరక నెడముగ నుండెడివాడు. కాని, బెసెంటుసతి యాపదవిని విడిచి, సమాజ నియమముల నుల్లంఘించకుండ, సమాజ సర్వసమత్వమునకు భంగములేకుండ, పరమగురువుల యునికి



డాక్టరు ఆనీ బిసెంటు
60 ఏళ్ల వయస్సున 1907 లో దివ్యజ్ఞాన సమాజమునకు
అధ్యక్షురాలుగా ఎన్నుకోబడెను.

గుఱించియు, వారికి తనకును వారికి సమాజమునకును గల సంబంధము గుఱించియు, వారియాజ్ఞల ననుసరించి తాను చేయు పనినంతను వారి కర్పణముగ వారిసంకల్పము నెరవేర్చుటకు చేయుచుంటిననియు వెల్లడించుటయే గాక, వ్యక్తిగతముగ తానితరసంస్థలలో జేరి వాని యభివృద్ధికి తోడ్పడుచుండెను. ఆసంస్థలను Subsidiary activities అని వానినిగుఱించి వారిక నివేదికలలో నుదహరించుచుండెను. బెసెంటుసతి అధ్యక్ష పదవిని స్వీకరించినది మొదలు తనకాలమును, ధనమును, సర్వశక్తులను సమాజాభివృద్ధికే వినియోగించెను. ఇతరసంస్థల నేర్పర్చినను, అవి సమాజాదర్శములకు తోడ్పడునవిగనే యుండెను, కాని, వానికి సమాజమునకు సంబంధము లేకుండ నుంచుచుండెను. ఆమె యేపని నారంభించినను దానిని సాధ్యమైనంత నిపుణతతో జేయుటయు, పనిచేయుటలో తీవ్రతయు నామెకు సహజలక్షణములు. ఆమె కాటంకములతో బనిలేదు. అంతపట్టుదలతో పనిచేసి 15 జాతీయశాఖలతో తనచేతికి వచ్చిన సమాజమునకు తన యంత్యకాలమున 47 జాతీయశాఖలుండునట్లు విస్తరింపజేసెను; ప్రపంచమందంతటను సమాజమునకు కీర్తి ఆదరణ ప్రబలెను.

ది. స. నియమముల ప్రకారము అధ్యక్షుని యేడేండ్లకొకసారి యెన్నుకోవలెను. జనరల్ కౌన్సిలువారామోదించినయభ్యర్థికి పోటీలేకపోయినను సభ్యులలో హెచ్చుమంది తమయంగీకారమును తెలియజేయవలెను. క. ఆల్కాటు యావజ్జీవము అధ్యక్షుడుగ నుండవలెనని మొదటనే తీర్మానింపబడెను. బెసెంటుసతినికూడ యావజ్జీవము అధ్యక్షురాలుగ

నుండుట కంగీకరించుమని కోరిరి, గాని, యామె యందు కంగీకరించలేదు. ఏడేండ్ల కొకసారి తమ కెవ రధ్యక్షుడుగ నుండవలెనో నిర్ణయించుకొను నధికారము సభ్యుల కుండవలె ననియును, యావజ్జీవము తా నధ్యక్షురాలుగ నుండుట కిష్టము తీర్మానించినయెడల తన చర్యలను విమర్శించుటకును, తన పరిపాలనయం దిష్టము లేనియెడల తనను తొలిగించుటకును సభ్యుల కవకాశ ముండదనియు, వారు తననే యెన్నిసార్లయిన నిష్టమున్న నెన్నుకొనవచ్చునుగాని, యిష్టము లేనియెడల మఱి యొకరి నెన్నుకొను నధికారము తీసివేయరాదనియు నామె యభిప్రాయము. 1914 సం. లో ఎన్నికలు జరిగి యామె యెన్నుకొనబడెను. 1921 సం. లో ఎన్నికలముం దామెకండ్లు జబ్బుచేసి దృష్టిపోవునని వైద్యులు చెప్పిరి. అందుచేత ఆమె ఆయేడు ఎన్నికకు నిలువదలచుకొనలేదు. కాని, తలవని తలంపుగ నామె కండ్లరోగము పోయి దృష్టి బలపడుట చేత, ఆమె తిరిగి యెన్నుకొనబడెను. 1928 సం. లో నాలుగవసారి యెన్నుకొనబడి తరువాత ఎన్నికల సమయము రాకముందే చనిపోయెను.



# అడయారు కార్యస్థానవృద్ధి

బెసెంటుసతి యధ్యక్షురాలు కాగానే యామె కాపు రము అడయారుకు మార్చివేసెను. ఆమె 1908సం ఫిబ్రవరిలో కాశీనుండి రాగానే అప్పటికి అడయారు కార్యస్థానమున కుండిన 27 యకరములతోటను కలిసి తూర్పున సముద్రతీరము వఱకు గల (81 యకరముల) నేల అమ్మకమునకు వచ్చెను. వెంటనే దాని నామె కొనదలచి కొందరు మిత్రులతో జెప్పగా, వారమురోజులలో రు 12,000 లుచితముగ పోగాయెను. తక్కిన ధనము తక్కువవడికి ఋణముచేసి రు 40,000 లకు అస్థలమును క్రయము పొంది ఆనెల 15 తే దిని స్వాధీనము చేసికొనెను మఱిరెండు సంవత్సరములలో తన స్వంతార్జిత ద్రవ్యముతో నాఋణమును తీర్చి ఆ స్తిని సమాజపరము చేసెను. 1910, 1911 సం. లలో ఆయా స్తి 253 యకరము లకు పెరిగెను.

అదివఱ కడయారు కార్యస్థానములో పనిచేయువారే గాని మరెవ్వరు నక్కడ కాపురముండుటకు వీలులేకుండెను. బెసెంటుసతి బ్రహ్మవిద్యాభ్యాసకులు విద్యార్థులు అక్కడ కొంతకాలముండుట కక్కడ వసతు లేర్పరచవలెనని నిశ్చ యించెను. ఆవరణ వృద్ధిచేయుటకు ప్రక్కభూములు కొను టకును, భవనములు కట్టుటకును ఆమెయడిగిన మాత్రమున సహాయము వచ్చుచుండెను. ధనమిచ్చినవా రిచ్చిరి. ఇండ్లు కట్టిం చినవారు కట్టించియిచ్చిరి. శ్రీ బోడిరెడ్డి రంగారెడ్డిగారు 'భోజనశాలను', ఎ. స్వార్జిగారు 'దామోదర్ గార్డెన్సు'ను, జె. ఆర్. ఆర్యగారు 'బెసెంటుగ్రోవు'ను చార్లెస్ హార్వే 'లెడ్బీ

టర్ చాంబర్సు'ను 'థియసాఫీకల్ పబ్లిషింగ్ హౌసు'ను కట్టించి యిచ్చిరి. 'క్వాడ్రాంగిల్సు' అనబడు భారతీయుల వసతి భవనములుకూడ నిట్లే కొందరు సభ్యుల సహాయమున కట్టించిరి. అక్కడ నెవరైన సభ్యులు కాపురముండుట కిల్లు కట్టుకొనదలచినయెడల, వారి యనంతర మాయిల్లు సమాజమునకు చెందు నిర్ణయముపైన స్థలము నిచ్చుచుండెను.

బెసెంటుసతి యడయారువాసులకు కావలసిన సదుపాయముల నన్నిటిని అక్కడనే యేర్పాటు చేయదలచి, బట్టలుతుకుట కొరక 'లాండ్రి' ని, పాలు పెరుగు 'సప్లయి' చేయుట కొరక 'డెయిరీ'ని, ఒక విద్యుజ్జనన యంత్రమును స్థాపించెను. అక్కడివారు తమ సొమ్మునుదాచుకొనుట కొరక 'బాంకు'ను గూడ బెట్టించెను, గాని యది కొద్దికాలమే పని చేసెను. అక్కడక్కడ నూతులు తీయించి త్రాగుటకు వాడుకలకు కావలసిన నీరు కొళాయిల ద్వారా 'సప్లయి' చేయించెను. గృహకృత్యములకు కావలసిన సామగ్రి సులభముగా దొరుకుటకొరక 'స్టోర్సు' పెట్టించెను. వ్యాయామమునకు 'టెన్నిస్ కోర్టులు' కట్టించెను. బాటలు వేయించి తోటలు వేయించి ఆవరణ యంతయు తపోవనమువలె తయారుచేయించెను. అధ్యక్షురాలి యనుమతి లేక యెవరు నక్కడ రెండు రోజులకంటె నెక్కువ కాలముండరాదు, ఉన్నవారే క్రొత్త వ్యవస్థను ఆరంభించరాదు; రాత్రి గం 9 లు మొదలు తెల్లవారి గం 4 ల వఱకు నిశ్శబ్దముగ నుండవలెను, దీపము లార్పి వేయవలెను; పగలైనను ధ్వనులేమియు చేయరాదు; పొగ త్రాగరాదు; కుక్కలు మొదలగు జంతువులను రానీయరాదు.

1909 సం. లో 'వసంత ప్రెస్' భవనమును తెరిచెను. సుప్రసిద్ధ వటవృక్షమును చక్కగా దిద్ది దానిక్రింద సభలు, ఉపన్యాసములు జరుపనారంభించెను. Theosophical Publishing House (దివ్యజ్ఞాన ప్రచురణాలయము) ను పెట్టి దానిని చాలా వృద్ధిచేసెను.

అడయారు కార్యస్థానమున సేవని జరిగినను అది లోకమున కాదర్శప్రాయముగ నుండవలెను. అది పరమపురుషుల వాసస్థానమనియు, వారి యాశ్రమమున నుండవలసిన శాంతి భద్రత లచట నుండవలెననియు, లోకపరిణామమున ముందు మెట్లక్కడనే చూపవలెననియు నామె యభిప్రాయము. పని చేయువారికి శ్రమతగ్గించి కాలవ్యయమును తగ్గించు క్రొత్త యుపాయముల నక్కడ ప్రవేశపెట్టుచుండెను.

థియాసఫిస్టు పత్రిక అధ్యక్షుని స్వంత అధ్వర్యమున నడుపబడు పత్రిక దానిని గురించి యామె మిక్కిలి జాగ్రత్త తీసుకొనుచుండెను. తనద్వారా సమాజసభ్యులకు పరమ పురుషుల తేజశ్శక్తులు ప్రసరించుట కదియే యుపాధి యని దాని పవిత్రతను కాపాడుచుండెను. ఆమెది. స. ప్రధాన కార్యస్థానావరణలో హిందూ, పార్శీ, బౌద్ధ, క్రైస్తవ, ఇస్లాం మతముల యాలయములను గట్టించెను. ఏయాలయములో పూజలు ప్రార్థనలు ఆ మతమువారే జరుపుదురుగాని, వాని యం దితరులు గూడ నిష్టమున్నచో బాల్గొనవచ్చును.

1925 సం॥ లో సమాజ సువర్ణోత్సవము అడయారు లో జరిగినపుడు సమాజ శాఖలుగల యొక్కొక్క దేశము

పేరున నొక్కొక్క 'ఓకు' చెట్టును ఒకబాట కిరువైపులను పాతించెను.



## లెడ్బీటరు

1906 సం. లో దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వమునకు రాజీనామా నిచ్చిన లెడ్బీటరుపైన వేయబడిన యపవాదు గురించి పునర్విమర్శ చేయవలెనని బెసెంటుసతి 'జనరల్ కౌన్సిలు'లో ప్రతిపాదించి ఆసభవారిచే నాతని యెడల నిందార్హమగు వర్తనములేదని సమాజములో తిరిగి చేర్చవలెనని తీర్మానము చేయించెను. వెంటనే, 1909 సం. ఫిబ్రవరిలో నతడు ఇండియాకు వచ్చి, అదిమొదలు అడయారులో బసచేసి, బెసెంటుసతితోను స్వయముగను అనేక సూక్ష్మలోకపరిశోధనల జేసెను. వానిఫలితముగ వారుభయులు 'ది అకల్టు కెమిస్ట్రీ' (గుప్తరసాయన శాస్త్రము), 'Man: Whence, How and Whithcer'(= 'మానవుడు : ఎక్కడనుండి, ఎట్లు, ఎక్కడకు', ' The Lives of Alcyone' (ఆల్కియోన్ జన్మములు) అను గ్రంథములు వ్రాసిరి

వీ రుభయులు గొప్ప ఆత్మవికాసమును బొందిన యోగులు. వారిస్వభావము, పనిచేయువిధానము ఒకటిగాకున్నను, వా రత్యంత సహకారముతో బనిజేసిరి. ఇద్దరును అనేకమంది యువకులను యువతులను మోక్షమార్గమున జేర్చి ధన్యులైరి. డా. అరండేలు, సి. జినరాజదాసా, శ్రీమతి

రుక్మిణీదేవి, జేమ్సుహెచ్. కజిన్సు, జిడ్డు కృష్ణమూర్తి వారిలో కొందరు.

ఆల్కాటు బ్లవాట్స్కీల తరువాత బెసెంటు లెడ్బీటరు కలిసియు వేర్వేరుగాను ది. స. ను చాలావృద్ధిలోకి దెచ్చి, దివ్యజ్ఞాన బోధలకు ఆదర్శములకు లోకమునందు గొప్ప పలుకుబడిని గొనితెచ్చిరి.



# జిడ్డు కృష్ణమూర్తి

1909 సం. లో బెసెంటుసతి విదేశములలో నున్నసమయమున నడయారులో లెడ్బీట రొకనాడు జిడ్డు కృష్ణమూర్తి యొక్క పూర్వ జన్మములను యోగదృష్టితో జూచెను.

జిడ్డు నారాయణయ్య యను నొక వైదిక బ్రాహ్మణుడు ప్రభుత్వోద్యోగమునుండి విరమించుకొని (అప్పటి కతని భార్య పోవుటను) పిల్లలను తీసికొనివచ్చి, సమాజములో సభ్యుడగుటచేత, అడయారులో కాపురముండెను. అతని పిల్లలలో కృష్ణమూర్తి, నిత్యానందము అనుబాలు రిద్దరు ఒకబడిలో చదువుకొనుచుండిరి. వారి పూర్వజన్మ వృత్తాంతములను చూడ లెడ్బీటరుకు వారు సేవకబృందములో ననేక జన్మములనుండియు జేరి నేడు మహీపీఠమున నధికారపీఠముల యందున్న పరమపురుషుల కమితసేవ చేసియుండిరనియు నీజన్మములో కృష్ణమూర్తి యొక మహాకార్యమున వారికి యుపకరింప నవకాశ మున్నదనియు గనిపెట్టి యాసంగతి

బెసెంటుసతి కెరిగించెను. ఆమెయు నాసంగతులనుకనిపెట్టి అడయారు వచ్చిన తరువాత, ఆబాలురిద్దరిని తన సంరక్షణలోకి దీసికొనుట కనుజ్ఞ నీయుమని నారాయణయ్యను కోరి, అతనిచే లిఖితపూర్వకమగు ననుజ్ఞ పత్రిమును పొంది, యీ బాలురను తన సంరక్షణలోనికి దీసికొని, వారివిద్యకు, పోషణకు, ఆత్మవికాసమునకు తగిన యేర్పాట్లు చేసెను. లెడ్బీటరు వారి యాధ్యాత్మిక విద్యాబోధకుడు. కొద్దికాలములోనే కృష్ణమూర్తిబుద్ధి యద్భుతముగ వికసించి, నేర్పిన విద్యలను సులభముగ నేర్చుచుండెను. అతనిని ప్రతిరాత్రియు శరీరము నిద్రిలోనున్నసమయమున లెడ్బీటరు సూక్ష్మదేహములో తన పరమగురువు ఆశ్రమమునకు గొనిపోవుచుండెను. అచట పరమ గురువు ఆబాలున కొక విషయమును వానికి సులభముగ బోధపడు శైలిలో ఇంగ్లీషులో బోధచేసి కడపట ఆచెప్పినదాని నంతను సంగ్రహముగ కొన్నివాక్యములలో జెప్పుచుండిరి. ఆవాక్యముల నాబాలు డుదయమున మేలుకొనిన వెంటనే జ్ఞాపకమునకు తెచ్చుకొని యొక కాగితముమీద వ్రాయు చుండెను. అదివరకే బెసెంటుసతి శ్రీ జగద్గురువులవారు త్వరలో నవతరించవచ్చునని యక్కడక్కడ సూచనల జేయు చుండిరి. 1908 సం. డిసెంబరు 31 తేదిని బహిరంగముగ స్పష్టముగ నాసంగతి నామె తెలియజేసెను. 1910 సం. డిసెంబరులో కృష్ణమూర్తి ప్రతియుదయమున వ్రాసిన కాగితముల నన్నిటినిచేర్చి, దాని నొక చిన్న పుస్తకరూపమున బ్రకటించిరి. దానికి బెసెంటుసతి 'At the Feet of the Master' (పరమగురు చరణసన్నిధి) అని పేరుపెట్టెను. 1911 సం. జనవరి 11 తేదీని

'The Order of the Rising Sun of India' (ఇండియాదేశపు ఉదయభానుని సంఘము) అనుపేరున జగద్గురు వవతరించునని ప్రపంచమున ప్రచారముచేసి యందుకు లోకమును సిద్ధపరచు నుద్దేశముతో నొక సంఘమును స్థాపించి దానికి కృష్ణమూర్తి నధ్యక్షునిగ జేసిరి. ఆసంఘమునకే ఆ సం. ఫిబ్రవరిలో 'The Order of the Star in the East' (ప్రాక్తార సంఘము; తారకసంఘము) అని పేరుపెట్టిరి.

జిడ్డు కృష్ణమూర్తి (యీజన్మములో నతని) శరీరమున శ్రీ జగద్గురువులవారు, వెనుక జీసను శరీరమునవలె, ఆవేశించి యీరూపమున నవతరించి లోకమునకు నూతన సందేశమిచ్చుట కవకాశమున్నదని బెసెంటుసతియు లెడ్బీటరును కనుగొనిరి. ఈ యవతారముగుఱించి, యెప్పుడవతారమువచ్చునో, యెట్లువచ్చునో, యేమిబోధించునో, మొదలగు వివరముల నెవ్వరు నిదమిత్థమని చెప్పజాలకుండినను, ప్రపంచపరిస్థితు లట్టి యవతారమునకు అవకాశమిచ్చుచున్నవనియు, ఏరూపమున వచ్చినను ఏమిబోధించినను ఆయవతారపురుషుని గుర్తించి ఆయన సహకారులగుటకు ఎంతమంది జనులు సిద్ధముగనున్న నంతమంచిదనియు నుద్దేశించి, ఆప్రకారము వారిని ఏరూపములో నున్నను గుర్తించి, వారు చేయు బోధలను నిష్పక్షపాతముగ పరిశీలించగలుగుటకు జనులను సిద్ధము చేయుటకు తారకసంఘమును పెట్టిరి. ది. స. నకు ఈ యభిప్రాయములతో సంబంధములేకుండ చేయుటకది వేరే స్థాపించబడెను. క్రమముగ కృష్ణమూర్తి శరీరము శ్రీ జగద్గురువులవా రుపయోగించు చిహ్నము లగుపడసాగెను. అతడును క్రమముగ

స్వతంత్రముగ నపూర్వవిధమున బోధింప నారంభించెను. ఆ బోధలలో కొన్ని ది. స. సభ్యుల యభిప్రాయములకు భిన్నములుగ నుండెను. డా. బెసెంటు అటువంటి విషయములలో నతని బోధలు తన కర్థమగుటలేదనియు ముందుముం దర్థమగునేమో చూచెదననియు ననుచుండెను, కాని, ది స. సభ్యులలో చీలికలు బయలుదేరి కొందరు సమాజమునుండి విడిపోయి కృష్ణమూర్తిగారి ననుసరించిరి. తుదకు కృష్ణమూర్తి ముక్తికి గురువులు, సంఘములు, సంస్థలు, శాస్త్రములు అన్నియు నాటంకములనియు, ఎవనిముక్తికి వాడే మార్గము చూచుకొని దాని ననుసరించి స్వశక్తిచే బోవలెననియు, ఒక వ్యక్తి కింకొక వ్యక్తి- ఎంత గొప్పవాడైనను - ప్రమాణము కాడనియు బోధించి, దివ్యజ్ఞాన సమాజమును విడిచి, తారక సంఘము నెత్తివేసెను. ఏది యెట్లున్నను బెసెంటుసతి కాతనిపై పుత్రప్రేమ తగ్గలేదు. కన్నకొడుకు ప్రయోజకుడైనపుడు తల్లి యెంత ఆనందించునో అంతకంటె వేయిరెట్లామె యతని వికాసమును జూచి యానందించుచుండెను. మహీపీఠము వారు తనకొప్పగించిన కార్యమును సంతుష్టికరముగ నెరవేర్చి ధన్యురాలనైతినని యామె పరమానందము నొందుచుండెను.



# వ్యాజ్యములు

కృష్ణమూర్తి వ్రాసిన పుస్తకమును ప్రకటించి, అతడు తారకసంఘాధ్యక్షుడు కాగానే యసురశక్తులు ("శ్రేయాంసి బహువిఘ్నాని" యన్నట్లు మంచిపని నారంభించిన వెంటనే విఘ్నములు ఆవిఘ్నములు సృష్టిలో బుట్టిన సురాసురశక్తులలో నసురశక్తుల ప్రభావముచే గలుగును.) విజృంభించసాగెను. తారకసంఘమును బెట్టి ది. స. సభ్యుల యభిప్రాయ స్వాతంత్ర్యమునకు భంగముకలిగించుచున్నదని కొందరు సభ్యులు బెసెంటుసతిపై నిందమోపసాగిరి. వెనుక 1906 సం లో లెడ్బీటరు ఇంగ్లండులో యువకులకు దుర్బోధల జేయుచుండెనని యాక్షేపించినవా "రిప్పుడతడు కృష్ణమూర్తి కట్టి బోధలజేసి పాడుచేయుచున్నాడని" నిందింపసాగిరి. తుదకు వారందరు నారాయణయ్యరు తన కొడుకులు బెసెంటుసతి సంరక్షణలోనుంచిన చెడిపోయెదరని నమ్మకము పుట్టించి యతనిచే వారి స్వాధీనముకొఱకు కామెపైన 1912 సం. లో వ్యాజ్యము వేయించిరి. ఆ వ్యాజ్యమునకు ముందే యామె యాబాలురను ఉన్నతవిద్యకొఱకు ఇంగ్లండు పంపివేసెను.

యథాప్రకారము హైకోర్టులో బెసెంటుసతి తనపక్షమున స్వయముగ వాదించెను. ఆ వాదమున నామెకు సహాయము చేసిన న్యాయశాస్త్రవేత్తలలో మెడ్రాస్ హైకోర్టు ప్రధాన న్యాయాధిపతిగనుండి, పనినుండి విరమించి విశ్రాంతిగొనుచుండినట్టి, ఋజుత్వమునకు, పాండిత్యమునకు, ధైర్యమునకు ప్రసిద్ధికెక్కినట్టి డా. సర్. యస్. సుబ్రహ్మణ్యఅయ్యరు

ప్రముఖుడు. న్యాయస్థానమున నామె వాదించినపుడు న్యాయాధిపతి యెడలను, ఎదిరిపక్షమున పనిచేయు న్యాయవాది యెడలను కనపరచిన గౌరవమర్యాదలకును, ఆమె వాదనా నైపుణ్యమునకును అందరు నాశ్చర్యపోయిరి. ఆవిషయమున నామెను న్యాయాధిపతి ప్రశంసించుచు తీర్పులో వ్రాసెను.

నారాయణయ్యయు నతని సాక్షులును చెప్పిన సాక్ష్యమంతయు నబద్ధమనియును పిల్లలకు తండ్రియొద్దనుండుట కంటె బెసెంటుసతి యొద్ద నుండుటయే యెక్కువ శ్రేయస్కరమనియు నంగీకరించుచు, తండ్రికి తనపిల్లలను స్వాధీనపరుచుకొనుటకు సర్వాధికారమున్నదని న్యాయాధిపతి తీర్పు చెప్పెను, కాని, అసత్యవాదము చేసెనని నారాయణయ్య నామెకైన ఖర్చుల నిచ్చుకొనుమనెనను. దానిపైన జరిగిన అపీలులో నాతీర్పును ఖాయముచేయుచు నారాయణయ్య ఖర్చులన్నిటి నామె నిచ్చుకొనుమని తీర్పుచెప్పిరి. దానిపై నామె ప్రివికౌన్సిల్‌లో అప్పీలు చేసె. అక్కడ బాలురిద్దరి పక్షమున నొకన్యాయవాది హాజరై వారి కామెయొద్ద నుండుటయే యిష్టమని తెలియజేసెను, అటువంటి వ్యాజ్యములలో బాలుర (ముఖ్యముగ మంచిచెడ్డలు తెలియగల యీడు వచ్చిన బాలుర) యిష్టానిష్టములను కనుగొనవలసి యుండెననియు, నావ్యాజ్యములో నది జరుగలేదనియు, అందుచేత క్రిందికోర్టుల తీర్పులు చెల్లవనియు బాలురు తమ యెదుట తమ తండ్రియొద్దకు వెళ్లుటకిష్టములేదని తెలియచేసినందున ఆతీర్పులను రద్దుచేయుచున్నామనియు ప్రివికౌన్సిలువారు తీర్పుచెప్పి; అన్నికోర్టులలోను ఆమెకైన ఖర్చులను నారాయ

ణయ్య కిచ్చుకోమనిరి. తనవాదము నెగ్గినందు కామె సంతుష్టురాలై, తనఖర్చులనేగాక, తాను మొదటి అపీలుతీర్పుప్రకారమతని కిచ్చిన ఖర్చులనుగూడ నారాయణయ్య యొద్దనుండి యూమె రాబట్టక వదిలివేసెను.

ఈవ్యాజ్యము నడుచుచున్న కాలమున మెడ్రాసులో దివ్యజ్ఞాన సమాజమునకు విరోధులైనవారు తిరిగి తలలెత్తి సమాజమును అధ్యక్షురాలినికూడ అసృతముల నారోపించి దూషింపదొడగిరి. సమాజప్రతిష్ఠను కాపాడుటకై యూమె యీ దుష్ప్రచారకులపైన పోలీసుకోర్టులో పరువునష్టమునకు వ్యాజ్యములు వేసెను, కాని, మేజస్ట్రేటు ఆ వ్యాజ్యముల నామెకు వ్యతిరేకముగ తీర్మానించెను.

ఈకోర్టు వ్యాజ్యములవల్ల దివ్యజ్ఞానసమాజమునకును బెసెంటుసతికిని కూడ, అవమానము అపకీర్తి వచ్చుటకు బదులు, గొప్పకీర్తి గౌరవములు కలిగి, సమాజము గుఱించి విస్తారమగు ప్రచారముజరిగి, అదివఱకెన్నడు చేరనంతమంది క్రొత్తసభ్యులందులోజేరిరి. నారాయణయ్యపక్షము పనిచేసిన వకీలు (సర్) సి. పి. రామస్వామి అయ్యరుగారికిని బెసెంటు సతికిని గాఢమగు మైత్రికుదిరి, ఆత డామెకు హోంరూలు ఉద్యమములోను కాంగ్రెసు ఉద్యమములోను విశేష సహాయము చేసెను.



# భారతదేశసేవ

బెసెంటుసతి భారతదేశమునకు జేసిన సేవ నొకానొక లక్ష్యమును బొందుట కొక నియతమగు నేర్పాటు ననుసరించి చేసెను. భారతీయ ప్రాచీన నాగరికత నిద్రించుచున్నదిగాని చావలేదని, అది తిరిగి మేల్కొని, భారతదేశము స్వతంత్రమై బ్రిటన్‌తో సమానముగ నొక సమ్మేళనమున జేరి, ప్రపంచమున కంతకు నాయకత్వము వహించుట పరమపురుషుల సంకల్పమని యది నెరవేర్చుటకై యామె యత్నించెను. మఱియును భారతదేశము స్వతంత్రమైనపుడు రాజ్యాంగము తన ప్రాచీన నాగరికత ననుసరించి భారతీయులు స్వయముగ నిర్ణయించుకొన్న ప్రణాళిక ప్రకారము జరుగవలెనుగాని, పాశ్చాత్యాదర్శములనుబట్టిగాని యితరులు నిర్ణయించినట్టిగాని ప్రణాళిక పనికిరావని యామె నిశ్చితాభిప్రాయము. మఱియును అదివఱకు ఆత్మగౌరవము గోల్పోయి భావదాస్యమునకు లోబడియుండిన భారతీయులు తమ యౌన్నత్యమును దెలిసికొని, తాముకూడ గౌరవనీయులమని తల యెత్తుకొని తిరిగిననేగాని వారికి స్వాతంత్ర్యమువల్ల ప్రయోజనములేదని ముందుగా ఆమె భారతీయులను మేల్కొల్పి వారికి తమ నిజస్వరూపము దెలియజేయ యత్నించెను. అందుచేత, ఆమె ఇండియాకు వచ్చిన వెంటనే సంస్కృతము నేర్చుకొని ప్రస్థానత్రయమును, యోగసాంఖ్యశాస్త్రములను, స్మృతులను ఇతిహాసములను చక్కగా చదివెను. అలహాబాదులో డిప్యూటీ మేజస్ట్రేటుగా నుండిన బాబు భగవాన్‌దాస్ అను గొప్ప పండితు డామెను 1894 సం॥ లో కలుసుకొని, వెంటనే తన యుద్యోగమును

వదులుకొని యామె కన్నివిధముల సహకారియయ్యెను. ఆయన సహాయమువనే యామె యా విద్యలన్నిటిని నేర్చి, మొదట హిందూమతమును సంస్కరించి పునరుద్ధరించ నారంభించెను. ఆసేతుహిమాచల పర్యంతము అలసట నెరుగక సంచారముచేసి హిందూమత పారిశుద్ధ్యమునుగురించి యనేక యుపన్యాసముల నిచ్చి, వ్యాసములు పుస్తకములు వ్రాసి విశేషప్రచారముచేసెను. అదివఱకు ఇంగ్లీషుచదివి, బడులలో చిన్నతనమునుండియు తమ మతాచారముల యెడల విముఖతను నేర్చికొని, తుదకు ఏ మతానుష్ఠానము లేక, పాషండులై భ్రష్టులగుచుండిన భారతీయ యువకులు స్వమతమహత్త్వము నెరింగినవారై, తమ పూర్వమతాచారములను తిరిగి యనుష్ఠింపదొడగిరి ఆ ప్రకారమామె యితర మతములకుగూడ గొప్పప్రోత్సాహము నిచ్చెను. హిందూదేశమునందు ప్రపంచమునందలి గొప్ప మతములన్నియు నున్నవనియును, మత సామరస్యమునకు ఆదేశము లోకమునకు త్రోవజూపవలసి యుండుటచేత, ఆసామరస్య మభ్యాసమగుట కామతము లన్నియు నచట చేరినవనియు నామె యభిప్రాయము. మఱియును, మతమనునది మూఢాచారములచే గడ్డకట్టుకొనిపోరాదనియు, దైనందిన జీవితములో నాత్మవికాసమునకు వ్యక్తి యుపయోగింపదగి, సజీవమునుగ, అనగా, కాలానుసారముగ మారు సంఘుపరిస్థితుల కనుకూలముగను, ఎప్పటి కప్పుడు, బయలుదేరు నూతనసమస్యలకు సమాధానము చెప్పగలదిగను నుండవలెననియు నామె యభిప్రాయము.

తరువాత, బెసెంటుసతి విద్యావిధాన సంస్కారము నారంభించెను. బడులలో మతబోధ యావశ్యకమని, విద్యార్థులు బ్రహ్మచారులుగ నుండవలెనని యామెవాదము. విద్యయనగా విద్యార్థికి అభిరుచిలేని విషయములను, వానికి కష్టము గలిగించువిధమున, బలవంతముగ మెదడులోని కెక్కించుటయు, పరీక్షామందిరములో విద్యార్థులు వానిని పారబోసి వట్టిమెదడుతో బయటకు వచ్చుటయు కాదనియును, బిడ్డలో వాసనారూపముగ నున్న సహజశక్తులను సమర్థతలను వికసింపజేసి, వానిలోని సుగుణవాసనలను వికసింపజేసి వృద్ధిజేయుచు దుర్గుణవాసనల నణగద్రొక్కి నాశనము చేయుటయు, మొత్తముమీద బాలబాలికలు యుక్తవయస్సు వచ్చినతరువాత తమ లౌకికధర్మములను యుక్తముగ నెరవేర్చదగిన సామర్థ్య మలవరుచుటయు నిజమగు విద్యయనియు నామె యభిప్రాయము. ఆ ప్రకారము విద్యావిధానముతో నామె కాశీలో సెంట్రల్ హిందూకాలేజిని, మదనపల్లిలో నొక కాలేజిని, అడయారునొద్ద నొక కాలేజిని, ఇంక నితరచోట్ల పాఠశాలలను బెట్టించెను. అడయారులో నొక జాతీయ విశ్వవిద్యాలయముగూడ బెట్టించెను. బాలికలకు బాలురతో సమానముగ విద్య గరుపు టావశ్యకమని బాలికలకు కూడ పాఠశాలల బెట్టించెను. బాలురు బాలికలు కలిసి యొకబడిలో చదువుకొనుట యే శ్రేష్ఠమని యామె తలచెను, గాని, అందుకు తగిన పరిస్థితులు లేనిచోట వేరు బడు లుండవలెనని చెప్పుచుండెను.

బాలురకు బాలికలకు చిన్నతనమునుండియు దేశభక్తి, ఆత్మగౌరవము, గొప్పవారియెడల గౌరవము, స్వయంసహాయశక్తి, పరోపకారచింత, ధైర్యము, ఋజుత్వము, స్వమతాభిమానము, పరమతసహనము మొదలగు సుగుణము లలవాటు చేయుట, కామె యెన్నియో యేర్పాట్లు చేసెను. మతబోధకొఱకు కొన్ని పాఠ్యపుస్తకములు వ్రాయించెను. విద్యార్థులకామె యనేక యుపన్యాసములనిచ్చి వారిలో ప్రాచీన భారతీయ నాగరికతయందు, సారస్వతమునందు, మహాపురుషులయందు, గౌరవము రేకెత్తించెను. ఆ యుపన్యాసములలో ముఖ్యమైనవి రామాయణ మహాభారతములను గుఱించినవి. ఆమె బాలురకు బోయిస్కౌటు ఉద్యమమును, బాలికలకు గర్ల్‌గైడ్ ఉద్యమమును నెలకొల్పెను. 'Sons of India' (భారతపుత్రులు), 'Daughters of India' (భారతపుత్రికలు), 'The Gold Chain' (బంగారు గొలుసు) అను సంస్థలను పెట్టెను.

భారతీయ యువకుల యుపయోగార్థము Young Men's Indian Association (భారత యువక సంఘము)ను పెట్టి, చెన్నపట్టణములో లక్షరూపాయిలు విలువగల మందిరమును కొని 'గోకలేహాల్' అని పేరుపెట్టి యిచ్చెను. అక్కడ బసలు, భోజనములు, ఫలహారములు, వ్యాయామములు మొదలగు సదుపాయము లేర్పాటయినవి; ఒక దివ్యమైన యుపన్యాస మందిర మున్నది. ఆ మందిరములో ప్రవేశద్వారమున కెదురుగ బెసెంటుసతి విగ్రహ మున్నది. యువకులు పార్లమెంటుపద్ధతి ప్రకారము విషయములను చర్చించుట చట్టములు నిర్మించుట నేర్చుకొనుటకు 'మెడ్రాస్‌పార్లమెంటు'ను పెట్టెను.

భారతీయ స్త్రీజనోద్ధరణమున కామె, కజిన్సుసతి, జిన రాజదాసాసతి మొదలగువారి సహాయమున Women's Indian Association (భారత మహిళాసభ)ను బెట్టి దానికి దేశమంతట వ్యాప్తి కలిగించెను. అన్నివిధముల భారతమహిళ యాదర్శ స్త్రీయని యామె యభిప్రాయము. అందుచేత ఆమె పూర్వ ఋషిప్రోక్తములగు గృహిణీధర్మములను తిరిగి తలయెత్తించ యత్నించెను. భారతమహిళ కట్టు, బొట్టు మొదలగు నాచారములయందు కూడ ఆమె కెంతో గౌరవము. మొత్తముమీద ఏదేశమువా రా దేశాచారములను చక్కగా ననుష్ఠించవలెననియు నితరులను గుడ్డిగా ననుకరించరాదనియు నామె యభిప్రాయము. భారతస్త్రీలు పురుషులు ఆంగ్లేయ వనితలను పురుషులను అనుకరించుట యామె కెంతమాత్రము నిష్టములేదు. ఇందు కొక నిదర్శనము: వెనుక శ్రీమతి రుక్మిణీదేవి మొదటిసారి భర్తతో పాశ్చాత్యదేశముల కేగుచు నామె యాశీర్వచనము బడయబోయెను. అప్పు డామె యిట్లనెను. "బిడ్డా! నీ వెక్కడికి వెళ్లినను భారతమహిళ వని మరువవద్దు. నీ కట్టు, బొట్టు మొదలగు విశిష్టాచారముల నక్కడ విడువవద్దు. నీలో నక్కడివారు ఆదర్శభారతమహిళను చూడవలెను. అట్లని అక్కడిస్త్రీల కెడముగ నుండక వారితో కలిసి మెలిసి మసలుచు వారియొద్ద నేర్చుకొనవలసిన మంచి యేమున్నను నేర్చుకొనుము" అని బోధించెను.

ఆమె తరువాత పూనినది సంఘసంస్కరణము. బాల్య వివాహములను నిర్మూలించుట ఆమె మొదటియత్నము.

ఆమె వృద్ధవివాహములను, బహు భార్యాత్వమును ఖండించి, వితంతువివాహములను, విడాకులను ప్రోత్సహించెను. బెసెంటుసతి హరిజనోద్ధరణమునకు పాటుపడెను. "మన స్వాతంత్ర్యమునకుగల యవరోధములలో గొప్ప యవరోధ మొకటి అస్పృశ్యులు మనసోదరులని గుర్తించినప్పుడు తొలిగిపోవును." అనియామె 1929 లో వ్రాసెను. కాని అస్పృశ్యులుగను గ్రామబాహ్యులుగను ఉంచి వారి నగౌరవము చేయరాదని, వారిని అన్నివిధముల బాగుచేసి, విద్యగరపి, ముందుకు తేవలెనని, చెప్పెనుగాని, ఉన్నపాటున వారిని తెచ్చి బలవంతముగ నితరవర్ణములవారిలో కలిపి కూర్చొనబెట్టవలెనని చెప్ప లేదు. వారికి తరతరములనుంచి వచ్చుచున్న అశుచి, అజ్ఞానము, అనాచారములు విద్యవలనను సహవాసమువల్లను పోగొట్టి వారి ఆర్థికస్థితి బాగుపరిచి, ఆత్మగౌరవము గలిగించనంతవరకు వారి బాలురు ఇతరుల బాలురు పోవు బడుల చుట్టుపట్లనుండుటకూడ మంచిదికాదని ఘంటాపథముగ నామె చెప్పెను. హీనస్థితిలోనున్న వారిని పైకి తేవలెనుగాని పైస్థితిలో నున్న వారిని హీనులుగ జేయరాదని, క్రిందనున్నవారు పైకెక్కుట కష్టముగాని పైనున్నవారు క్రిందకుజారుటతిసులభము గనుక సదాచారముల కలవారైన యగ్రజాతిబాలురు సంస్కారమెరుగని పంచముబాలురతో గూడినచో వీరు బాగుపడక పోవుటయేగాక వారు వీరిని చూచి భ్రష్టులగుదురని యామె చెప్పెను.

ఇతరుల యాచారముల నామె గౌరవించుచుండెను. అడయారులోని భోజనశాలలో వర్ణవిచక్షణలేకుండ సహ

పంక్తి భోజనములు చేయుట కవకాశమున్నను అది యిష్టము లేనివారికి ప్రత్యేకముగ భోజనములు పెట్టుటకు ఏర్పాట్లు చేయవలెనని యామె వ్రాసెను. ఒక యాచారము మంచిదా కాదా యనుటలో నామెయభిప్రాయ మెట్లున్నను ఆయాచారము నవలంబించువారి కవకాశ మీయవలెనని యామెయుద్దేశము. సెంట్రల్ హిందూ కాలేజి ఆవరణలో నొక సరస్వతీ దేవియాలయ ముండెను. ఒకనా డామె నాయాలయమునకు బాబు భగవానదాసు గారు తీసికొని వెళ్లిరి. ఆయన యెంత చెప్పినను ఆమె ఆలయములో బ్రవేశింపక బైటనుండి దేవి విగ్రహమునకు కొంచెము దూరమున ఫలపుష్పముల నుంచి నమస్కరించి వెడలిపోయెను.

మతము, విద్య, సాంఘికాచారములు, తరువాత ఆర్థికస్థితి. బెసెంటుసతి ఇండియాకు వచ్చినదిమొదలు దేశీయ పరిశ్రమలను, కళలను పునరుద్ధరించవలెనని, యామె వాదించుచుండెను. దొరికినంతవఱకు ఆమె స్వదేశవస్తువులనే వాడుచుండెను; ఇతరులను ప్రోత్సాహము చేయుచుండెను. న్యూయిండియా పత్రికలో నామె విదేశవస్తువుల గుఱించిన ప్రకటనలను వేయనంగీకరించలేదు. భారతీయులందరు కులమతాది విచక్షణలు లేక నొకజాతిగా నుండవలెనని, మే మొక మతము వారము, లేక, ఒకరాష్ట్రమువారము, కనుక, మాకు మీకు సంబంధము లేదు అను భేదబుద్ధి పోయి మనమందరము భారతమాతబిడ్డలము, కనుక, ఒక్కటేయను నైక్యభావము భారతీయులలో గలిగించవలెనని యామె యత్నము.

భారత దేశములో భారతీయులు యూరోపియనుల చేతులలో పొందిన అవజ్ఞలకు మితిలేదు. భారతీయులను 'Natives' (నేటివులు) అని పిలచెడువారు. ఇంకను 'కూలీ' లనికూడ పిలచెడువారు. అది బెసెంటుసతి కెంతమాత్రము ఇష్టములేదు. ఒకనాడు కలకత్తానుండి కాశీ సెం. హిం. కాలేజీ వారి కోత్సవమునకు వచ్చిన యొకపూర్వ విద్యార్థి రైలులో 2 వ తరగతిలో ప్రయాణము చేయుచుండగా నొక యురోపియను అతనిని పైకి వెడలగొట్టెను. ఆ సంగతి తెలిసి కాలేజిపత్రికలో నామె యొక తీవ్రమైన వ్యాసము వ్రాసెను. అది లె. గవర్నరు మొదలు ప్రభుత్వాధికార్లందరకు కోపము తెప్పించెను, కాని, వా రేమియు చేయజాలక యూరకొనిరి. ఇటీవల 'నేటివు' లను మాటను వాడుట మానివేసిరి.

ఈ ప్రకారము ముందు భారతదేశమును ప్రజలను తమ భావిస్థితికి తగినట్లు తయారుచేసి పిదప భారతదేశ రాజకీయ స్వాతంత్ర్యతకై పోరాటము నారంభించెను. ఆమె భారత దేశమునకు స్వాతంత్ర్యము వచ్చుట తన కన్నులతో జూచెదననుకొనెనుగాని, యది కొనసాగలేదు. కాని, యామె యందుకై చేసినకృషి చిరస్మరణీయము. భారతదేశ శృంఖల విముక్తిగురించి యెవరైన నిష్పక్షపాతముగ చరిత్ర వ్రాసినచో డా. బెసెంటు చేసిన కృషియంతయు సువర్ణాక్షరములతో వ్రాయదగినదై యున్నది.

డా. బెసెంటు భారతదేశమున కంతగొప్ప సేవజేయుటకు ముఖ్యకారణములు మూడు. మొదటిది, తన పరమ గురువు

నకు, మహీపీఠ నాయకు లనేకులకు అది మాతృదేశము, పుణ్య భూమి. మఱియు నది వారిసంకల్పము ప్రకారము భావి ప్రపంచ నాగరికతలో నాయకత్వము బూనవలసి యుండుటచే నామె నావిధముగ సేవజేసి దాని నుద్ధరింపవలెనని నియోగించిరని మే మనుకొందుము. మూడవ కారణ మిది యామెకు మాతృభూమి. వెనుకటి జన్మములో నామె యీదేశములో బుట్టిన జన్మవృత్తాంత మామె మరువలేదు. అంతకుముం దనేక సార్లామె యక్కడ జన్మించియుండెను. ఇండియాయే ఆమెకు "Home" స్వదేశము.

డా. బెసెంటు స్మారకచిహ్నముగా చెన్నపట్టణములో తిరువళిక్కేణి సముద్రతీరమున నొకవిగ్రహమును ప్రతిష్ఠించిరి కాని, అంతకంటె గొప్పస్మారకచిహ్నము నే డామె జన్మశతవార్షికోత్సవ సందర్భమున శ్రీమతి రుక్మిణీదేవిగారు స్థాపింపదలచిన విద్యాసంస్థలు.

భారతదేశోద్ధారణమునకై పాటుపడిన మహానుభావు లెందరో కలరు. కాని, వా రొక్కొక్క రొక్క విషయమున బనిచేసినవారే గాని, డా. బెసెంటువలె సర్వతోముఖ సేవ జేసినవా రింకొకరు లేరు. ఆమె యితర దేశములవా రందరి మన్ననకు పాత్రురాలైనను భారతదేశీయుల కామె నిత్యమూ నారాధించదగిన వ్యక్తి.



# రాజకీయాందోళనము

1913 సం. వఱకు బెసెంటుసతి ప్రత్యక్షముగా భారత దేశపు రాజకీయ రంగములో దిగలేదు. ఆ సంవత్సరము అక్టోబరులో నామె 'Wake up' India' (ఇండియా! మేల్కొనుము) అను శీర్షికతో చెన్నపట్టణమున కొన్ని యుపన్యాసముల నిచ్చి, నవంబరులో ఇంగ్లండును ఇండియాను ఎక్కువ దగ్గఱగా జేర్చుటకున్ను, బ్రిటిష్ సామ్రాజ్యమును నిలబెట్టుటకై యైకమత్య మెంత యవసరమో రెండు దేశములకు దెలియ జేయుటకున్ను ఒక పత్రికను ప్రకటింపదలచి, దానికి తగిన యేర్పాట్లు చేయనారంభించి ఆరు వారములలో పూర్తిచేసి, తే 2—1—1914 దిని 'Commonveal' (కామన్‌వీల్) అను వారపత్రికను ప్రకటించెను. "దేశములో పరిపూర్ణ స్వరాజ్యమును నెలకొలుపుట - అనగా, గ్రామపంచాయతీ సభ మొదలు తాలూకా సభ, జిల్లాసభ, రాష్ట్ర శాసన నిర్మాణసభ, జాతీయ పార్లమెంటు వఱకు ఎక్కడ కక్కడ స్వతంత్ర పరిపాలనాధికారముగల పరిపాలక వర్గముల నేర్పర్చుట, జాతీయ పార్లమెంటుకు సామ్రాజ్యములోని వలసరాజ్యములకున్న యధికారము లుండుట, సామ్రాజ్య శాసనసభలో భారతదేశప్రతినిధులు సభ్యులుగా నుండుట—ఇది యామె యా పత్రిక ద్వారా సాధింపదలచిన లక్ష్యము.

ఆ సంవత్సరము జూలై నెలలో నామె చెన్నపట్టణములో చిరకాలమునుండి ప్రకటింపబడు చుండిన 'మెడ్రాస్ స్టాండర్డు' అను ఆంగ్ల దిన పత్రికను కొని, దానికి 'న్యూ

ఇండియా' యని పేరుమార్చి తాను సంపాదకురాలుగా నుండి ప్రకటింపసాగెను.

డా. బెసెంటు ఏ లక్ష్యముకొఱకు భారతదేశమున పని చేయుచుండెనో చెప్పియుంటిమి. ఇంగ్లండు ఇండియా కూడ ఆలక్ష్యమును పొందు మార్గమునకు దూర మగుచుండిరి. ఇంగ్లండు ఇండియాకు స్వాతంత్ర్యము నిచ్చుటకు వెనుదీయుచుండెను. భారతీయులలో అందుకు కినిసి ఇంగ్లండుతో సంబంధమును పూర్తిగా త్రెంపుకొనవలెనని, అవసరమైనచో బలాత్కారముగనైన స్వతంత్రత గైకొనవలెనని యనువారి సంఖ్య యెక్కువగుచుండెను. ఈ రెండింటికి మధ్యమార్గమును జూపి రెండుదేశములను సమాధానముగను శాంతముగను ఒప్పించి పరమపురుషుల సంకల్పము నెరవేర్పవలెనను నుద్దేశముతో డా. బెసెంటు కార్యరంగములో దిగెను.

న్యూ యిండియా స్థాపించిన కొద్ది దినములలోనే మొదటి యైరోపా మహాసంగ్రామ మారంభించెను. అప్పుడు ఇంగ్లండులో నధికారమందున్న రాజకీయవేత్త లొక తప్పు చేసిరి. ప్రధానమంత్రి లాయడ్ జార్జి బ్రిటిష్ వలసరాజ్యములకు "ఈయుద్ధములో మీరు మాకు సహాయము చేయుడు, యుద్ధానంతరము మనసంబంధముల గుఱించి క్రొత్త యేర్పాట్లు జరుగును" అని సందేశమంపి, ఇండియాకు పంపినసందేశములో "ఈ యుద్ధములో మాకు సహాయము చేయు" డని మాత్రము వ్రాసి తరువాత మాటలు చేర్చలేదు. అది లాయడ్ జార్జి బుద్ధిపూర్వకముగ జేసినది కాని పొరపాటుకాదు. అందు

చేత ఇండియాలో స్వాతంత్ర్యము కొఱకు తీవ్రమగు నాందోళన చేయవలెనని, చేయుట కదే తరుణమని డా॥ బెసెంటు నిశ్చయించుకొనెను. ఒకవైపు యుద్ధమువల్ల ఇంగ్లండునకే గాక ఇండియాకుగూడ రానున్న ఆపదనుండి తప్పించుటకు భారతీయు లన్నివిధముల సహాయము జేయవలెనని హెచ్చరించుచు, స్వచ్ఛందసైనికదళములు సమకూర్చుటకు, స్వయముగ పాటుబడి ప్రభుత్వమునకు తోడ్పడుచు, నింకొక ప్రక్క దేశస్వాతంత్ర్యమున కాందోళనమును జేయుచుండెను. బ్రిటిషు వారి పరిపాలనా విధానము నామె యాక్షేపించి దానిని పూర్తిగా మార్చివేయుట యామె లక్ష్యముగా బెట్టుకొనెను. గాని, బ్రిటిషువారి సంబంధమునుండి పూర్తిగా తొలిగిపోవుట యామెలక్ష్యము కాదుగనుక, ఆమె యామార్గ మనుసరింపలేదు. ఇంగ్లండు కష్టములో నున్నప్పు డిట్టి యాందోళన లేవదీసినచో వారికి మఱింతకష్ట మగును గనుక అది సమయముగాదని కొందరాక్షేపించిరి. కొందరు ఆంగ్లేయులేగాక భారతీయులు కూడ ఇండియా స్వరాజ్యమున కర్హులు కాదని వాదించుచుండిరి. వారందరకు భారతదేశము స్వాతంత్ర్యమున కర్హులని, స్వతంత్రత ఆవశ్యకమని, చెప్పినది పది సార్లు చెప్పుటకిదియే తగిన యదనని యుద్ధమైన తరువాత బ్రిటిష్ ప్రభుత్వపుత్ర నాయకు లిటు చూడరని యామె వాదము. ఇనుము వేడిగానున్నప్పుడే సాగగొట్టవలెనని సామెత యున్నది. డా॥ బెసెంటు కొట్టి కొట్టి వేడెక్కించి సాగగొట్టవలెనన్న నమ్మకము గలది. ఆమె పద్ధతి హద్దు మీఱకుండ మృదువైన మాటలతో మనసున్న కంటునట్లు వ్రాయుటలో నేర్పరి. ఆ

విషయములో న్యూయిండియాద్వారా భారతదేశపు వార్తా పత్రికల కామె వరవడిబెట్టెను.

1907 సం. లో సూరత్ లో జరిగిన కాంగ్రెస్ సభలో నాయకులలో చీలికలు వచ్చి యది మొదలు బాలగంగాధర తిలకు పక్షమొకటి, గోపాలకృష్ణగోకెలే పక్షమొకటి రెండు వేర్వేరు పక్షములు బయలుదేరెను. ఆ రెండుపక్షముల మధ్య భేదము నానాటికి హెచ్చగుచుండెను. బెసెంటుసతి 1915 సం. లో నారెండు పక్షములకు సమాధానము కుదిర్చెను. ఆ సభలో నామె స్వరాజ్యతీర్మానమును బలపరుచుచు గంభీరోపన్యాసము జేసెను. ఆసమయమున కాంగ్రెస్ ఆదరణక్రింద 'హోంరూల్ లీగ్' ను స్థాపించయత్నించెను, గాని, యచట సమావేశమైనవారిలో నెక్కువమంది స్వరాజ్య ప్రయత్నమంతయు కాంగ్రెసు పేరుననే జరుగవలెనుగాని దానికొఱకు వేరే సంస్థ యుండరాదనిరి. అందు కామె యొప్పుకొనక 1916 సం. లో 'హోంరూల్ లీగ్' ను స్థాపించెను. అనేక పుస్తకములను పత్రికలను ప్రచురించెను. 'How India Wrought for Freedom' ఇండియా స్వతంత్రతకొఱకెట్లు పోరాడెను, 'India Nation' (ఇండియా యొకజాతి) మొదలగు పుస్తకములు ప్రకటింపబడెను ఆ'లీగ్' నారంభించినతరువాత నామె విశ్రాంతినెరుగక దేశమంతటను సంచారము చేసి యుపన్యాసములిచ్చియు, పత్రికలలో వ్రాసియు తీవ్రాందోళనముజేసి, దేశనాయకు లనేకుల నామె పక్షము దిప్పుకొని, జనుల నందరను మేల్కొల్పెను. స్వరాజ్యకాంక్ష దేశమం దన్నిమూలల చెలరేగెను. ఆమె తీవ్ర విమర్శ

లకును ఆమెకు జనులలో దినదినము పలుకుబడి హెచ్చగుట కును రాష్ట్రప్రభుత్వమువారు చలించిరి.

దాని ఫలితముగ మొదట 'న్యూ యిండియా' నుండి రు 2,000 లు జామీనుకోరి, తే 16.5-1916 దిని మెడ్రాసు ప్రభుత్వ ము త్తరువుచేసిరి. దానిని గురించి డా. బెసెంటు 'న్యూయిండియా'లో నిట్లు వ్రాసెను:—

"కారణమేమో తెలియజేయలేదు. 'జోవాలుకుం' మా యా సికి వ్యాపారమునకు భంగము గలుగునేమోయని భయ మగుచున్నది. మేము తప్పుచేసి యుండినను, మా నియంత యాతప్పేమో మాకు చెప్పనందున, దానిని దిద్దుకోజాలము. 'ధనమో, ప్రాణమో', ఇదే సూత్రము. తప్పెక్కడ నున్నదో తెలియనందున జామీనుధనము చెల్లించిన మరునాడు మాటల నాతప్పు జేయవచ్చునుగదా. ఆవెంటనే ఈ జామీనుధనము నపహరించి తిరిగి రు 10,000 కావలెనందురు. మెద్రాసులోను ఇండియాలోను ఇతరచోట్లను బ్రిటీష్‌వారి న్యాయము మీా రూప మున నున్నది."

(న్యూ ఇండియా అప్పటప్పట చెల్లించిన జామీను ధరావతుల మొత్తము రు 20,000. దానిలో అతి ప్రయత్న ముపైన కొంత తిరిగియిచ్చిరిగాని హెచ్చుమొత్తము నీయ లేదు).

ఆ యుత్తరువు అనుకొనని రీతిగ పనిచేసెను. దానిని దేశమంతట నందరు ఖండించిరి. 'హోం రూల్' ఉద్యమమున కెక్కువ సహాయము బలము చేకూరెను. 1916సం.జూలైలో

బొంబాయి దొరతనమువా రామెను బొంబాయిరాష్ట్రములో బ్రవేశింపరాదని నిషేధించిరి. దానిని గురించి యామె యిట్లు వ్రాసెను:—

"ఇతర పరిపాలన మెంత యాక్షేపణీయముగ నున్నదో ప్రదర్శించుటవల్ల జనులలో స్వపరిపాలనా కాంక్షను చంపుట సాధ్యముకాదని మన పరిపాలకుల కెందుకు తోచదో నా కాశ్చర్యమగుచున్నది. నన్ను దండించుటకు వా రెంత ప్రయత్నింతురో అంతయెక్కువగ జనులు వారి పీడనము నుండి విముక్తులగుటకు నిశ్చయించుకొందురు. వెల్లింగ్టన్ ప్రభువు బహుమందగామి. నేను గత క్రిస్మస్‌లో బొంబాయిలో నుంటిని, తరువాత మే నెలలో తిరిగి రెండురోజు లుంటిని. నేడు జూలై తే 10 ది......"

ఆ సంవత్సరము సెప్టెంబరులో మధ్యపరగణాలలో జరుగనుండిన దివ్యజ్ఞాన సమాజ వార్షికసభకు డా. బెసెంటు వెళ్లవలసియుండగా నామె నారాష్ట్ర ప్రభుత్వమువా రారాష్ట్రములోకి రాకుండ నిషేధించిరి. ఆ యాంక్షలను, జామీను ఉత్తరువులను మన్నించుచు ఆమె తన యాందోళనమును యథాప్రకారము జరుపుచునే యుండెను. అందుచేత ప్రభుత్వోద్యోగుల కేమిచేయుటకును తోచక, తుదకు ఆమెను ఆమె సహకారులగు జి. యస్. అరండేలు, బి. పి. వాడియాగార్లను కోయంబత్తూరులోబెట్టి యక్కడనుండి కదలరాదని శాసించిరి. అంతకుముందు 1917 సం. జూన్ తే 16 దిని గవర్నరు ఆమెను రప్పించి రాజకీయములలోనుండి విరమింపజేయ యత్నించెను. ఆమె చర్యలలోను మాటలలోను ఏ దోషముగాని కనపర్చ

జాలక, రాజకీయములను విడువుమనుటకంటె మఱేమియు నతడు చెప్పజాలనందున ఆమె యాతని సలహా నంగీకరించ జాలక సెలవుదీసుకొని వచ్చెను. మఱియొక గంటలో ప్రభుత్వపు ఉత్తరువు ప్రకటింపబడెను.

దానితో ఇండియాలోనే గాక ఇంగ్లండులోను ఇతర దేశములలోను కూడ ఆందోళనము ప్రబలి యా ప్రభుత్వపు చర్యను ఖండింపసాగిరి. అంత లోకవ్యాప్తమగు నొత్తిడి వచ్చునని దొరతనమువా రనుకొనలేదు. ఆ యొత్తిడి భరించ లేక బ్రిటిష్ ప్రభుత్వమువారు మూడు నెలలలో నామెను ఆమె సహచరులను విడిచిపెట్టిరి. ఆ మూడు నెలల యేకాంతవాసములో నామె పని లేకపోవుటచేత శుష్కించి పోయెను. కోయంబత్తూరు విడిచివచ్చినదే తడువుగ శరీరములోని నీరసమునైనను లెక్కచేయక తన మామూలు పని నారంభించెను.

ఆమె శరీరము దుర్బలమైనను కీర్తి ప్రబలమయ్యెను. దేశములో నెక్కడ కేగినను వేనవేలు జనులు గుంపులు కూడి స్వాగతమిచ్చిరి. ఆ సంవత్సరము డిసెంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ మహాసభ కామెను అధ్యక్షురాలుగ నెన్నుకొని భారతదేశము తన పుత్రికలకీయగల యుత్తమ గౌరవము నిచ్చిరి.

ఆ సభలో నామె చదివిన యధ్యక్షప్రారంభోపన్యాసము ఆమె గొప్పదనమునకు, ఆమె దేశభక్తికి, శాశ్వత నిదర్శనము. మఱియును, కాంగ్రెస్ చరిత్రలో నామె యొక

క్రొత్త మార్గము నవలంబించెను. అధ్యక్షుడు నాలుగు రోజులు మహాసభ జరిపి తరువాత అంతర్ధానము కారాదని, మరుసటి సంవత్సరమున క్రొత్త అధ్యక్షుడు పీఠము నెక్కు-వఱకు అతడు నెరవేర్చవలసిన పని యున్నదని చెప్పి, యామె సంవత్సరము పొడుగునను కాంగ్రెసు కమిటీసభలలో నధ్యక్షత వహించియు, కాంగ్రెసు తరపున జరుగు పనులన్నిటిని తన పేరున జరుపుట మొదలగు బాధ్యతలను వహించెను. ఆ యాచరణ మప్పటినుండియు కాంగ్రెసులోనే గాక, యితర సంస్థలలో గూడ నవలంబించుచున్నారు.

1917 సం. మొదలు ఆమె భారతదేశ రాజ్యాంగ ప్రణాళికను నిర్మించుటకై దేశనాయకులలో ప్రముఖులను ప్రబుద్ధులను సమకూర్చుటకు యత్నముల జేయనారంభించెను. 1918 సం. లో యుద్ధ మాగిపోయెను. బ్రిటిష్ ప్రభుత్వమువారు ఇండియాకు డొమినియన్ ప్రతిపత్తి నిచ్చుచు రాజ్యాంగ చట్టమును సవరింపగోరిరి. 1919 సం. లో మాంటెగ్యు - చెంసుఫర్డు రిఫారంసు అని ప్రసిద్ధిగాంచిన సవరణలతో రాజ్యాంగచట్టమును పార్లమెంటు నిర్మించెను. ఆ చట్టము ప్రకారము రాజ్యాంగ తంత్రమును నడుపుటకు అంగీకరించుటా నిరాకరించుటా యని కాంగ్రెసులో జరిగినచర్చలో రెండు పక్షములు బయలుదేరెను. అంతకుముందే అమృతసరములో బ్రిటిషు ప్రభుత్వమువారు జరిపిన దురంతములు భారతీయుల హృదయములను దహించివేయుచుండెను. ఆ తీవ్రవేశములో గాంధీగారి వాదమునకు హెచ్చుమంది లొంగిపోయి చట్టమును నిరాకరించుటకు అసహాయోద్యమమును

ఆరంభించుటకు తీర్మానించిరి, అదివఱకు కాంగ్రెస్ - ముస్లిం లీగుల ప్రత్యేకసభలో ఆ చట్టము నంగీకరించిరి. ఆ తీర్మానము ప్రకారము చట్టము నంగీకరించవలెననియు, పూర్వపు పరిపాలనవిధానములో కంటె నిప్పుడు భారతీయుల కెక్కువ యధికారము లభించినందున ఆ యవకాశమును గైకొని ముందడుగువేయుటకు దాని నుపయోగించవలెనని వాదించిన డా. బెసెంటువాదము నిరాకరింపబడెను. అదిమొదలు కాంగ్రెస్ గాంధీజీ చేతులలో బడెను.

డా. బెసెంటు సహాయనిరాకరణమునకు శాసనోల్లంఘనము నకు ప్రసిద్ధికెక్కెను. కాని, అత్యవసరసమయములలో అన్యాయముగనున్న చట్టమునుగాని శాసనమునుగాని ఇతరవిధముగ సవరింప సాధ్యముకానప్పుడు, ఎవరో బాధ్యతగల నాయకులొక రిద్దరు ఆ పనికి పూనుకొనవలెనుగాని, జనులను రెచ్చగొట్టి వారిచే చట్టముల నుల్లంఘింపజేయుట ఆమె మార్గము కాదు. ఇంగ్లండులో నామెయు చార్లెస్ బ్రాడ్లాయు నేప్రకారము శాసనోల్లంఘన చేసిరో చూచితిమి. ఇండియాలో సైమన్ కమిషన్ వచ్చినపుడు వారినిబహిష్కరించుటకు కారణము డా. బెసెంటు. కాని, గాంధీజీ ప్రణాళికకు ఆమె ప్రణాళికకు భేద మిది: జను లందరు ఏదోయొక యన్యాయపుశాసనమునో చట్టమునో గాక, నాయకులు నియమించిన శాసనములను చట్టములను ఉల్లంఘించి దొరతనముపై తిరుగుబాటుచేసి రాజ్యాంగము నడువకుండ చేయవలెనని, అట్లుచేసినయెడల కొద్దిరోజులలో స్వతంత్రత వచ్చునని,మఱియు బ్రిటన్‌కు ఇండియాకు పూర్తిగా సంబంధము విడిపోవలెనని గాంధీజీ వాదము. ఈ రెండింటికి డా.

౧ బెసెంటు మొదటినుండియు వ్యతిరేకమే. ఆమె రాజకీయరంగములో దిగినప్పుడామెకు పెద్దలిచ్చిన సలహాలో నిది యొక నియమము అని యామె చెప్పెను. ఆ రెండు పద్ధతులు దేశ స్వాతంత్ర్యమును పూర్తిగా ఆటంకపరచకున్నను ఆలస్యము చేయునని, అది ఈ రెండుదేశముల పురోవృద్ధికేగాక ప్రపంచమంతటి పురోవృద్ధికిని నష్టదాయకమని యామెవాదము.

కాంగ్రెస్ ఆతీర్మానము చేయుటతో డా. బెసెంటుకు కాంగ్రెసుకు మధ్య నొక యగాధ మేర్పడెను. గాంధీజీ క్రొత్త పదకమునకు భ్రాంతులై కొద్దిరోజులలో స్వతంత్రత వచ్చుననియాశించి, జనులలో నెక్కువమంది ఆయన ననుసరించిరి. దేశమునం దన్ని వైపుల నుండియు పేరుబడ్డ నాయకు లాయనతో జేరిరి. డా. బెసెంటుకు పలుకుబడి తగ్గుటయేగాక నామె నగౌరవము గూడ జేయసాహసించిరి.

అభిప్రాయ భేదములున్నను వ్యక్తిగతమగు మైత్రికి, గౌరవమర్యాదలకు భంగము రాగూడదన్న ధర్మము నాచరించువా రెంతో మహనీయులు కావలెను. అది యభ్యసించుట సర్వసోదరత్వము నభ్యసించుటలో ముఖ్యాంగము. దివ్యజ్ఞాన సమాజ మొక్కటియే యీయభ్యాసమున కవకాశ మిచ్చుచున్నది. రాజకీయరంగములో నొక్కవిషయమున డా. బెసెంటు గాంధీజీ ననుసరించలేదని ఆయనయనుచరుల మనుకొన్నవారు (ఆయన కాదు) ఆమెపై రాజకీయ రంగంలోనే గాక యితర యుద్యమములలోగూడ తీవ్రముగా నసహాయోద్యమమును నెరపిరి. ఆమె నెలకొల్పిన జాతీయవిశ్వవిద్యాలయమునకు తగిన సహాయములేక మూసివేయవలసి వచ్చెను.

ఎవ రేమన్నను, ఏమిచేసినను, డా. బెసెంటు తనపనిని మానలేదు. రాజ్యాంగ చట్టనిర్మాణ యత్నమును యథాప్రకారము సాగించి 1925 సం. లో 'ది కామన్వెల్తు ఆఫ్ ఇండియా బిల్'అనుచిత్తు చట్టమును అన్నిపక్షములకు చెందిన 250 మంది ప్రఖ్యాత నాయకుల సమావేశములో బెట్టి వారి సమ్మతిని పొంది పార్లమెంటులో ప్రవేశపెట్టించెను సైన్యము, పరరాజ్యములతో వ్యవహారములతప్ప తక్కిన యన్నివిషయములలోను ఇండియా స్వతంత్రముగ పాలించుకొనుటయు, ఆ రెండువిషయములు కూడ తన స్వతంత్రపాలనములోనికి దీసికొనుట కెప్పుడు తన కనుకూలమని తోచినప్పుడు బ్రిటిష్ పార్లమెంటు నడుగకుండ ఇండియా తీసికొనుటయు నాచట్టములోని ముఖ్యమైన నిబంధనలు. మఱియును ఆచట్టములో నింకొక యపూర్వ విషయము వోటింగుహక్కు ప్రాతినిధ్యపు హక్కు అందరకు లేకపోవుట. వోటునిచ్చు నధికారముగలవా రందరకు ప్రతినిధులుగా నుండుట కధికారము లేదు. ఒకప్రాంతమును చట్టములుచేసి పాలించవలసిన సభలో తీర్మానములు కేవలము తలలను లెక్కపెట్టుటవల్ల ఆమోదింపబడరాదని ఆతలలలో తగినంత జ్ఞానము సమర్థత యుండవలెనని యామె యాశయము. దాని ననుసరించి గ్రామపరిపాలక సభలో నీడు వచ్చిన స్త్రీపురుషులందఱకు వోటు నిచ్చుటకు ప్రతినిధులుగ నుండుటకు అధికారమున్నది. ఆపైన తాలూకాసభకు జిల్లా సభకు రాష్ట్రసభకు జాతీయపార్లమెంటుకు వోటింగుకు ప్రాతినిధ్యమునకుకూడ నర్హతలు క్రమముగ పరిమితము చేయబడెను. ఆయాసభలు వాని యధికారప్రాంతములలో

పైసభ అజమాయిషీకి లోబడి సర్వస్వతంత్రత గలిగి యుండవలెను. పార్లమెంటులో ఈ బిల్లు మొదటిసారి చదివి ప్రవేశపెట్టుట కంగీకరించిరి. కాని, ఆ పార్లమెంటు రద్దగుటచేత రెండవసారి చదువుట కవకాశము లేకపోయెను. తరువాత వచ్చిన పార్లమెంటులో దానిని తిరిగి ప్రవేశపెట్ట దగిన యభిమానము గలవారు లేకపోయిరి, యీ దేశములో గూడ దానికి వ్యతిరేకాందోళనయు నెక్కువైనది. 1926 సం. లో 'ఇండియా బాండ్ ఆర్ ఫ్రీ' అను పుస్తకములో డా. బెసెంటు రాజకీయరంగమున తన యత్నములను వివరించుచు వివరముగ వ్రాసి యీ బిల్లులోని ముఖ్యాంగములను అనుబంధముగా జేర్చెను. ఆ బిల్లు జనామోదముగాని ప్రభుత్వామోదముగాని బడయక విస్మృతిపాలైపోయినను, ఇండియా స్వాతంత్ర్యసమర చరిత్రమునందలి యొక ప్రధానఘట్టముగ నుండుటయే గాక, యెన్నటికైన నిండియా రాజ్యాంగ ప్రణాళిక కది మూలముగ నుండక తప్పదు.

కలకత్తా విశ్వవిద్యాలయమువారు ప్రతి సంవత్సరము 'కమలా లెక్చెర్సు' అను పేరున గొప్ప పండితులచేత నుపన్యాసము లిప్పించెదరు. 1925 సం. జనవరిలో డా. బెసెంటు అట్టి యుపన్యాసములను 'రాజ్యతంత్రము' పై నిచ్చెను. ఆ యుపన్యాసములనే తిరిగి మైసూరు విశ్వవిద్యాలయములో గూడ నిచ్చెను. ఆ యుపన్యాసములు కళాశాలలలో రాజ్యతంత్రమును నేర్చుకొను విద్యార్థులకు పఠనీయగ్రంథముగ నుండదగి యున్నవి.

1929 సం. జనవరి నెలాఖరులో 'న్యూ యిండియా'

దినపత్రికను నిలిపివేసి వెంటనే ఆ పేరుతోనే వారపత్రికను కొంతకాలము ప్రకటించెను. అవినీతికరములగు ప్రకటనలను (advertisements) విదేశవస్తుప్రకటనలను మత్తుద్రవ్యముల ప్రకటనలను తన పత్రికలో వేయుటకు డా. బెసెంటు నిరాకరించుటచేత సామాన్యముగ పత్రికలకు జీవనాధారమగు రాబడి న్యూ యిండియాకు లేకపోవుటయును, ఆమె గాంధీ తత్త్వమును తీవ్రముగ ఖండించుటచేత చందాదార్లు తగ్గిపోవుటయును, ఆ పత్రికను నిలిపివేయుటకు కారణములు.

డా. బెసెంటు స్వతంత్ర భారతదేశమును చూచెదననుకొనెను. కాని, యామె యందుకు చేసినకృషికి చాలినంత సహాయము లేకపోవుటయేగాక, అందుకు కేవలము వ్యతిరేకములగు శక్తులు ప్రబలుటచేత, అది యాలస్యమైనది. 'ఒక గుఱ్ఱము నొకఁడు నీటియొద్దకు తీసికొనిపోగలడు గాని దానిచే నీరు త్రాగించుటకు పదిమందికైన సాధ్యముకాదు' అని యొక సామెత కలదు. డా. బెసెంటు దేశమునంతను స్వాతంత్ర్యమార్గద్వారమున జేర్చెను; గాని, ఆ ద్వారములో ప్రవేశింప నిష్టములేనివారి నామె యేమిచేయుగలదు? ఆమె యీ స్థూలలోకమున చేయనియోగింపబడిన కార్యమును నెరవేర్చి ధన్యురాలై, యవతారము చాలించెను. దాని ఫలితమును వెంటనేగాకున్న నొకప్పుడు లోక మనుభవించకపోదు. ఆమె సూక్ష్మలోకములలోనుండి యీ కార్యమును కొనసాగించు యత్నముల నెకుఁడవ సార్థకముగ జేయుమానెనా?



# జాతీయ విద్య

విద్యావిధానమునందు డా. బెసెంటు ఆదర్శములను గుఱించి యిదివఱకు కొంత చెప్పియున్నాము. (18- అధ్యాయము చూ॥) ఆమె ఇండియాకు వచ్చిన కొద్దిరోజులలో కాశీలో 'సెంట్రల్ హిందూ కాలేజి'ని స్థాపించెనని వ్రాసితిమి. ఈ కాలేజి వ్యవహారములలో నామెకు గొప్ప సహాయము జేసినవారు బాబు భగవాన్ దాస్, పండిత ఇక్బల్ నారాయణగుర్తు, తిలాంగ్ సోదరులు మొదలగు ప్రఖ్యాత భారతీయులుగాక, డా. రిచర్డ్సన్, హారీబాన్బరీ, మిస్ లోయడ్ మొదలగు నాంగ్లేయులును గలరు. డా. అరండేలు నామె ప్రత్యేకముగ ఆకాలేజిలో పనిచేయుటకీ దేశమునకు దెచ్చెను. అతనితో నతని పెంపుడుతల్లి మిస్. అరండేలుకూడ వచ్చెను. వా రిద్దరు నాకాలేజి కపరిమితమగు సేవజేసిరి. ఆకాలేజిలో చదివి పట్టములుపొందిన పండితులెందరో భారతదేశమునఁ నేక విషయములలో ప్రసిద్ధిగాంచిన నాయకులైరి హిందూమత ధర్మములను భారతపౌరధర్మములను అందలి విద్యార్థు లభ్యసించుచుండిరి. వారి కితర పాఠశాలలలోను, కళాశాలలలోను చదువువిద్యార్థులవలె భావదాస్య మలవాటు చేయుటలేదు. ఆకళాశాల త్వరలోనే ప్రఖ్యాతి గాంచెను. కాని, మదన మోహాన మాలవీయగారు కాశీలో ప్రతిష్ఠింపబూనిన హిందూ విశ్వ విద్యాలయమునకు ప్రాతిపదికగ నొక కళాశాల కావలసి యుండుటచేత ఈ కాలేజి నియ్యమని డా. బెసెంటు నాత డడిగినంతనే యామె యంగీకరించి 1913 సం. లో నాతని కొప్పగించెను.

హిందూవిశ్వవిద్యాలయము హిందూ మతబోధకు సహాయమగునని డా. బెసెంటు ఆశించెను కాని, దొరతనము వారి సహాయము నపేక్షించిన యా విశ్వవిద్యాలయమునకు మతబోధను ప్రవేశపెట్టుట సాధ్యముకాలేదు మాలవీయ గారు తన విశ్వవిద్యాలయమునకు దివ్యజ్ఞానముతోగూడ పని లేదని స్పష్టముగ జెప్పిరి. అందుచేత, ఆమె వెంటనే జాతీయ విశ్వవిద్యాలయమును స్థాపించ నేర్పాట్లు చేయ నారంభించి, 1917 సం. లో 'జాతీయ విద్యాభివృద్ధి సంఘము'ను స్థాపించి, అడయారులో ఆసంఘము ఆదరణక్రింద నొక జాతీయ విశ్వ విద్యాలయము ప్రతిష్ఠించెను. దానికి డా. రబీంద్రనాధ్ టాగూరుగా రధ్యక్షుడు(చాన్సెలర్), డా. సర్ సుబ్రహ్మణ్య అయ్యరు ప్రోచాన్సెలరు. అదివరకు కక్కడ పనిచేయుచుండిన కాలేజి గాక, దేశమునం దితరచోట్ల నున్న కొన్ని యితర కాలేజీలు, పాఠశాలలుకూడ దానిలో చేరెను.

ఆ విశ్వవిద్యాలయమువా రిచ్చు పట్టము (డిగ్రీ)లలో బి. టి. (ఉపాధ్యాయపట్టము) డిగ్రితప్ప తక్కినవానిని దొర తనమువా రంగీకరింపకున్నను ఆమె జంక లేదు. మొదటలో విశ్వవిద్యాలయమునకు విద్యార్థులు, ధనసహాయముకూడ విశేషముగ చేరెను, గాని, దేశములో విద్యావంతున కుద్యో గముదప్ప నొరిదొక లక్ష్య మున్నదన్న సంగతి నెవరు నంగీక రించకపోవుటచేత, ఉద్యోగములకు ఆధారముగాని పట్టముల నిచ్చు విశ్వవిద్యాలయమునకు తమ పిల్లలను బంపుట కనేక మంది వెనుదీయసాగిరి. ఇంతలో కాంగ్రెసు సహాయనిరా కరణోద్యమము ప్రబలి యా సహాయనిరాకరణ మీసంస్థపైకి

కూడ బ్రాకెను. అందుచేత ఆ విశ్వవిద్యాలయము నిలిచి పోయెను.

మరియును హిందూ విశ్వవిద్యాలయమునకు సెంట్రల్ హిందూకాలేజి నొప్పగించినపుడు ఆ కళాశాల ధర్మకర్తృ సంఘములోని పదిమంది సభ్యులను డా. బెసెంటును ఆ విశ్వ విద్యాలయపు 'కోర్టు' లో యావజ్జీవ సభ్యులుగ జేయుట యొక షరతుగా నంగీకరించిరి. కాని, డా. బెసెంటును, అరండేలును మరి కొందరిని మొదటి 'కోర్టు'లో చేర్చి తరువాత ఎన్నికలకు హిందువులుతప్ప ఇతరుల కర్హత లేదని చట్టములో విధించిరి. అట్టి యెన్నికలకాలము వచ్చినపు డామె 'హిందువుగా నెన్నికకు నిలువనంగీకరించక, తనకు మొదట మాలవ్యా ప్రభృతులిచ్చిన మాట డప్పినందుకు చింతించెను. తరువాత, ఆమె అందులో సభ్యురాలుగా నుండుట కవకాశామగునట్లు చట్టమును సవరించి యామె బ్రతికియున్నంతకాలము ఆమెను తిరిగి తిరిగి యెన్ను కొనుచుండిరి. ఆ విశ్వవిద్యాలయమువా రామెకు 1921 సం. ఏప్రిల్‌లో 'డాక్టర్ ఆఫ్ లెటర్స్' (D. L. - విద్యావిశారద) యను గౌరవపట్టము నిచ్చిరి.

జాతీయ విశ్వవిద్యాలయముతోపాటు జాతీయ విద్యాభివృద్ధి సంఘమును కూడ ఎత్తివేసి పూర్వపు 'ఎజుకేషనల్ ట్రస్టు' ను పునరుద్ధరించిరి. ఈ ట్రస్టుక్రింద కాశీలో నొక పురుషుల పాఠశాలయు, నొక స్త్రీల కళాశాలయు, అడయారులో నొక కళాశాల (తరువాత నిది యున్నత పాఠశాలయైనది) యు మరికొన్ని సంస్థలు నుండెను.

డా. బెసెంటు ఉపాధ్యాయుని యాదర్శములను బహు గొప్పవిగ నుంచెను. తరువాత కృష్ణమూర్తిగారు ఆయాదర్శము లనే 'ఎడుకేషన్ ఏజ్ సెర్విస్' (Education as Service) అను పుస్తకములో విపులముగ వ్రాసిరి. ఉపాధ్యాయులు తమ జీవితముల నెట్లు గడపవలెనో, తమ ప్రవర్తన మెట్లుంచుకొన వలెనో, విద్యార్థుల యెడల తమ ధర్మము లెట్టివిగ నుండ వలెనో తెలియజేయు కొన్ని ప్రతిజ్ఞలను అగ్నిహోత్రసాక్షిగ జేసెడివారు అట్లు ప్రతిజ్ఞలజేసినవా రింకను కొందరున్నారు.

తరువాత కృష్ణాజీ తన యాదర్శముల ప్రకారము విద్యాశాలలను బెట్టదలచి నపుడు కాశీవిద్యాలయమును అడ యారు విద్యాలయమును ఆతనికి డా. బెసెంటు ఒప్పగించెను.



## బాలవీరోద్యమము

### స్కౌటింగు

లార్డు బేడన్-పవెల్ ఇంగ్లండులో మొదట నీయుద్యమమును స్థాపించెను. అది యిండియాలో ప్రభుత్వమువారి యాదరణక్రింద ప్రవేశపెట్టబడెను, గాని, యూరోపియనుల ఆంగ్లో - యిండియన్ల బడులలోని విద్యార్థులు మాత్రమే దానిలో జేరనర్హు లనిరి. డా. బెసెంటు ఆ యుద్యమము యువకులలో శీలనిర్మాణమునకును, ధైర్యము, సాహసము, పరోపకారచింత, ఆత్మగౌరవము, స్వయంరక్షణ మొదలగు

సుగుణములను వికసింపజేసి సత్పౌరులుగ జేయుటకును బహు అనుకూలముగ నున్నదగుటచేత భారతీయ విద్యార్థులలో గూడ దానిని ప్రవేశపెట్టదలచి 1917 సం॥ లో 'ఇండియన్ బోయి స్కౌట్సు ఎసోసియేషన్'ను స్థాపించి, 1918 సం. లో మదనపల్లి కళాశాలలో యఫ్. జి పియర్సు, ఎం. వి. వెంకటేశ్వరన్ గార్ల సహాయమున బాలవీరదళమును ప్రారంభించెను. ఆ సంస్థ కామె Protector (రక్షకురాలు), జి. యస్. అరండేలు, పియర్సు మొదలగువారు శిక్షకులు. ఈ యుద్యమము నెడల ప్రభుత్వమువారు వ్యతిరేకులై, దీని నే బడిలోను ప్రవేశపెట్టకూడదని శాసించిరి, కాని, చాలచోట్ల నిది ప్రబలి క్రమముగ దేశములో నామోదము బడసెను. 1921 సం. ఫిబ్రవరిలో లార్డు బేడెన్-పవెల్ ఇండియాకు వచ్చినప్పుడు ఈ రెండు ఉద్యమములను చేర్చి ఏప్రిల్‌లో డా. బెసెంటును ఇండియాకు గౌరవ కమిషనరుగ నియమించెను. ఫిబ్రవరిలో చెన్నపట్టణమున జరిగిన (Zamboree) 'రాలీ' లో రెండు సంఘములవారును పాల్గొనిరి. ఆ 'రాలీ' గుఱించి డా. బెసెంటు ఇట్లు వ్రాసెను:- "అది చూచుటకు బహురమ్యమైన దృశ్యము. భారతీయ దళములు, యూరోపియన్ దళములు నొకరి శ్రేణులలోని కొకరేగి పరస్పరకరస్పర్శనములు చేసికొని సన్మానించుకొనిరి. నేడు బాలురుగ నున్న వీరు రేపు పెద్దవారై పరస్పర సహాయమున లోకసేవ జేయు దృశ్యమిందులో మాకగుపించెను."

క్రమముగ బాలికలలో గూడ నీ యుద్యమము ప్రబలినది. 1932 సం.లో స్కౌటు ఉద్యమములో నీయగల నుత్తమ



డాక్టరు ఆనీ బిసెంటు

1917లో హిందూస్థాన్ బాలవీరోద్యమమును స్థాపించిరి.

వీరు బాలవీరోద్యమ దుస్తులను ధరించిరి.

గౌరవమగు 'సిల్వర్ వుల్ఫ్' పతకము నిచ్చి లార్డుబేడన్-పవెల్ డా. బెసెంటును బహూకరించెను.

ఆమె కా యుద్యమమునెడల గల అభిమానాదరణల జూపుట కామె యొక బాలవీర సమావేశమునకు బంపిన సందేశము నుదహరించెదము.

"నాకు డజనుమంది కుమారులున్నచో (ఒక్కడే కలడు) వారి నందరిని స్కౌటు ఉద్యమములో ఎంత పిన్న వయస్సులో చేరదగునో అంత పిన్నవయస్సులో చేర్పింతును. నా కుమార్తెలున్నచో అట్లే చేసియుందును. ఆదిసి ప్రారంభించి చివరవఱకు ఆ తరిఫీదు పొందవలయునని నా యాశయము. ఈ సందేశమును వినుచున్న మీరు స్కౌటు ఉద్యమములో చేరుడని ప్రబోధించుటకు ఇంతకన్న ఎక్కువగ నే నేమైన చెప్పగల ననుకొందురా!

ఇంత ఎక్కువగ ఇది నే నేల వ్రాయుచున్నానని ఆశ్చర్యపడుచున్నారా? అయినచో వినుడు, కారణము చెప్పెదను. నేను కబ్బులను, కిశోరవీరులను, స్కౌటులను, రోవరులను చూచితిని. వారు యువకులుగను పౌరులుగను ఎంత యుపయుక్తమగు బృందమో నే నెరుగుదును. బాలికలు కూడ అట్లే. ఇదియే నేను ఇంతగ వ్రాయుటకు కారణము. వారు తమ దేశముకొఱకు కష్టపడుటకు సంసిద్ధులు. దేశాభ్యుదయముకొరకై మరణించుటకు కూడా సంసిద్ధులే. అట్టి సత్పౌరులు వారు. పౌరుడన్నమాట కిదియే యర్థము: పురమున నివసించుట కర్హుడని, అనగా, సంఘమున నితర ప్రజలతో కలసిమెలసి

నివసించుట కర్తవ్యమని. సోదరుఁడని. సౌహార్దపూర్వకమున దీనినే మఱి యొక విధముగా చెప్పెదము. ప్రతిదినమునను ఒక్కసహాయ కార్యమైనను చేయుదుమని ప్రమాణము చేయుదుము. సహాయకార్య మనగా కొనుటకును అమ్ముటకును అవకాశము లేని ప్రేమతప్ప మఱి యే యితర ప్రతిఫలమును ఆసించక చేసెడి సహాయము. మనము మన గౌరవముసాక్షిగా ప్రమాణము చేయుదుము. అందుకు నిర్బంధము లేదు. నీలోని భగవద్వాణియగు అంతరాత్మయే ఆగౌరవము. అధికారుల నిర్బంధము లేక సహజముగ నీచే అది మంచిపనులు చేయించును. నీకు చేయతగినది అని తోచినపనిని నీ వేల చేయవలయునో చూడుము. ఇది చేయదగినది అని నీకు తోచుట భగవద్వాణి నీలో పలుకుచుండుటవలన. భగవద్వాణి ఆదేశానుసారము నీ వాచరించినచో మంచివాడవును, గౌరవ నీయుడవునై నీజాతి ప్రపంచమునందలి ఇతర జాతులలో తల ఎత్తుకొనగలదు. కావున, సోదరులారా, మీకు శుభమగుగాక. నేను స్త్రీ శరీరము ధరించినను మీ సోదరసౌహార్దమునే.”



# స్త్రీలయుద్ధరణ

డా. బెసెంటు మొదటినుండియు సకలదేశములలోను స్త్రీలదురవస్థను తొలగించ యత్నించుచుండెను. స్త్రీలకు పురుషులకు స్వభావసిద్ధమగు భేదములుండుటచేత వారిజాతి ధర్మములు భిన్నములైనను, ఆధర్మములను పరస్పర సహాయములేక నెవరును ప్రత్యేకముగ నెరవేర్పజాలరు, గనుక, స్త్రీలకుకూడా పురుషులవలె విద్యజెప్పించవలయుననియు, సాంఘికముగను రాజకీయముగను పురుషునితో సమానమగు స్వాతంత్ర్యము స్త్రీకికూడ నియ్యవలెనని యామె వాదము. భారతీయ స్త్రీల యుద్ధరణమునకై 1917 సం. మే తే 8 దిని కజిన్సుసతి, జినరాజిదాసాసతి మొదలగువారి సహాయమున నడయారులో 'Women's Indian Association'(భారత మహిళా మండలి)ని స్థాపించెను. ఇప్పుడామండలి దేశమందంతటను శాఖలు గలిగి స్త్రీలవిముక్తికై పనిజేయుచు విశేషపలుకుబడి గాంచెను. దానిలోని విశేషమేమనగా, నితర సంస్థలలోనున్న జాతిమతాదిభేదములు దానిలో లేవు. దానిలో నన్నిజాతుల వారును అన్నిమతములవారును సభ్యురాండ్రుగ నున్నారు.

స్త్రీలలో నతిబాల్యవివాహములను పోగొట్టుట కామె విశేషముగా పాటుపడెను. అందుకు మొదట చేసినపని విద్యార్థులు వివాహమాడరాదని పూర్వకాలపు నియమమును తన యాజమాన్యమున నున్న బడులలో ప్రవేశపెట్టెను. 1912 సం. ఆప్రాంతములో, ఆమె స్థాపించిన 'Stalwarts' (స్టాల్వర్ట్సు) సంఘములో జేరువారు తమ యాడుబిడ్డలకు 16 సం. లలోపు

వయస్సున పెండ్లిచేయము అని ప్రతిజ్ఞ చేయవలయును, భారత సమాజములో గూడ సభ్యు లట్టి ప్రతిజ్ఞ చేయవలెను.

ఇంగ్లండులో 1910 సం. ఆరోజులలో స్త్రీలవిముక్తికై 'Seffragette' (సఫ్రెజెట్) ఉద్యమము బయలుదేరి, దానిలో గొప్పకులీనకుటుంబములలోని స్త్రీలు, ప్రసిద్ధపురుషుల భార్యలుకూడ చేరి గొప్పయలజడి కలిగించిరి. ఆ యుద్యమములో దుకాణముల అద్దపుతలుపులను బ్రద్దలు గొట్టుట మొదలగు దౌర్జన్యముల నంగీకరించకపోయినను ఉద్యమమునకు బెసెంటుసతి చాలా సహాయపడెను.



## సన్యాసులు

హిందువులలో సన్యాసాశ్రమము గైకొన్నవారు తిరిగి గృహస్థాశ్రమమునకు మరలరాదు. కాని, బౌద్ధమతమునందా నిషేధము లేదు. హిందువులలో గూడ నట్టి నిషేధము లేకుండ సన్యాసాశ్రమము స్వీకరించి, ఆయాశ్రమ ధర్మముగ సేవజేయ దలచినవారికి నవకాశమిచ్చుటకొఱకు బెసెంటుసతి యేర్పాట్లుచేసెను; కాని ఆయుద్యమము విస్తరించ లేదు.



# లోకసేవ

## (1) రౌండు టేబిల్

చిన్నపిల్లలలో (అబలులను అనాథులను రక్షించు) సేవ, ధైర్యము, సత్యము, మొదలగు వీరలక్షణము లలవడు టకు 'Round Table' ను బెసెంటుసతి స్థాపించి ఆమె బ్రతికి యున్నంతకాలము దానికి అధ్యక్షురాలుగ నుండెను. ప్రాచీన కాలమున ఆర్థర్ అను రాజు ఈపేరుతో కొందరు వీరపురు షులను తన కొలువులో జెరదీసి, వారిచే కొన్ని ప్రతిజ్ఞలు చేయించి, ఎవరు సహాయ మపేక్షించినను వారిలో నొకరు వెళ్లి ఆసహాయము చేసి రావలెనని యేర్పరిచెను. వారిలో నొకరి కంటె నొకరు గొప్ప ఒకరు కొద్ది యను భేదము లేదని కన పరుచుట కందరు నొక గుండ్రని బల్ల చుట్టును కూర్చొనెడు వారు. వారి సంఘమున కా పేరుపెట్టుటకూడ యీ సమానత్వ మును సూచించుటకే. దానినిగురించి టెన్నిసన్ కవి యొక మహాకావ్యమునింగ్లీషులో రచియించెను. ఆసంఘసభ్యుల ఆదర్శ ములతో బెట్టినదగుటచేత దీనికి బెసెంటుసతి దానిపేరునే పెట్టెను. దీనిలో పిల్లల కుత్సాహము గలిగించుటకు చక్కని సంస్కారములు, పాటలు, ఆటలు, వినోదములుకూడ నేర్ప బ్బెదరు. దీని శాఖలు ఇప్పుడు ప్రపంచమున చాలాచోట్ల నున్నవి. ఆమె స్థాపించిన రౌండుటేబిల్‌లో ఆదర్శ ధీరలక్షణ ముల నిట్లు వివరించెను:—

"ఆదర్శధీరుడు బలశాలి, ధైర్యశాలి, సత్యశీలుడు, కరుణామయుడు, మర్యాదస్థుడు, ఆత్మనిగ్రహము గలవాడు,

తనకంటె బలహీనునిపై చేయెత్తడు. ఎవ్వరికి నన్యాయము చేయడు, ఎదుట లేనివానినిగూర్చి అపవాదులాడడు, స్నేహితునియెడల విశ్వాసహీనముగ వర్తించడు.

గౌరవ మతని లక్షణము. సౌమ్యత యతని కలంకారము. అత డందరి — ముఖ్యముగ దుర్బలుల — కష్టసుఖములను గమనించి, వారికుపకారముచేయును. అతడాపదలో నిర్భయుడు, విజయములో కరుణామయుడు, తన కపకారము జరిగినపుడు క్షమాశాలి, బిడ్డలయెడలను, జంతువులయెడలను దయాశాలి".

## (2) బ్రదర్సు ఆఫ్ సర్వీస్

డా. బెసెంటు స్థాపించిన యనేక వ్యవస్థలలో నిది యెక్కువగ జెప్పదగినది. ఇది 1917 లో స్థాపింపబడెను. దీనిలో జేరువారు ఆత్మత్యాగము జేసి లోకసేవకు బూన సిద్ధముగ నున్నవారు. దానిలో మూడు తరగతుల సభ్యులు. ఉన్నత తరగతివారు తమరాబడినంతను ఒకనిధి కిచ్చి వారిచ్చు స్వల్పవేతనముతో నిరాడంబరజీవనము చేయవలెను. మఱి కొన్ని తరగతులవారల్లే తమరాబడిలో నొకపాలానిధికియ్య వలెను. కడపటి తరగతివా రిచ్చునది పదవవంతు. సభ్యులు తమయిష్టము వచ్చినపుడు సభ్యత్వమును వదులుకొనవచ్చును. కాని సభ్యులుగ నున్నపుడు డా. బెసెంటును తమ నాయకురాలుగ నంగీకరించి, ఆమె యెప్పుడే పని నెక్కడ చేయవలెనని యాజ్ఞాపించిన నచట నాపనిని చేయసిద్ధముగ నుండవలెను. అదివఱ కెవ రెక్కడ ఏపనిలో నున్నను ఆమెయాజ్ఞ

వచ్చినంతనే దానిని విడిచి యాయాజ్ఞను మన్నించవలెను. ఆ సంస్థలో ధనవంతులు, పండితులు, గొప్ప సమర్థులు చాల మంది చేరి దివ్యజ్ఞాన సమాజాభివృద్ధియందు, విద్యాభివృద్ధి యందు, తారకసంఘ నిర్వహణమందు, రాజకీయోద్యమ మందు, సంఘ సంస్కరణమందు, ఎన్నోవిధముల ససమాన ముగు సహాయము నామెకు జేసిరి.

## (3) ఆర్డర్ ఆఫ్ సెర్విస్

Theosophical Order of Service (దివ్యజ్ఞాన సేవా సంఘము) అను పేరుతో బెసెంటుసతి యొక సంస్థను స్థాపించెను. దానిలో ది. స. సభ్యులు కానివారు గూడ చేరవచ్చును. దానిలో జేరినవారు, కలిసిగాని, యెవరికి వారు గాని, యేదో యొక సంఘసేవాకార్యమును బూని చేయు చుండవలెను. సభ్యులు తమ జీవితము నాదర్శప్రాయముగ నుంచుకొన యత్నించవలెను; తాము బూనిన సేవాకార్య మునందితరుల సహాయమును గైకొనవచ్చును. ఈ సంస్థ శాఖలు చాలా దేశములలో నున్నవి. ఈ దేశములోగూడ కొన్ని యున్నవి.

## (4) దివ్యజ్ఞానుల సమష్టి సంఘ జీవన వసతి

'Man : Whence, How and Whither' (మానవుడు: ఎక్కడనుండి, ఎట్లు, ఎక్కడకు) అను గ్రంథములో ఆర్యజాతి యొక్క గౌరవ యుకజాతిని గురించియు, నారవ మూల జాతి పారంభము గురించియు విపులముగ వ్రాయబడి

యున్నది. భూత భవిష్యత్తులలో మానవ పరిణామమునుగురించి వ్రాసిన గ్రంథమగుటచే దీనికి దివ్యజ్ఞాన పురాణమని పేరు వచ్చెను. దీనిలో నాగవజాతి మూలపురుషులు కేలిఫోర్నియా లో నివసించెదరని అక్కడనుండియే యాజాతి నాగరికత ప్రబలి విస్తరించునని వ్రాసి, ఆ మూలపురుషుల గుణాతి శయములను. సాంఘికజీవిత విశేషములను, వారి నగరమును వర్ణించిరి. ఆ మూలపురుషులుగ బుట్టదలచినవా రాగుణ ములను సాంఘికాచారములను ఈ జన్మమునుండియు నలవాటు చేసికొనవలెను, వారి కా భాగ్యము ప్రాప్తించును, గనుక, వీలైనంతవఱకు, అన్ని దేశములలోను, సమాజ సభ్యులు కొందరు చేరి యొక కుటుంబముగ కలిసిమెలిసి యుండుట, అందరు సమష్టి సంఘమునకు తమ చేతనైన సేవజేసి పరస్పరసహాయులై యుండుట అభ్యసింపవలెనని యామె యాశయము. ఇండియాలో బొంబాయివద్ద 'జూహూ' లో నట్టి 'కాలనీ' యొకటి పెట్టిరి.

కాని, కేలిఫోర్నియాలోనే యిటువంటి పెద్ద కుటుంబ మేర్పర్చవలెనని డా. బెసెంటు యత్నించెను. అక్కడ నొక లోయలో కొంత స్థలమునుకూడ కొనెను. కొద్దిమంది అక్కడ ఇండ్లు కట్టుకొనియున్నారు. గాని, యింకను ఆవసతి బాగుగా వృద్ధికాలేదు.

## (5) కో - ఫ్రీ మే స న రీ

1882 సం. లో ఫ్రీమేసనరీలో స్త్రీలనుగూడ జేర్చుట కవకాశ మీయదలచి ప్యారిస్ నగరములో 'The Supreme

Council of Universal Co-Masonry ' (సుప్రీం కౌన్సిల్ ఆఫ్ యూనివర్సల్ కో - మేసనరీ) * అను పేరున నొక క్రొత్త సంస్థను కొందరు గొప్ప ఫ్రీమేసనులు స్థాపించిరి. 1902 సం. లో బెసెంటుసతి దానిలో బ్రవేశించెను. ఆమె బహు కట్టుదలతో నాయుద్యమమున బనిచేసి, ఇంగ్లీషుభాష వాడుకలో నున్న దేశములన్నిటిలోను కొన్ని యితర దేశములలోను ఆ యుద్యమమును వ్యాపింపజేసెను. ఆమె యా సంస్థలో నున్నత తరగతియగు 33 వ డిగ్రీలో జేర్చుకొనబడి సుప్రీం కౌన్సిలు అధ్యక్షురాలును, బ్రిటిష్ ఫెడరేషను లో సుప్రీం కౌన్సిలుకు ప్రతినిధియునై యా పదవియందు బ్రతికియున్నంత కాలము నుండెను. సర్వభూత సోదరత్వమును నెలకొల్పుటకును ఆత్మవికాసమునకును చక్కని మార్గమగు నీ మహాదుద్యమము నే డనేక దేశములలో ప్రబలియున్నది. మనదేశమున గూడ దీని శాఖలు చాలా యున్నవి. ఈ సంస్థలో నుపయోగించు సంస్కారముల నెక్కువ ప్రయోజనకరముగ నుండునట్లు సవరించి మనోహరమగు నాంగ్లభాషలో డా. బెసెంటు లెడ్బీటరు గార్లు వ్రాసిరి.

## (6) గుప్త విద్యా శిక్షణము

డా. బెసెంటు వృద్ధిచేసిన యుద్యమములలో కో-ఫ్రీమేసనరీవలె లోకమున కెరుక లేనిది గుప్తవిద్యాశిక్షణాలయ (The Esoteric School of Theosophy) మొకటి. బ్లవాట్స్కీ

* ఇప్పుడు ఈ యుద్యమము పేరు International Co-Free Masonry

గారు కొందరు శిష్యులను ప్రోగుజేసి వారికి యోగవిద్యయందు శిక్షణము నిచ్చుచుండెను. మహార్షులచే శిష్యులుగ స్వీకృతు లగుట వారి లక్ష్యము. ఆమె యామహర్షుల యాజ్ఞచొప్పున నాశిక్షణము నిచ్చుచుండెను. 1891 సం. లోనే ఆసంస్థ కామె బెసెంటుసతిని కార్యదర్శిగ నియమించెను. బ్లవాట్స్కీగారు చనిపోయిన తరువాత ఆమెకు బదులు బెసెంటుసతి యాశిక్షణమునుబూనుకొని "Esoteric School" (ఈసోటెరిక్ స్కూలు; ఇ. యస్.) అను నాసంస్థకధ్యక్షురాలాయెను. ప్రపంచమం దన్ని దేశములలోను ది. స. సభ్యులనేకవేలమంది యామెను తమ యాధ్యాత్మిక శిక్షకురాలుగ నంగీకరించిరి. ఆమె యోగా రూఢయని యామె నెఱింగిన వారందరకు దెలియును. ఆమె సృష్టిరహస్యములను స్వయముగ దన యోగశక్తులచే పరీక్షించి తెలిసికొనుటచేత తన శిష్యులకు యోగవిద్య గఱపుట కత్యంత సమర్థురాలు. ఆమెయును, లెడ్బీటరును కలిసి చేసిన పరిశోధనలను గుఱించి 16 వ అధ్యాయములో వ్రాసి యున్నాము. డా. బెసెంటు తరింపజేసిన యనేకమంది జీవు లాయమను శాశ్వతముగ సేవించుచునుందురు. ఆమె యీజన్మములో జేసిన సకల విధములగు సేవాకార్యము లన్నిటిలోను ఇది యుత్తమసేవ. ఆమె యితరులను తరింపజేసి తాను ధన్య జీవి యైనది.

## (7) జగజ్జనని

అటువంటిదే మరియొకటి జగజ్జననిసేవ. 1928 సం. లో డా. బెసెంటు అడయారులోనున్న క్రైస్తవాలయములో నుత

న్యసించుచు అంతరంగ పరిపాలక వర్గములో జగద్గురువను నాధికారిక పీఠమున్నట్లే జగజ్జనని యను నొకపీఠమున్నదని చెప్పి, యిట్లనెను:—

"వివిధమతములలో వివిధ నామములతో బరగు జగజ్జనని పరలోకములలో నెల్లపుడు పనిచేయుచునున్నది. ఇప్పుడామె బహిరంగముగ లోకులకెరుకపడి తన విశిష్టమగు జగజ్జనని పదవినలంకరింప నీతరుణమున రానున్నది. శిశూదయ సమయమున, తల్లిగొప్పదైనను, కొద్దిదైనను,ఆదేవి బహుమృదువగుకృపతో చెంతనుండి పురుడుగడుపును. మాతృత్వముయొక్క యలౌకికపవిత్రత యామెను ఆర్తుల శయ్యచెంత జేర్చును. ఆమె కరుణ,ఆమెదయాళుత్వము,ఆమెసర్వవ్యాప్తమగుమాతృత్వము కుల,వర్ణ,స్థాన భేదముల నెఱుగవు. ఆమె కందరు నామెబిడ్డలే."

అప్పుడు డా. బెసెంటు జగజ్జననికొక ప్రార్థనగీతమును వ్రాసెను. దానియర్థము:— "మహామహిమాన్వితము, శక్తిమంతమునైన లోకపాలక వర్గమగు మహీపీఠమునకును, అందలి దివ్యమణి, సాగరతార, జగజ్జననికిని ప్రణామపూర్వక వందనములు చేయుచున్నాము."

జగద్గురు వవతరించుటకు జిడ్డు కృష్ణమూర్తి శరీరము నుపయోగించునని చెప్పినట్లే జగజ్జనని అవతరించుటకు శ్రీమతి రుక్మిణీదేవి శరీరము నుపయోగించునని డా. బెసెంటు చెప్పి, ఆమెనందుకు తగిన శిక్షణము నిచ్చెను. లోకములో స్త్రీత్వమునకు మాతృత్వమునకు గౌరవము లేనియెడల సుఖ సౌభాగ్యము లుండవనియు, అగౌరవము కలుగు

టకు స్త్రీత్వ మాతృత్వముల పవిత్రతను లోక మెఱుంగవలె నని, జగజ్జనని యవతరించి యా పవిత్రతను, గౌరవమును పున రుద్ధరించునని డా. బెసెంటు చెప్పుచుండెను.

జిడ్డు కృష్ణమూర్తివలెనే రుక్మిణీదేవియు లోకమున కొక విశిష్టత నగపరచుచున్నది. స్త్రీకి సహజలక్షణము కళా నైపుణ్యము. ఆ చిత్ర కళలలో నామె క్రొత్తత్రోవలలో ప్రపంచమును ప్రవేశపెట్టుచున్నది.

కృష్ణమూర్తి, రుక్మిణీదేవిగారల శరీరములు డా. బెసెంటు చెప్పిన ప్రకార మవతారములకొఱకు వినియో గింపబడినను లేకున్నను, వారిద్దరు తమపేరు ప్రపంచమున చిరస్థాయిగ కీర్తింపబడదగినవారైనారు. వారి నంత వారిని జేయుటకు డా. బెసెంటుకే తగినది.

## (8) దివ్యజ్ఞానము

డా. బెసెంటు దివ్యజ్ఞాన సమాజములో ప్రవేశించిన తరువాత, ఆమెకు తెలిసిన సత్యమును లోకమున కొసంగక యొక దినమైన నుండలేదు. ఆమె చర్యలన్నియు దివ్య జ్ఞానానుష్ఠానమే. ఆమె యే విషయము నవలంబించి పనిచేసి నను అది దివ్యజ్ఞాన బోధల ననుసరించి చేసెను. ఆమె యన్ని విధముల దివ్యజ్ఞాన స్వరూపమే. ఆమె సహజముగ పరిపాలక వర్గమునకు జెందిన జీవిగాని బోధకవర్గమునకు జెందినది కాదు. అయినను, దివ్యజ్ఞాన సత్యములను గుఱించి తాను ప్రాచీన గ్రంథములు చదివి వాని నర్థము చేసికొనియు, స్వయ

ముగ యోగశక్తుల నుపయోగించి పరిశోధనల జేసియు నితరు లకు బోధించెను. ఆమె చేసిన యుపన్యాసముల మూలమును, ప్రచురించిన పుస్తకముల మూలమునను దివ్యజ్ఞానము అన్నిమతముల జనులకు, అన్నితరగతులవారికి సులభముగ బోధపడునట్లు చేసి ప్రపంచమున వ్యాప్తిచేసెను.

ఆమెయును, లెడ్బీటరును దివ్యజ్ఞానసారసంగ్రహాములు (Theosophical Manuals) అను పేరున ఏడు ముఖ్యవిషయ ముల గూర్చి చిన్న 'పాఠ్య పుస్తకము'లను వ్రాసిరి. ఆ విషయ ములు : 1. మానవుని సప్తతత్వములు, 2. కర్మ, 3 మర ణము, అనంతరము, 4 భువర్లోకము, 5. దేవఛన్, (సువర్లో కము) 6. పునర్జన్మము 7. మానవుడు, వాని దేహములు. వీనిలో 4, 5 సంఖ్యలు గలవి లెడ్బీటరు, తక్కినవి డా. బెసెంటు వ్రాసినవి. మరియును ఆమె వ్రాసిన 'The Ancient Wisdom' (సనాతన జ్ఞానము), 'A Study in Consciousness' (చైతన్య పరిశీలన), 'Esoteric Christianity' (గుప్త క్రైస్తవము) అను మహాగ్రంథములును పైనజెప్పిన సారసంగ్రహాములును దివ్యజ్ఞాన సత్యములను దెలియ గోరువారు ముఖ్యముగ జదువ వలసిన ప్రమాణ గ్రంథములు.

ఆమె సమాజ వార్షిక సభలలో నొక్కొక్క సంవత్సరము ఇచ్చిన యుపన్యాసములు ఒక్కొక్క విషయమున ప్రమాణ గ్రంథముగ జదువ దగినవియై యున్నవి. ఆమె యన్నిమతము లకు మూలమగు దివ్యజ్ఞానము ఈ నూతన యుగములో బోధింపబడు రీతిని అన్ని మతబోధలకును వర్తింపజేసి ఆ

మతములలో బోధపడనట్టియు, నసందర్భములుగ గనపడు నట్టియు బోధలను చక్కగా సమన్వయనుచేసి చూపెను; అనగా, దివ్యజ్ఞానమను దీపపు వెలుగును సకల మతములలోని మారుమూలలలో బ్రసరింపజేసి, అక్కడ చిరవిస్మృతములగు సత్యములు ఆయా మతస్థులకు గోచరింపజేసెను. ఆమె కన్ని దేశములలోను అంతకీర్తి వచ్చుట కది యొక కారణము. ఆమె దివ్యజ్ఞానము కేవలము స్వాభివృద్ధికొఱకు స్వోత్కర్షకొఱకు చదువుకొని పాండిత్యము సంపాదించవలసినది కాదనియు, ప్రతియొకరును తన నిత్యజీవితములో ననుత్తమము ననుష్ఠించ వలసినదనియును, చెప్పుటయే గాక తా నాచరించి చూపెను. ప్రతి సంవత్సరము సమాజసభ్యుల కొక యాదర్శ వాక్యము నిచ్చి యా సంవత్సర మా వాక్యము ననుసరించి వారు జీవితములను దిద్దుకొనవలెనని కోరుచుండెను; ప్రతి సంవత్సరము తసజన్మదినమున నొక సందేశము బంపుచుండెను. ఆమె ప్రతి సంవత్సరము నొక యాదర్శమును పెట్టుకొని దాని నొక కాగితముమీాద వ్రాసి తాను ఉదయాది యా సాయంత్రము పనిచేయు పీఠమున కెదురుగ గోడకు వ్రేల గట్టుకొనుచుండెను.

ఆమె మొత్తముమీాద రమారమి 400 పుస్తకము లను ప్రచురించెను ఇవిగాక ఆమె యితరులతో కలిసి వ్రాసి ప్రచురించినవి 24 ఉన్నవి.

డా॥ బెసెంటు దివ్యజ్ఞాన వ్యాప్తికై ప్రతి సంవత్సరము విస్తారముగ సంచారము చేయుచుండెను. సకలదేశములనుండి విద్యార్థులు అడయారువచ్చి అక్కడ కొంతకాలముండి

గ్రంథములను చదివి పరిశోధనలుచేసి, యితర విధముల శిక్షణమునొంది, తమ దేశములకేగి ప్రచారము చేయవలెనని యామె యాశయము. అందుకొఱకు అడయారులో 'బ్రహ్మ విద్యాశ్రమ' మను బోధనాలయమును బెట్టెను. దాని కధ్యక్షుడు డా. కజిన్సు. అది రెండు సంవత్సరములు మాత్రము పనిచేసెను.



# విశిష్టము.

## (1) వీరాంగన

డా. బెసెంటు సహజముగ వీరాంగన. నిజమగు వీర పురుష లక్షణములన్నియు నామె జీవితములో నగపడును. వీరుడు అనగత్యముగ నెవ్వరిని ఎదిరించక పోవుటయేగాక, సకల భూతములయెడల బహుమర్యాద, దయ, కరుణ గలిగి వర్తించును; పరులు బాధింపబడుట చూడజాలడు; బాధించు వానిని బాధించకుండ జేయుటకు, అవసరమైనచో చంపుటకు కూడ, సిద్ధపడునుగాని వానిని ద్వేషింపడు; ఎదుటివాని బలాబలములను జూచి వానితో బోరాడును; పోరాడునపుడు నిర్భయముగ తనకున్న శక్తినంతను వినియోగించి పోరాడును. డా. బెసెంటువీరాంగనయనుటకనేకనిదర్శనములజూపవచ్చును. కాని కొంతకాలము బొంబాయిలోను, కొంతకాలము చెన్న పట్టణములోను గవర్నరుగ నుండి, తరువాత వైస్రాయిగ పనిచేసిన లార్డు విల్లింగ్డన్ ప్రభువు 1924 సం. లో చెన్న

పట్టణమునుండి వెడలిపోవునపుడు వ్రాసిన యొక వాక్యము నుదహరించు చున్నాము. (ఆమెను బొంబాయి రాష్ట్రము లోనికి రాకుండ బహిష్కరించిన గవర్నరు ఆయనే.)

"మన మిచట మొట్టమొదట కలుసుకొని మాట్లాడి నపుడు మీరీ విషయమును* ప్రస్తావించి, 'దానిని గుఱించి మనము మనస్సులో ద్వేష ముంచుకొనరాదు,' అని చెప్పిన మాట నెన్నడును మరచిపోను. ఔను, మాకు ద్వేషము లేదు. అందుకు నేను హృదయపూర్వకముగ కృతజ్ఞుడనై యున్నాను. నేను తప్పుచేసితినని మీకు తోచినపుడు నన్ను విమర్శించి ఖండించిరి; నేను చేసినది సరియైనదని మీకు తోచినపుడు ఉదారచిత్తముతో నాపక్షమునుండి సహాయ మిచ్చిరి. ఈ దీనుని యెడల నీప్రకారము నిష్పక్షపాతముగ పత్రికా సంపాదకు లందరువర్తించు నెడల నా జీవిత మింతకంటె నెక్కువ సుఖముగ నుండియుండును."

ఆమె భయమెరుగదు. సామాన్యముగ నితరులతో బోరాడు నపుడు ధైర్యముజూపువారు తమ లోపములను అంగీకరించి వానితో బోరుటకు జంకుదురు. డా. బెసెంటు తాను తప్పుచేసినట్లు తెలిసినవెంటనే దిద్దుకొనుట కెన్నడు వెనుదీయ లేదు. ఆమె సత్యమని నమ్మిన దాని పక్ష మెంత తీవ్రముగ బలపఱచెనో అది సత్యముకాదని తెలిసినంతనే దాని నంత తీవ్రముగ విడిచి సత్యము నంత తీవ్రముగ నవలంబించుట కెన్నడును జంక లేదు. బెర్నార్డు షా ఈ లక్షణము గుఱించి యిట్లు వ్రాసెను:—

* బొంబాయి బహిష్కారము.

"బెసెంటుసతి బహుళత్వరితముగ తీర్మానములు చేయు స్త్రీ ఆమె తన నిజరూపమును గనుగొనుటకుముం దనేక సంస్థలను సంఘములను మచ్చుచూచెను; ఆమె యొకదానిలో నుండి యొకదానిలోనికి క్రమ క్రమముగ మారుట నెన్నడు నెరుగదు; ఆమె యొక సంస్థలోని కాకస్మికముగ దుమికి, ప్రాతనమ్మకము చలించినదని యణుమాత్రపు అనుమాన మైన లేని చూపరు లాశ్చర్యముతో జూచుచుండ క్రొత్తగ నమ్మిన మతమును బోధింపుచుండెను."

ఆమె యేయుద్యమములో దిగినను అంతసాహసముతో దిగుచుండెను, కాని, దూరదృష్టియు నాత్మ ప్రబోధమును గలిగి తాను బూనబోవు కార్యము మంచిదని యెఱింగియే దిగు చుండెను.

ఆమెకు పోరాటములో పట్టుదల లేదు. ఎదిరితో సంధి చేసికొనుట కెన్నడును సిద్ధముగ నుండెను.

మహీపీఠమువారు- అందులోముఖ్యముగ శ్రీవైవస్వత మనువు - ఈ లోకమున జీవపరిణామము జరుగుటలో జేయు కార్యములు నెరవేరుటలో సహాయపడుట ఆమెజీవితరహ స్యము. ఆ కార్యమునకు విరుద్ధములై యాటంకములగు శక్తు లతో నామె పోరాడెనుగాని వ్యక్తులతోకాదు. అందుచేతనే ఆమె 'జయ్ మనవే జయ్' అని సింహనాదము చేయుచుండెను. ఆమె సందేశములలో నొకటి ఆమె వీరాంగనయనుటకు నిద ర్శనము:—

"పిలుపు వినిపించినది. లేచి ప్రపదములు బిగించి యుద్ధ

మునకు) సిద్ధమైనాము. జయించెదమని నిశ్చయముగ జెప్ప లేము. కాని, పోరాడుచు వీరమరణము నొందెదమని చెప్ప గలము. మా కళేబరములు వంతెనలై, వాని మీాదనుంచి మా వెనుక వచ్చెడువారు నడిచిపోయి జయలక్ష్మిని చేకొందురు గాక. జయ్ మనవే జయ్."

## (2) కర్మయోగి

ఆమె చేసినదంతయు నిష్కామకర్మ. శ్రీమద్భగవద్గీతా బోధ లామెకు ఆదర్శములు. ఏపని నారంభించినను తా నెంత వఱకు దానిలో పూనుకొని పని చేయవలెనో అంతవఱకు చేసి యితరుల కొప్పజెప్పుచుండెను, గాని, కొసవఱకు తానే అధ్వర్యము చేయవలెనని దానికీర్తిఅంతయు తనకే రావలెనని కోరలేదు. లోకహితకార్యముల నారంభించి, స్థిరపరచి యితరుల కొప్పగించుటయే దివ్యజ్ఞాని కర్తవ్యమని యామె చెప్పుచుండెను. తా నారంభించిన కార్యము భగ్నమైనదనిగాని, పూర్తిగా జయముకాలేదనిగాని విచారించలేను. లాభాలాభములు జయాజయములు చూడరాదని సద్యోఫలితము కలుగకున్నను చేసినయత్నము వ్యర్థముకాదని, అందుచేత జరిగినదానికై విచారించుచు కూర్చొనక పునఃప్రయత్నము చేసి వెనుకటి యనుభవము నుపయోగించి పనిచేయవలెనని యామె బోధ.

ఆమెకు పనిచేయుటయే కావలెనుగాని యెవరుచేసి రనున దామె కక్కరలేదు. ఇతరులు చేసినపనిని ఏదో సమయముచూచి మెచ్చుకొనక విడువలేదు. తాను చేయవలసిన

పని యున్నపుడు దానివలన వచ్చు కష్టనిష్ఠురములను, ఏప్రకారముచేసిన నేమగునో, యేయుపాయమునవలంబించిన త్వరలో పని నెరవేరునో యోచించుచు కూర్చొనక తత్క్షణము పనిలోని కురుకుచుండెను. ఒకనా డామె అడయారు నుండి న్యూఇండియా కార్యాలయమునకు, తన సహకారులతోగూడ మోటారు కారులో బోవుచుండగా త్రోవలో కారుచెడి నడువక నిలిచిపోయెను. తక్కినవారందరు మరియొక కారు ఎక్కుటకై నద్దెకు దొరుకునేమోయని యటునిటు చూచుచుండ ఆమె తిన్నగా నడిచి పోవుచుండెను. అదిచూచి వారు దిగ్భ్రాంతులై ముందుకుపోయి యామెను కలుసుకొని కొంతదూరము నడచిరి. ఇంతలో నొక యద్దెకారు దొరకెను, దానిలో నందరు వెడలిపోయిరి.

ఒక్కక్షణమైనను వ్యర్థము చేయుట కామె యంగీకరించదు. ప్రయాణములుచేయుటలో శీఘ్రగతిగల వాహనముల నుపయోగించుచుండెను. వాయువిమానము లింకను బాగుగా వాడుకలోనికి రానిరోజులలో నామె విమానములో ప్రయాణముచేసి యూరప్ ఖండములో నన్నిదేశములు దర్శించెను.

ఆమెయు త్తరములనుగాని వ్యాసములనుగాని సంక్షిప్త లేఖకులకు జెప్పుట, వారు వానిని టైపుచేసి తెచ్చిన సంతకం చేయుట యెరుగదు. ఉత్తరములను పత్రికావ్యాసములను స్వయముగ వ్రాయుచుండెను. ఆమె సామాన్యముగ నొక గొప్ప పనివాడొక దినములో జేయగలపనిని రెండు మూడు గంటలలో చేసెడిది.

ఏపని జేసినను బహుశ్రద్ధతో జేసెడిదిగాని చిన్నపని యైనను నశ్రద్ధగ జేయలేదు. 'నీవు శ్రద్ధగా చేయుటకు వ్యవధిలేని పని నీదికాదు గనుక దానిని నీవు పూనుకొనవద్దు,' అని యామె యాదేశము. కాని యామె పూనుకొనిన యసంఖ్యాకములగు కార్యము లన్నిటిని శ్రద్ధతో నెరవేర్చుట కామె వ్యవధి కుదుర్చుకొనుచుండెను.

## (3) పిల్లలు, యువతీ యువకులు

డా. బెసెంటు యొక్క గుణములను వర్ణించుచు నొక మహనీయుడు 'ఆమె మనుష్యులను తయారు చేసెను' అని యొక గొప్ప భావగర్భితమైన వాక్యము నుపయోగించెను. మనుజుడు అనేక జన్మసంస్కారములతో బుట్టును. ఆసంస్కారములలో మంచివి చెడ్డవి గూడ నుండును. సామాన్యముగ మంచివానికి బాల్యములో పోషణలేక చెడ్డవానికి పోషణ హెచ్చుఅగుటను చెడుసంస్కారములు మొలకెత్తి త్వరలో వృద్ధియై సత్సంస్కారముల నణచివేయును. వాడు పెద్దవాడైన తరువాత చెడుసంస్కారములను చంపి సత్సంస్కారములను పెంచనారంభించుట అసాధ్యము గాకున్నను బహుకష్టసాధ్యమైనపని. అందుచేత చిన్నతనములోనే వానిలోపల డాగియున్న సత్సంస్కారములు మొలకెత్తి వృద్ధిపొందుటకు తగిన పరిస్థితులను నిరంతరము పెద్దవారు కలిగించుచుండవలెను. ఆ పరిస్థితులలో ముఖ్యమైనది బాలుని, యువకుని గౌరవించి, వానిలో ఆత్మగౌరవము బుట్టించుట, వానిలో నున్నవని యాత డెరుగని సామర్థ్యములు పైటకు వచ్చునట్లు ప్రోత్సాహము

చేయుట. వానితో నాడుమాటలు, వానిచే జేయించు పనులు, మొత్తముపై వాని సంరక్షణమంతయు నాలక్ష్యముతో జేయు చుండుము.

డా. బెసెంటు పిల్లలను పెద్దవారినివలె నెంతో గౌరవ మర్యాదలతో జూచుచుండుటకు కారణ మిది. సామాన్యముగ చిన్నపిల్లలయెడల ప్రేమ గలిగి వారి నాదరించువా రనేక మంది యుందురు, గాని, వారు పిన్నవయస్సు గలవారై నందున తమకంటె తక్కువవారని భావించెదరు, పిన్న శరీరములోనున్న జీవు లెంతవృద్ధులో వారెంత గౌరవనీయులో యెరుగక వారి ననేక విధముల నవజ్ఞ చేయుదురు. డా. బెసెంటు తనయెదుటనున్న పిన్నశరీరములోని వృద్ధజీవుని జూచుట కలవాటు పడినదగుటచే నా జీవున కీయదగిన గౌరవము నిచ్చుచుండెను. పిల్లలను భయపెట్టుట, కోప పడుట, కొట్టుట, అవమానించుట, ఇండ్లలోగాని బడులలో గాని యుండరాదని యామె యాశయము. వారిని చక్కగా దిద్ది సత్పౌరులుగ జేయు బాధ్యత తలిదండ్రులదియు, నుపా ధ్యాయులదియు నని నొక్కి చెప్పుచుండెను. తనకు మని మనుమలుగ నుండదగిన యీడుగల యువకులను గాని యువతులను గాని యామె చూచినపు డనేక మహద్విషయ ములను గురించి వారి యభిప్రాయముల నడిగి తెలిసికొని, ఆ యభిప్రాయముల మంచి చెడ్డలను తా నాలోచించుకొను చుండెను. ఆమె యెదుట నిలచి మాట్లాడుటకు యువతీ యువకులు భయపడెడువారు కారు,ఆమె వారికెంత చనువును ప్రోత్సాహమును ఇచ్చెడిది. వారు నిర్భయముగ దమ యభి

ప్రాయములను వెలిబుచ్చుట కలవాటు పరచవలెననియే గాక యామె మనస్సులోని విషయముగుఱించి పక్షపాతములతో ఘనీభవించని లేత మనస్సుగల వారి యభిప్రాయ మెట్లుండునో తెలిసికొనవలెనని కూడ వారి నడుగుచుండెను. ఈ ప్రకారము ఆమె ప్రోత్సాహము చేయుటచేత నెందరో యువతీ యువకులు తీర్చబడిరి. భారతీయులు పిల్లలను యుక్త రీతిని పెంచి, విద్యాబుద్ధులు గరపనందున గొప్పగొప్ప జీవుల కిక్కడ బుట్టుటకు తగినపరిస్థితులు లేక, వారు ఇతరదేశము లలో బుట్టుచున్నారని, ఇక్కడ బుట్టువారిలో నట్టి గొప్ప జీవులు లేక దేశాభ్యుదయ మాలస్యమగుచున్నదని యామె తరచుగ జెప్పుచుండెను.

పిల్లలను గుఱించి యామె నిరంతర చింతను దెలుపుట కామె కొద్దిరోజులలో మరణించుననగా నొకనాడు చెప్పిన మాటల నుదహరించెదము:—

"యువతీయువకులు ఆనందముగను, నిర్భయముగను నుండునట్లు చేయుటకు నేను చాలకాలము పాటుపడితిని. ఆ పనిని కొనసాగించి, యువజనులకు నన్ను గుఱించి, వారి యెడల నాకుగల ప్రేమను గుఱించి తెలియజేయుచుండుడు."

"ఎల్లయెడలను పసిబిడ్డలను భయముపాలు గాకుండ నుంచుడు. బిడ్డల నెల్లపుడును వారి యిష్టప్రకారము చేయ నీయ కూడదుగాని, వారి నానందముగా బెరుగనీయవలెను."

## (4) మర్యాద

డా. బెసెంటు సంఘమర్యాదలను పాటించుట చాలా ముఖ్యమని భావించుచుండెను. ఆమె భారతీయులమధ్య నున్నపుడు రెండుచేతులు జోడించి నమస్కరించుట, భారతీయులవలె బాసికపట్టువేసి కూర్చొని భోజనము చేయుట, చీరెగట్టుట మొదలగు నాచారములను పాటించెను. సంఘములో చక్రవర్తి మొదలు అధికారిక వర్గములోని యుద్యోగులకు, సంస్థానాధిపతులకు, మతగురువులకు, పీఠాధిపతులకు ఇటువంటివారిలో ఎవరి కెట్లు మర్యాదచేయవలెనో అట్లు మర్యాద చేయుచుండెను. అదియును లాంఛనమునకు గాక బుద్ధిపూర్వకముగ నెదుట నున్నవారియందా గౌరవమున కధికార మున్నదని చేయుచుండెను.

డా. బెసెంటు అనేక జన్మములలోని యనుభవము వలనను, అంతరంగపరిపాలకవర్గమగు మహీపీఠములో జేరిన దగుటచేతను ఆధికారిక పురుషులలో నెవరి కెట్లు గౌరవ మర్యాదలు చేయవలెనో యెఱుగును. మఱియును, సింహాసనాధిపతులు, పీఠాధిపతులు, వ్యక్తిగతముగ నెంతచెడ్డవారైనను, ఆపదవియందుండుటచేత మాత్రముననే, వారు మహీపీఠమునకు ప్రతినిధులగుదురు, గనుక, వారాపదవియొక్క గౌరవమర్యాదల నందదగ్గులనియు, మన మాగౌరవ మర్యాదల నిచ్చుట యుచితమనియు నామె యాదేశము. పూర్వపు దర్బారు మర్యాదలు లాంఛనములు కేవలము శుష్కాచారములు దంభాచారములు కావు.

. డా. భగవాన్ దాసుగారి కుమారుడు, కేంద్రశాసన సభలో సభ్యుడునగు శ్రీ ప్రకాశ్ ఆమె దేశాచార గౌరవము గురించి తా నింగ్లండులో నున్నప్పటి కొన్ని యనుభవములను 'Annie Besant : As Woman and Leader' అను పుస్తకములో నుదహరించెను:- కేంబ్రిడ్జిలో నతడు చదువుకొనుచుండగా నొకనా డామె యాతని యాహ్వానముపై నా యూరికి కొందరు పరివారముతో గూడ వెళ్ళి, అత డేర్పర్చిన యొక హోటలులో బసచేసెను. ఆ మధ్యాహ్న మామె సపరివారముగ శ్రీ ప్రకాశ్ బసలో నతనితో భోజనము చేయవలసి యుండెను. అతడు వారిని తోడ్కొని వచ్చుటకు వెళ్ళి వారితోగూడ తిరిగి తన బసకు వచ్చుచుండగా, ఆమె త్రోవలో నాగి 'నే నంత వేగముగ నడువలే' న నెను. అదివఱకు ఇండియాలో ననేకసార్లామెతో నడువలేక యనేకమంది పరువెత్తుట చూచియుండిన శ్రీ ప్రకాశ్కు ఆశ్చర్యమాయెను. కాని, ఇంగ్లండులో కులీన స్త్రీలు వీధులలో తొందరగా నడుచుట తప్పు, కనుక, ఆ యాచారము నామె యుల్లంఘింప నిష్టములేక యట్లనెను. ఆ సమయముననే శ్రీ ప్రకాశ్ టోపీలేకుండ వచ్చుట చూచి 'నాయనా' నీ టోపి యేమైనదని యడిగెను. ఆ కాలమున యూనివర్సిటీ విద్యార్థులు టోపీలు లేకుండ వీధులలో నడచు నలవాటారంభమాయెను. గాని, పెద్దమనుష్యులు టోపీ లేకుండ వీధివెంట వెడలుట ఆచారము కాదు. ఆమె కది యిష్టము లేదు. మఱియొకసారి యా యూరనే ఆమెను రైలుస్టేషన్ వద్ద కలుసుకొని యూరిలోనికి తోడ్కొని వచ్చుటకు శ్రీ ప్రకాశ్ యును, అక్కడి దివ్యజ్ఞాన సమాజసభ్యులును వెళ్లిరి.

వారిలో నొక రిద్దరిని తప్ప తక్కినవారి నామె యెఱుగదు. భారత దేశీయులకు గ్రొత్తవారి నొకరి కొకరిని పరిచయము చేయునలవాటు లేదు కనుక, శ్రీ ప్రకాశ్ ఆ లాంఛనము జరుపలేదు అది చూచి యామె "ప్రకాశ్, నన్ను వీరందరికి పరిచయము చేయుదువా" యని యడిగెను

ఆమె యేదైన సంస్థలో సభ్యురాలుగ నుండి యాసంస్థ కొక నియమితమగు దుస్తులు ధరించవలెనను నియమ మున్న యెడల ఆ దుస్తుల నామె ధరించకుండ ఆ సంస్థల సభలు మొదలగువానికి వెళ్లుటలేదు. భారత బాలవీరులు తల పాగా బెట్టుకొనవలెను ఆమెయు వెనుకకు తోకవదలి తలకు పాగా చుట్టుకొనుచుండెను. ఫ్రీ-మేసనరీ సభలలో తత్సంబంధ మగు దుస్తులు ధరించుచుండెను. ఆమె గుఱ్ఱపుస్వారిలో నేర్పరి గుఱ్ఱము నెక్కినపు డందుకు ఆచారము ప్రకార ముపయోగించు దుస్తులను తొడగి, ఇంగ్లండులో స్త్రీల యాచారము ప్రకారము రెండుకాళ్లను గుఱ్ఱమున కొక వైపుననే వేసి స్వారి చేయుచుండెను.

## (5) కాలనియమ పాలనము

ఏపని చేయుటకైనను ఒక కాలము నేర్పర్చినపు డా కాలమున నాపని జరుపుట డా. బెసెంటు కొక గొప్పనిష్ఠ. ఉదయము గం. 9 ల కుపన్యాసమని నిర్ణయించిన యెడల గడియారము తొమ్మిదవ గంట కొట్టిన వెంటనే యామెకంఠధ్వని వినిపించవలసినదే. ఎవరినైన ఆమె చూచుటకు గం 10 లకు వెళ్లవలెనని యేర్పర్చుకొన్న యెడల గడియారము కదవ

గంటకొట్టుసరికి ఆమె వారియెదుట నుండవలసినదే. ఆమె నిర్ణయమయిన కాలము నతిక్రమించినయెడల నితరులకు ఇబ్బంది కలుగును. అది యామె కిష్టములేదు. ఆమెపనులన్నియు కాల నియమముబట్టి జరుగవలసినదే. కాని, రైలెక్కుటకు వెళ్లుటలోను, నాటకములు మొదలగు వినోదములు చూచుటకు (ఇది బహు అరుదు) వెళ్లునప్పుడును ఆమె నిర్ణీత కాలమున కొకయరగంటయైన ముందుగా వెళ్లి కనిపెట్టుకొని కూర్చొనెడిది. రైలు, వినోదములు మనకొఱకు కాగవు. తొందరలో నేకారణము చేతనైన కొంచెమాలస్యమైనచో తప్పిపోదుము. రైలు తప్పి ప్రయాణమాగిపోయిన నావల ఎన్నిపనులు నిలిచిపోయి యెందరి కాశాభంగమగునో.

ఒక యుపన్యాస మొకవేళ కారంభమగునని ప్రకటించినపు డావేళకు వినుటకు జనులువచ్చినను రాకున్నను సూక్ష్మలోకవాసులనేకులు వచ్చివేచియుందురట. వారి కాశాభంగము గాకుండ, సభలో జనులెందరున్నను, ఎవరు రాకున్నను, వేళకుపన్యాస మారంభము కావలెను.

## (6) మైత్రి

ఆమె కనేకమంది మిత్రులనేక దేశములలో నుండిరి. వారినందరిని, జ్ఞాపకముంచుకొని, కుశలప్రశ్నల జేయుచు వారికుటుంబ సంబంధమగు భోగట్టాలు చేయుచు, తన కుశల వార్తల దెలుపుచు తరుచు జాబులు వ్రాయుచుండెను. ఆ జాబులలో నామె నిష్కల్మష హృదయమును వెల్లడించెడిది. అనేకు లామె వ్రాసినజాబులను ధనమువలె దాచుకొను

చుండెను. ఎక్కడికైన వెళ్లినపు డక్కడ తన మిత్రు లున్న యెడల వారియింట బస చేయు చుండెను.

తన మిత్రులతో కలిసి పనిచేయవలసినపుడు తనను గురించిగాని వారిని గురించిగాని లోకు లేమనుకొందురో యని సంశయమైన లేకుండ వారితో కలిసిమెలిసి పనిచేసెడిది. తన మిత్రులను గురించి యొక్క చెడ్డమాట తా నాడక పోవుటయే గాక, యితరు లాడిన సహించెడిది కాదు. తనకు సహాయులుగ పనిచేయువారి గురించి గొప్పచేసి చెప్పెడిది గాని వారి లోపముల నెంచి బైట బెట్టుట లేదు. బ్లవాట్స్కీ మోసకత్తె యని యపవాదులు పడినప్పు డామె పక్షమున, లెడ్బీటరుపైన నిందలు వడినప్పు డాయన పక్షమున, డా. అరండేలు రుక్మిణీ దేవిని వివాహము చేసికొన్నపుడు పూర్వాచార పరాయణులు దండెత్తిన సమయమున నాదంపతుల పక్షమున ఆమె ధైర్యముతో నిలిచి పోరెను. అట్లే కారమే చార్లెస్ బ్రాడ్లా మొదలగువారి పక్షమున నింగ్లండులోగూడ పోరెను.

ఆమెకు పరమ మిత్రుడగు బాబు భగవాన్‌దాస్ ఆమె కిష్టములేని అసహాయోద్యమములో చేరి చెరసాల కేగెను. డా. బెసెంటు కాశీ వెళ్లినపుడు రైలుదిగి ముందాయనను చెరసాలలో చూచి తరువాత బస కేగెను.

## (7) నిష్కల్మష హృదయము

ఏవిషయము గురించియు నెవ్వరిగురించియు నామె హృదయములో దురభిప్రాయము లేదు. ఎన్నడును ఆమె మనస్సులో నున్నదానిని దాచుకొనలేదు. శత్రువుతోనైనను

పరిపూర్ణప్రేమతోను నిండుహృదయముతోను మాట్లాడు చుండెను. అందుచేతనే యామెతో పోట్లాడుట కామెవద్దకు వెళ్లినవా రామెను మెచ్చుకొనుచు బైటకు వచ్చెడువారు. తన యెదుట నెవ్వరును పరులను దూషించిన నామె సహించదు. ఒకనాడొక స్నేహితు డొక గొప్ప ప్రభుత్వోద్యోగిని కఠిన ముగ దూషింపదొడగెను. ఆమె యతని శిరముపై చేయివేసి నెమ్మదిగా 'నాయనా! లోకములో వానికంటె దుర్మార్గు లుండవచ్చునుగదా!' యనెను.

## (8) మేధావి

డా. బెసెంటుది బహు కుశాగ్రబుద్ధి. ఎంత గూఢ విష యములైన నవలీల గ్రహించి విపులపరచి చెప్పగల యద్భుత శక్తి గలది. అందుచేతనే సీక్రెట్ డాక్ట్రిన్, ఉపనిషత్తులు, యోగశాస్త్రములు, తర్క-వేదాంత శాస్త్రములు, పురాణే తిహాసములు, ఇతరమతముల యుద్గ్రంథములు అంతసులభ ముగ, పాలసముద్రమును మథించి యమృతమును దెచ్చినట్లు, మథించి వానిలోని యమృతమును తీసి లోకమున కిచ్చెను.

ఆమె జ్ఞాపకశక్తి యసమానము. బహుస్వల్ప విష యములను గూడ జ్ఞాపకముంచుకొనగలదు.

## (9) వక్తృత్వము, ఉపన్యాసములు

ఆమె సమకాలికులలో నత్యుత్తమ తరగతికి చెందిన వక్త. విషయమును చెప్పుటలోను, శ్రోతల నాకర్షించు భాష నుపయోగించుటలోను, శ్రోతలెందరున్న నందరకు సమానముగ వినిపించుటకు తగినట్లు కంఠమును సర్దుకొని

మాట్లాడుటలోను, చెప్పవలసిన విషయమును నియమిత కాలములో పూర్తిగా జెప్పి ముగించుటలోను, ఉపన్యాస అంత్య వాక్యములచే శ్రోతల కుత్సాహము గలిగించుటలోను ఆమె నేర్పు అసమానము.

ఆమె యుపన్యాసములకు సామాన్యముగ నధ్యక్షు డుండుట, ఉపన్యాసమునకు పూర్వము తరువాత గంటలకొలది ఆత డుపన్యసించుట ఆమె కిష్టములేదు. విధిలేక అధ్యక్షుడున్న సభలో నుపన్యసింపవలసిన యెడల, ముందామె నుపన్యసింపు మని కోరుచు నొక మాట, కడపట సభముగిసినదని యొక మాటతప్ప మరేమియు ననవద్దని స్పష్టముగ నతనికి చెప్పెడిది. అనేకమంది తమ యభిప్రాయముల దెలుపు సభలలోను కాంగ్రెసు మొదలగు వాద ప్రతివాదములు జరుగు సభల లోనుతప్ప ఇతరచోట్ల ఆమె యుపన్యాసానంతరము వెంటనే మఱి యొకరుపన్యాసము చెప్పుట ఆమె కిష్టములేదు.

ఉపన్యాసమునకు ప్రత్యేకముగ దుస్తులు ధరించుకొని పోయి వేళకు వేదిక నెక్కి మాటలాడ నారంభించి యుపన్యాస మంత్యముకాగానే వేదికనుండి దిగిపోయెడిది. ఉపన్యసించినపుడు హా స్తవిన్యాసములను బహుకొద్దిగా చేయుచుండెను, గాని, మరియేవిధమునను నేయంగము చలించుట లేదు.

ఆమె యుపన్యాసము నారంభించుటకు ముందు విష యము నే విధముగ జెప్పవలెనో యోచించుకొనుచుండెను, ఇంచుమించుగ నుపన్యాసము నంతను ఒకసారి మనస్సులో తలచుకొనుచుండెను. 1917 సం. కాంగ్రెసు అధ్యక్షోపన్యా

సము తప్ప వ్రాసిన వ్యాసములను చదువుట నెఱుగదు. ఆమె యుపన్యాసములో ఛలోక్తులనుగాని, విషయమునకు సంబంధించని మాటలనుగాని యెన్నడు నుపయోగించ లేదు; ఉపన్యాసమునకు పిలిచి తన కా మహదవకాశము నొసంగినవానికి కృతజ్ఞత దెలుపుట, తన యనర్హతను చెప్పుకొని లోపములను క్షమింపుడనికోరుట, సమావేశమైన మహనీయుల యెదుట నిలిచి మాట్లాడుటకు సాహసించినందుకు క్షమాపణగోరుట, కష్టపడికూర్చొని వినినందుకు శ్రోతలకు ధన్యవాదములు తెలుపుట మొదలగు వ్యర్థ ప్రసంగముల నెన్నడు చేయలేదు.

1910 సం. మార్చిలో నొకసభలో బెసెంటుసతి యుపన్యసించిన తరువాత చెన్నపురిగవర్నరు, సర్. ఆర్థర్ లాలీ లేచి యామెకు కృతజ్ఞత తెలుపుచు నిట్లనెను.

"శ్రోతలలో నొక ఉదారతరప్రవృత్తి గలిగించుటకో ఒక ఉన్నతాదర్శమును బుట్టించుటకో, వారి నేదో యొకగొప్ప భావనాప్రపంచమున కెత్తివేయుటకో తప్ప మఱియొకందు కామె కంఠమెత్తదు."

ఆమె క్రొత్తగా దివ్యజ్ఞానసమాజములో జేరినరోజులలో క. ఆల్కాటు ఇట్లు వ్రాసెను.

"మరుచటి ఆదివారము సాయంత్రము 'హాల్ అఫ్ సైన్సు' లో నామె 'మెమొరీ' (జ్ఞాపకశక్తి) గుఱించి యిచ్చిన యుపన్యాసము వినుట కేగితిని. అది బహుజ్ఞానవంతమును శక్తివంతమునునైన యుపన్యాసము. అంతగొప్ప వక్తను వినుటకు గలిగిన యట్టి మహదవకాశమును పోగొట్టుకొనరాదు, గనుక

ఒక్కడనుగాని యితరులతో గలిసిగాని, ఆమె యుపన్యాసము లన్నిటికి వెళ్లితిని... 'ఫ్రీ థింకర్' గా నున్నపు డామెతో గలిసి పనిచేసినవారి యొద్ద సెలవుపుచ్చుకొనుట కామె ఆ హాలులో నిచ్చిన కడపటి యుపన్యాసమున కామెను నేనే వేదిక యొద్దకు తోడ్కొనిపోతిని".

ఒకనా డామె యొక్కడనో జైనమతముగుఱించి యుపన్యసింపవలసి యుండెను. ఆమె కావేళ తీవ్రమైన జ్వరము వచ్చెను, ఆ జ్వరముతోనే బయలుదేరి, యెవరుచెప్పినను వినక యుపన్యాసమందిరమున కేగెను. ఆమెతో నొక మిత్రుడు సహాయముగ నేగెను. అతడు బండితుము త్రోవలో నతనిని జైనమతమునందలి ముఖ్యబోధలను చెప్పుమని యడిగి తెలిసుకొనెను. ఆమె కూర్చొని ఉపన్యసించుట యరుదు. జ్వరముతో వేదికపైన నిలువలేక ఆమిత్రుని సహాయమున నిలిచి ఉపన్యాసము నారంభించి క్రమముగ జ్వరము నీరసము అన్నిటిని అతిక్రమించి మామూలుధోరణిలో గంటసేపు మాట్లాడెను. జైనమతముగుఱించి యిటువంటి యద్భుతమగు నుపన్యాసము నెన్నడును వినలేదని శ్రోతలు మెచ్చిరి. ఆమె యుపన్యాసములో చెప్పిన మతబోధలు తా నామెకు త్రోవలో చెప్పినవేగాని ఆ చెప్పిన నాలుగుమాటలను ఉపయోగించి యంతగొప్పగా నుపన్యసించుట తన కీ జన్మములోగాదు ఎన్నిజన్మలకైనను రాదని యా మిత్రుడనెను.

## (10) దాత

యావజ్జీవ నిర్ధనవ్రతము బూనిన డా. బెసెంటు చేసిన

దానములకు లెక్కలేదు. ముఖ్యముగ పేదవిద్యార్థు లెందరికో నెల నెలకు కొంతధనమును మనిఆర్డరుచేసి పంపుచుండెను. ఎవరైన విద్యార్థి సహాయము కోరి యుత్తరము వ్రాయుటయే తడవుగ వారిపేరు ఆమె జాబితాలో పడినదనవలెను. ఒకప్పుడు ప్రభుత్వమువారు విద్యార్థుల ఆత్మగౌరవమునకు భంగకరమగు నిషేధపుటుత్తరువును చేసిరని యదిమొదలు ప్రభుత్వమువారి గ్రాంటునుపొందు పాఠశాలలలోను కళాశాలలలోను చదువు విద్యార్థులకు సహాయము చేయుట నిలిపివేసెను.

ఆమెనుండి ధనసహాయము పొందినవారు కొందరు మోసముచేసిరి. గాని యామె వారిని పల్లెత్తుమాటననక తిరిగి వారికి సహాయముకూడ చేసెను. ఒకప్పు డామె అడయారులో నివసించువారి సౌకర్యముకొరకు నక్కడ నొక బ్యాంకును పెట్టించెను. కొంతకాలమునకు దానిలో నక్కడివారు దాచుకొన్న ధనము చాలభాగము హరింపబడినట్లు లెక్కలతనిఖీలో దొరికి, బ్యాంకు గుమాస్తాను అరెస్టుచేయు స్థితికి వచ్చెను. ఆసంగతి నామె విని వెంటనే లోటుధనమును తా నిచ్చి వానిని కాపాడి యెవరిసొమ్ము వారి కిప్పించి బ్యాంకును మూయించివేసెను.

దివ్యజ్ఞాన సమాజమునకుగాని, విద్యాశాలలకుగాని, మఱియేయితర సంస్థకుగాని ధనలోపమున్నదని యీామెచెవిని పడగానే ఆమె యెంతధనమునైన నిచ్చి యాలోపమును పూర్తిచేసెను. నీరు తోడినకొలది యూరుచుండునట్లు ఆమె దానములు చేసినకొలదియు నామె చేతిలో ధనము చేరుచుండెను. ఆమెచేతులతో దానముచేయవలెనని యెందరో ఆమెకు ధనము నిచ్చుచుండిరి.

## (11) అమ్మ

డా. బెసెంటు గొప్పదనమునంతను ఒక్కమాటలో వర్ణించవలెననిన 'ఆమె అమ్మ' అనిన చాలును. ఆమె కడుపున బుట్టిన బిడ్డ లిద్దరే, గాని, యామె నమ్మాయని పిలిచినవారు లక్షలు. ఆమె సంతమంది అమ్మాయనుట కేవలము మర్యాద కొఱకు కాదు. అందరును ఆమె మాతృత్వమును రుచిచూచిరి. సంస్థానాధిపతులు, పండితులు, యోగులు, రాజకీయ వేత్తలు ఎందరెందరో యాతల్లిని నోరార 'అమ్మా' యని పిలుచుచుండిరి.

కన్నతల్లి తనపిల్లల నెంత ప్రేమించునో వారికొఱ కెంత త్యాగము చేయునో, యెన్నిపాట్లుపడునో అందరు నెరిగిన సంగతే. డా. బెసెంటు దివ్యజ్ఞాన సమాజసభ్యులయెడల ముఖ్యముగ నామె శిష్యగణమునెడల, అంత ప్రేమయు, వారి పురోవృద్ధికొఱ కంతజాగ్రత్తయుదీసికొని, ఎందరినో త్రోవలో బెట్టి, యెందరినో గురుసన్నిధిని జేర్చెను. వా రందరు తమకు ద్వితీయజన్మమునిచ్చి పోషించి పెద్దలజేసిన యామె తమ తల్లియని భావించి, 'అమ్మా' యని పిలిచి తమ కృతజ్ఞతను చూపిరనిన, నందాశ్చర్యమేమున్నది?

ఆమె యనేకమందిని తన దయచేతను ప్రేమచేతను తప్పుత్రోవలనుండి తప్పించి బాగుజేసెను. అనేకమంది యువతీ యువకులు, ఊరు పేరు లేకుండ బోవలసినవారు, ఆమె యాదరణచే లోకమున దలయెత్తుకొని తిరుగగలిగిరి. దిక్కులేని నిరుపేదల కెందరికో ఆమె జీవనమార్గముల జూపి దిక్కు-

చూపెను. వారందరును ఆమె యవ్యాజప్రేమకు ఆమె తమ యమ్మయని యెంచి గౌరవించి తమ కృతజ్ఞతను దెలుపుకొని రనిన నాశ్చర్యమేమికలదు?

## (12) గురుభక్తి

డా. బెసెంటు దివ్యజ్ఞాన సమాజములో జేరుటకు చాలా పూర్వమే తన గురుదేవుని వాక్కును వినెను. ఈ సంగతి వెనుకటి అధ్యాయములలో నుదహరించితిమి. కాని, అప్పు డామె కా వాక్కెవరిదని తెలియదు. ఆమెకును తన గురుదేవునకును గల సంబంధ మీనాటిది కాదని యామె వెనుకటి జన్మల చరిత్రనుబట్టి విశదమగును. ఆమె స్వభావతః పరిపాలకవర్గమునకు జెంది యితరుల నాజ్ఞాపించి వారిచే పనిచేయించ దగినదియైనను తన గురుదేవుని యాజ్ఞలను మన్నించుటయందు దాసి. ఆమె మహీపీఠమునకు ప్రతినిధి యగుటచేత, ఆమె యీలోకమున జేసినపను లామె గురుదేవుని కార్యములు మాత్రమేగాక, ఆ మహీపీఠమం దాధికారిక పురుషులుగ నున్న యితర మహర్షులకార్యములు కూడ గలవు. అనగా, మహీపీఠమందలి యాధికారిక పురుషులీలోకమున జేయవలసిన కార్యములన్నియు నామెద్వారా చేయుచుండిరి. వారందరిశక్తులు ఈలోకమున ప్రసరించుట కామె శరీరము తగిన యుపాధి యయ్యెను.

వారందరియెడలను ఆమె భక్తి కంతములేదు, వారి మాట కడ్డు లేదు, వారియాజ్ఞయైనయెడల యుద్ధరంగములోని సైనికునివలె, మారుఆలోచనలేక ఆ యాజ్ఞను మన్నించు

చుండెను, ముందు వారు చెప్పినవని చేసి తరువాత వారెందుకా పని నావిధిముగ జేయుమనిరని యోచించుచుండెను, గాని, ముందుగావారి యాజ్ఞల మంచిచెడ్డలను తర్కించుచు కూర్చొనుట నెఱుగదు. వారి కార్యమనిన ఆమెకు ప్రథమకర్తవ్యమగుటను, వారీలోకమున నొక మహత్కార్యము నెరవేర్చుటకు స్థాపించిన దివ్యజ్ఞాన సమాజవిస్తరణము, దివ్యజ్ఞాన ప్రబోధము ఆమె ముఖ్యకర్తవ్యములై, ఆకార్యనిర్వహణమునకు తక్కిన యుద్యమములన్నియు సహాయభూతములు ఉపాయములునయ్యెను. ఆమె తన సర్వస్వమును గురుదేవుని కన్ని వేలేండ్లక్రిందటనే సమర్పించుకొనెను. ఆరహస్యము నెరింగిన వారికి ఆమె సర్వతోముఖశక్తి సమర్థతలకును ఆమె జీవితమునందలి మహత్తునకును కారణము విశదమగును. వారే ఆమె చేసిన సేవయొక్క విలువను తెలిసి మెచ్చగలరు, గాని, తదితరులకది సాధ్యముకాదు.



## అంత్యకాలము

1930 సంవత్సరాంతమున యూరోపాలో సంచారముజేసి యడయారుకు తిరిగివచ్చినప్పటికి ఆమె యారోగ్యము చెడియుండెను. కాని 55 వ దివ్యజ్ఞాన వార్షికసభలకు కాశీ వెళ్ళెను. ఆ తరువాత అడయారులోనేయుండి ఎప్పుడోగాని మేడదిగలేదు, విశేషముగ పనిచేయలేదు. క్రమముగ కృశించిపోయెను. ఆమె మేడదిగుట కొక Lift (బరువులెత్తు యంత్రము) ను

పెట్టించిరి. 1931 సం. డిసెంబరులో నచట జరిగిన దీ. స. వార్షికసభ నారంభించుటకు వెళ్ళెదనని యామె యాకస్మికముగ గోరుటచేత క్రిందకు దింపిరి. ఆరంభోపన్యాస మారంభించినంతనే పూర్వపు జ్వాల బయలువెడలి యథాప్రకారము వాక్ప్రవంతి ప్రవహించెను. శ్రోతలు విద్యుచ్ఛక్తి తాకిన వారివలె భ్రాంతులైరి. ఆమె కొన్ని నిమిషములు మాత్రమే మాట్లాడెనుగాని యామాటలు శ్రోతల హృదయములలో నమృతమువలె బ్రవేశించెను. కాని, యా స్వల్పశ్రమ ఆమెకు చాలా ఆయాసము గలిగించెను. అదియే యామె కడపటి యుపన్యాసము.

1932 సం. లో ఆమె జన్మదినమున యథాప్రకారము మామె కన్నిమూలలనుండియు సందేశములు వచ్చెను. ఆరోజున బ్రాహ్మణు లామెకు పూర్ణకుంభము సమర్పించిరి. ఆ సాయంత్రము మామె తనగదియొద్ద వసారాలో పూవులగుట్టల మధ్య గూర్చొనియుండ నడయారు వాస్తవ్యులొక్కొక్కరే యామెకు నమస్కరించి పుష్పములర్పింప, యామె వారిచేతులు పట్టుకొని యాశీర్వదించి పంపెను. 1932 సం. డిసెంబరులో 57 వ దీ. స. వార్షికసభ లడయారులో జరిగెను. గాని అమ్మగారు మేడదిగి రాలేక, తాత్కాలికాధ్యక్ష ప్రతినిధిగ పని చేయుచుండిన యుపాధ్యక్షుడు ఏ. పి. వారింగ్టన్ ద్వారా ప్రతినిధుల కొక సందేశము నంపెను:—

"నామిత్రులారా, సోదరులారా, పుత్రులారా, పుత్రికలారా, నేడు మీకందరకు హృదయపూర్వకముగ స్వాగత మిచ్చుచున్నాను. మీలో ప్రతియొకరును నాకు కుమారుని

వలెనో కుమార్తెవలెనో అత్యంత ప్రేమాస్పదులు. పరమ గురుని యిట నాచుట్టును మీరు సమావేశమై యుండుట కంటె నాకానందదాయకమగు విషయ మింకొకటిలేదు. ఆ పరమపురుషుల నివాసమునకే మీకు నేను స్వాగత మిచ్చు చున్నాను.

ఆయన యాశీస్సు ఆయన బిడ్డలందరి శిరస్సులపై కురియుగాక !

ఆయనా సన్నిధిని మీరందరు విశ్రాంతి గాంచెదరు గాక !

ఆయన ప్రేమ మీతో నుండుగాక!

పరమగురువుల సేవార్థము వారిబిడ్డల సహాయార్థము ఈవార్షికసభ ఆరంభమైనదని తెలియజేయుచున్నాను."

ఆసభకువచ్చిన రమారమి 700 ప్రతినిధులు డిసెంబరు తే 26 దిని వరుసగా నొక్కొక్కరు ఆమెను దర్శించి, ఆమె సన్నిధిని మోకరించి ప్రముక్క పుష్పముల నర్పించి యామె యాశీస్సుల నొంది వెడలిరి. అంతసేపు కూర్చొని అందరిని ఆదరించి యాశీర్వదించుట ఆమెకు అత్యంతానందమును నను కూర్చెనుగాని, మిక్కిలి ఆయాసము గూడ గలిగించెను.

తరువాత క్రమముగ నామె సీరసించి వసారాలో కూర్చొని అడయారునదిపై పు పూర్వము పరమపురుషు లచటికి దయచేయుచుండిన దిక్కున చూచుచు కూర్చొనుట దప్ప మరి యేపనియు జేయజాలకుండెను. అత్యంతాప్తులు, పరిచారకులు తప్ప మరెవ్వరిని ఆమె చూచుటలేదు. ఆ శరీర

ములో జీవు డొక స్వల్పాంశను మాత్రముంచి బైటకు పోవు చున్నట్లుండెను. ఆ విషయమున యోగి లెడ్బీటరు ఇట్లు వ్రాసెను:- "శరీరములో నుండి జీవు డంతమెల్లగా బైటకు పోవుటకు కారణమేమో యూహింపజాలను. బహుశః, పరమ పురుషులకు లోకమున కర్త్యావశ్యకములై యున్న తమ శక్తుల ప్రసారము కొఱకు కేంద్రముగ నుండుటకా శరీరము ఇంకను కావలసినందున యుంచుకొనియుందురు. ఆమె తన శరీరము నా శక్తులకు బహు ప్రయోజనకరమగు నుపాధిగ జేసికొన్నందున, జీవు డితర పనులమీద బైటకు పోయినను శరీర ముపయోగపడుచున్నది."

క్రమముగ క్షీణించిన స్థూలదేహమును ఆనీ బెసెంటు 1933 సం. సెప్టెంబరు తే 20 ది సాయంత్రము గం. 4 లకు పూర్తిగా విడిచిపెట్టెను.

డా. బెసెంటు తన స్మృతి వాక్యముగ<br>
'సత్యము ననుసరించుట కామె యత్నించెను'<br>
అని వ్రాసిన చాలునని యొకప్పుడు చెప్పెను.<br>
కాని, ఆమె నెఱింగిన వా రావాక్యమును<br>
'ఆమె సత్యము ననుసరించెను' అని సవరించిరి.<br>
ఆమె సత్యము ననుసరించెను, ఆమె సత్యస్వరూపిణి.

## (2) అంత్యక్రియలు

1933 సం. సెప్టెంబరు తే 21 ది ఉదయము ది. స. ప్రధానకార్యస్థాన ఉపన్యాస మందిరము (Hall) లోనికి అమ్మ గారి కళేబరమును తెచ్చి, యచట ఆమె మిత్రులు, శిష్యులు,



స్మారకోద్యానవనము

1933 సం. సెప్టెంబరు 21వ తేదీన డాక్టరు అనీ బిసెంటు స్థూలశరీర దహన సంస్కారమయిన స్థలము.

బిడ్డలు, భక్తులు, ఆమె మొద్ద సెలవుగైకొనిన తరువాత, మెస్సానిక్ హాలుకు గొనిపోయిరి. అచట మెస్సానిక్ సంప్రదాయాను సారము సంస్కారము జరిగిన తరువాత గొనిపోయి చంద నపు కర్రలలోను, పరిమళతైలములలోను బెట్టి యగ్నిహోత్రుని ద్వారా పంచభూతములకు, సమర్పించిరి. మిగిలిన యస్థులను భస్మమును అక్కడనే పూడ్చి, చుట్టును సుందరమగు నుద్యానమును వేసిరి. దానికి 'The Garden of Remembrance' (స్మారకోద్యానము) అని పేరుబెట్టిరి.

ఇది పంచకోణతారాకారమున గట్టబడి చుట్టును కమల ములతో నిండిన చిన్న జలాశయములును, వానిచుట్టును నానా వర్ణపత్రపుష్పయుతమగు నుద్యానమును గలిగి, చలువరాతి తిన్నెలతో విరాజిల్లుచున్నది దీనికి ఉత్తరమువైపున ప్రక్కనే అడయారునదియును తూర్పున ననతిదూరముననే సముద్ర మును దక్షిణ పశ్చిమములను సరుగుడుతోటలును ఉండి యెంతో మనోహరముగను బహుప్రశాంతముగను నుండును.

అక్కడనే యీ తరువాత యోగి లెడ్బీటరు అస్థులను, డా. అరండేలు అస్థులనుగూడ స్థాపించిరి. అడయారు థి. స. కార్యస్థాన ఆవరణయంతయు గొప్పపుణ్యక్షేత్రము, తపోవ నము. దానిలో కొన్ని స్థలములు ప్రత్యేకముగ దివ్యశక్తులు ప్రసరించు కేంద్రములై యచటి కేగువారిని తన్మయుల జేయును. అట్టి స్థలములలో నీయుద్యాన మొకటి.

అక్కడ మూడు రాతిపలకలమీద నీక్రింద నుదహ రించిన వాక్యములు ఇంగ్లీషులో చెక్కియున్నవి:—

(1)

1907 మొదలు 1933వరకు దివ్యజ్ఞాన సమాజాధ్యక్షురాలుగ నుండిన అనీబెసెంటు శరీరము 1933 సం. సెప్టెంబరు 21 తేదీని ఇచ్చట దహనము చేయబడెను.

(2)

పరమపురుషులకు నమ్మినబంటు, సత్యశీల, సర్వభూతహిత యగు అనీ బెసెంటుకు గౌరవపూర్వకముగను ప్రేమపూర్వకముగను, ఈ స్మారకోద్యానము 1935 సం. వజ్రోత్సవ సమయమున సమర్పింపబడినది.

(3)

చార్లెస్ వెబ్‌స్టర్ లెడ్బీటరుగారికి ప్రేమపూర్వకము గౌరవపూర్వకమునైన స్మారకము. ఆయన స్థూలశరీరభస్మము అనీ బెసెంటు శరీరభస్మముతో గూడ, వారిద్దరు కోరదగినరీతి, నిచట విశ్రాంతి గొనుచున్నది.



# సమాప్తి

ప్రపంచ పరిణామములో నొక్కొక నూతనశకారంభమునకు ముందా నూతన పరిస్థితులకు లోకమును సిద్ధపరచుటకు మహాపురుషు లవతరించెదరని ప్రపంచ చరిత్రవల్ల దెలియుచున్నది. అట్టి యవతార పురుషులలో ఆనీ బెసెంటొకరు. ఆమె యీ యవతారమున స్త్రీ శరీరమును కొన్ని కారణములచే ధరించెను, గాని, యిదివర కవతరించిన యే మహా పురుషునకును ఆమె తీసిపోలేదు. ఇటుసైన ఆ మహా సీయు డెప్పు డెక్కడ నవతరించునో చెప్పజాలము, గాని, యీ యవతారమునం దాయన చేసిన బోధలు, చూపిన త్రోవలు, నడచిన నడతలు చక్కగా నర్థముచేసికొని అనుసరించువారి కాయనతోగూడ బుట్టి ఆయన ననుసరించి పనిచేయు మహా భాగ్యము గలుగును. ఆయన ననుసరించుటయన పరమపురుషుల ననుసరించుట, కనుక, పరమపురుషుల సేవించి దరింపగోరువారెల్లరు ఆనీ బెసెంటు జీవితచరిత్రమును తెలిసికొని, అందలి రహస్యము నెఱింగెదరేని కామ్యార్థ సిద్ధిపొంది ధన్యులగుదురు.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః



# అనుబంధములు

## 1. ఆనీ బెసెంటు ది. స. అంతర్జాతీయ వార్షిక సభలలో యిచ్చిన యుపన్యాసములు

| సం॥రము. | విషయము |
| --- | --- |
| 1893 | The Building of the Kosmos = జగన్నిర్మాణము. |
| 1894 | The Self and its Sheaths= ఆత్మ, వానికోశములు. |
| 1895 | The Path of Discipleship = శిష్యపథము. |
| 1896 | The Four Great Religions= నాలుగు గొప్పమతములు. |
| 1898 | Evolution of Life and Form = జీవరూపముల పరిణామము. |
| 1899 | Avataras = అవతారములు |
| 1900 | Ancient Ideals in Modern Life = ఆధునిక జీవితములో ప్రాచీనాదర్శములు. |
| 1901 | The Religious Problem in India = ఇండియాలో మత సమస్య. |
| 1902 | The Laws of the Higher Life = పరమార్థ నిష్ఠా నియమములు. |
| 1903 | The Pedigree of Man = మానవ వంశావళి. |
| 1904 | Theosophy in Relation to Human Life = మానవుని జీవితమునకు సంబంధించిన దివ్యజ్ఞానము. |
| 1905 | Bhagavadgeeta = భగవద్గీత |
| 1906 | The Upanishads = ఉపనిషత్తులు. |
| 1907 | An Introduction to Yoga = యోగశాస్త్ర ప్రవేశము |

సం.రము. విషయము

1911 Ideals of Theosophy = దివ్యజ్ఞానాదర్శములు.
1912 Theosophy = దివ్యజ్ఞానము.
1913 Indian Social Reform = ఇండియాలో సంఘ సంస్కరణము.
1915 Life's Deeper Problems = గాఢ జీవిత సమస్యలు.
1916 Duties of the Theosophist = దివ్యజ్ఞాని ధర్మములు.
1918 Religious, Social, Educational, and Political Reconstruction = మత, సాంఘిక, విద్యా, రాజకీయ పునర్నిర్మాణము.
1919 The Duties of the T. S. = ది. స. ధర్మములు.
1920 The Great Plan = మహాసంకల్పము.
1921 Theosophy and World Problems = దివ్యజ్ఞానము, ప్రపంచ సమస్యలు (ఈ మకుటముతో నా యేడు నలుగురు నాలుగు ఉపన్యాసముల నిచ్చిరి. ఆ. బె. ఇచ్చిన దొకటి)
1922 Your World and Ours = మీ లోకము మా లోకము (ఒక్కటే యుపన్యాసము)
1923 Religion and Religions = మతము, మతములు. (ఒక్కటే యుపన్యాసము)
1924 The Real and the Unreal in a Nation's Life=ఒకజాతి జీవితమందలి సదసత్తులు (ఒక్క యుపన్యాసము)
1925 The Three World Movements : The Basic Truths of the World Religions = మూడు ప్రాపంచికోద్యమ

సంరము. విషయము.

ములు: ప్రపంచములోని మతముల మూలతత్త్వములు
(ఒక్క యుపన్యాసము)

1927 Work of the Manu = మనువు చేయుపని. (ఒక్క యుపన్యాసము)

1929 The Past and Future of the T. S. = దివ్య జ్ఞాన సమాజము యొక్క భూత భవిష్యత్తులు (ఒక్క యుపన్యాసము)

1930 The Future of the T. S. = ది. స. యొక్క భవిష్యత్తు (నాలుగింటిలో నొక యుపన్యాసము)



## 2. ఆనీ బెసెంటు జన్మదిన (అక్టోబరు తే 1 ది) సందేశములు

1913. "బలముగను, ధైర్యముగను, సత్యముగను నుండుము."

1914. "పనిలో మన ప్రాముఖ్యతకు ఇయ్యదగిన దానికంటె నెక్కువ విలువ నిచ్చెదము. ఒకచోటనుండి తీసి మరి యొకచోట నాటుట సస్యపు మొలక కెంత మేలు చేయునో మనకు నంత మేలుచేయును."

1915. "ఇప్పుడు మన మున్న ప్రాపంచిక సంకటసమయము వంటి సమయములలో దుర్బలులు తుపానుగాలిలో గొట్టుకొని పోవుదురు. 'ధైర్యముగనుండుడు, పురుషుల వలె పనిచేయుడు' అని యొక ప్రాచీనరచయిత చెప్పు చున్నాడు. నా తొలియౌవనమున ప్రపంచములో

నొంటరికతైన 'బలముగ నుండుము' అనువాక్యమును నా మేలుబంతిగ గైకొంటిని. నా వార్థకములో నా వాక్యమును మీ కందజేయుచున్నాను. 'బలముగ నుండుము'.

1916. "సోదరులారా! స్వస్తి! అంధకార బంధురమైన నడిరాత్రియందున్న మీరు అరుణోదయ మగునని నమ్ముడు".

1917. "ఇచ్ఛ, జ్ఞానము, తెలివి, ఇవి మానవుని యందున్న భగవంతుని మూడు మూర్తులు. తెలివి సంకల్పించుటకు, జ్ఞానము (వివేకము) ప్రబోధించుటకు, ఇచ్ఛ పనిచేయుటకు".

1918. "స్థిరముగ నుండుడు, బలముగ నుండుడు, ఆత్మనిగ్రహము గలిగియుండుడు, మీ పాదములు, అనేక యుగము లను శిలపై నున్నవి. గాలికి కొట్టుకొను మేఘములకుపైన 'తార' వెలుగుచున్నది."

1919 (మౌనదినము, శాంతికై ప్రార్థన) "దేనికి కరమై యుండున దెద్దియు నుండదో ఆ భగవంతుని గుప్త జీవమూ, నిన్ను మావైరుల ముఖములలో జూచి వారిని మేము ప్రేమించునట్లు మాకు తోడ్పడుము. నీ శాంతి యారీతిగా లోకమున ప్రసరించుగాక, నీయిచ్ఛ స్వర్గమునందువలె భూమిమీద నెరవేరుగాక."

1920. "కాలము కష్టకాలము, పని భారముగ నున్నది, కాని, మనము పూర్వాచారములు మతమూర్ఖత లోకము నెదిరించినపుడు తీవ్రతను భరించుటకు ముందుగ మహా

సేనాని పంపిన పురోగాములమని జ్ఞాపకముంచుకొన వలెను మనవెనుక వచ్చు తరమువారు ఇప్పటికంటె నెక్కువ పరిశుద్ధమగు వాతావరణమునందు వసించి గొప్ప శీలమును అలవరచుకొన గలుగుటకై మన మా తీవ్రతను భరించవలెను. మనలో ప్రస్తుతమున్న చెడ్డలక్షణము లన్నిటిని తొలిగించుకొను వఱకు రాబోవు నూతనయుగ నాగరికత రాజాలదు. మాతృ దేశమునందలి మహర్షుల సేవజేయుటలో భయంకర మగు పరిస్థితుల నెదుర్కొనుట బహు గొప్పకార్యము. మనము వెలుగుదండులో చేరినవారము. మనకు గెలుపు తప్పదు. మనయధికార్ల నెరుగుదుము, మన సేనానిని నమ్ముదుము. మనధ్వజము ప్రాక్తారచే ప్రజ్వలించుచున్నది. ఆ ప్రాక్తారయే భారతతార. మనకు మనలక్ష్యము దానిని జేరు మార్గము దెలియును, గనుక, మనకు భయము లేదు, సంశయము లేదు. అంత రాత్మలో వసించియుండు నిత్యత్వమునందలి శాంతిని మీ హృదయములలో నుంచుకొనుడు"

1921. "తలవరీ! రాత్రి యెట్లున్నది?".

'రాత్రి యరుణోదయమును సమీపించుచున్నది.'

'సూర్యోదయము దగ్గరగుచున్నదని నీ కెట్లు తెలి యును?'

'ప్రభాతతార, ప్రాక్తార, దిఙ్మండలమున వెలుగు చున్నది.'

'సోదరులారా! సిద్ధముకండు! తలలెత్తుడు, మీ జ్యేష్ఠ సోదరుడు సమీపించుచున్నాడు"

1922. "ప్రపంచమంతటనున్న నా సోదరులకు నాజన్మదిన అభివందనములనుహిమాలయములమధ్యనుండివ్రాయుచున్నాను. కాని, యీపర్వతములు భూమినుండి పుట్టిన మేఘములచే దట్టముగ గప్పబడి కంటికింపుకయు నగుపించుటలేదు, అందుచేత అవి యక్కడ యుండుటను సంశయింపనా? వాని పచ్చని చరియలు, ఉన్నతశిఖరములు, ఆకాశమును చొరుచుకొని పోవు హిమశృంగముల, ఊహాకల్పితములని, స్వప్నములని యననా?, అనను, వానిని నేను చూచితిని, వానిపై నడిచితిని, నే నెఱుగుదును.

సనాతనధర్మము, మనను నడుపుచున్న మహీపీఠము, మనకు ప్రబోధముగలిగించు జగద్గురువు, మనను పాలించు ఇచ్ఛాస్వరూపము, సత్యమని నమ్మకముగను నిశ్చయముగను చెప్పుచున్నాను. హిమాలయములు వొడిమైనను వారందరు నిత్యములో నుందురు. శ్వేతద్వీపము పైన వెలుగు తారను నే జూచితిని. నాసోదరులారా! కన్నులెత్తి చూడుడు, మీకు కూడ అది యగుపించును; అప్పుడు, తుపానును నిశ్చయముగ నెరుంగరుడు."

1923 "అణువు అణువునను స్పందించు నో గురు ప్రజీవమా,
ప్రతి ప్రాణిలోను వెలుగుచున్న యోగు ప్రజ్యోతీ,
సమస్తమును ఏకముజేయు నో గురు ప్రేమా,
నీతో తాదాత్మ్య మొందినట్లు ఎవడు భావించునో

అట్టి ప్రీతి యొకడు నితరు లోకాంతరములతో తాదాత్మ్యమొందియున్నట్లు తెలియుగాక".

1924. "భూమిపై నీకత్యంత ప్రియుడెవరో, ఎవనికొఱకు త్యాగము జేయుట సంతోషమో వానిని గుఱించి యాలోచింపుము. పిదప ఆదర్శమువైపు కన్నులనెత్తి ఆయన కున్నంత ప్రేమను, ఆసంతోషదాయకమగు త్యాగమును, మానవసోదరు లందరకు మనము ఈయ వలసియున్నదని స్మరింపుము. మానవులకంటె తక్కువ వర్గములలోని ప్రాణులతో మనకుగల సంబంధము లలో అందరము చరించు ఏకైకజీవమును అనుభవించు చున్నాము గనుక గొప్పప్రాణులు కొద్దిప్రాణుల యెడల చూపవలసిన యుపకారబుద్ధి, దయ, రక్షణము మరిచిపోకూడదు."

1925.
1926. (సందేశము లేదు)
1927.

1928 "ఈ సంధి సమయమున జీవించి యుండుటయు, 'ధర్మ మును నెరవుశక్తి' (దానికేపేరు పెట్టినను పెట్టవచ్చును) కి ఉపాధులమగుటకు సంతోష పూర్వకముగ సమర్పించు కొనుటయు బహు మహద్విషయములు. ప్రేమించువా రందరిసహాయము కావలసియున్న యీప్రపంచములో, గుడ్డిగాను, కోపముతోను బాధపడుచున్న జను లనేకు లున్న యీప్రపంచములో, మన మున్నందున సేవ నిజమగు మహాత్త్వము."

1929. "మనలో ప్రతియొకడును తనకు హానిచేసినాడని తాననుకొను ప్రతివానిపైనను కోపమానవాలునకైన లేకుండ తన హృదయమునుండి తొలిగించుకొనుటకు కష్టపడి, విరామము లేకుండ పాటుపడిన యెడల ప్రపంచమంతటను శాంతి పాలించునని, బహుశః ఆశ్చర్యముతో, చూచెదము."

1930. 1929 సం లోని సందేశమే.

1931. "పరమ గురువులు తాము జ్యేష్ఠసోదరులమని యందురు, మనముకూడ వారి నట్లే పిలుచుచున్నాము. ఆవిధముగనే అతినీచుడైన పాపి మన మతి దయతో సంరక్షించవలసిన శిశుసోదరుడని చెప్పుకొనుటకు ఆతురిత పడుదుమా? ప్రపంచ మందున్న యీ శిశువులందరకును వచ్చే సంవత్సరములో ప్రతిదినమునను ప్రేమపూర్వకముగు నొక సంకల్పమును బంపెదము."

## జన్మదిన తీర్మానములు (మాదిరికి)

1. "వచ్చే సంవత్సరములో ప్రతిదినమున, దినమంతయు, నాజీవితమును నాలోనున్న క్రీస్తుతో సమశ్రుతి గలుపుటకు ఓరిమితో యత్నించెదను."

2. "వచ్చే సంవత్సరము ప్రతిదినమున, దినమంతయు నాజీవితమును నాహృదయములో నివసించియున్న గురుదేవుని జీవితముతో సంపూర్ణ సామరస్యము నొందునట్లు సరిజేయుటకు ఓరిమితో యత్నించెదను."



## 3. ఇతర సందేశములు

1924 సం జూలై తే 23 దిని డా. బెసెంటు లోక సేవనారంభించి 50 సం. లయినందున గొప్ప స్వర్ణోత్సవములు జరిగెను. ఆసందర్భమున నారోజున లండన్ క్వీన్సు హాలులో జరిగిన సభకు పంపిన సందేశము:—

"నేడు యువకులుగ నున్నవారికి సందేశము—

మేము చేయక విడిచినట్టి, మీరు చేయబోవునట్టి మహా కార్యములతోను, మేము కనుగొనజాలని గొప్ప యుద్యమములతోను నిండిన భవిష్యత్తుకొరకెదురు చూదుదు. మానవజాతి తన బిడ్డలు ఒక్కొక్క తరమువారు తనను సేవించుచురాగా నిరంతర క్రమోన్నతి నొందుచున్నది. ఎప్పటి కప్పుడు గతమునుండి నూతనయుగము పుట్టుచుండ, ప్రపంచము నవనవ యౌవనమును బొందుచుండును. కొందరు నేను యౌవనములో నున్నానందురు. ఔను, నిత్యములో వసించువారికి వృద్ధాప్యముండదు గనుక, వారన్నది నిజమే".

1931 సం. డిసెంబరులో అడయారులో జరిగిన అంతర్జాతీయ వార్షికసభలో నిచ్చిన యుపన్యాసమునుండి:—

"అది (దివ్యజ్ఞానము) జనులకు వ ంచు జీవనముగాని మాటలు కాదు. మీరు పండితులు కానందున జనులను మార్చజాల మనుకొనవద్దు. వారు మీజీవితమును చూచెదరు గనుక మీరు వారిని మార్చగలరు.

'మీలోని దైవాంశను నమ్ముడు. మీకు బలమిక్కడ దొరుకును. మీరు దైవాంశలు. మన చుట్టునున్న

వారిపైన మనము ప్రేమను కురిపించినపుడే మన ముత్తమోత్తములమగుదుమన్న నాకు సత్యమని తెలిసినసంగతిని మీకు తెలియజేయ గలిగిన భాగుండును. మీ నమ్మక మెద్దియైనను లెక్కలేదు, మీరెట్టి వారను నది బహు ముఖ్యమైన విషయము. ... మీలో నున్న భగవంతున కొక యవకాశము నీయుడు. మీ హృదయమును విప్పి మీ చుట్టునున్న వారందరిపైన ప్రేమ కురిపించుడు. ఒక్కొక్కపుడు ప్రేమను చూపు విధము తెలివితక్కువగ నున్నను ప్రేమ యెప్పుడును మంచిదే. ...మీలోని యాత్మను, దేవుని, విశ్వసింపుడు. అప్పుడు మీ జీవితము ప్రేమమయమై యుండును గనుక అత్యుత్తమమైనదగును.

1931 సం. లో వ్రాసినది. 1932 సం. లో ప్రకటింపబడెను.

## దివ్యజ్ఞాన సమాజ భవిష్యత్తు

ఇది ప్రతి దివ్యజ్ఞానియు తన హృదయమునకు మనస్సునకు వేసికొనవలసిన ప్రశ్న. మనము విశ్వసోదరత్వమున కంకుర స్థానముగ నుండగోరెదము. అది యుత్తమమగు నాశయము. మన ఆశయము యథార్థమగునట్లు అంకురము తన చుట్టు నొక తగిన దేహమును, జీవచైతన్యమున కొక యాలయమును, నిర్మించుకొనుటకు ద్రష్ట. ద్వేషము - మరణము అయిన ద్వేషము - చే సంభవించిన నాశనకర వేదనల ననుభవించు ప్రపంచము నుద్ధరించుటకు తన దివ్యలక్షణములను కొన్నిటిని ప్రకటించుట కొక యుపాధిని నిర్మించుటకు, సృష్టిశక్తులను మనచుట్టు ప్రసరింప జేయుటకు మన మేమి చేయుచున్నాము ?

# డాక్టరు అనీబిసెంటు

## 2వ భాగము : పూర్వజన్మ వృత్తాంతములు

## విషయ పరిచయము

డా. బెసెంటు జీవితమహత్త్వము తెలుంగుటకా పేరుతో నవతరించిన జీవుని పూర్వజన్మవృత్తాంతము కొంతవరకైన దెలియుట మంచిది. ఆమెయును, యోగి సి. డబ్లియు. లెడ్బీటరును తమ యోగశక్తుల నుపయోగించి: సృష్టి వృత్తాంతమును పరిశోధించి 'Man: Whence, How and Whither' (మానవుడు : ఎక్కడనుంచి, ఎట్లు, ఎక్కడకు) అను మహాగ్రంథమును వ్రాసిరి. మఱియును కొందరు ప్రసిద్ధవ్యక్తుల పూర్వజన్మములను గూడ పరిశోధించి వ్రాసిరి. వానిలో శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి పూర్వజన్మవృత్తాంతములను రెండు సంపుటములుగ (ఆల్కియోనీ జన్మవృత్తాంతము లను పేరుతో) ప్రకటించిరి. ఆ రెండు పుస్తకములను. అనుసరించి యీ భాగము వ్రాసినాము. 'మానవుడు: ఎక్కడనుంచి, ఎట్లు, ఎక్కడకు' అను పుస్తకములో నీ 'భూమి' పుట్టకముందు చంద్రమండలములో జీవపరిణామము జరుగుచుండినప్పటి నుండియు కొందరు జీవుల పరిణామము నందలి వివరములను నిదర్శన పూర్వకముగ నైకొని ఆయా కాలవిశేషములను వర్ణించిరి.

మనదేశములో జీవు డమృతుడనియు, ననేక జన్మముల నాత్త్రి క్రమముగ సంపాదించిన యనుభవములచే ఆత్మవికా

సము నొంది సంసారమును తరించుననియు నమ్మని వారుండరు. కాని, యీపరిణామముగురించి యీగ్రంథములో వ్రాయ బడిన పరిణామ వ్యూహములు (Schemes of Evolution), చక్రములు (గ్రహమాలలు = Chains), పరివర్తములు మొదలగు వివరములు అనేకులకు క్రొత్తగా నుండును. వానిని గురించి దివ్యజ్ఞాన ప్రబోధినిలో 9 వ అధ్యాయములోను పైన పేర్కొనిన మానవుడు అను పుస్తకములోను చదువవచ్చును. అయినను ఈగ్రంథములోని విషయ మర్థమగుటకిచట ఆవిషయములగురించి సంగ్రహముగ వ్రాయవలసి యున్నది. సృష్టిలో అనేకకోట్ల బ్రహ్మాండము లున్నవి. ఒక బ్రహ్మాండము నొక సౌరకుటుంబము అని పేర్కొందము. ఒక సూర్యనారాయణమూర్తి ఆబ్రహ్మాండమునకు నాయకుడు. మన బ్రహ్మాండములో మన కగుపించు సూర్యబింబము మన సూర్యనారాయణమూర్తికి స్థూలోపాధి. మనభూమితో సంబంధించిన బ్రహ్మాండమును గురించియే మన మాలోచించెదము. దానిలో పది పరిణామవ్యూహము లున్నవి. వానిలో ఏడింటినిగురించిమాత్రమిప్పుడు తెలియునుగనుక ఏడు వ్యూహములే యున్నవనుకొందము. ఒక్కొక్క వ్యూహములో జీవులు పరిణామము నొందుచున్నారు. అన్నివ్యూహములలోని పరిణామము ఒక్కయవస్థలో లేను; కొన్నిటిలో చాలా వృద్ధిలో నున్నది, కొన్నిటిలో నింకను వెనుకబడియున్నది.

ఒక్కొక్క వ్యూహములో నేడేసిచక్రములు (Chains)ను ఒక్కొకచక్రములో నేడేసి గోళములు నున్నవి. ఒకవ్యూహములోని 4వ చక్రము స్థూలతమము, దానిలోని 4-వగోళము

స్థూలతమమగు పృథ్వీతత్వపు గోళము. ఆస్థూలతమగోళముల పేర్లనుబట్టి వ్యూహములకు పేర్లుబెట్టిరి. ఆప్రకారము (1) వల్కన్ (2) శుక్ర (3) భూమి (4) బృహస్పతి (5) శని (6) యూరేనస్ (7) నెప్ట్యూన్ గ్రహములు ఏడును ఏడు ప్రత్యేకవ్యూహములలోని స్థూలాతి స్థూలమగు పృథ్వీతత్వపు గోళములు గనుక ఆపేర్లనే ఆవ్యూహములకు పెట్టిరి. ఒక వ్యూహములో పరిణామమున ప్రవేశించిన జీవులు జీవన్ముక్తు లగునంతవరకు మరియొక వ్యూహములోని కేగజాలరు.

ఒక వ్యూహములోని ఏడు చక్రములలోని యన్నిగోళ ములు పార్థివ ప్రకృతిగలవి కావు. మన భూవ్యూహములో ఏడింటిలో 3,4,5, చక్రములలో మాత్రము పార్థివగోళము లుండును. 1_7 చక్రములలో 1-7గోళములు ఆత్మలోకమునను, 2-6 గోళములు బుద్ధిలోకమునను, 3 - 5 గోళములు సూక్ష్మ (అరూప, లేక ,శుద్ధ) మానసికలోకమునను 4 గోళము స్థూల (రూప, లేక, అశుద్ధ) మానసికలోకమునను ఉండును. 2-6 చక్రములలో 1-7 గోళములు బుద్ధిలోకమునకు, 2-6 గోళ ములు సూక్ష్మ మానసిక లోకమునకు 3 _ 5 గోళములు స్థూల మానసిక లోకమునకు 4 గోళము భువర్లోకమునకు చెందినవి. 3-5 చక్రములలో1-7 గోళములు సూక్ష్మమానసిక లోకమునకు, 2-6 గోళములు స్థూల మానసిక లోకమునకు 3-5 గోళములు భువర్లోకమునకు, 4 గోళము భూలోకమునకు చెందినవి. 4 చక్రము (భూచక్రము) లో 1-7 గోళములు స్థూలమానసిక లోకమునకు, 2-6 గోళములు భువర్లోకమునకు, 3,4,5 గోళములు పృథ్వీలోకమునకు చెందినవి.

దీనినిబట్టి ఒకవ్యూహములో 1,2,3 చక్రములు ప్రవృత్తి యందు 4 వ చక్రము సంధియందు 5,6,7 చక్రములు నివృత్తి యందు నున్నవని విశదమగును. ఆ ప్రకారమే ఒకచక్రములో 1, 2, 3 గోళములు ప్రవృత్తియందు క్రమముగ స్థూలతర ప్రకృతిలో రూపములనొంది 4 గోళము స్థూలతమ ప్రకృతిలో రూపమునొంది పిదప 5,6,7 గోళములలో క్రమముగ స్థూల ప్రకృతిని విడుచుచు బోవును. ఒక చక్రములో పరిణామము నొందు జీవులుకూడ ఆ ప్రకార మాయా గోళములలో నుపాధులను నిర్మించుకొనును; ఒక పరివర్తములోకంటె నొక పరివర్తములో ఆ యుపాధులు ఎక్కువ సౌష్ఠవము, ఎక్కువ వికాసము నొందును.

భూవ్యూహములో మొదటిచక్రములో 1వగోళములోని పరిణామములో నభ్యాత్మవర్గులో ప్రవేశించిన చిత్కళవరుసగా నొక్కొక్క గోళములో పరిణామమొంది యొక పరివర్తము తరువాత నొక పరివర్తములో వికసించి ఆ చక్రకల్పాంతమున కావర్గులో పరిణామము పూర్తిచేసికొని రెండవ చక్రములో సౌరాత్మ వర్గులోజేరి పరిణామమొందును. కొన్నిజీవులా గమ్య స్థానముజేరలేక రెండవచక్రములో తిరిగి యా యభ్యాత్మ వర్గులోనే జేరును. మొదటి చక్రములో సౌరాత్మవర్గులో జేరిన చిత్కళ ఆ చక్ర కల్పాంతమున కావర్గులో పరిణామము ముగించుకొని రెండవచక్రములో చంద్రాత్మవర్గులో జేరును. ఒక్కొక్క వర్గులో నొకచక్రకల్పకాలములో పరిణామము జరుగును. వెనుక మూడవ (చాంద్ర) చక్రములో మానవ వర్గులో జేరి కొంతకాల మక్కడ ఆ వర్గులో పరిణామము

బొందిన జీవులు భూచక్రములో కొందరు సిద్ధిపొంది పరమ పురుష వర్గములో జేరిరి, కొందరు అందుకు సిద్ధముగ నున్నారు. ఒక వ్యూహములోని యేడు చక్రములలో నొక సమయమున నొక చక్రములోనే పరిణామము జరుగును. కనుక, భూ వ్యూహములో 1,2 చక్రములలో పరిణామము పూర్తియై యందలిగోళములు నశించెను; 3 వ చక్రములో పరిణామము పూర్తికానున్న సమయమున భూచక్రగోళసృష్టి ఆరంభమై ఆ చక్రకల్పాంతమున నందులో పరిణామ మొందుచుండిన జీవులు క్రమముగ భూచక్రములో తమ అనంతర పరిణామ పూర్తి కనుకూల సమయము వచ్చినప్పుడు చేరిరి. చాంద్ర చక్రగోళములు నిర్జీవమై క్షీణించుచున్నవి. చంద్రగోళము నిర్జీవ గోళము, శవము, క్రమముగ క్షీణించుచున్నది. ఈ భూవ్యూహములో 5 వ చక్రగోళము లింకను సృష్టికాలేదు, అయినప్పు డవి మూడవ చక్రములోని గోళమువలె నుండును, గాని, యందలి పరిణామము నివృత్తి యైయుండును.

ఒక్కొక్క చక్రములోను చిత్కళ క్రొత్తగా పరిణామములో ప్రవేశించి అధ్యాత్మవర్గులో నారంభించును. దీనిని థి. స. గ్రంథములలో నీశ్వరుని 'జీవతరంగ' మనిరి, కనుక, ఒక చక్రములో క్రొత్తజీవతరంగమునకు చెందిన యధ్యాత్మికవర్గు, పూర్వచక్రములోనుండి ఆయా వర్గులన్నిటిలోనుండి వచ్చిన భూతములు పరిణామము నొందుచుండును. ప్రస్తుతము భూచక్రములో మూడు పరివర్తములు పూర్తియై నాలుగవ పరివర్తములో స్థూలతమమగు నాలుగవ గోళములో పరిణా

మము జరుగుచున్నది. కనుక, మన మీభూవ్యాప్తి పరిణామ మధ్యకాలమున నున్నాము.

పూర్వజన్మ వృత్తాంతములను పరిశోధించినపుడు ఒక్కొక్క జన్మములో నే యే జీవు లే యే సంబంధములలో గలిసికొనిరో వివరించిరి. ఆ యా జీవులను సులభముగ నాన వాలు పట్టుటకు ఒక్కొక్క జీవునకు (జీవాత్మకు) ఒక్కొక్క పేరుపెట్టి, ఆ పేరునే అన్ని జన్మల వృత్తాంతములలోను వాడిరి. ఉదా:- ఆనీ బెసెంటుగ బుట్టిన జీవాత్మకు హెరక్లిస్ అని, జిడ్డు కృష్ణమూర్తిగ బుట్టిన జీవాత్మకు ఆల్క్యోన్ అని పేరు పెట్టిరి. ఆపేర్లు ఏజన్మవృత్తాంతములో వచ్చినను, ఆజీవు డెవరో ఆనవాలు తెలియును. తెలిసినంతవరకు కొందరు జీవుల పేర్లు ఈ క్రింద వ్రాయబడినవి. ఆ పేర్లనే దీనిలో వాడితిమి.

ఈ పూర్వజన్మల వృత్తాంతములవల్ల అమ్మగారి పూర్వ చరిత్ర దెలియుటయేగాక ప్రపంచ చరిత్ర కూడ కొంతవరకు సూచితమగును, కాని, గ్రంథవిస్తరభీతిచే అమ్మగారి జీవిత ములో ప్రత్యేకముగా దెలిసికొనదగిన విషయములున్న జన్మల వృత్తాంతములనే కొంచెము వివరించివ్రాసి తదితరజన్మల వృత్తాంతముల వివరములు వ్రాయలేదు. ప్రపంచ చరిత్ర దెలియగోరువారు పైనుదహరించిన రెండు గ్రంథములను చదువవలెను.

ఈ పూర్వజన్మలలో రెండు మూడు తప్ప తక్కిన జన్మల సంవత్సరములు ఆల్క్యోన్ జన్మల సంవత్సరము లను బట్టియు ఆ యా జన్మలలో నాల్క్యోన్‌కు హెరక్లి సుకుగల బాంధవ్యమును బట్టియు నురమరగా చూచివేసినవి.

(ఈ జీవితముల చరిత్రలో నుపయోగించిన సాంకేతిక నామము లాయాజన్మములెత్తిన జీవులను తెలియజేయును. ఆ నామములు గల జీవుల కడపటి జన్మములో వారి పేర్లు తెలిసినంత వరకు ఇచట ఉదహరించబడినవి.)

అరోరా = కౌంట్ బుబ్నా - లికిక్సు
ఆర్కటూరిస్ = జిడ్డు నారాయణయ్య
ఆర్చర్ = ఎ. జె. విల్సన్
ఆల్కియోన్ = జిడ్డు కృష్ణమూర్తి
ఎతీనా = థామస్ వాఘన్ ముని
డిమీంగా = జిడ్డు కృష్ణమూర్తి తల్లి
ఒసిరిస్ = సిరాపిస్ మహర్షి
కేపెల్లా = యస్. మాడ్ షార్ప్
కేప్రికార్న్ = బాబు భగవాన్ దాస్
కుక్సు = ఆనరె. ఆర్వేకఫ్
కొరోనా = జూలియస్ సీజర్
జూపిటర్ = నీలగిరివాసుడగు సిద్ధపురుషుడు, అగస్త్య మహాముని
జెం (జెమిని) = ఇ. మాడ్ గ్రీన్
డెనెబ్ = లార్డ్ కొకేన్
ధృవ = కూట్ హూమీ మహర్షి యొక్క గురువు
నెప్ట్యూన్ = హైలేరియన్ మహర్షి
పల్లాస్ = ప్లేటో
పోలరిస్ = బి. పి. వాడియా
ఫైడీస్ = డా. జి. యస్. అరండేలు
ప్రోటియస్ = టిబెట్ దేశపు తేషులామా

బృహత్ (బృహస్పతి) = జీసస్ మహర్షి
మనువు = వైవస్వతమనువు
మహాగురువు = వ్యాసులవారు; గౌతమబుద్ధుడు
మార్స్ = మరుమహర్షి
మిజార్ = జిడ్డు నిత్యానందం
మెర్క్యూరీ = కూట్‌హూమీ మహర్షి
యురేనస్ = జ్వాల్‌కూల్ మహర్షి
యులిసెస్ = క. ఆల్కాటు
లియో = ఫెబ్రిజి మోరస్పోలి
లూటియా = చార్లెస్ బ్రాడ్లా
లైరా = లెవ్ - ట్జీ
వజ్ర = హెచ్. పి. బ్లవాట్స్కీ
వల్కన్ = సర్ థామస్ మూర్ అను మహాశి
విరాజ్ = మహాచోహాన్
వీనస్ = రెకోక్జీమహర్షి
వెస్టా = మిన్నీ సి. హాల్‌బ్రూక్
శాటర్న్ = వెనీషియన్ మహర్షి
సిరియస్ = సి. డబ్ల్యు. లెడ్బీటరు
సిలీన్ = సి. జినరాజదాసా
సివ = స్వామి తల్లాప్రగడ సుబ్బారావు
సూర్య = మైత్రేయ బోధిసత్త్వులవారు
హీలియస్ = మేరి రసక్ (=హాచ్నర్ సతి)
హెక్టార్ = డబ్ల్యు. హెచ్. కిర్బి.
హెరక్లీస్ = డా. అనిబెసెంటు

## సాంకేతికాక్షరముల వివరము

తం. = తండ్రి
త. = తల్లి
భ. = భర్త
భా. = భార్య
కొ. = కొడుకు, కొడుకులు
కూ. = కూతురు, కూతుళ్లు
సో. = సోదరుడు (లు)
సో.రీ. = సోదరీ (లు)
పి.మ. = పితామహుడు. ప్రి. పి. మ. = ప్రపితామహుడు.
పి.తం. = పినతండ్రి. పె. తం. = పెత్తండ్రి.
పౌ = పౌత్రుడు.
మా.మ. = మాతామహుడు.

ఒక పేరు తరువాత (=...) ఉన్నయెడల ఆ పేరు గలవారికి బ్రాకెటులోపల పేరు గలవారు భార్య లేక భర్త అని యర్థము.

జా. = జాతి
ఉ.జా. = ఉపజాతి
పు. = పురుషుడు



# చంద్రమండలములో

జంతువర్గమున:—

చంద్రమండల పరిణామ చక్రము (Moon Chain) లో 5 వ పరివర్తము (5th Round) న స్థూలతమ (పృథ్వీ తత్త్వపు) మండలమగు చంద్రమండలమున వానర రూపము గల పెంపుడుజంతువులలో సిరియస్, హెరక్లిస్, ఆల్కియోన్, మిజార్, అను నలుగురు మొట్టమొదట ఆనవాలు పట్టబడిరి. అవి బహువిశ్వాసముగల జంతువులు. మార్సు, మెర్క్యూరీ (నరులు) దంపతులు. వారికి మహాగురువు, సూర్య కొడుకులు. ఆనలుగురు వానరులును ఆకుటుంబము నతివిశ్వాసముతో సేవించుచు వారి కుటీరముచుట్టును కాపున్నుండెను. ఈ వానరులు యజమానులను వారి ఆస్తిని కాపాడుటయేగాక వారి బిడ్డల నాడించుచుండిరి. ఒకనాడు కొందరు శత్రువులు తమ పెంపుడు జంతువులను వెంటబెట్టుకొని యాకుటీరముపై నకస్మాత్తుగ బడిరి. వానరులు వారితో తీవ్రముగ పోరాడజొచ్చిరి. ఇంతలో మార్సు వచ్చి శత్రువులను పారద్రోల సాగెను. వారందరు యుద్ధము చేయుచుండగా తొండవంటి యొక పెద్దజంతువు కుటీరములో ప్రవేశించి పసిబిడ్డయైన సూర్యనెత్తికొని పోవుచుండెను. అదిచూచి సిరియస్ ఆ జంతువుపై బడి ముందు దానిచేతిలోని బిడ్డను లాగికొని ఆల్కియోన్ కందిచ్చి ఆజంతువుతో పోరాడి, దానిని చంపి, తానుగూడ గాయములచే స్పృహతప్పి పడిపోయెను. ఇంతలో నొకశత్రువు మార్సును వెనుకనుండి కత్తితో పొడువవచ్చుట.

చూచి హెరక్లిస్ వారిద్దరి మధ్యనుబడెను. ఆక త్రిపోటు హెర క్లిస్‌కు తగిలి మార్స్ నిరపాయముగ బ్రతికెను. మార్స్ తనవెనుక నేదో పడిన చప్పుడు విని, వెనుదిరిగి చూచి జరిగిన సంగతి గ్రహించి హెరక్లిస్ తలను తనయొడిలో బెట్టుకొని శరీరము నిమురజొచ్చెను. హెరక్లిస్ తన యజమాని ముఖ మును గాఢమగుభక్తితో నిశ్చలముగజూచుచు ప్రాణములు విడి చెను. ఆ ప్రకారము తనయజమానిని రక్షింపవలెనన్న తీవ్ర కాంక్షతో జేసిన సేవాకృత్యమువల్ల తురీయునియిచ్ఛ యొక్క మహాప్రవాహమువలె దేహాత్మలో బ్రవేశించుటచేత ఆ వాన రుడు ప్రాణోత్క్రమణ సమయమున వ్యక్తిత్వము (మానవ త్వము)నొంది, అటుపైన జంతువర్గములో బుట్టక మానవవర్గ ములో బుట్టుచుండెను.

సిరియస్ అవయవములన్నియు చితికిపోయి నందున గాయములుమాని బ్రతికినను అత డేపనియు చేయలేక చాల కాలము పడియుండెను. బాలుడగుసూర్య యతనిని సంర క్షించుచుండెను. అల్క్యోన్, మిజార్ ఎల్లపుడు వానిని కని పెట్టి చూచుచుండిరి. సిరియస్ తనయజమానుల యెడల గాఢ మగుభక్తితో వారినే చూచుచు, వారినే తలచుచు నుండుటచేత క్రమముగ స్థూలమనస్సు వికసించి సూక్ష్మమనస్సు నాక ర్షింప, తద్వారా అతను వ్యక్తిత్వమునొంది మానవవర్గమున జేరెను. అల్క్యోన్, మిజార్ యజమానుల ననన్యభక్తితో సేవించుచు చాలకాలము బ్రతికిరి. వారికామశరీరము వికసించి బుద్ధిశరీరము నాకర్షింప, తద్వారా వారు మానవత్వము నొందిరి.

ఈకాలములో వ్యక్తిత్వము నొందిన జంతువులలో కొందరు ద్వేషము, దంభము, గర్వము, క్రోధము, ఈర్ష్య మొదలగు దుర్భావముల ప్రకోపముచే వ్యక్తిత్వమునొందిరి. వారిలో స్కార్పియో యొకడు. వాని కీకాలము నుండియు హెరక్లిస్‌పై ద్వేషము కనిపించుచున్నది.

మానవవర్గమున:—

చాంద్రచక్రము 6వ పరివర్తములో చంద్రమండలమున,—

1. అజ్ఞానులు ననాగరికులు నైనను క్రూరులు మూర్ఖులుగాని యొకజాతిమానవు లొక దీవిలో వసించుచుండిరి. హెరక్లిస్ ఆజాతివారిలో నొకజంతువు శవముకొరకు కింకొకనితో పోట్లాడుచుండెను. ఆదీవుల సమీపమున నున్న యొక పెద్ద భూఖండముమీద క్రూరులు నరభక్షకులునగు రాక్షసులు వసించుచుండిరి. ఈరెండు జాతులకు తరుచు యుద్ధములు జరుగుచుండెను.

2. మరియొక జన్మలో ఆదీవులలోనే ఆజాతిలోనే హెరక్లిస్, సిరియస్, అల్‌క్యోన్, మిజార్ పుట్టిరి. వారికి బంధుత్వమున్నట్లగుపించదు, కాని మిత్రులు. ఒకనాడాదీవి కొక దివ్యపురుషుడు వచ్చెను. అతడు గొప్పనాగరికత గలవాడు, నీలమేఘచ్ఛాయగల దేహమువాడు, దూరమున నున్న నొక చక్రవర్తి సామ్రాజ్యములోని పౌరుడు. అత డీదీవుల లోనిజనులను నాగరికులుగ జేయవచ్చెను. రాగానేయతడొక పాత్రలో నీరుబోసి, దానిలో నొక చిన్న మాత్రను వేసెను. వెంటనే యది మండెను. కొన్ని యెండిన ఆకుల నామంటలో

నటించి పెద్దజ్వాల చేసెను దానిని జూచి యాజనులు భయపడి దూరముగ బోయి చెల్లెక్కి యావింతను జూడసాగిరి. క్రమముగా జనులు భయము దీరి ఆ యాగంతకుని, అగ్నిని కూడ పూజింపదొడగిరి. ఇట్లు తనయందు జనులకు నమ్మకము కుదిరిన తరువాత వారికతడు నేలదున్నుటనేర్పి, తాను తెచ్చిన విత్తనములు నాటి,ఆహారపదార్థములుపండించుటయును ఆపదార్థములలో రకరకముల వంటకములు చేయుటయును నేర్పెను. ఇతడు మెర్క్యూరీ, హెరక్లిస్ మొదలగువారి కితనియందు విశేషమగు భక్తికుదిరెను.

ఇది యిట్లుండ పొరుగుననున్న రాక్షసు లొకద్వీపములోని జనులపైబడి వారిలో వయస్సుమీరినస్త్రీలనుఅందరు పురుషులను బాలబాలికలను చంపి యువతులను చెరపెట్టిరని యొకడు గాయములతో తప్పించుకొనివచ్చి చెప్పెను. ఆమాట విననంతనే హెరక్లిస్ కొంతసేనతో బయలుదేరిపోయి ఆరాక్షసులలో (అప్పు డక్కడ హాజరులేని) స్కార్పియోను తప్ప తక్కిన వారిని దునుమాడి, చెరలోని యువతులందరిని విడిపించెను. ఒకగుడిసెలో మెర్క్యూరీ వచ్చిన నగరము నుండి వచ్చిన యొక పురుషుడు గాయములతో బాధపడుచు బంధితుడై యుండుటచూచి యాతనిని హెరక్లిస్ విడిపించితెచ్చి మెర్క్యూరీకి చూపెను. వారిద్దరు చిరమిత్రులగుట నాసమావేశమున కిద్దరును కడుసంతసించిరి. క్రొత్తపురుషుడు మార్స్. అతడు తన ప్రభువుపంపున రాక్షసులపై యుద్ధమునకు వచ్చి, యోడిపోయి, సైన్యమునంతను గోల్పోయెను. అతనిని తీరుబడిగా చంపితినుటకు రాక్షసులు బంధించియుంచిరి. మెర్క్యూరీ చేసిన

చికిత్సచే మార్స్ కొన్నాళ్లకు ఆరోగ్యవంతుడై స్వదేశమునకు పోవనిశ్చయించెను మార్స్‌ను విడిచి హెరక్లిస్ ఉండజాలక అతనివెంటసేవకునిగ నగరమునకు బోయెను. మెర్క్యూరీ ఆదీవిలో నింక కొంతకాలముండి జనులకు జ్ఞానవికాసము గలిగించెను.

ఆప్రకారము మార్స్ హెరక్లీస్‌తో తన నగరమున కేగినతరువాత కొంతకాలమునకుచక్రవర్తితనగురువుల యాజ్ఞపైన తిరిగి రాక్షసులపైకి యుద్ధమునకు మార్సును సహాయమిచ్చి విరాజ్ అను నాయకుని పెద్దసైన్యముతో బంపెను. హెరక్లిస్ మార్స్ ననుసరించి పోయెను. సాగిట్రియో శత్రుసైన్య నాయకుడు. యుద్ధమున రాక్షసు లోడిపోయిరి. ఈ యుద్ధానంతరము ఈ దీవులలోని యనాగరిక జనులనందరిని తీసికొనిపోయి రాక్షసుల రాజ్యములో నెలకొల్పిరి. పాత మిత్రులు కలిసికొనిరి. సిరియస్‌కూడ మెర్క్యూరీ సేవకునిగ నగరమునకు బోయెను.

3. తరువాత హెరక్లీస్, అనాగరిక జాతులలో ననేక జన్మములనెత్తెను. వాని మానసికాభివృద్ధి బహుమెల్లగాను స్వల్పముగను జరుగుచుండెను. ఇట్టి జన్మలు 12 అయిన తరువాత ఒకసారి హెరక్లీస్ పొలములలో పనిజేయు స్త్రీగా కనిపించెను. అప్పటికి వంటచేసి భోజనముచేయుట జనులు నేర్చిరి. హెరకీస్ కి జన్మములో కేపెల్ల,పిండార్,బియాట్రిక్సులు చేటియా యను నలుగురు సోదరులు భర్తలు.

4. తరువాత చాలాజన్మములెత్తినపిదప, ఈజట్టువారు

కొంచెము నాగరికత తెలివితేటలుగలవారుగ నగుపించిరి. కాని యింకను వ్యవసాయదార్లు, దుకాణదార్లు, కర్షకులు ఇటువంటి వృత్తులను మాత్రము చేయుచుండిరి.

చాంద్రిచక్రము 7 వ పరివర్తములో చంద్రమండలమున:-

1. ఈకాలమునాటికి మనజట్టు జీవులు చాలా అభివృద్ధి నొందిరి; తెలివి బలపడినది, కారణశరీరము రూపొందినది, శరీరఛాయ నీలమేఘవర్ణము నొందినది, భక్తి గాఢమై పెద్దలను కిమ్మనకుండ మన్నించి సేవించుటయందనురక్తులగుటకై గోరుచుండిరి. వీరు 'సేవకబృందము'లో జేరినవారు. వీరందరు ఈపరివర్తములో చంద్రమండలమున పరిణామము జరుగుచున్న కాలములో చాంద్రిచక్రి పరిణామములోనుండి తప్పించబడి భూచక్రపరిణామములో జేరిరి మహాగురువు (గౌతమబుద్ధులు)ను సూర్య (శ్రీ మైత్రేయ బోధిసత్త్వులు) యును ఈ 7 వ పరివర్తమున నేడవగోళమువరకు పరిణామము బొందిరి. వారు ఆరవ గోళములో దీపాంకురబుద్ధులవారి యెదుట బుద్ధదీక్షగై కొని యేడవగోళములో అర్హతపదవి నొందిరి. దీపాంకురుని తరువాత భూచక్రపరిణామములో 4 వ పరివర్తము లో భూగోళముపైన 3వ జాతికాలమున కశ్యపుడు బోధిసత్త్వుడుగనుండి నాలుగవ జాతికాలములో బుద్ధపదవి నొందెను; తరువాత నాలుగవజాతికాలమున బోధిసత్త్వుడుగ నుండిన వేదవ్యాసులు అయిదవజాతికాలమున (గౌతమబుద్ధులు అనుపేరున) బుద్ధపదవి నొందెను. ఇప్పుడు శ్రీమైత్రేయులు బోధిసత్త్వుడు.

# భూమండలములో

భూచక్రపరిణామములో 4వపరివర్తములో భూగోళమున:-

1. హెర్క్లిస్ క్రీ. పూ. 600,000 సం॥ ల క్రిందట కనిపించెను. అప్పటికి 2 50,000 సం॥ల క్రిందటనే యొకసారి అట్లాంటిస్ ఖండము జలప్రళయముచే ముక్కముక్కలుగ చీలి పోయెను అజన్మములో హెర్క్లిస్ 4 జాతి 2 వ ఉపజాతిలో సూర్యమెర్క్యురీల గర్భమున స్త్రీగ బుట్టెను మార్స్ ఆమె తమ్ముడు. అతనియం దామెకు విశేషప్రేమ. ఒకయుద్ధములో మార్స్ గాయములు తగిలి యుద్ధభూమిలో పడిపోయి మృతి నొందిన ట్లెంచబడెను. కాని, హెర్క్లిస్ వానిని వెతికి బైటకు తెచ్చి, సంరక్షణచేసి బ్రతికించెను. సూర్య అనంతరము మార్స్ రాజయ్యెను. అతని కిది రాజ్యపాలనము చేయుట యందు, మొదటిపాఠము.

2. తరువాత 3 వ జన్మములో హెర్క్లిస్ ఆయుపజాతి లోనే కొంచెము నాగరికతగల తెగలో బుట్టెను. అత డొక యోధుడు. వారిపొరుగున వసించు నొక యనాగరిక తెగ స్కార్పియో నాయకత్వమున వీరినందరిని తమదేవతకు బలి వేయ గొనిపోవలెనను నుద్దేశముతో నొకనా డకస్మాత్తుగ దండెత్తివచ్చిపడిరి. వారోడిపోయినచో ఆత్మహత్యచేసికొని సూక్ష్మలోకము నుండి శత్రువులను బాధించుటకు వారు దీక్ష బూనిరి. వారాసందర్భములలో గొప్ప మంత్రతంత్రముల నుపయోగింతురు. హెర్క్లిస్ కిదంతయు దెలియును. అతడు వారందరి నోడించి వారాత్మహత్య జేసికొనకుండ బంధించి చెరసాలలో బెట్టెను. తరువాత వారు హెర్క్లిస్‌ను చంప యత్నించిరని వారందరి నురిదీసిరి.

ఇటుపై జన్మములలో తరుచుగా మార్సు రాజుగానో చక్రవర్తిగానో బుట్టుటయు, మెర్క్యూరీ మతగురువుగా బుట్టుటయు, హెరక్లిస్ మార్సును, సిరియస్ మెర్క్యూరీని ఎక్కువగా ననుసరించుటయు గాంచెదము. మరియును మెర్క్యూరీ అప్పటప్పట స్త్రీజన్మము నెత్తుటగుపించునుగాని మార్సు ఎప్పుడును స్త్రీగా బుట్టుటగుపించదు.

3. క్రీ.పూ. 2,20,000 సం.4వ జాతి పోసిడోనిస్ ఖండమున స్వర్ణద్వారనగరము సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణము. మార్సు చక్రవర్తి, మెర్క్యూరీ ప్రధానాచార్యుడు. వజ్ర యువరాజును, చక్రవర్తి యంగరక్షకదళ నాయకుడును. హెరక్లిస్ ఆదళములో నొక యోధుడు. వజ్ర బాల్యములో ఆ దళనాయకుడు యులిసెస్. ఇతడొకనాడు వజ్రతో నగరు వెలుపలకు బోయి, యచట నిద్దరును కూర్చొనియుండగా, కొందరు హంతకు లకస్మాత్తుగా వారిపై బడి వజ్రను తీవ్రముగ గాయపరచుటచే నతడు మూర్ఛిల్లెను. వానిని కాపాడుటకు యులిసెస్ అతి సాహసముతో పోరుచు గట్టిగా నరువసాగెను. ఆ యరుపులు విని కొందరంగరక్షకులు వారికి సహాయము చేయబోవునరికి యులిసెస్ గాయములచే తెలివితప్పి పడిపోయెను. వచ్చిన సైనికులు శత్రువులను పారద్రోలి, ఇద్దరి కళేబరములను నగరులోనికి దెచ్చి చక్రవర్తియెదుట నుంచిరి. యులిసెస్ కండ్లు విప్పి 'ప్రభూ! క్షమింపుడు, నా చేతనైనంత వరకు చేసితిని' అనెను. చక్రవర్తి వెంటనే వాని గుండెలలో నుండి ప్రవహించు రక్తములో వ్రేలుముంచి దానితో వాని నొడుట బొట్టుబెట్టి, తాను బొట్టుపెట్టుకొని, "నాకొరకు

నాకొడుకు కొరకు నీవు ధారవోసిన నెత్తురు సాక్షిగ మన యనుబంధ మెన్నడును విచ్ఛిన్నము గాకుండుగాక! విశ్వాస నీయుడవగు సేవకా! మిత్రమా! శాంతితో వెడలుము" అని యాశీర్వదించెను. ఆమాటలు విని యులిసెస్ మందహాసము చేసి ప్రాణములు విడిచెను. ఆప్రకార మాగురుశిష్యుల యను బంధ మవిచ్ఛిన్నముగ నేటికిని సాగుచున్నది. ఇకముందును సాగును.

తరువాత చాలకాలము వరకు హెర్క్లిస్ జన్మల చరి త్రలో పురుషుడుగ బుట్టినపుడు యుద్ధములు చేయుటయు, స్త్రీగబుట్టినపుడు చాలమంది సంతానము గనుటయు తప్ప మరియే విశేషములులేవు.

4. క్రీ.పూ. 1,00,000 సం. ము. స్వర్ణ ద్వారనగరము. కొరొనా చక్రవర్తి. మార్స్ అతని సేనానాయకుడు. హెర క్లిస్ మార్స్‌భార్య. చక్రవర్తికి విరోధులు అభిచారిక సంప్ర దాయమునకు జెందినవారునగు నొక తెగవా రాదేశములో నుండిరి. వారికి ఓడు ఆర్పా నాయకుడు. వానికి చక్రవర్తి నోడించి రాజ్యమాక్రమించుకొనవలెనని తీవ్రాశయము. వారాయుద్దేశముతోనే భూతప్రేత పిశాచాది గణముల సహా యముకొర కనేక మంత్రతంత్రములను క్షుద్ర విద్యలను ఉప యోగించుచుండిరి. ఆల్కి-యోన్ తండ్రి చక్రవర్తి రాజ్యము లోనివాడైనను ఓడుఆర్పాకు మిత్రుడు గనుక అతని పక్షము బనిచేయుచుండెను. ఆల్కి-యోన్ కూడ తమ పక్ష ముండునని వారనుకొనిరి, గాని, వానికి మార్స్ యెడల నను రాగము భక్తి మెండగుటచేత వారికి లోబడలేదు. ఓడు ఆర్పా

కూతురు సిగ్నస్ క్షుద్రవిద్యలలో నేర్పరియగుట నామెవలలో నాల్కియోన్‌ను చిక్కించి తమ పక్షమున జేర్చుకొనవలెనని యత్నించిరి. ఆమె ఆల్కియోన్‌ను నిజముగ మోహించెను, గాని కొంతవర కతనిని తనమాయలలో జిక్కించుకొనెను. ఓడుఆర్సా చక్రవర్తిపై దండెత్తివచ్చి యుద్ధములో నతనిని చంపెను. మార్స్ తీవ్రముగ బోరుచున్న సమయమున నతనిని వెనుకనుండి పొడువజూచిన యొక శత్రుసైనికుని ఆల్కియోన్ వధించెను. ఇది చూచి ఓడుఆర్సా సహించలేక తన కూతురు నొక ఘోరవనమృగ రూపమున నావాహనముజేసి యాల్కియోన్‌పై బంపెను. ఆమృగ మాల్కియోన్‌ను కోరలతో పీకి పడగొట్టెను; గాని, ఆసమయమున కామె కతనిపైగల ప్రేమబల మధికమై, ఆమె నిజరూపము ధరించి వాని కళేబరముపై బడి యేడ్చుచు మరణించెను. తుదకు ఓడుఆర్సా విజయుడై నగరములో బ్రవేశించి మార్స్ భార్యయగు హెరక్లీస్‌ను బంధించి తీసికొనిపోయి తనను గలియగోరెను. అందు కామె యంగీకరింపక నొకబాకుదీసి వానిపై విసరెను. అది వాని కవచమునకు తగిలి తూలిపోయెను; గాని వానికోప మధికమై యామెపైబడి బలిమిచెరబట్టి, తరువాత తన మంత్రి బలముచే గల్పించిన క్రూరమృగములచే నామెను జంపించెను. ఓడుఆర్సా శవరాసులపై వేసిన సింహాసనము నెక్కి పట్టాభిషిక్తుడాయెను, కాని, వాని యధికారము కొద్దిదినములలో నేలగూలెను. వైవస్వత మనువు వానిపై దండెత్తివచ్చి వానిని సపరివారముగ నిర్మూలించి, నగరమునంతను శుద్ధిజేసి పూర్వ వంశమును తిరిగి యధికారమున నిలిపెను.

5. క్రీ. పూ. 79,790 సం. 4వ జా. 5ఉ. జాతి. మనువు ఆర్యజాతిని స్థాపించుటకు నాలుగవ జాతిలోనుండి 9,000 మంది స్త్రీపురుషులను మూలపురుషులుగ నెంచి (వీరిలో 5/6 అయిదవ యువజాతివారు 1/12 అక్కేడియనులు, 1/12 టోల్టెకులు) వారిని గోబీ సముద్రము దాటించెను. వారిలో కొందరు ఈజిప్టులో నిలిచిపోయి తక్కినవారు అరేబియాలో స్థిరపడిరి. వీరికిని ఈజిప్టు జనులకును తరువాతజరిగిన యుద్ధములో పాల్గొనిన అరేబియా వాసులలో సిరియస్ కొడుకగు హెరక్లిస్ ఒకడు. ఇతడాయుద్ధములో హతుడాయెను.

6. తరువాత నొక జన్మలో హెరక్లిస్ అరేబియాలో ఆ జాతిలోనే స్త్రీగ బుట్టెను.

[ఇట్లు అరేబియాలో స్థిరపడిన జనుల సంతతిలో గొందరిని మనువు క్రమముగ మధ్యఆసియాలో గోబీ సముద్ర తీరమున నెలకొల్పి, వారిని ప్రత్యేక శిక్షణమున నుంచి, ఆ చుట్టుపట్ల ఆదిమ నివాసులతో వైవాహిక సంబంధములను నిషేధించి, క్రొత్తజాతిగ తయారు చేయసాగెను.]

## తరువాత జన్మలు

7. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 72,000

దేశము : గోబీ సముద్ర ప్రాంతము.

జాతి : 4 జా. 5 ఉ. జా.

లింగము : పు.

వివరములు:— 4 జా. 5 ఉ. జా. నుండి క్రీ. పూ. 100,000 సం.ల ఆర్యజాతికి మూల పురుషులుగ నుండదగిన వారి కుటుంబములను కొన్నిటిని మనువు ఎంచి ప్రత్యేకించి యుంచెను. తరువాత 79,790 సం. లో వారి సంతతివారి నీవలకు గొనితెచ్చెను. వారి సంతతికి చెందిన జాతిలో నీ జన్మ. భా. మిజార్; తం. విరాజ్; త రామా; [పె తండ్రి మార్స్ (=మెర్క్యూరి); వారి కొ. అల్క్యోన్ మరి 3 రు; కూ. మిజార్.]; కొ. ఫైడీస్ మరి 2 రు. కూ. 2 రు.

ఈ కాలములో తురేనియనుల దాడిచే నీ వలస నాశనమగునని మనువు తెలిసికొని చిన్న పిల్లలందరిని శ్వేత ద్వీపమునకు బంపెను. పెద్దవారు ఇంచుమించుగ స్త్రీ పురుషు లందరు, ఆ దాడిలో హతులైరి. హెరక్లిస్ తన కొ. ఫైడీస్‌ను కూ. పిండార్‌ను శ్వేతద్వీపమునకు బంపెను. తక్కిన కుటుంబమంతయు నశించెను.

8. ఉరిమరగ జననకాలము : క్రీ. పూ. 72,000

దేశము : గోబీసముద్ర ప్రాంతము

జాతి : 7 వ జన్మలోని వంశములో 4 వ తరమున

లింగము : పు.

వివరములు:— భా. అరోరా, తం. మార్స్; తం. ధ్రువ; [మార్స్, మనువు సోదరులు, విరాజ్ వారి సోదరి, మనువు కొ. అల్క్యోన్ (=ఓసిరిస్), కూ. అరోరా.]; సో. మిజార్ (=సిరియస్); పి. మ. శాటర్న్ (=సూర్య), 7 వ జన్మ వృత్తాంతములో జెప్పిన నాశనమైన తరువాత 12 సం. లలో మనువు తిరిగి ఆర్యవంశ పునర్నిర్మాణమునకు

బూనేను. ఆ కాలమున బుట్టిన నాయకులలో హెర్క్లిస్ ఒకరు.

9. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 60, 000
దేశము : మనోవా నగరము.
జాతి : ఆర్యజాతి మూలపురుష కూటము.
లిఙ్గము : స్త్రీ

వివరములు:— భ. వజ్ర; తం. మనువు; త. సూర్య; సో. అల్కి యోన్ (=మెర్క్యురి), కొరోనా (=యులిసెస్) సిలీన్, మరి యిద్దరు; సో రీ వీనస్, బృహత్, యురేనస్ మరి 2 రు; [మనువుకూ జూపిటర్ (=మార్స్); వీరి కొ విరాజ్; అతని కొ. తిరిగి మనువు. ఇతని కూ. హెర్క్లిస్.] గోబి సముద్ర ప్రాంతమున మనువు స్థాపించిన వలస ఇదివర కొక సారి నిర్మూలింపబడెనని యిదివరకు చదివితిమి. (7 వ జన్మ చూ.) తరువాత పునర్నిర్మాణము నారంభించి 10,000 సం. లు. ఆ వంశము విశేషముగ ప్రబలి విస్తరించెను, గాని, తిరిగి తురేనియనులు వారిపై బడి చాలవరకు వారిని నాశనము జేసెను; తరువాత, మనువు మార్స్‌ను పోసిడోనియాలో బుట్టించి, అక్కడి టోల్టెక్ జాతి నెత్తురును తిరిగి తన క్రొత్త వంశములో జేర్చవలెనని, మార్స్‌ను మనోవాకు తెప్పించి, అతనికి తన కూతురు జూపిటర్ నిచ్చి పెండ్లి చేసెను. మనువు తిరిగి వారి పౌత్రుడుగ బుట్టి సూర్యను పెండ్లాడెను. వారిసంతతి సూర్యవంశ మనబడెను. వారి సంతతివా రితర వంశములలో వివాహమాడరాదని మనువు

శాసించెను. ఆ సంతతియే వృద్ధియై నిజముగ ఆర్యజాతికి మూల పురుషుల కూటమయ్యెను.

10. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 42,030
దేశము : గోబీసముద్ర ప్రాంతము.
జాతి : 5 జా. 2 ఉ. జా
లింగము : పు.
వివరములు:— భా. సిరియస్; తం. కొరోనా; కొ. అల్కియోన్, మిజార్, మరి 3 రు; కూ. ఓరియన్ మరి 1 రు. మనువు ఆజ్ఞానుసారము ప్రధాన మతాచార్యుడైన జూపిటర్ తన కుమాళ్లను కుమార్తెలను వారి వారి సంతతిని ప్రత్యేకముగ నొక లోయలోనికి కాపురమునకు బంపెను. వారక్కడ కొంతకాలము కొన్ని విశిష్టలక్షణముల నలవరచుకొని అరేబియాకు వలస బోవలెనని మనువు సంకల్పము. ఆ ప్రకారము లోయకు కాపురము పోయినవారిలో హెరక్లిస్ ఒకడు. ఇతని కొడుకులలో నొకడగు యురేనస్‌కు మనువు పౌత్రుడుగ బుట్టెను. ఈ వంశనాయకుడు కొరోనా. అతని అనంతరము హెరక్లిస్, అతని అనంతరము మనువు నాయకులైరి.

11. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 40,000
దేశము : మనోవా, అరేబియా.
జాతి : 5 జా. 2 ఉ. జా.
లింగము : స్త్రీ
వివరములు:— భ. మార్స్; (అతనితండ్రి జూపిటర్) కొ! 2 రు; కూ. 4 రు. [మనువు, మార్స్, అరోరా,

అల్కి-యోన్ - ఈ 4 రు సోదరులు; వీరికి ఫైడీస్, వేగా సో. రీ.]

ఈ కాలమున సామ్రాట్టు జూపిటర్. ఇతని కొడుకు హెరక్లిస్. జూపిటర్ పెద్దకొడుకు మనువు పైన జెప్పిన లోయ నేలు సామంతరాజు. ఇప్పటి కాలోయలో నొకగొప్ప నాగరికత గల జాతి విస్తరించెను. వారిలో నుండి మనువు 150,000 మంది యోధుల నెంచి వారి వెనుక 100,000 మంది స్త్రీ బాలురను చేర్చి వారందరిని అరేబియాకు వలస బంపెను. వారు కొంతదూరమేగిన తరువాత మనువు వారిని కలుసుకొని, వారిని సురక్షితముగ నరేబియాలో జేర్చెను. హెరక్లిస్ ఈ వలసలో అరేబియా కేగెను.

12. ఉరమరగ జననకాలము: క్రీస్తు. పూ. 380,00.

దేశము : మహోనాలాండు (ఆఫ్రికాలో)

జాతి : 5 జా. 2 ఉ. జా

లింగము : పు

వివరములు: భా.యులిసెస్;తం.మార్స్;త.వీనస్; సో. వల్కన్, వజ్రి, పల్లాస్; సో. రీ. అల్కి-యోన్ (=సిరియస్) జూపిటర్ (=సిలీన్) తెలీమా; మేనత్త మెర్క్యురీ (=ధ్రువ).

అరేబియానుండి యార్యులు తమ రాజ్యమును ఆఫ్రికాలోకి వ్యాపింప జేసికొనిరి. అక్కడ యాకాలమున సామ్రాట్టు మార్స్, యువరాజు హెరక్లిస్.

13. ఉరమరగ జననకాలము: క్రీ.పూ 32,000

దేశము: మెసొపొటేమియా-మనోవానగరము.

జాతి: 5 జా. 2 ఉ. జా.

లిఙ్గము: పు.

వివరములు: భా. ఓరియన్; తం. ఓసిరిస్; కొ. ఫైడిస్ మరి 5 రు; కూ. 6 రు; [పి. మ. మనువు (=మెర్క్యురి); ఓసిరిస్ తమ్ముడగు సిరియస్‌కు కొ. అల్క్యరోన్, కూ. ఓరియన్.]

మనువు 4వ జాతిలోని అక్కేడియన్ ఉ. జాతియందలి కులీన కుటుంబమునుండి బీజములు ఆర్యజాతి మూలపురుషులలో గలుపదలచి, హెరక్లిస్‌ను మెసొపొటేమియాలో బుట్టించెను. అచట నతడు శౌర్యపరాక్రమ సంపన్నుడై వీరకృత్యాన్వేషణార్థ మిల్లువిడిచిపోయి, నానా దేశములలో సంచరించుచు క్రమముగ మధ్య ఆసియాలోని యార్యుల నివాసము జేరి, యచట ఓరియన్‌ను వలచెను. ఆమెయు నతని పెండ్లాడ గోరెను; మనువు వా మనువున కంగీకరించి, ఆర్యేతరులతో సంబంధములు చేయకూడదన్న నియమమునుల్లంఘించకుండుటకై యతనిని ఓసిరిస్‌చే దత్తపుత్రునిగ గైకొనజేసి, పిదప వివాహము చేయించెను. మనువు అనంతరము వాని పెద్ద కొడుకు ఓసిరస్ రాజ్యమునకు రావలసినవాడు. కనుక మనువు రెండవ కొడుకగు సిరియస్‌ను కుటుంబసహితముగ నొక లోయలోనికి వేరొక వంశమును స్థాపించుటకై కాపురము బంపెను. వారితో హెరక్లిస్‌కూడ నచటికే బోయెను.

14. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 31,100

దేశము: మధ్యఆసియా,

జాతి: 5 జా. 3 ఉ. జా.

లిఙ్గము: పు.

వివరము: భా. శాటర్న్; తం. జూపిటర్; త. ధు్రవ; సో. అల్క్-యోగ్ (=ఎలెక్ట్రా), సిరియస్ (= మెర్క్యూరీ), మిజార్ (=యురేనస్), సిలీగ్ (=ఓసిరిస్); సో. రీ. నెప్ట్యూన్, వీనస్. [అల్క్-యోగ్ కొ. ఫైడీస్]

15 ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 31,200

దేశము: మధ్య ఆసియానుండి పర్షియా.

జాతి: 5 జా. 3. ఉ. జా.

లింగము: పు

వివరము: భా. సైకి; తం. మార్స్; త. నెప్ట్యూన్; పి. తం. వల్కన్; కొ. అల్క్-యోగ్ (= ఫైడీస్), సిరియస్; పి. మ. సూర్య (=విరాజ్; ప్రి. పి. మ. మనువు.

పైన (13వ జ.) చెప్పిన ప్రత్యేకవంశము ప్రబలి విస్తరింప వారిలోనుండి కొందఱిని మనువు ఎంచి పర్షియాకు వలస బంపెను. వారచట స్థిరపడిరి. మెసాపొటేమియాను ఆకాలము లోనే ఆర్యులాక్రమించిరి. ఈ యాత్రలో హెరక్లిస్ భర్త నాయకుడు.

16. ఉరగమరగ జననకాలము:29,700.

దేశము: పర్షియా.

జాతి: 5 జా. 3 ఉ. జా.

లింగము: పు.

వివరము: భా. హెక్టార్;సో. ధ్రువ, బృహత్, వీనస్; సో. రీ. నెప్ట్యూన్, ఎపోలో మరియు; త. లైరా; తం. పోర్టియస్. [మేనమామలు మార్స్, కొరోనా; పినతల్లులు ఓసిరిస్, దెనాబ్; మార్స్ కొ. మెర్క్యూరి, అల్క్-యోగ్ విలు

ఓసిరిస్‌గూ. సిరియస్‌ను ఆల్కిఒయోన్ పెండ్లాడెను. మార్స్‌కూ ఫైడీస్ మొ॥].

ఈ కాలములో మహాగురువు మెర్క్యూరీ శరీరమునందావేశించి జరతుష్ట్ర యను పేరుతో నూతనమతము బోధించెను. దీనినిప్పుడు జొరాస్ట్రియానిజం (పార్సీమతము)అందురు.

17. ఉరమరగ జననకాలము క్రీ. పూ. 28,810

దేశము: పర్షియా.

జాతి: 5 జా. 1 ఉ. జా.

లిఙ్గము: స్త్రీ.

వివరము: భ. నెప్ట్యూన్; తం. వల్లాస్; త. ప్రొటియస్; సో. మెర్క్యూరి (= ఫైడీస్), హిలియస్, సో. రీ. వజ్ర [మెర్క్యూరీ కొ. ఆల్కిఒయోన్, యురేనస్, ధ్రువ, బృహత్, యూఫ్రా; కూ. సిరియస్, సిలీడ్, యజ్ఞ, మిజార్, కేసియో] నెప్ట్యూన్ పర్షియాదేశపు రాజు.

18. ఉరమరగ జననకాలము క్రీ. పూ. 28,150

దేశము: మనోవా

జాతి: 5 జా 1 ఉ. జా.

లిఙ్గము: స్త్రీ.

వివరము: భ. మార్స్. తం. డయానా, త. జూడాస్; కొ. ఆల్కిఒయోన్ (= మిజార్), విరాజ్, నాగ, బృహత్, కూ. ?రు; సో. రి. జూపిటర్ [జూపిటర్ నుమార్స్ తమ్ముడు రామా పెండాడెను. ఈమె కొ. మిజార్ ]

మార్స్ మనోవారాజు.

19. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 275,00

దేశము: ఐర్లండు.

జాతి: 4 జా. 5 ఉ. జా

లిఙ్గము: స్త్రీ.

వివరములు: భ. లైరా; తం. మార్స్; త వెస్టా; సో. బిరాజ్; సో. రీ. వల్కన్, బృహత్.

[వల్కన్కూ. మెర్క్యురీ, అల్లుడు ఆల్సియోన్]

20. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 26,800

దేశము: మనోవా

జాతి: 5 జా. 1 ఉ. జా

లిఙ్గము: పు.

వివరములు: భా. కేపెల్లా; తం. మార్స్. త. వజ్ర; సో 2రు. సో. రీ.2 రు; [పినతం. సిరీ (=శాటర్న్); ఇతని కొ. ఆల్సియోన్] మనోవా సామ్రాట్టుకొడుకు హెరక్లిస్; ఇతడు, ఆల్సియోన్, నాగా ఒక్కయీడువారు. ఒకనాడు లాక్నాయను నాలుగవ జాతి వృద్ధునొకనిని కొందరుబాలురు హింసించుచుండగా వీరు ముగురు నతనిని విడిపించి కాపాడిరి. అందుకు తన కృతజ్ఞత జూపుటకావృద్ధుడు వారినొక గొప్ప రహస్యసంఘమున సభ్యులుగ జేర్చి, ఆసంఘసభ్యత్వమున కానవాలును వారి శరీరములపై చిత్రించి, వారికొక రహస్యముద్రను నేర్పి, ఆసంఘసభ్యున కెవనికైన నాముద్రను జూపినయెడల వాడు భృత్యునివలె సేవించునని చెప్పి వారిని వీడ్కొల్పెను. తరువాత కొన్నండ్లకు ఆల్సియోన్ చీనాలో నొక రాష్ట్రమునకు గవర్నరుగ నియమింపబడినప్పుడీ రహస్యసంఘసభ్యత్వసహాయమున

నచట ప్రభుత్వముపై తిరుగుబాటుచేయుట కేర్పడిన మరి యొక రహస్యసంఘమును నిర్మూలింపగలిగెను.

21. ఉరమరగ జననకాలము క్రీ. పూ. 26,10౦

దేశము: మంగోలియా.

జాతి: 4 జా. 7 ఉ. జా

లింగము: పు

వివరములు: భా. ఆల్సియన్; తం. కాలిక్స్. త. క్లియో సో. మార్స్; (=అల్టా-యోన్), మిజార్ (=మెర్క్యూరీ)

20 వ జన్మచరిత్రలో లాక్సాకు హెరాక్లిస్ మొ॥ వారికి గలిగిన సంబంధముచేత, ఇప్పుడొక తెగకు నాయకు డుగ బుట్టిన లాక్సాకూతురైన క్లియోయను నామెకు మార్స్, మిజార్, హెరక్లిస్ ముగ్గురు కు. పుట్టిరి. లాక్సాకు మరియొక కూతురు పుత్రికలు అల్టా-యోన్, మెర్క్యూరీ [మిజార్‌కు కా. నాగ]

22. ఉరమరగ జననకాలము క్రీ. పూ. 25,550

దేశము: న్యూజీలండు

జాతి: 4. జా. 5 ఉ. జా.

లింగము: పు

వివరములు: తం. రెక్టార్, త. లైరా; సో. మిజార్ (=సిరి యస్); నెప్ట్యూన్; సో .రీ. జూపిటర్ (=విరాజ్) [మిజార్ కూ అల్టా-యోన్ సూర్యను పెండ్లాడెను].

23. ఉరమరగ జననకాలము క్రీ. పూ. 24,680

దేశము: మెక్సికో

జాతి: 4 జా. 3 ఉ. జా.

లింగము: పు.

వివరములు: భా. యులిసెస్; తం. సిలీన్; త. ఆల్కిమోన్; సో. 6. రు; సో. రీ. జూపిటర్, అరోరా.

24. ఉరమరగ జననకాలము క్రీ. పూ. 236,83

దేశము: ఉ. అమెరికా రాకీపర్వత పశ్చిమప్రాంతము

జాతి: 4 జా. 3 ఉ. జా.

లింగము: పు

వివరములు: భా. ఎచిల్లీస్; తం. రామా. త. ఏలెక్ట్రా సో. విరాజ్, సిరియస్, సిలీన్, ఫైడీస్ ఎపోలో, నాగా; సో. రీ. ఆల్కిమోన్

25. ఉరమరగ జననకాలము 22,660

దేశము: ఉ. అమెరికా మిసిసిప్పి

జాతి: 4. జా. 2 ఉ. జా.

లింగము: పు

వివరములు: భా. బీ. తం. మిజార్. త. హీలియాస్ సో. అరోరా, సిలీన్ మరి 1 రు; సో. రీ. ఆల్కినుమోన్ మరి 4 రు. రాజుమార్స్, యువరాజు వజ్ర, రాజపుత్రిక బీ. వజ్ర. హెరక్లీస్ మిత్రులు. రాజును చంపుట కిద్దరు దుష్టులు కుట్రపన్నిరి. కాని, ఆకుట్రముందుగ హెరక్లీస్‌కు తెలిసి, అతడావంగతి కొందరు పెద్దలకు తెలియజేయ, వారందరు యోచించిరి. హంతకులను పట్టుకొని రాజును కాపాడిరి. రాజు సంతసించి హెరక్లీస్‌కు తనకూతురు నిచ్చి పెండ్లిచేసి కొంత రాజ్యము నిచ్చెను.

26. ఉరమురగ జననకాలము క్రీ. పూ. 21,900

దేశము: ఇండియా

జాతి: 4 వ జా.

లింగము: స్త్రీ

వివరములు: భ. మెర్క్యురి; కొ, 2 రు; కూ. 4 రు

27. ఉరమురగ జననకాలము క్రీ. పూ. 21,466

దేశము: ద. ఇండియా, ంమచిలీపట్టణప్రాంతము

జాతి: 4 జా. 3 ఉ. జా.

లింగము: స్త్రీ

వివరములు: భ. అల్క్‌యోన్; కొ. వజ్ర, యురేనస్ మరి 2 రు; కూ. 3కు. కో. సిలీన. హెరక్లిస్ ఆదేశపురాణి, 70 సంవత్సరములు బ్రతికెను.

28. ఉరమురగ జననకాలము క్రీ. పూ. 20550

దేశము: ద. ఇండియా సేలంప్రాంతం

జాతి: 4 జా. 3 ఉ. జా

లింగము: పు

వివరములు: భా. జెమిని, తం. అల్క్‌యోన్ త. పెర్సి

సో. మిజార్ మరి 2 రు సో. రి. 4 రు; కొ. 4 రు; కూ 4 రు; పి. మ. యురేనస్ (=మెర్క్యురి.). ఈజన్మలో హెరక్లిస్ మార్సచక్రవర్తియొద్ద సేనానాయకుడుగను నమ్మకమయిన మంత్రిగను నుండెను. విశేషముగ ప్రఖ్యాతి మానము సంపాదించెను మార్స అనంతరము అతని కొ. ఆర్ఫియస్ రాజ్యమునకు వచ్చి హెరక్లిస్‌ను ప్రధానిని జేసెను. అతడు చాలకాల మాయుద్యోగము జేసినతరువాత రాజుతో

నొకవిషయమై యభిప్రాయభేదము గలిగి యా యుద్యోగ మును విడిచిపెట్టి యొక దూరరాష్ట్రమునకు గవర్నరుగ నియ మింపబడెను. ఆరాష్ట్రము నతఁడించుమించుగ స్వతంత్రరాజుగా పాలించెను. ఆర్ఫియస్ అనంతర మతనికొడుకు రాజై యా రాష్ట్రప్రజల కొక సందేశము నంపెను. అది ప్రజలు మన్నింప దగినది కాదని హెరక్లిస్ దానిని తిరుగగొట్టెను. దానితో నతని స్వతంత్రత పూర్తియైనది.

29. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 196,00

దేశము : చీనా

జాతి : 4 జా. 4 ఉ. జా.

లిఙ్గము : పు.

వివరములు:— భా. బృహత్; కొ. వీనస్, మార్స్; కూ. నెప్ట్యూన్, వీనస్; [వీనస్ కూ. సెలీన్].

ఆ దేశము నేలినరాజు.

30. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 188,90

దేశము : మనోవా.

జాతి : 5 జా. 1 ఉ. జా.

లిఙ్గము : పు

వివరములు:— తం. మార్స్; త. మెర్క్యూరీ; సో. యురేనస్, ఆల్సియోన్, మరి 1 రు; సో. రీ. బృహత్ మరి 1 రు.

గోబీసముద్ర ప్రాంతమున వర్ధిల్లుచుండిన ఆర్యవంశము లలో నొకదానికి మార్సురాజు. మనువు పంపున నతఁడు తన

ప్రజలతో గూడ దక్షిణ యిండియాకు వలసబోయెను. ఆ ప్రయాణికులకు ముందుబోయి త్రోవలో సౌకర్యము లేర్పఱ్చుట యందు హెర్కక్లిస్, ఆల్కియోనీ విశేష సహాయము జేసిరి. ఒకచోట హెర్కక్లిస్ శత్రువుల మోసముచే అనుచరులతో వారికి జిక్కి, అందరును నాశనమగుటకు సిద్ధముగనుండ, ఆల్కియోనీ అకస్మాత్తుగ వచ్చి వారిని రక్షించెను. ఈ యాత్ర చాలా సంవత్సరములు పట్టెను. తుదకు పోదిప్పర్ (విరాజ్) అను రాజు రాజ్యమున వారు ప్రవేశించి, యా రాజు సత్కారమంది, ఆరాజు సలహా సహాయముల పైన దక్షిణ ఇండియాలో హుయరంద (శాటర్న్) అను నొక రాజు రాజ్యమున బ్రవేశించిరి. అక్కడ వారుచిత సత్కారముల బొంది, యచటనే స్థిరవాస మేర్పఱ్చుకొనిరి. ఆ రాజ్యములో సూర్య ప్రధానమతాచారి, ఆల్కియోన్ అతని ప్రతినిధియాయెను. మార్స్ అనంతరము హెర్కక్లిస్ ఆర్యుల నాయకుడయ్యెను. శాటర్న్ తరువాత నతని కొ. కుమారుడు రాజై, అతని యనంతరము జనుల యంగీకారము మీద హెర్కక్లిసే రాజయ్యెను. ఈ ప్రకార మార్యులు మొట్టమొదట ఈ దేశమునకు వచ్చి మొదటి యార్య రాజ్యమును దక్షిణ యిండియాలో స్థాపించిరి. అచటి బ్రాహ్మణులాకాలమున వలస వచ్చిన యార్యుల సంతతి.

31 ఉరమర జననకాలము : క్రీ. పూ. 18,185

దేశము :ఆల్జీరియా

జాతి : 4 జా. 5 ఉ. జా.

లింగము : పు

వివరములు:— తం. ఆల్కి-మోనా; త. హీలియస్; భా. అరోరా; సో. 2రు. సో.రీ. మెర్క్యూ, యులిసెస్ మే. 2రు; కొ. 3 రు; కూ. 3, రు. [ఆల్కి-న్ మోర్, సిరియస్ కవల సోదరులు]. వజ్రియను నొక యువకుడు మెర్క్యూరిని వలచి యామెను పెండ్లాడదలచి యుండెను. యులిసెస్ వజ్రిను వలచి యతని నెట్లులైన దన వైపు మరల్చుకొన యత్నించి విఫలమనోరథయై, యొకనా డతనిపై నత్యంతాగ్రహము వచ్చి యతని నొక కత్తితో పొడిచిచంపెను. ఇదంతయు తెలిసి హెరక్లిస్ ఆడుపిల్లపై నా హత్యానేరము మోపినచో, నీకథ యంతయు రచ్చకెక్కి కుటుంబ గౌరవము భంగమగుననితలచి, ఆహత్యానేరమును తనపై బెట్టుకొనెను. అతని పినతండ్రి సికియస్ న్యాయాధికారి. అతడీవ్యవహారములో హెరక్లిస్ ఒప్పుదల వెనుక నేదో రహస్యముండవలెనని యనుమానించి నేర విచారణమును పొడిగించజొచ్చెను. ఇంతలో మెర్క్యూరి నిజము కనిపెట్టి యులిసెస్‌ను నిర్బంధించి యడుగ నామె నిజము నొప్పుకొనియాత్మహత్య జేసికొనెను. హెరక్లిస్‌ను విడిచిపెట్టిరి, మెర్క్యూరి తన దుఃఖోపశాంతికై తన తండ్రి చేయుచుండిన విశ్వవిద్యాలయ విస్తరణకార్యమం దతనికి తోడ్పడుచు జీవితముగడిపెను. హెరక్లిస్ తాననృతమాడినందుకు కడువిషాదగ్రస్తుడై, ఆవిశ్వవిద్యాలయమునం దప్పటప్పట తత్త్వశాస్త్రమునుగుఱించి యుపన్యసించుచుండెడి యొకయోగి (బృహత్) వలనపైన తాను నావిశ్వవిద్యాలయ సేవాతత్పరుడయ్యెను.

32. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 17455

దేశము : మధ్య ఆసియానుండి కైబరు కనుమద్వారా ఇండియా.

జాతి : 5 జా. 1 ఉ. జా.

లిఙ్గము : పు

వివరములు:— తం. మార్సు; త. నెప్ట్యూన్; పి. మ. జూపిటర్ (= శాటర్న్), సో. సివ, మిజార్; సో. రి. ఓసిరిస్ మరి 2రు; భా. సెటస్.

ఆర్యులలో నొకశాఖ మనోవానుండి బయలుదేరి యిండియాకు మార్సు యాజమాన్యమున వలసబోయెను వారు ప్రయాణమగుటకు కొద్దిరోజులుముందే హెరక్లిస్ పుట్టెను. వారిండియాలో బ్రవేశించినప్పటికి హెరక్లిస్ నవయౌవనము జెందెను. అల్కియోన్, హెరక్లిస్, వజ్రొక్కయీడువీరులు. ప్రయాణములలో ముందుగా బోయి దారిలోని దేశపరిస్థితులు కనుగొనుటకు సౌకర్యముల నేర్పర్చుటకు మార్సు ఈముగ్గురిని బంపుచుండెను. హెరక్లిస్ దురుసుతనము గలవాడు. ఒకనాడతడు ముందువెనుకలు చూడకుండ చొరుచుకొని పోయి శత్రుజాలములో జిక్కుకొనెను. వారితోనతడతి ధైర్యముతో బోరెనుగాని యతని గుఱ్ఱము దెబ్బతిని పడిపోయెను, అతడును దానిక్రింద బడి తెలివిగోల్పోయెను. మరియొక దిక్కునకు బోయియుండిన అల్కియోన్ సపరివారముగ అచటికి వచ్చుట తటస్థించెను. వారు శత్రువులను బారదోలి హెరక్లిస్‌ను లేవదీసి తలిదండ్రుల కొప్పగించెను. తరువాత మార్సు స్త్రీలను బిడ్డలను సింధునదీతీరప్రాంతమునందుంచి ఢిల్లీప్రాంతమున స్థిరనివాస మేర్పరు

కొనుటకు పురుషులనందరను వెంటబెట్టుకొని పోయెను. ఆ త్రోవలో 4 వ జాతికి జెందిన కేస్టర్ పాలించు నొక రాజ్యముగుండా వారు పోవలసి యుండుటచేత మార్స్ అతని యనుమతిని గోరెను. ప్రయాణికులు నగరములో ప్రవేశింప కుండ బోవుట కత డనుమతినిచ్చి మార్స్‌ను కొందరు బంధువులను విందుకు బిలిచెను. కాని, కేస్టర్ కుట్ర నుద్దేశించెనని మార్స్ తెలిసికొని తాను దుస్తులలోపల కవచమును ధరించి, తనతో హెరక్లిస్, వజ్ర, ఆల్కె-రోమోలను అంగరక్షకులుగ దీసికొనిపోయెను. మరియును ఎవరికిని అనుమానము గలుగ కుండ మరికొన్ని యేర్పాట్లుగూడ చేసికొనెను. అనుకొన్న ప్రకారము విందుమధ్యను కేస్టర్ చే నియోజితులైన వీరులు మార్స్ నకస్మాత్తుగా పట్టుకొనిరి. కాని, అప్రమత్తుడై యున్న మార్స్ వెంటనే పట్టు విడిపించుకొనెను. ఇంతలో నతని యంగరక్షకులు ముందునకురికి మార్స్‌చుట్టు నిలచిరి. అప్పుడు జరిగిన సంకుల సమరములో మార్స్ కేస్టర్ నొకదెబ్బతో మూర్ఛపోగొట్టెను. అతడు వాని కతిథి యగుటచే వానిని జంప నిష్టములేక మూర్ఛితు నచటవిడచి యా మందిరమునుండి తన పరివారముతోగూడ బైటపడెను. ఇదంతయు నొకక్షణములో జరిగిపోయెను. ఇది యిట్లు జరుగుచుండగ అదివరకేర్పర్చు కొన్న ఆనవాలుప్రకార మతడు చేసిన ధ్వనిని విని రహస్యముగ కోటలో నచ్చటచ్చట నుంచబడిన యతని సైనికులు కేస్టర్ సైనికులను కావలివాండ్రను హతమొనర్చిరి. మార్స్ సింహద్వారము దాటగానే అతని సైనికులు తలుపులు మూసి బైట తాళమువేసి పోయిరి. తరువాత కేస్టర్ తన దుష్కృత్యా

మునకు సిగ్గుపడి మార్స్‌ను క్షమాపణగోరి, సంధిచేసుకొని, మార్స్ కానమరదికూతురు డిమిటర్ను తన పెద్దకోడలుగ గైకొనెను. మార్స్ సపరివారముగ ముందుకు బోయి తా నేర్పర్చినచోట రవిపురమను నగరమును నిర్మించి, వల్కానునచట గవర్నరుగ నియమించి, హెరక్లిస్‌ను అల్కియోన్‌ను అతనికి సహాయులుగ నుంచి, వజ్రమొదలగు కొందరు యోధులను తీసికొని వెనుకకు బోయి స్త్రీలను బిడ్డలను పశువులను రవిపురమునకు తెచ్చి చేర్చెను. మార్స్ 65 సం॥ లు బ్రతికి చనిపోయెను. అనంతరము హెరక్లిస్ రాజయ్యెను. అల్కియోన్ క్రీ. పూ. 17,404 సం॥లో చనిపోయెను. హెరక్లిస్ ఆయాప్తమిత్రుని యెడబాటు భరింపజాలక కొద్దికాలములోనే చనిపోయెను. చనిపోవుటకుముందు తనకొడుకులు స్థిరులుకారని రాజ్యము చేయదగరని తన తమ్ముడగు సివకు పట్టముగట్టెను. హెరక్లిస్ కొడుకు లితరరాజ్యముల స్థాపించుకొనిరి.

33. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 16.910

దేశము : పోసిడోనియా

జాతి : 4 జా. 6 ఉ. జా.

లింగము: పు.

వివరములు: తం. మార్స్; భా. కాటర్న్; మామ సూర్య; కొ. మెర్క్యురీ (=బృహత్); వీనస్ (= ఓసిరిస్); కూ. అపోలో (=జూపిటర్).

హెరక్లిస్ టోల్టెక్ (ఉపజాతి) చక్రవర్తి కొడుకు. మార్స్‌రాజ్యకాలముననే రాజ్యము దుర్బలమై, అతనితరువాత హెరక్లిస్ రాజ్యమునకు వచ్చి యనేక కుట్రలను ద్రోహము

లను ఎదుర్కొనవలసివచ్చెను.అతనికి రాజ్యపాలనమున సుఖము లేదు. వెనుక (31 జన్మము చూ॥) ఆల్జీరిమాలో నెలకొల్పిన విశ్వవిద్యాలయమును నేడు తిరిగి అల్కియోన్, సిరియస్ చేబూని విస్తరింపచేసిరి. వారికి హెరక్లిస్ విశేషసహాయము జేసెను.

34\. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 15,997

దేశము: మ. ఆసియానుండి బంగాళమునకు

జాతి: 5 జా. 1 ఉ: జా.

లింగము: స్త్రీ

వివరములు: భ.జూపిటర్; తం. మెర్క్యురి; త. శాటర్న్, సో. లియో, వజ్ర, కేష్టర్, నాగా; సో. రి.సిలీన్, అల్కియోన్; మిజార్; కొ. 3 రు; కూ. 3 రు.

మనోవానుండి యొక జట్టుఆర్యులు మూడుపాయలుగా ఇండియాకు పోవలెనని మనువు ఆజ్ఞాపించెను. ఒకపాయ కొరోనా నాయకత్వమున కాశ్మీరముద్వారా హిమాలయ ములు దాటి తూర్పుముఖముగపోయి బంగాళాదేశమును చేర వలెను. ఒకపాయ మార్స్ నాయకత్వమున తిబెత్ ద్వారా నేపాళమును దాటియు, మూడవపాయ వల్కన్ నాయకత్వ మున తిబెత్ ద్వారా భూతాన్ దాటియు నుత్తరబంగాళమును జేరవలెను. అక్కడ మూడుపాయలు కలిసి స్థిరనివాస మేర్ప ర్చుకొనవలెనని యేర్పాటు. ఈజట్లు బయలుదేరినప్పటికి హెర క్లిస్‌కు 5 సం,అల్కియోన్‌కు 3 సం.లు వయస్సు,పై 32వ జన్మ చరిత్రలో(మార్స్‌ను కేష్టర్ చంపజూచినట్లు చెప్పినరాజ్యమును రవిపురమునుగూడ కొరోనాయుద్ధముచేసిజయించెను. ఇట్లతడు

తనతో్రివలో 50 రాజ్యములను జయించి, అచట తన ప్రతి నిధులను నియమించి, నలుబదేండ్లలో, అనగా, క్రీ. పూ. 15,952 సం. లో, బంగాళము జేరెను. అప్పటికి మార్స్ తన పరివారముతో మధ్యబంగాళమునబ్రవేశించి రాజ్యముస్థాపించు కొని యుండెను; వల్కన్ కూడ 16 సం. పూర్వమే భూతాన్ ద్వారావచ్చి మార్స్‌ను కలిసికొని క్రీ. పూ. 15,953 సం. లో అస్సామును జయించియుండెను. హెరక్లీస్ తలిదండ్రులు మార్స్ జట్టులో వచ్చిరి. ఆమెకు అల్క్యోన్‌కు కూడ క్రీ. పూ. 15,979 సం. లో వివాహమై, 15,978 సం. లో ప్రథమసంతానము గలిగెను. మార్స్, మెర్క్యురి దక్షిణముగ బోయి, ఒరిస్సాజయించి, యచటగూడ రాజ్యము స్థాపించిరి. ఆదండయాత్రలో వారచ్చటి అట్లాంటియన్ (4వ జాతి) యభి చారికగణముతో బోరవలసివచ్చెను. ఆగణమునకు పూరిలో నొకగొప్ప పురాతనాలయ ముండెను. వారి కిప్పుడు స్కార్పియోఆచార్యుడు. ఈయుద్ధములో నోడిపోయినతరువాత వాడేమయ్యెనో యెవ్వరు నెరుగరు. తరువాత, 15937 సం. లో. హెరక్లీస్ అల్క్యోన్‌ను చూచుట కేగి, ఆమెయింటనుండగా నొకనాడు, వారిసోదరుడును, అల్క్యోన్ భర్తయుగూడ దూరదేశమున కేగియుండిన సమయమున స్కార్పియో అక స్మాత్తుగా దండెత్తివచ్చి, యంతఃపురరక్షకులను వధించి, లోపల ప్రవేశించి, అక్కచెల్లెండ్రిద్దరను ఎత్తికొనిపోయి తన యాల యమున బంధించెను. ఆ రాత్రి యొక గొప్ప యుత్సవము జరి గెను. ఆయుత్సవములో స్కార్పియో మంత్రిబలముచే నొక క్రూరదేవత నావాహనచేసెను. అదేవత యాస్త్రీలను భక్షింగ

వచ్చుచుండగా హెరక్లిస్‌సూర్యను దలచుకొని,'సూర్య దేవా, రక్షింపు'మని యొక కేక వేసెను. తక్షణము సూర్య యచట ప్రత్యక్షమై వా రిద్దరిని తనలో జేర్చుకొనెను. అక్కడ జేరిన దుష్టభూతగణములన్నియు నశించెను. ఆరాత్రి భూకంపముల తోను, సముద్రకెరటములతోను పూరీనగరము బీభత్సము జెందెను.

35. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 15,500
దేశము: అయోధ్యప్రాంతమున రహనాగ్రామము.
జాతి: 5 వ జా. 1 ఉ. జా.
లిఙ్గము: స్త్రీ
వివరములు: భ. మెర్క్యురీ; తం. మార్స్; త. వల్కన్

36. ఉరమరగ జనన కాలము: క్రీ. పూ. 14,500
దేశము: అయోధ్య ప్రాంతమున కలీపగ్రామము
జాతి: 5 వ జా. 1 ఉ. జా.
లిఙ్గము: స్త్రీ
వివరములు: భ. హిలియాస్; కొ. 4 రు; కూ. 2 రు

37. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 13,650
దేశము: పోసిడోనియా
జాతి: 4 జా. 2 ఉ. జా.
లిఙ్గము: స్త్రీ
వివరములు: భ. ఆల్డెబ్; తం. సిరియస్; త. ఆల్కియోన్

[మేనమామ కొ. ను పెండ్లాడెను]

హెరక్లిస్ ఈజన్మమున నొకదేశపు రాజు కూతురు

మరియొక దేశపు రాణి. గొప్పజ్ఞానియని పేరుకెక్కెను. రాజ కార్యములలో ఆమె భర్త ఆమె చెప్పినట్లు చేయుచుండెను.

38. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 12,877

దేశము: పంజాబ్

జాతి: 5 జా. 1 ఉ. జా.

లింగము: స్త్రీ

వివరములు: భ. పోలరిస్; తం. మార్స్; త. శాటర్న్; సో. వజ్రి, విరాజ్, మరి 1 రు; సో. రీ. యజ్ఞ, వల్కన్. ఆకాలములో మధ్యఆసియానుండి ఇండియాకు ఆర్యులు చిన్న చిన్న జట్లుగా బయలుదేరి తరుచుగా వలసవచ్చుచుండిరి. అట్టి జట్టులలో నొకదాని నాయకుని కూతురు హెర్క్లిస్.

39. ఉరమరగ జననకాలము: క్రీ పూ. 12,080

దేశము: పెరూ

జాతి: 4 జా. 3 ఉ. జా.

లింగము: స్త్రీ

వివరములు: భ. కేస్టర్; కొ. 2 రు; కూ. 3 రు; పి. మ. మార్స్. [మార్స్ సో. యూరేనస్, ఇతనికొ. అల్కియోన్].

40. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 11,200

దేశము: రాజపుత్రస్థానంలో రంతంభోరు

జాతి: 5 జా. 1 ఉ. జా.

లింగము: స్త్రీ

వరములు: భ. అడ్రోనా; కొ. జెం; కూ. సిగ్నస్ (=అల్కియోన్)

41. ఉరమరగజననకాలము: క్రీ. పూ. 10,800
దేశము: చీనా
జాతి: 4 జా.
లిఙ్గము: పు
వివరములు: భా. ఆర్కార్; కొ. 3రు; కూ 6 రు.
(వీరిలో జూపిటర్ను ఆదేశపురాజు మార్స్ పెండ్లాడెను). ఆరాజ్యమున హెరక్లిస్ ప్రధానమతాచార్యుడు.

42. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 10,420
దేశము: బంగాళము
జాతి: 5 జా. 1 ఉ. జా.
లిఙ్గము: స్త్రీ
వివరములు: భ. యజ్ఞ; తం. ఓసిరిస్; త.కుర్కున్; సో. 4 రు; సో. రీ. 5 రు; కొ. 7 రు; కూ. 8 రు.

పూరీకనతిదూరమున కామ రూపరాజ్యములో కానూర గ్రామము నివాసము. ఇంకను పూరీఆలయములో వరబలు లిచ్చు వామాచారము ప్రబలియుండెను.

43. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 9,690
దేశము: ఉ. పొసిడోనియా
జాతి: 4 జా. 5 ఉ. జా.
లిఙ్గ: స్త్రీ
వివరములు: భ. నెప్ట్యూన్; త. కేపెల్లా; తం. బీ, సో. 3 రు; సో. రీ. 3 రు; కొ. ఆల్సియోన్ మరి 4 రు; కూ 3రు.

ఈమెభర్త యొక జమీందారు. ఈమె పురాణకథలు చెప్పుటయందు పల్లెపాటలు పాడుటయందు ప్రసిద్ధిజెందెను.

44. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 8,725
దేశము : మైసూర్.
జాతి : 5 జా. 1 ఉ. జా.
లిఙ్గం : స్త్రీ
వివరములు: భ. నాగ; పి. మ. అల్కియోన్ (=యురేనస్). హాస్సాన్‌కు ఉత్తరమున హాలీబీడు అను దొరసముద్రము కాపురము.

45. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 8,345
దేశము : ఎట్రూరియా
జాతి : 4 జా (?)
లిఙ్గం : పు
వివరములు : భా. పోలక్సు; కొ. 4 రు; కూ. 1.

46. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 7,900
దేశము : పెషావర్
జాతి : 5 జా. 1 ఉ. జా.
లిఙ్గం : స్త్రీ
వివరములు: భ. విరాజ్; సో. మార్స్ (=జూపిటర్), మరి 1 రు; కొ. శాటర్న్ (=మెర్క్యురి); కూ. వల్కన్ (=శివ).

47. ఉరమరగ జననకాలము : క్రీ. పూ. 7,040
దేశము : ఈజిప్టు
జాతి : 5 జా. 1 ఉ. జా.
లిఙ్గం : పు

వివరములు: భా. 1. లూటియా; 2. నాగ; తం. మార్స్; త. వల్కన్; పి. మ. విరాజ్ (=కొరోనా).

ఈకాలములో మార్స్ ఈజిప్టురాజు (ఫెరోఅ). అతని తరువాత హెరక్లిస్ రాజయ్యెను. ఇతనికి సిరియస్‌కు బాల్య స్నేహము. [సిరియస్ కూ. అల్కియోన్.]

48. ఉరమరగ జననకాలము: క్రీ. పూ.. 6,360

దేశము : మధ్యఇండియా

జాతి: 5 జా. 1 ఉ. జా.

లింగం : పు.

వివరములు : భా. అపోలో; తం. ఎజాక్స్; కొ. మార్స్= (జూపిటర్), నెప్ట్యూన్ (=విరాజ్); కూ. మెర్క్యురి (=సాటర్న్), నాగ=(సిరియస్), యజ్ఞ (= లిరా) మరి 1 రు.

మధ్యయిండియాలో ప్రక్క ప్రక్కనేయున్న రెండు రాజ్యములలో నొక దానికి హెరక్లిస్ ఒకదానికి ఎతెనా రాజులు. ఇద్దరు అన్యోన్యమైత్రితో నుండిరి.

49. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 5,655

దేశము : కథియవాడ్.

జాతి : 5 జా. 1 ఉ. జా.

లింగం: పు.

వివరములు: భా. బీ. తం; శాటర్న్. త, జూపిటర్; పి. మ. మార్స్;సిరియస్‌కు అల్కియోన్ కవలచెల్లెలు: వీరితం. కొరోనా. కథియవాడ్‌కు రాజు. అతని తమ్ముడు శాటర్న్.

50. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 5,000
దేశము: ఉ. ఇండియా. శ్రీవస్తి సామ్రాజ్యములో శిరగంగ:
జాతి: 5 జా. 1 ఉ. జా.
లింగం: పు.
వివరములు: భా. జెం; తం. మెర్క్యూరి; సో. నెప్ట్యూన్ మరి 1 రు; కౌ. మిజాన్; కూ. 3 రు.

51. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 4,050
దేశము: ఈజిప్టు.
జాతి: 5 జా. 1 ఉ. జా.
లింగం: స్త్రీ.
వివరములు: భ. మెర్క్యూరి; తం. శాట్నరు; త. వీనస్; కౌ. 3 రు; కూ. 1 రు.

52. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 3,420.
దేశము: ఇండియా.
జాతి: 5 జా. 1 ఉ. జా.
లింగం: స్త్రీ.
వివరములు: భ. వజ్రి; తం. మార్సు; త. విరాజ్; పి. మ. జూపిటరు; సో. 3 రు; కౌ. 3 రు.

మార్సు చక్రవర్తి. అతనికి నలుగురు తమ్ములు, వారైదుగురునొక్కపోలికనుండిరి, ఆజానుబాహువులు, గొప్పవీరులు. అయిదుగురు కలిసియొంటటి వారినైనను ఎందరినైనను సులభముగ నోడించుచుండిరి. వారికి రాతుసపంచకమని పేరు, వారిలో నాగమాత్రి యొక సామంతరాజ్యమునకు రాజ

య్యేను. తక్కిన 3 ను అనాథరక్షణజేయుచు సంచరించు చుండిరి. వారి సోదరి యజ్ఞకూడ గొప్ప యోధురాలు.

53. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 2,850.

దేశము: క్రీటుదీవిలో గొలాస్ రాజ్యము.

జాతి: 5 జా. 1 ఉ. జా.

లింగం: స్త్రీ.

వివరములు: భ. మూర్సు; కొ. వజ్రి, సిలీరు; కూబెల్లా, మిజారు (= సిరియస్).

54. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 2,230.

దేశము: ఇండియా నాగపూరు జిల్లా వార్ధారాజ్యంలో మోపాగ్రామము.

జాతి: 5 జా. 1 ఉ. జా.

లింగం: స్త్రీ.

వివరములు: భ. బృహత్; తం. మూర్సు; త, ఎతీన్! [మామగారు జూపిటరు (= ధృవ)]. కొ. 6 రు; కూ. 4 రు; పౌ. ఆల్కియోన్.

55. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 1,520.

దేశము: ఆసియా మైనరులో అగాతిగ్రామము. ఇప్పుడు లంప్సాకినగరమున్న చోటు.

జాతి: 5 జాతి.

లింగం: స్త్రీ.

వివరములు: ఒక దేవాలయములో దేవదాసి.

56. ఉరమరగ జననకాలము: క్రీ. పూ. 600

దేశము: ఇండియా, రాజగృహ.

జాతి: 5 జా. 1 ఉ. జా.

లిఙ్గం: పు.

వివరములు: భా. కోన్స్; త. మార్స్; త. వజ్ర; సో. 2 రు; సో. రీ. 2 రు; కొ. 2 రు; కూ. 3 రు.

శ్రీగౌతమ బుద్ధులవారు అవతారము చాలించుటకు 15 సం. లు ముందు మార్సుచక్రవర్తి తన కుమారుడగు హెరక్లిస్‌ను తీసికొని బుద్ధులవారి దర్శనమున కేగెను. అప్పుడాయనబోధలనువిని హెరక్లిస్ ఆయన శిష్యుడై, ఆయనబోధలను దేశమందన్నిదిశలను వ్యాప్తిజేసి యనేకమంది శిష్యులను ప్రోగుజేసికొనెను. హెరక్లిస్ తన సోదరులనుసోదరీలను అత్తమామ (ఆర్ఫియస్ - ఒకదేశపురాజు) లను వారి వారి కుటుంబములతోగూడా బౌద్ధమతానుచరుల జేసెను.

57. ఉరమరగ జననకాలము: క్రీ. వె. 388

దేశము : అలెగ్జాండ్రియా

జాతి : 5 జా

లిఙ్గము : స్త్రీ

వివరము : (పేరు హిపాటియా) తం. ఎపోలో, (ఈ జీవిత చరిత్ర వేరే వ్రాయబడినది).

58. ఉరమరగ జననకాలము: 5 వ శతాబ్దిం

దేశము : ఇండియా

జాతి : 5 జాతి

లిఙ్గము : స్త్రీ

వివరము : తం. మార్స్; కొ. 1 దు.

59. ఉరమరగ జననకాలము: క్రీ. వె. 1,560
దేశము : ఇటలీ
జాతి : 5 జాతి
లిఙ్గము : పు
వివరము : (పేరు జియార్డినో బూ్రనో) (ఈ జీవిత చరిత్ర వేరే వ్రాయబడినది.)

60. ఉరమరగ జననకాలము: క్రీ. వె. 19 శతాబ్ది తుది పాదము.
దేశము : రాజపుత్రస్థానము
జాతి : 5 జాతి
లిఙ్గము : స్త్రీ
వివరము : మృతి 1844 సం. లో.

61. జననకాలము: క్రీ. వె. 1847 అక్టోబరు తే 1 ది.
దేశము : ఇంగ్లండు
జాతి : 5 జాతి
లిఙ్గము : స్త్రీ
వివరములు : ఆనీ ఫుడ్ (డా. ఆనీ బెసెంటు). మృతి 1933 సం. సెప్టెంబరు తే 20 ది.



# హిపాటియా జీవిత చరిత్రము

(హెరక్లిస్ 57 వ జన్మము).

(క్రీ. పె. 388 సం.)

ప్లాటో మహాశయుడు సోక్రిటీస్ ప్రియశిష్యుడు. ఇతని సిద్ధాంతాలను ప్లెటానిక్ సిద్ధాంతాలంటారు. అలెగ్జాండ్రియాలో ప్లెటానిక్ విద్యాలయంలో ఈయన సిద్ధాంతాల ప్రకారం విద్యాబోధ జరుగుతూ వుండేది. అర్థశాస్త్రములో పేరెన్నికగన్న థియాన్ పండితుడు ఆకళాశాలకు ప్రధానోపాధ్యాయుడు. ఈయనకుమార్తె హిపాటియా. ఈమె చిన్నతనంలోనే సర్వశాస్త్రాలనూ ఆమూలాగ్రంగా గ్రహించినది. ప్లెటానిక్ సిద్ధాంతపక్షపాతి, సౌందర్యవతి. తండ్రిగారి బలవంతమువల్ల ఆకళాశాలలోనే పనిచేయ నుద్దేశించిరి.

అలెగ్జాండ్రియాలో యువతీమణు లధ్యాపకులగుట కదే తొలిసారి. స్త్రీఅయినా, అల్పవయస్కురాలయినా, ఆపని కామె కడు సమర్థురాలు. ఎందుచేతనంటే, అకాలంలో, శాస్త్రము లెంతవరకు పరిశ్రమ చెయ్యబడినవో అంతవరకూ ఆమెకు కరతలామలకము. అంతేకాదు. క్షేత్రగణితమూ, ఖగోళశాస్త్రమూ, సామాన్య శాస్త్రములం దామెకు చెప్పవలసినవా రాకాలములో లేరట. ఆమెకు పాఠములుచెప్పే ఉపాధ్యాయులు 'ప్లాటోనిజం' హిపాటియా అనే పేరుతో అవతరించిందా అని ఆశ్చర్యపోయేవారు. అసలు నిజము చెప్పవలసివస్తే అమోనియస్ మొదలైన ప్రముఖు లధికారముచేసిన ఆ

విద్యాలయానికి సరస్వతి అపరావతారమైన హిపాటియాను అధ్యాపకురాలుగా వుండమనుట అవమానంకాదు అని వారనేవారు. ఈమె దగ్గర విద్యనేర్చుకోవడానికి, వినటానికి ర ము, ఇటీటదేశములనుండి విద్యార్థులు వచ్చేవారట.

ఆమె తండ్రియొక్క నమ్మిక, విద్యార్థుల విశ్వాసము, శ్రోతల అభిప్రాయము సత్యమనడానికి "ప్రపంచంలో వివిధదేశాలనుంచి విజ్ఞానపూరితాలయిన ఆమె యుపన్యాసాలను వినటానికి తండోపతండాలుగా జనులు వచ్చేవారట" యున్న చరిత్రపూర్వక నిదర్శనాలు చాలు. ఇలాగని ఆమెను గురించి మార్కెట్లలోగాని స్నాన ఘట్టాలలోగాని చెడ్డగా చెప్పుకోవడాలులేవు. ఆమె ఎంత విద్యావతియో అంత సౌందర్యవతి; ఎంత సౌందర్యవతియో అంత శీలవతి.

దురదృష్ట వశాత్తు మహాకోపిష్ఠి, అసూయాపరుడు అయిన సిరిల్ అనేవ్యక్తి అలెగ్జాండ్రియా దేవాలయంపూజారిగా వచ్చాడు. హృదయవికాసమూ విద్యాగంధమూ లేని అనాగరిక పూజారు లతని కనుచరులయారు. అప్పుడే మొగ్గతొడిగి వికసిస్తున్న విజ్ఞానంకట్ల సహానం చూపలేక ఏవిధంగానైనా ఈవిజ్ఞాన పుష్పాన్ని తుంచివేయాలని నిశ్చయించాడు సిరిల్ మహాశయుడు. హిపాటియా విజ్ఞాన కీర్తికిరణాలు వ్యాపించినకాలదీ తండోపతండాలుగా ఆమె యుపన్యాసభవనం నిండిపోతున్నకాలది, చర్చిలలో ఆమె ప్లాటో వేదాంతాన్ని బోధచేసే స్థలమంతా శ్రోతల నాకర్షిస్తున్న కాలదీ, ఈశత్రువు నశింపచేయబడాలనీ, ఆమెచేత ఆక్షే

కాలం విజ్ఞానపవిత్ర కాంతికిరణాల ప్రసరింప చేయనీయకూడ దనీ, అజ్ఞానాంధకారంలో వున్న సిరిల్ నిశ్చయం అధికమైంది. ప్రథమంలో ఆమెను తన మూఢనమ్మకాలలోకి దింపాలని యత్నించాడు. ఆమెను చంపడంకంటే ఆమె సునిశితహృదయాన్ని తన పిచ్చినమ్మకాలలో లీనంచేయటం చాలా లాభదాయకమని సిరిల్ వుద్దేశించాడు.

కాని విజ్ఞానభారాన్ని సిగపూవులా భరిస్తున్న ఆమెను తనమూఢత్వపు యిరుకుత్రోవలో నడిపించటం అసంభవం అయింది. ఎందుచేతనంటే ఆవిషయాన్ని గురించి, తానామె వద్దకు పంపిన ప్రచారకుల మూఢప్రబోధాలను హిపాటియా తన విజ్ఞాన విశేషాలతో నిదర్శనపూర్వకంగా ఖండించేది. అప్పుడు సిరిల్ నిరాశతో ఆమె అసువుల్ని తీయక తప్పదనుకున్నాడు. పీటరు పూజారి పాషాణహృదయుడు, దురాత్ముడు. మూఢవిశ్వాసాలతో కరడు గట్టిన మెదడు గలవాడు. మనోవికాసం మానవత్వంలేని అనాగరికులైన సన్యాసుల సహాయంతో ఈసైతాను బిడ్డను చంపవలసినదని సిరిల్ మహాశయుడు పీటరు పూజారి కుత్తరువిచ్చాడు. సైతాను హిపాటియా నావేశించినదనీ, అందుచేతనే ఆమె కాసౌందర్యమూ వాక్చాతుర్యము కలిగాయనీ, హిపాటియా తమధర్మమతవిరుద్ధంగా భగవద్దూషణ చేస్తున్నదనీ, అలెగ్జాండ్రియాలోని అమాయిక ప్రజలను పాపపంకిలంలోనికి దింపుతూన్నదనీ, దుష్ప్రచారం చెయ్యసాగాడు పీటరు. మెల్లి మెల్లిగా అజ్ఞానులైన పౌరులూ, సన్యాసులూ, పీటరు బోధలకు వశులయ్యారు.

ఆ దినం సాయంకాలం హిపాటియా కళాశాలనుండి మామూలుగా వచ్చే యిరుకుత్రోవను కాశారు పీటరు బృందము. వారిలో చాలామంది పదునైన నత్తగుల్లల నాయుధాలుగా ధరించారు. వానితో ఈబాలమాంత్రికు రాలి శరీరాన్ని చీరుతూవుంటే ఆవిడయొక్క మంత్రాలు పని చేయవనీ, ఆమెను తమ బారినుండి రక్షించలేవనీ వారి నమ్మకం. ఇంతలోనే ఒక యువక సన్యాసి పరుగెత్తివచ్చాడు. ఆవిడ దగ్గరగా వచ్చింది అన్నాడు రొజుకుంటూ. మరు క్షణంలో హిపాటియా రథం వచ్చింది. అందమైన ఆమె శేత ముఖం ఇంకా వుపన్యాస ఆవేశంతో మరీ మనోహరంగా వుంది. సునిశిత దృష్టిగల ఆమెకళ్ళు ఆమెకుగల మనోవికా సాన్ని వెల్లడిచేస్తున్నాయి. ఆవేశపూరితమైన అరవులతో పీటరుపరివారం ముందుకు తోసుకు రావటం, భయంకర ముఖాల్తో రథం చుట్టబడటమూ, గుర్రా లాగటమూ ఒకే క్షణంలో జరిగాయి. అర్థంకానిచూపులతో ఆశ్చర్యంగా ఆమె ఆసనంనుంచి లేచేసరికి పీటరుయొక్క మాంసహీనమైన పొడుగాటి చేతులు ఆబాలని క్రింది కీడ్చాయి.

ఆమె మధురస్వప్నాలు మాయమయాయి. విజ్ఞాన పిదాహంతో ఆశాదృక్కులతో తనచుట్టూ పరివేష్టించే శ్రోతలకు బదులు ఛైబాల్లులోని బూటక సన్యాసుల మోటముఖాలు తనను ముట్టడించాయి. బీభత్సంగా అరు స్తున్న ఆమూక నామె కలయజూర చూచింది. ఒక్కని దృక్కులోకూడా తనయందు స్నేహభావం కనబడలేదు. "చర్చికి నడవండి మన మహాదేవుని పవిత్ర కదసన్నిధికి

మాంత్రికురాలిని సమర్పించాలి" అంటూ ఆపాషండుడు అరిచాడు బిగ్గరగా. దిగ్భ్రమతో మూర్ఛావస్థకు వస్తూన్న హిపాటియాను పీటరు ముందు కీడ్చి దారితీసాడు. శాపాలతోనూ, ప్రార్థనాగీతాలతోనూ సన్యాసిబృందం వారి ననుసరించారు. అలెగ్జాండ్రియా చర్చిప్రాంతాలను చేరుకున్నారు. పవిత్ర వేదిక మీదనుండి మహాత్ముడు, శిలువవేయబడిన క్రీస్తు, తన ప్రసన్నదృక్కులతో తన భక్తబృందాన్ని వీక్షిస్తున్నాడో ఆ వేదికదగ్గర కీడ్చాడు తాను వేటాడితెచ్చిన ఆ నిస్సహాయ జీవాన్ని పీటరు పూజారి రొజుకుంటూ. క్షణమాత్రం స్వేచ్ఛ నొందిన హిపాటియాబాల కొంచెంగా తేరుకుని, సాయుధులైన ఆపూజారుల బీభత్సాకారాలని కలయజూచి ఏదో మాటాడాలని ప్రయత్నించింది. ఆ భయంకర ప్రయాణంలో ఆమె తెల్లనిదుస్తులు మాలిన్యాలయాయి, కాని, ఆమె కళ్ళలోని తేజస్సూ, ముఖంలోని మార్దవమూ, ప్రశాంతతా, గంభీరతా మాత్రం అలాగే వున్నాయి. ఆమెవుపన్యాసం తీగమీద పాకుతూన్న దివ్యనిరాగంలా, ఆమె శత్రువులమీద సాగుతూవుంది. కాని తనపరివారం ఈవాక్ప్రవాహంలో కొట్టుకుపోయి తన నుపకరించరనే భయంతో పీటరు ఆవేశంతో వెర్రిగా అరిచాడు.

"హిపాటియా మాంత్రికురాలు. ఆమె తంత్రాలను వినవద్దు. అదిగో సైతా నామె నాలికమీద ఎలా నృత్యం చేస్తున్నాడో" అంటూ ఆమెమీద కురికి ఆమె వస్త్రాలను పీలికలుగా చించి, ఆమె ముందర కుప్పవేశాడు. తెల్లని పొడుగాటి ఆమె ఆకారం, వస్త్రవిహీనమై, మంచులా మెరుస్తూ

ఆ కాంచనవేదికముందు నిలబడివుంది. ఆ ఆటవికులముందర, ఆవిధంగా దిగంబరిగా చేయబడినందుకు, ఆమె ఒక వెర్రి అరపు మాత్రం అరవగలిగింది.

కాని మహాత్ముడైన క్రీస్తు మూగవోయి అలాగే చూస్తున్నాడు.

సన్యాసులమూక ఆమెను సమీపించి, తమచేతి బలం కొలదీ ఆమెను మోదారు. ఆ మెరుస్తూన్న బంగారు జుట్టును పిడికిళ్లకొలదీ పీకారు. భీకర వన్యమృగాల్లాగ తమ వాడి గోళ్లతో ఆమె శరీరాన్నుండి మాంసశకలాల్ని పూడదీసారు. తమ పవిత్రశంఖాలతో ఎముకలు కనబడేవరకూ ఆమె శరీరాన్ని గీకి దేహమంతా ఒకటేగాయంచేసి అలసిపోయారు. ఆవేశంతో ఆమె అవయవాలను ఒకదానినుండి ఒకటి వేరు పరచారు. అయినప్పటికి వారి ఆవేశం ఆగలేదు. ఆమాంత్రికురాలి భౌతిక శరీరాన్ని బూడిదచేయాలని అరచారు.

కాని మహాత్ముడైన క్రీస్తు మూగవోయి అలాగే చూస్తున్నాడు.

కొన్ని పుల్లల్ని సేకరించి, చితి తయారుచేసారు. ఆమె అవయవాలనీ, మాంసఖండాలనీ దానిమీదకి విసిరి, నిప్పుముట్టించి చితిచుట్టూ నిలబడి, తమదివ్యగానాల నాలపిస్తూ జయధ్వానాలు చేసారు తుదివరకూ. చివర ఆ బూడిదను గాలిలోనికి విసిరేసి, తాముచేసిన ఘనకార్యానికి సంతృప్తితో, సంతోషముతో గృహాల్ని చేరుకున్నారు.

ఆరాత్రి సిరిల్ మహాశయుడు మధుర భావాలతో నిద్రించి అగాధసుషుప్తిలో ఎన్నో సుఖస్వప్నాలను అనుభవించాడు. పీటరుపూజారి విజయసూచకంగా పీకవరకూ త్రాగి, ఒళ్ళు తెలియకుండా గడిపాడు. కాని చాలమంది సన్యాసులు తామేదో మహాపాప కార్యాన్ని చేసామనే అనుమానంతో కలతనిద్దుర ననుభవించారు.

ఆ చీకటిచర్చిలో మానవరుధిరం కాలవలుగా ప్రవహించింది. అక్కడక్కడ చింపిరిజుట్లు మాంస శకలాలూ ప్లాటోనిజంయొక్క శిథిలచిహ్నాలల్లే పడివున్నాయి.

కాని మహాత్ముడు క్రీస్తు మూగవోయి ఆలాగే చూస్తున్నాడు.

(ఆనీ బెసెంటుగారు దివ్యజ్ఞానసమాజములో చేరక పూర్వము హైపేటియా చరిత్రగురించి వ్రాసిన వ్యాసము 1946 సెప్టెంబరు నెల ఇండియన్ థియాసఫిస్టులో ప్రచురించిరి. దానిని అనుసరించి యీ వ్యాసము వ్రాయబడినది.)

ఓ

# జియార్డినో బ్రూనో జీవితచరిత్ర

## (హెరక్లిస్ 59 వ జన్మము.)

ఇటలీదేశములో సౌందర్యమునకు లోకవిఖ్యాతిగాంచిన నేపిల్సు నగరములో క్రీ. శె. 1560 సం॥ లో ఫిలిప్పో బ్రూనో పుట్టెను. తరువాత నతనిపేరు జియార్డినోగా మారెను. ఇతని తండ్రి సైనిక నిష్ఠపరుడు, అతని బాల్యములోనే పోయెను. తల్లి దైవభక్తిగలది, అమాయకురాలు, ఇతనిని కడు ముద్దుగ బెంచుచు నొక మఠములో సన్యాసిగనున్న ఫాదర్ ఏన్సెల్మొ వద్ద చదివించెను. ఆమెకు కొడుకు సన్యాసి కావలెనని కోరిక, బ్రూనో ఆమఠములోని కొన్ని పుస్తకములను చదువ గోరెను గాని చదివి అర్థము చేసికొనలేకపోయెను ఫాదర్ ఏన్సెల్మొ ఆ మఠనియమముల ననుసరించి సన్యాసాశ్రమము గైకొనినయెడల ఆ పుస్తకములలోని విషయమతనికి బోధించెదననెను. దానిమీద జియార్డినో చాలాదూర మాలోచించి మఠములో జేరనిశ్చయించెను. ఆ తల్లి కొడుకుల సంరక్షణను చూచుచుండిన అతని పినతండ్రి యతనిని సైనికునిగ జేయదలచెను. కాని జియార్డినో ఆయుధములుధరించుటకుగాని, "ఎవడో యొక సోమరిపోతు ప్రభువుపంపున తోడి మానవుల జంపుటకును ధనము దోచుకొనుటకునుగాని నే నెన్నటికి నంగీకరించను" అని స్పష్టముగజెప్పి తల్లి సెలవుగొని మఠములోజేరి, అక్కడ కొన్నాళ్ళు చదువుకొని సన్యాసదీక్ష నొందెను. అప్పటి కతనివయస్సు 15 సం. లు. ఫాదర్ఏన్సెల్మొ ఆ యువకుని తెలివికి, సూక్ష్మబుద్ధికి, మాటనేర్పుకు చాల

ముగ్ధుడై యతనిని విశేషముగ ప్రేమించుచుండెను, కాని, వాని కా తెలివి యెన్నటికైన నపాయము దెచ్చునని భయపడు చుండెను.

అతని భయమునకు కారణము లేకపోలేదు. నాటి చర్చిలో భూమి స్థిరముగ నున్నదని సూర్యుడు దానిచుట్టును తిరుగునని అరిస్టాటిల్ ననుసరించి బోధించుచుండిరి. మరి యును, తత్త్వమునకు సవుబునకు విరుద్ధములగు ఆధ్యాత్మిక సంబంధమగు విషయములనుగూడ బోధించుచుండిరి. జియా ర్డినో స్వతంత్రబుద్ధి గలవాడు. చర్చిలో చెప్పినబోధ లతనికి నచ్చక వానిని ప్రశ్నింపజొచ్చెను. అతం కా మతమునందలి గ్రంథములలో జదివిన రహస్యములు కొన్ని మనస్సున కెక్కెను. "చాలకాలము సాహిత్యము కావ్యములు చదివిన తరువాత, తత్త్వశాస్త్రమునకును స్వతంత్ర అన్వేషణకును నా యుపాధ్యాయులే, నా మార్గదర్శులే, పెద్దలే నాకు త్రోవ జూపిరి" అని యతడు వ్రాసెను. ఆ ప్రకార మతడు మతగురు వులబోధల నంగీకరించక పైతోగొరస్, అతనితరువాత కొపర్నికస్ చేసినబోధల నంగీకరించెను ఆకాలమున చర్చి అభిప్రాయములకు భిన్నమగు నభిప్రాయములు గలవారిని పాషండులని చెప్పి పలుబాముల బెట్టుచుండిరి. ఫాధర్ ఏన్ సెల్మొ తనతోడి సన్యాసులలో జియార్డినోయెడల గలుగు చున్న ద్వేషభావమును గుర్తించుటచేత అతనికి ఆ యువకుని గూర్చి భయముపుట్టెను అందుచే నతనిని చర్చికి లొంగజేయ జూచి యనేక విధముల బ్రతిమాలెను, గాని, జియార్డినో లొంగలేదు. తుదకు మఠాధికారి నేపిల్సు ప్రధానాచారియొద్ద

కొక సందేశము నంపెననియు, ఆ మరునా డుదయమున కక్కడనుండి యొక విచారణకర్త వచ్చుననియు విని ఫాదర్ ఏన్సెల్మో విచారణకర్తవిచారణలో జియార్డినోకు న్యాయము దొరకదని తెలిసినవాడగుటచేత నీసంగతి నతనికి రహస్యముగ జెప్పి యేలాగైనను తెల్లవారులోపల తప్పించుకొని పారిపొమ్మని బ్రతిమాలెను. జియార్డినో యందు కంగీకరించి, యా రాత్రి యందరు నిద్రించుచుండగా, తనగది కిటికీ కొక త్రాడుగట్టి దాని సహాయమున క్రిందకు దిగి పారిపోయెను. తెల్లవారిన తరువాత విచారణకర్త వచ్చెను. జియార్డినో కొఱకు చూడగా నతడగుపించలేదు. దానిపైన వారేమియు చేయజాలక, వాని యాత్మను దేహమును దయ్యమున కొప్పగించుచు శాపములబెట్టి, వానిని కులమునుండి వెలివేసిరి

ఇక నా యువకుడు రాత్రింబవళ్ళుత్తరదిశగా కాలి నడకను దొరికినప్పుడే రాధారిబండియో నెక్కియు, బోవుచుండెను. ఆరోజులలో మర్యాదస్తునకు సత్యసంధునకు గౌరవము లేదు. పాపి తగుమనుష్యునిగను తగుమనుష్యుడు పాపిగను నెంచబడుచుండెను. ఎటువంటి నేరము లెన్ని చేసినను చర్చికి పోయి, మతగురువులు చెప్పినట్లు చేసి వారికి ధనము నిచ్చువారు పెద్దమనుష్యులే. అట్లుగాక సత్ప్రవర్తకుడు సత్యవాదియైనవాడు పాషండు డనిపించుకొని మతాచార్యుల చేతులలో మాటలకో యురికంబమునకో ఆహుతి యగుచుండెను. అందుచేత జియార్డినో నరావాసముల జేరకుండ తప్పించుకొని పోవుచుండెను. తుద కతడు ఇటలీకి స్విట్జర్లాండుకు సరిహద్దుననున్న ఆల్ప్సు పర్వతశ్రేణి జేర

సెం. బెర్నార్డు పర్వతశిఖరమునెక్కి తన మాతృదేశము వంక జూచి "ఇటలీ! ఇటలీ! నాచక్కని, నాప్రియమైన తల్లీ!... మానవులలోనుండి క్రైస్తవము తయారుచేసిన దెయ్యముల అపరాధావతారముల బారినుండి తప్పించుకొని పారిపోవుచున్నాను. నీలో కెన్నడైన వచ్చి యచట కాపురముండి యచట ప్రాణములు విడిచెదనా! నాఇటలీ! నీయందు నాకు ఇల్లు ఆశ్రియము ఉన్నవా? లేక గోరీ మాత్రమె యున్నదా!" అని యుష్ణభాష్పములు రాల్చుచు బిగ్గరగ వాపోయి, తన మాతృభూమియొద్ద సెలవు దీసికొని యుత్తరమునకు మళ్లెను.

అట్లాత డా పర్వతశ్రేణిని దాటి తుదకు 1580 సం లో జినీవానగరము చేరెను. అక్కడ అదివఱకు ఇటలీలో వలెనే అరిస్టాటిల్ ననుసరించిన క్రైస్తవచర్చి సాంప్రదాయకుల మూర్ఖ వాదములు ప్రబలియుండెను. కాల్విన్ అను నతడక్కడ కొంత సంస్కారము జేసియుండెను. గాని యాతని వాదము కూడ జియార్డినో సిద్ధాంతముల నంగీకరింప జాలకుండెను. మొదట జియార్డినో రోమన్ చర్చిసిద్ధాంతములపై తిరుగుబాటుచేసి వచ్చెననుకొని జినీవాలోని కాల్విన్ మొదలగు సంస్కర్తల యనుచరులు అతనిని గౌరవించిరి కాని, తుదకచ్చటివారుగూడ నతని వాద మంగీకరింపక అతనిని చంప యత్నించిరి. ఆసంగతి తెలిసి జియార్డినో యచటనుండి పారిపోయి ఫ్రాన్సుదేశము జేరెను.

ఫ్రాన్సులో లయాన్సు నగర మప్పుడు అచ్చుకూటములకు ముఖ్యస్థానము. అనేక గ్రంథము లక్కడ అచ్చుపడి యూరప్ ఖండమం దంతటను విజ్ఞానతేజస్సును ప్రసరింపజేయు

చుండెను. అక్కడ నెందుచేతనోగాని జియార్డినో యొంతో కాల ముండలేదు. అక్కడనుండి టూలూస్ నగరమున కేగెను. అక్కడకూడ బ్రూనో తన యభిప్రాయములు ప్రాణహాని దెచ్చునని తెలిసి ప్యారిస్ నగరమునకు బోయెను.

ఫ్రాన్సులో జియార్డినో ప్రయాణము ముండ్లమీద నడిచినట్లుండెను. క్రైస్తవులలో నొకతెగవారింకొక తెగ వారి ననేక విధముల హింసించుచుండిరి. మతమూర్ఖత యందు స్నేహబాంధవ్యములకుకూడ నిలువచోటు లేకుండెను. ఎక్కడ జూచినను నెత్తురు ప్రవాహములే. అటువంటి దేశములో జియార్డినో ప్రయాణముచేసి 1582 సం. లో ప్యారిస్ చేరి, అక్కడనైన తన కాదరణ దొరుకునని యాశించెను.

సోర్బోన్ మఠము రోమన్ కేథలిక్కు సంప్రదాయము నకు చెంది పూర్తిగా పూర్వాచార పరాయణులగు మతగురు వులతో నిండినది. ఇంకొకవైపు రోమర్ కాలేజి నూతన భౌతికవాదులతో నిండినది. వారెంత మూఢాభిప్రాయములు గలవారో వీరంత విశాలహృదయులై నూతన అభిప్రాయము లను విజ్ఞానమును గౌరవించెడివారు. వీరు బ్రూనో నాద రించిరి. అతడుతత్వశాస్త్రముగురించి బహిరంగోపన్యాసముల నిచ్చుట కనుజ్ఞబడసెను. ఆయుపన్యాసముల ధోరణి, మాట పొందిక, హేతుపూర్వకమగు విమర్శ, సమయస్ఫూర్తి జనుల నాకర్షించెను. చప్పటివిషయముల యందు రుచికలిగించుట యందును కఠినవిషయములను సులభముగ బోధపడునట్లుచెప్పుట యందును అతడు కడునేర్పరి యగుటచే యువజనుల నాకరిం

చెను. అతని కీర్తివిని మూడవ హెన్రీరాజుగారతనిని తన సన్నిధికి రప్పించి ప్యారిస్ విశ్వకళాపరిషత్తులో తత్వశాస్త్రాచార్య పదవి నిచ్చెను. "ప్రభూ! నాకు విశ్వవిద్యాలయములో నాచార్య పీఠమా! నాకెప్పుడో ముసలితనమున నది లభించునను కొంటిని. నేనింకను చిన్నవాడను, అజ్ఞాతుడను, నాకా ఆపదవి" యనెను. రాజు "ప్యారిస్‌లోని యువకుల కుద్రేకముగలిగించువారును తరువాత వారి పదవులో నుంచగలవారును నీకంటె నింకెవ్వరున్నారు. నాతల్లి పుట్టిన దేశమునుండి వచ్చినవాని కొక యర్హపదవి నీయదలచినాను" అనెను. అంత నాపదవికి జియార్డినో అంగీకరించిన తరువాత రాజు అతనిని చర్చిలో ఆరాధన సమయమున నతని నెన్నడును చూడలేదనియు, ఆ యాచార్య పీఠమునందున్న పండితుడు విధిగా నారాధనకు హాజరు కావలెననియు, దానిలో పాల్గొనకున్నను కొన్ని నిముషము లచట నుండిన చాలుననియు చెప్పెను. కాని, బ్రూనో తాను కేథొలిక్కును కాననియును, చర్చి ఆరాధనకు హాజరు కాజాలననియు వినయ పూర్వకముగ మనవి చేసెను. రాజామాట విని ఆశ్చర్యపడి కొంతసేపు నిదానించి, అతని ముఖములోని ధైర్యము, వినయము చూచి యిట్లనెను, "సరే, ఇక చాలును, నీ పాషండత్వమును వెల్లడి చేయకుము. నమ్మనివానిని నమ్మించుటకు పవిత్రమైన చర్చి కనేక తీవ్రవాదము లున్నవి. చర్చి ఆరాధనతో గూడిన ఆచార్యపదవికంటె నెక్కువ అసౌఖ్యకరములగు పదవులున్నవి. నీకు మంచి బుద్ధి పుట్టించవలెనని దేవిని ప్రార్థించెదను. నీపాపిష్టి మూర్ఖత సోర్బోన్ పండితుల చేతిని బడిన మొదలు

నా కటాక్షముగూడ నిన్ను రక్షించజాలదు" అని యచట నుండి వెడలిపోయెను.

జియార్డినో ముఖము వాడిపోయెను. ఇక్కడకూడా అతనికిశాంతముగతలదాచుకొనుటకు చోటుదొరకకపోయెను. తిరిగి పలాయనము. ఏమి చేయును? 1583 లో ఇంగ్లండుకు పయనమై అక్కడ రాజ్యము నేలుచుండిన ఎలిజబెత్తురాణి గారి దర్బారులోని ఫ్రెంచి రాయబారికి ఫ్రాన్సురాజుగారిచ్చిన పరిచయపుజాబు గైకొని పోయెను. ఆ రాణి దర్బారులో సర్ ఫిలిప్ సిడ్నీయను నుదారహృదయునకు బ్రూనోకు నైక మత్యము కుదిరి క్రమముగ గాఢమైత్రిగ మారెను. బ్రూనోకు ఎలిజబెత్తురాణి మొకల గొప్ప సద్భావము గౌరవము కలి గెను. ఆమె నప్పు డతడు చేసిన స్తుతు లాతరువాత నతని విరోధుల చేతులలో నాయుధము లయ్యెను. ఏలయన, ఆమె ఇంగ్లం డును రోమన్ కేతొలిక్కుమతాధికార బంధమునుండి తప్పించి పోప్ (ఆ మతాచార్యుడు) నకు విరోధియయ్యెను.

ఆకాలమునం దొక్క మతములోని తప్ప తక్కిన విష యములలో నింగ్లండు ఇటలీ అక్కచెల్లెళ్ళవలె కలిసి మెలసి యుండిరి. ఇటలీదేశపు విద్యలు, కళలు, సాహిత్యము ఇంగ్లం డులో స్వాగతము నొందుచుండెను. షేక్స్పియరు, మిల్టన్ ఇటలీనుండి తమ రచనలకెంతో గొప్ప యాధారములను బడసిరి. ఇంగ్లీషు రాణి దర్బారులో ఇటలీ దేశస్థులు పరదేశీ యులు కారు. ఇట్టి పరిస్థితులలో నిటలీనుండి వచ్చిన బ్రూనో కక్కడ మరుపురాని దినములు గడుపుట కవకాశము దొరి కెను. అతడును తన తీవ్రవాదములను కొంతెము కట్టిపెట్టి

రోమను చర్చి పెట్టు బాధలను తాళజాలక తిరుగబడిన ప్రోటెస్టెంటు మాదిరిగ కాలక్షేపము చేయజొచ్చెను.

కాని, యతనిలో నణగియున్న తీవ్రభావములు పైకుబుకవలసిన సమయము త్వరలోనే వచ్చెను. ఎలిజెబెత్ రాణిగారి దర్బారులో నామె కత్యంతప్రేమాస్పదుడగు లీసెస్టర్ ప్రభువు ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయమునకు ఛాన్సెలర్ (అధ్యక్షుడు). అక్కడ యొకానొక యవసరమున ననేకమంది పండితులు కూడిరి. ప్రతిదినము శాస్త్రవాదములు జరుగుచు, పూర్వపక్ష సిద్ధాంతములతో యుద్ధభూమివలె నుండెను. తుదకు బైటనుండి వచ్చిన పండితులెవరైన ఆ విశ్వ విద్యాలయములో పట్టముల బొందిన పండితులతో వాదించగలరా యని పిలుపువచ్చెను. దానితో బ్రూనోలోని పోట్లాట స్వభావము "చకుముకి తో అగ్గిజాతి పైకొట్టినప్పుడు రగుల్కొను అగ్నివలె" రగుల్కొని మండజొచ్చెను. అతడు వేదిక నెక్కెను. మాటల పొందికతో వాగ్ధోరణి ప్రవహింప జొచ్చెను. ఇటలీలోను,స్విట్జర్లాండులోను, ఫ్రాన్సులోను పాడినపాటయే: ఆరిస్టాటిల్ చెప్పినట్లు భూమి స్థిరముగ నుండి సూర్యుడు తిరుగుచున్నాడా ?, కొపెర్నికస్ ననుసరించి బ్రూనో వాదించినట్లు భూమియే తిరుగుచున్నదా? ఈవాదమును గురించి బ్రూనో యిట్లు వ్రాసెను, "వాదము విపరీతమయ్యెను, నా ప్రతిపక్షులు వెక్కిరింపులకు దూషణలకు బూనుకొనిరి, ఒకడు కలము కాగితము తీసికొని, 'యిదిగో, చూడుము, టోలెమి, కొపెర్నికస్ చెప్పినదేమో నీకు బోధించెదను, నోరుమూసి కొని నేర్చుకొనుము' అని గోళములను గీయనారంభించగనే

వాడు కోపెర్నికస్ వ్రాసిన పుస్తకములను విప్పనేలేదని స్పష్టమైనది.” తుదకు బ్రూనో ఏకాకియైనను సత్యము తన పక్షమున నున్నందున ప్రతిపక్షులనోరు మూయగలిగెను, ఆ ఇటలీ దేశస్థుడు తనదేవియైన శాస్త్రము యొక్క గౌరవము నిలబెట్టుటకు పోరాడి తుదకామెధ్వజమునకు విజయము చేకూర్చి నపుడక్కడి పండితుల ముఖములు వాడిపోయెను.

పిదప బ్రూనో ఆక్స్‌ఫర్డులో నుపన్యసించుట కనుజ్ఞ గోరి పొందెను. పారిస్‌లోవలె నక్కడగూడ— త్రోవబోవు నపుడు జనులతనిని జూచి ‘ఛీ! నాస్తికుడు’ అని సణుగు కొన్నను, మతాచార్యులు భౌతికశాస్త్రమునకు బైబిల్ ప్రమాణము కాదనినందు కతనిపై కోపగించి, వానిమాటలు విన్న వారి యాత్మలు నరకములో బడునుగనుక యాపాషండుని, యాదైవదూషకుని లెక్కచేయవద్దని యువకులకు కఠినాదేశముల నిచ్చినను—ఉపన్యాస మందిరములు శ్రోతలతో క్రిక్కిరిసి పోయెను.

కాని, కొద్దికాలములో నీయసహాయశూరున కింగ్లండులో నుండుటకూడ కష్టమైనది. ప్రతిపక్షుల బెదిరింపు లెక్కువ కాజొచ్చెను అతని మిత్రులు సర్ ఫిలిప్ సిడ్నీయును ఫ్రెంచి రాయబారియును రాచకార్యములపై దూరదేశములకు బోయి యుండుటచే వారు కాపాడుదురను నాశలేదు. తుదకు 1586 సం॥ లో బ్రూనో ఇంగ్లండునుండి పారిపోయి తిరిగి ఫ్రాన్సు చేరెను

అచట ప్యారిస్‌నగరములో బ్రూనో అరిస్టాటిల్ సిద్ధాంతము మీద మూడురోజులు బహిరంగముగ వాదము

చేసెను. రాజు అతని పక్షముననుండ సాహసింపలేకపోయెను. పోర్ బోన్ మతమునుండి యతని శిక్షించెదమని బెదిరింపులు వచ్చెను. అందుచేత బ్రూనో శీఘ్రముగ పలాయనసూత్రమవ లంబించి, హెస్సిలోని మార్బరోనగరమున విశ్వవిద్యాలయములో పనిచేసి బ్రతుకవలెనని యక్కడ కేగెను. మొదట నక్కడ అంతయు సుముఖముగా నుండెను. ఆ సంవత్సరము జూలైలో నా విశ్వవిద్యాలయము వారు 'డాక్టరు' పట్టము నిచ్చి గౌరవించిరి. దానితో బ్రూనో తనకిక స్థిరవాస మమరిన దనుకొని తత్త్వశాస్త్రోపన్యాసముల నిచ్చుటకనుజ్ఞ గోరెను.

ఆయనుజ్ఞకొఱకతడత్యాశతో వేచియుండ పిడుగువలె విశ్వవిద్యాలయ ప్రధానాచార్యుని (రెక్టార్) యొద్దనుండి యనుజ్ఞ ఇచ్చుటకు వీలులేదనియు, అందుకు గొప్ప కారణములున్నవనియు జాబువచ్చెను. అది చూచినంతనే బ్రూనో తోకత్రొక్కిన త్రాచువలె లేచి రెక్టార్ యొద్దకు బోయి యతనియెదుట నిలిచి జాబు నతని బల్లమీద విసరికొట్టి, దానిలో వ్రాసిన గొప్ప కారణములేవని యడిగి, "నన్ను 'డాక్టరు'ను చేసి డాక్టరు చేయవలసిన బోధ చేయనీయరా, నాకీ నిరర్థకము బిరుదెందుకు. నన్నిట్లనాదరణచేయుదు రేల?" యని యడిగెను.

"డా. బ్రూనో! నీ యభిప్రాయములు క్రమమైనవి గావు. యువకులకు బోధించువాని కవియుండిన క్షేమముకాదు" అని రెక్టారనెను. బ్రూనో, "క్రమము? క్షేమము? అవి సత్యములైనచో?"

రెక్టార్:—"అయ్యా, సత్యమును దేవుడిచ్చిన ప్రమాణమును బట్టి కొలవవలెను. భూమి తిరుగుచున్నదని నీవు చేయుబోధ వేదమును వెక్కిరించును."

బ్రూ:—"వేదము పాడుగాను!"

రె:—"దైవదూషకా!, పీరీ నిగిడియస్ అను నేనీ విశ్వవిద్యాలయములో నధికారము చేయుచున్నన్నినాళ్లు దైవదూషకు డెవ్వడు నిచట నుపన్యసింపరాదు".

బ్రూ:—(కోపముతో) "ఇదిగో! ఈ నిరర్థకపట్టమును నీవే తీసికొనుము, నేను బోధింపజాలని బోధకునిగ నుండజాలను. మీా విశ్వవిద్యాలయ పట్టముల పట్టికలోనుండి నా పేరు కొట్టివేయుము. నీ మతమువలె శూన్యమైన గౌరవము నాకు చేయ నక్కరలేదు".

రె:—"నీ పేరు వ్రాసినందున పట్టిక కగౌరవమైనది. అటువంటి పేరు కొట్టివేయుట కష్టముకాదు. ఈ సాయంత్రము ప్రొద్దుగ్రుంకు లోపున కొట్టివేయుదును. కాని, నిర్భాగ్యుడా, పరదేశీయుడైనను స్వదేశీయుడైనను పాషండుడైనవానికి మార్బర్గులో చెరసాల యున్నదని తెలియగలవు, జాగ్రత!"

సరి, బ్రూనో తిరిగి పలాయన సూత్ర మవలంబించవలసివచ్చెను. అక్కడనుండి యతడు జర్మనీలోని వుర్టెంబెర్గు నగరముచేరి యచటి విశ్వవిద్యాలయములో రెండేండ్లు తలదాచికొని శాంతముగ గడిపెను.

ఈ నగరమునకు బ్రూనో తన కృతజ్ఞతను చిరస్మరణీయములైన యీా వాక్యములలో వ్రాసియుంచెను:-

"మీరు నామతము నామోదింపక పోయినను దానిని గురించి ప్రశ్నించలేదు. దాతృత్వము, శాంతి, పరోపకార బుద్ధి, తత్త్వము వీనియెడల నాకున్న ప్రేమనే మీరు మన్నించితిరి. నన్ను జ్ఞానహితుడుగను, సరస్వతీసేవానిరతుడుగను మాత్ర ముండనిచ్చితిరి. మీ రంగీకరించిన సిద్ధాంతములకు భిన్నములైన యభిప్రాయములను స్వేచ్ఛగా ప్రకటింప మీరు నిషేధించలేదు ...మీకు కోపము రాలేదు. మీరుసహాయము చేయవలెనని సేవించవలెనని హృదయపూర్వకముగ గోరి వివేకము, దయ, నాగరికత కనపరచిరి. అభిప్రాయ స్వాతంత్ర్యము నరికట్టుటకు ఆతిథ్యమున మీకుగల కీర్తికి కళంకము దెచ్చుటకు బదులు చాటసారిని, పరదేశీయుడను, దేశబాహ్యుడను మిత్రునిగను తోడి పౌరునిగను ఆదరించిరి; అధ్యాపక వృత్తిచే జీవింపనిచ్చిరి; మీనగరములో మీయాతిథ్యపునీడను ఆతడు వసించిన రెండేండ్లును అతనినిగురించి వ్యాపించిన నిందలను తొలిగించిరి."

అతడింత యాదరణమును పొంది సుఖించిన యీ నగరమునుండి వెడలిపోవుటకు కారణము తెలియదు, గాని, 1588 సం॥ లో ప్రేగ్ నగరమున కేగెను. అక్కడ రెండవ రుడాల్ఫు చక్రవర్తి దర్బారు జరుగుచుండెను. ఆతనికి విద్యల యందభిమాన మున్నదని తెలిసి బ్రూనో కొన్ని గణితశాస్త్ర విషయికమగు వ్యాసముల నర్పించెను. కాని, పూర్వాచారపరాయణుడగు నా కైస్తవ ప్రభువున కవి రుచింపనందున బ్రూనో హెల్మ్‌స్టాట్ నకుపోయి అక్కడ బ్రన్‌స్విక్ ప్రభువు కొడుకుకు చదువుచెప్పుటకు కుదిరెను. కాని, కొన్ని నెలలలో

నా ప్రభువు చనిపోవుటచేత మతపీడ ప్రారంభమై, ప్రధానా చార్రి యతనిని బహిష్కరించెను. దానితో ప్రజలుకూడ అనాదరణ జూపసాగిరి. వారిమధ్య నతడొక సంవత్సరమెట్లో వెళ్ళబుచ్చెను గాని తరువాత అక్కడ నివాసము దుర్భరమై యచటనుండి వెడలిపోయెను.

తరువాత ఫ్రాంక్ఫోర్టులో 1590 జూన్ మొదలు 1591 ఫిబ్రవరి వఱకు సర్ ఫిలిప్ సిడ్నీకు స్నేహితుడగు నొక గృహస్థుని యింట భోజనముచేయుచు తన గ్రంథముల నచ్చు వేయించి ప్రచురించెను. అక్కడ నతడున్నప్పుడే యతనిని తిరిగి యిటలీకి, తనను నాటినుండియు వెంటాడించుచున్న హంతకుల చేతులలోనికి, గొనిపోయిన జాబు అందెను.

ఆజాబు జియొవన్ని మోసినీగో యనునతని చేవ్రాలుతో వచ్చెను. అత డొక గొప్పకులీన వంశమువాడు, ఇతనిని కాపాడదగిన బలము పలుకుబడి గలవాడు. అంతేగాక అతడు బ్రూనోకు నిరపాయకరముగ వసించుట కాశ్రయమిచ్చెదనని యా జాబులో ప్రతిజ్ఞ జేసెను. అతడు స్వదేశమునకు వచ్చి తనకు అధ్యాపకుడుగ నుండవలెనని యా యువకుడు జాబులో గోరెను. ఆ జాబు చూచినంతనే బ్రూనో సంతోషము పట్ట లేకపోయెను. కాని, వెంటనే తనపై బడియున్న నేరము, విచారణ జ్ఞప్తికివచ్చి ఇటలీకివెళ్లినచో సుఖముగనున్న ప్రాణమును గోల్పోవవలసి వచ్చునే యని విచారించెను. ఒకప్రక్క మాతృదేశదర్శనాభిలాషయు నొకప్రక్క హత్యాభీతియు నీవిషమస్థితిలో చాలసేపు యోచించి తుదకు స్వదేశదర్శనాభిలాష యెక్కువయి, ఇటలీకి పోయెను.

కాని, పాడువా నగరములోని విశ్వవిద్యాలయ మనేక మంది ప్రఖ్యాత పండితుల నాకర్షించుచుండుటచే నచటకు బోయిన తన శాస్త్రచర్చకు తగిన తావుదొరుకునని ముందుగా నతడు పాడువా కేగెను. వాని సాహసమునకు వానిమిత్రులు భీతినొందిరి. "బ్రూనో మా యూరిలో నివసించుచు నుపన్య సించుచున్నాడని యనుకొనుచున్నారు. నిజమా ? ఇటలీనుండి పారిపోవలసి వచ్చినవా డచట నిప్పుడేమి చేయుచున్నాడు ? నా కీవార్త నమ్మదగినచోటనుండి వచ్చినను, ఆశ్చర్యముచే భ్రాంతుడనై నమ్మజాలకున్నాను" అని పాడువాలోనున్న యొకనికి ఫ్రాన్సునుండి యొకడు వ్రాసెను.

సాహసుడగు నీ పాషండుని చుట్టును వెంటనే తుపాను చెలరేగెను. అందుచేత, అత డచటనుండిపోయి తన నధ్యాపకు నిగ రమ్మనివ్రాసిన మోసినీగో యింటిలో 1592 మార్చిలో బ్రవేశించెను. అక్కడ రాత్రిం బవళ్లు తన శిష్యునకు కొపెర్ని కస్ తత్త్వము, భౌతికశాస్త్రముపై రోమను చర్చికిగల యధి కారము మొదలగు ననేకవిషయములను బోధించుచుండెను, కాని, అత డాడిన ప్రతిమాటయు నెప్పటికప్పు డా శిష్యు డొక మతాచార్యునకు రహస్యముగ నెఱిగించుచుండెనని పాపమత డెట్లెఱుంగును ? ఆ యాచార్యుడు తన సహచరులతోగూడి బ్రూనోచేత అతత్త్వములనన్నిటిని అతని కనుమానము కలుగ కుండ చెప్పించి మరణదండనపాలు చేయుటకు మార్గముల నాలోచించెను.

సెప్టెంబరు నెలలో ఒక రాత్రి కుండువెన్నెలలో బ్రూనో మోసినీగో భవనమున సముద్రపు నీటిని తాకు

చున్న మెట్లపై నున్న స్తంభమునానుకొని యుండెను. నిండు వయస్సులో బలము ఓజస్సుచే తొణుకు నవయువ సౌందర్యముతో, వెన్నెలలో మెఱయుచు నృత్యముచేయు నలలను, అంతరాళమున వ్రేలాడు నిండు చంద్రుని తీవ్రదృష్టితో జూచి చూచి, "జీవితమెంత మేలైనది!, ప్రకృతి యెంత సుందరమైనది! అయినను బుద్ధిహీనులు ప్రశాంతమైన యీ యంతరాళములో లెక్కకు మించిన యీ ప్రపంచములలో నరకజ్వాలలున్నవనుచు తమ సోదరులను దూషించుచునుందురు" అని పెదవులపై మందహాసము చిందులాడ ననుకొనెను. ఇట్టితలంపులనే తలంచుచు తుద కకస్మాత్తుగ లేచి నిలువబడి చేతుల ననంతాకాశమువైపు చాచి ఆనందముతో "హద్దులేని యాకాశమా!, బంధరహితమగు నీస్వేచ్ఛయే లేనియెడల నేనెట్లుబ్రతుకగలను? నీయుజ్జ్వల..." అనిమధురమగు స్వరమునబిగ్గరగ గానముచేయుచుండ వెనుకనుండి యెవరో శిరస్సుపై నొక వల్లెబట్టగప్పి నోరు మూసివేసిరి. సగము పలికిన వాక్యము గురగురధ్వనితో నిలిచిపోయినది. స్వేచ్ఛగా రెక్కలువిప్పి యెగురుపక్షి కిక నీజన్మమున స్వేచ్ఛ లేదు. బ్రూనో మతవిచారణకర్తల చేతిలో బడెను.

బ్రూనో నొక చీకటిగదిలో బడవేసిరి. కాళ్లుచేతులు త్రాళ్లతోగట్టిగా కట్టివేసి దిగంబరుని జేసిరి. కండ్లలో ధైర్యము నిర్భీతి తొణుకులాడుచుండెను. ఎదురుగా నొకమూల చీకటిలో నతనిని ద్రోహముచేసి పట్టియిచ్చిన జియోవన్ని మోసినీగో ముడుచుకొని కూర్చొని యుండెను.

"జియోవన్నీ! బయటకు రా, నీవు ఒప్పుకొన్న దైవదూషణము నిప్పుడు తెలియజేయుము" అని చీకటిలో నుండి యొక కఠోరధ్వని వచ్చెను. జియోవన్నీ యీవల కీడ్వబడెను. బ్రూనో చూపులకు వాడు నిలువజాలక నోట మాటరాక వణుకుచుండెను.

"పాపము పిల్లవానిని విడిచిపెట్టుము. పాపము, వాడేమి చేసెనో యెరుగడు; వానిస్థానమున వాడొప్పుకొనవలసినది నేనొప్పుకొందును. మహామాతను ఆమె బిడ్డల కగపడకుండ దాచు ముసుగును నేను కొంచెము తొలిగించితిని. మీరొక యువకుని చంప నిశ్చయించుకొనియును ఆబాలునెందుకు హింసించెదరు?" అని బ్రూనో నెమ్మదిగ పలికెను.

వాని ప్రక్కనే ముఖాచ్ఛాదనము వేసికొనియున్న విచారణకర్త "దైవదూషకుడా! పాషండుడా! సంపీడన యంత్రము నీకు మతము బోధించునుచూడు" మని యేదో సంజ్ఞ చేసెను. అంత కొన్ని చక్రములు తిరుగజొచ్చెను. ఆచక్రముల మధ్య బ్రూనో దిగంబర దేహము నలిగిపోయెను.

"ఓరి పాషండుడా! ఇకనైన బుద్ధి మరల్చుకొందువా? నీవుదూషించిన దేవుని వేడుకొనుము, నీవు విడిచిపెట్టినచర్చిని ప్రార్థింపుము, ఇప్పుడైన నీపాషండత్వము విడిచినచో దయ జూపబడును," అని యా హంత యనెను.

"నేను సత్యము నారాధించితిని, అసత్యము నన్ను సత్యవాదిగ నుంచుగాక" యనుపలుకు లాదుర్బలకంఠము నుండి వెలువడినంతనే యతడు మూర్ఛబోయెను. నలిగిన యాశరీ

రము నెత్తికొనిపోయి సముద్రముకంటె లోతుననున్న యొక చీకటిగదిలో వేసిరి. సత్యముకొఱకు ఆరు సంవత్సరములు జియార్డినో బ్రూనో గాలి వెలుగు యెరుగక ఆగదిలో పడి యుండెను.

బ్రూనోను వెనీసులోని చీకటికొట్టులో ఆరేండ్లుంచి పైకితీసి రోమ్ నగరమునకు తీసికొనిపోయిరి. ఆ రేండ్లలో వానితల నెరిసినది, కన్నులు లోతుకుపోయినవి, వెలుతురులో చూడలేవు; శరీరము వంగెను, అవయవములు దుర్బలములయ్యెను. క్రైస్తవు లాతని ప్రాణమునుపిండివేసి నడి వయస్సులో ముసలివానిని జేసిరి. కాని లోపలనున్న వాదాభిలాష చావలేదు. రోమ్‌లో నా రెండేండ్లు నతడు తనతత్త్వముగూర్చి వాదము చేయుటతో గడిపెను.

ఎనిమిది సంవత్సరముల హింస పూర్తియైనది, సత్యముకొఱకు పడినబాధ కంతము వచ్చినది. బ్రూనోను న్యాయాధికారులయెదుట విచారణకు బెట్టిరి. వారతనిని నేరస్థునిగ తీర్మానించి 'నెత్తురు చిమ్మకుండ' శిక్షించుటకు పురపాలకోద్యోగుల కొప్పగించవలెనని శిక్ష విధించిరి. ఆహా! మోసమును గప్పిపుచ్చుట కెటువంటి భయంకర సూత్రము! స్తంభమునకు కట్టి కాల్చిచంపుమని దాని యర్థము. ఆతీర్పువినినంతనే బ్రూనో చటాలునలేచి నిలువబడెను, కాని ప్రక్కనున్నవా రతనిని శిక్షను వినుటకు మోకాళ్లపైకి కూలద్రోసిరి. చెరలో బూంగురు పోయిన మధురకంఠమునుండి "మీరు చెప్పదలచిన శిక్షను వినుటవల్ల నాకు కలిగెడు భయముకంటె నెక్కువ

భయముతో మీరు చెప్పుచున్నారనుకొందును" యను మాటలు వినబడెను. శిక్షను విని బ్రూనో సంతోషము తాండవమాడు ముఖముతో, ఎత్తినశిరస్సుతో, స్థైర్యముతో, న్యాయస్థానమును వీడిచనెను. తరువాత, తనవాదమును వదిలి పశ్చాత్తాపపడుట కెనిమిది దినములు గడువు నిచ్చిరి. కాని, అతడు యూరప్ అంతటను సంచరించి బోధించి యెనిమిదేండ్లు చీకటి కొట్టులో యాతన ననుభవించుట తన సత్య దేవతను నిరాకరించుటకు కాదు.

1600 సం॥ ఫిబ్రవరి తే 17 ది యుదయమున నతనిని వధస్థానమునకు గొనిపోయిరి. వీధులు కేకలు వేయుచున్న మూర్ఖ జనులతో నిండియుండెను; వారిలో చాలమంది యాత్రికులు, అతనికి పాషండుడని తెలుపు గంధకపురంగుబట్టలు కట్టిరి. ఆబట్టలపైని అసహ్యాకరమగు దయ్యములు, మంటలు, శిలువలు మొదలగు బొమ్మలున్నవి. ఆ దుస్తులు గాని ఆ ప్రజా సమూహములుగాని యతని ధైర్యమునకు వెలితి తేలేకపోయెను; అతడు శాంతమగు ఫాలభాగముతో, మెఱయుచున్న చూపులతో, నెమ్మదిగ నడుచుచు వచ్చెను.

ఒక పురోహితుడు ముందుకు త్రోసికొనివచ్చి యతని చేతిలో నొక శిలువను బెట్టబోయెను, గాని, బ్రూనో దాని నంత నిరాకరించెను. అతని నొక రాటకు విరిచికట్టి చుట్టును మంటలు పెట్టిరి. అతనినోట నొక్క కేకయైన రాలేదు, బాధను సూచించు నొక చిహ్నమైన ముఖమున దోచలేదు. మంటలు ముఖమునంటి కాల్చివేయువఱకు ఆ ముఖ మొక్కతీరున

ప్రశాంతముగ నుండెను. ఆ సమయమున నతనినోటినుండి యొక గంభీరమగు సందేశము—తరతరములవఱకు లోకమున కాదర్శముగ నుండదగిన సందేశము బ్రూనోకే కాదు సత్యవాదు లందరకు నుచితమైన స్మృతివాక్యముగ నుండ దగిన సందేశము—వెలువడినది.

To know how to die in one century is to know how to live in all centuries to come.

ఒక శతాబ్దిలో మరణించుట యెట్లో తెలిసినయెడల తరువాత నన్ని శతాబ్దులలోను జీవించుటెట్లో తెలియును.

జియార్డినో బ్రూనో జ్వాలల కాహుతి యయ్యెను, కాని యా సందేశవాక్య మావధస్థానమం దింకను బ్రతిధ్వనించు చున్నది.



Printed at the Andhra Grandhalaya Press, Bezwada. K9
for Kalapeetham P. I. C. K 37 —500 - 10-10-47

నీ సోదరులలో నొకనిని గురించి విమర్శించి తీర్మానించుటకు నీకేమి యధికారమున్నది? వాని గత చరిత్రమును గురించి నీకేమి తెలియును? వాని కర్మను గురించి నీవేమెఱుంగుదువు? వాని జీవితము నావరించి యున్న స్థితిగతులు నీకేమి తెలియును? వాని మనస్సులో నున్న బాధలు, వాని యాశయములు, వాని లోపములు నీకేమి తెలియును? వానిని విమర్శించుటకు నీకేమి యధికారమున్నది? నిన్ను నీవు విమర్శించుకొనుము గాని పరుని విమర్శింపవద్దు; ఎందుచేతననగా, నీ వొకనిని బయటనుంచి మాత్రము చూచి వాడు ఆచరించునట్టి గాని ఆచరించనట్టిగాని యొకటిరెండు బాహ్యాచారములనుబట్టి విమర్శించిన యెడల, నీవుచేయు హానికంటె నెక్కువగ నీకే హానికలిగించుకొందువు. నీవు స్థూలతను లోకమున విమర్శించెదవు. దానిని నీయంతరంగమున కంటకును హానిచేసి దానిని నిర్దయ, కరుణారాహిత్యము అను మబ్బుచే కప్పివేయుదువు.

డా. ఆనీ బిసెంటు.

## సకలమును దానొకచే

గూఢముగ ప్రతి అణువులోపల, స్పందమొందే ప్రాణశక్తి!
గూఢముగ ప్రతి జీవిలోన, ప్రకాశమొందే కాంతిశక్తి!
గూఢముగ నన్నింటి నైక్యత, గౌగిలించే ప్రేమశక్తి!
ఎవడుతాను నీవునొకటని, భావమందు తలంపజాలునొ!
సకలమును దానొకటె యనుచును, వెలుగుగావుత నందుచే.

ఆనీ బిసెంటు

---

## విద్య - యుద్దేశము

విద్య చేయవలసినపని- మానవుని యుత్తమ ప్రకృతి యనుదాని లోని భగవదంశకు విడుదల, విముక్తి గలిగించుట, మరియు భగవదంశ యగు జీవుని వికాసమున కత్యుత్తమ సహకారులగు బాహ్యబోధనా పద్ధతులచేత నాయంశను మానవుని నీచప్రకృతియం దుద్భవింపజేయ దగు శిక్షణము విచ్చుట అనగా అంతరంగమున దాగియున్న భగవంతుని బహిర్గత మొనర్చుట.

ఆ నీ బి సెం టు.

---

మన సహవాసులు విశ్వాసహీనులగుచో,
మనము మాత్రము వారియెడల విశ్వాసముతో నుందము;
మన శత్రువులు హానిచేయుచో,
మనము మాత్రము వారిని మన్నించుదము;
మన మిత్రులు ద్రోహము చేయుచో,
మనము మాత్రము వారికి అండగా నుందము;
అప్పుడు మాత్రమే మనలోని పరమాత్మ ప్రకాశించగలడు.

ఆ నీ బి సెం టు.

# సవరణ పత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 10 | నిరశించి | నిరసించి |
| 6 | 14 | పోతున్న | తో నున్న |
| 19 | 11 | వలెనో | వలెనో! |
| 22 | 8 | నాజన్మ | నాకీజన్మ |
| 23 | 18 | పైకి | పైకి- |
| ” | 19 | పైకిని | పైకిని- |
| 24 | 18 | గురు | గురువు |
| 27 | 14 | తలి | తల్లి |
| 28 | 24 | వానిని | వారిని |
| 31 | 10 | గు ్ల | గుల్ల |
| 32 | 8 | రించిరి | రించిరి. |
| ” | 20 | కష్టములను | కష్టముల నామె |
| 46 | 8 | ఇద్దరు నడుమ | ఇద్దరు మతగురువుల నడుమ |
| ” | 22 | ఇంటనేయుండి | ఇంటనే ఆమెయుండి |
| 62 | 28 | ఆత్మ సిద్ధాం | ఆత్మ కాసిద్ధాం |
| 63 | 9 | నీయకుండ | లేకుండ |
| 64 | 6 | వారు | వారి |
| 66 | 20 | ప్రతిజ | ప్రతిజ్ఞ |
| 70 | 18 | బ్రాడా | బ్రాడ్లా |
| 71 | 9 | లారు | లారు |
| ” | ” | ఐర్లాండు | ఐర్లాండుకు |
| ” | 28 | యుత్రో[illegible]థము | యుత్రో[illegible]షము |
| 72 | 22 | సొసెటి | సొసైటి |
| 76 | 11 | పూరితులున్నారు | పూరితులై యున్నారు |
| 80 | 19 | నామె పృథ్వి | నామెకీ పృథ్వి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 89 | 23 | డాక్ట్రైర్ | డాక్టర్' |
| 95 | 14 | అ | అదివరకు |
| " | 15 | నా | నాస్తి |
| 99 | 2 | లలో | లలోని |
| 103 | 6 | రణకొంక | రణకోక |
| 107 | 17 | వర్లించె | వర్ణించె |
| 108 | 3 | అతని | అతనికి |
| " | " | పెట్టు | పెట్టు |
| 110 | 9 | విమర్శక | విమర్శన |
| 119 | 13 | సానా | స్నానా |
| 136 | 11 | Veal | weal |
| 139 | 10 | కొనెను. | కొనెను, |
| " | 12 | కాదు | కాదు, |
| " | 13 | కాదు, | కాదు. |
| 140 | 13 | Nation | a Nation |
| 147 | 7 | తముల | రములలో |
| " | 10 | తోచినప్పడు | తోచినప్పుడు |
| 152 | 19 | ఎజు | ఎడ్యు |
| 153 | 8 | ఎజు | ఎడ్యు |
| 165 | 21 | నందుకు | కందుకు, |
| 186 | 7 | పాంతకాలలోను | పాంతకాలలలోను |
| | | కళాకాలలోను | కళాకాలలలోను |
| 212 | 10 | డిమీగా | ఒమీగా |
| 213 | 13 | మహార | మహార్షి |
| 216 | 19 | సూల | స్థూల |
| 233 | 5 | విరాట్ | విరాట్ |
| " | 16 | ముగుదు | ముగ్గుదు |
| 235 | 22 | చిరి. పాం | చి, పాం |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 239 | 3 | రూార్ | రూాక్ |
| 252 | 8 | త. మా | తం. మా |
| 265 | 17 | సాద | వాద |
| 268 | 9 | పదవికి | పదవిని |
| 270 | 18 | నిరగ్గళము | నిరర్గళము |

ఈ క్రిందివానిలో కామా (,) లను తీసివేయవలెను

| | | |
|---|---|---|
| 20 | 5 | చుట్టు, |
| 42 | 15 | తరువాత, |
| 78 | 18 | కారణమని, |
| 91 | 18 | అపేక్షతో, |
| 189 | 6 | కూర్చుటకు, |

